# జానపద విజ్ఞానాధ్యయనం

(Studies in Telugu Folkloristics)

ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి.,

ఏ.పి.పి.యస్.సి., యు.జి.సి - నెట్, స్లెట్

విద్యార్థులకు ఉపయుక్త గ్రంథం



315

# జానపద విజ్ఞానాధ్యయనం

**(Studies in Telugu Folkloristics)**

ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి.,
ఎ.పి.పి.యస్.సి., యు.జి.సి - నెట్, స్లెట్
విద్యార్థులకు ఉపయుక్త గ్రంథం

With kindest regards
G. S. Mohan
8/8/03


**డా. జి. ఎస్. మోహన్**

తెలుగు విభాగం, జ్ఞానభారతి
బెంగుళూరు విశ్వవిద్యాలయం
బెంగుళూరు - 560 056



శ్రీనివాస పబ్లికేషన్స్
చంద్రా లే అవుట్
బెంగుళూరు - 560 040

జానపద విజ్ఞానాధ్యయనం - డా॥ జి. ఎస్. మోహన్
(Studies in Telugu Folkloristics) by Dr. G. S. Mohan

**Pp.** : X + 390

**First Edition** : 2001

**Copies** : 550

**Price** : **Rs. 140/-**
వెల : 140-00



**Sole Distributors** : **M/s. Visalaandhra Publishing House**
4-1-435, Vijnan Bhavan, Bank Street
Hyderabad - 500 001, A.P.

**For Copies** : **M/s. Visalaandhra Book House,**
Hyderabad, Vijayawada, Guntur,
Anantapur, Tirupati, Kakinada,
Hanamkonda & Visakhapatnam.

**Printed By** : **Sree Laxmi Art Printers**
910/A, 3rd Main, Vijayanagar,
Bangalore - 560 040 Phone: 3300093

*Published with the Financial Assistance from the Central Institute of Indian Languages (Ministry of Human Resources Development, Department of Education, Government of India), Manasa Gangothri, Mysore - 570 006, Vide Sanction Letter No. F.51-11(2)/99-2000/TEL/GRNT dated 21st February, 2000 under the Scheme of Grant-in-Aid.*

# DEDICATION



*This book is*
*dedicated*
*to my beloved*
*wife*
**Mrs. G. NEERAJA MOHAN.,**
*Who is an*
*encouraging Spirit*
*behind*
*all my writings*

# ఆశీస్సు

**ఆచార్య తంగిరాల వేంకటసుబ్బారావు**
విశ్రాంత ఆంధ్రశాఖాధ్యక్షుడు
బెంగుళూరు విశ్వవిద్యాలయము
బెంగుళూరు - 560 056

జానపద సాహిత్య పరిశోధనకు విశ్వవిద్యాలయ గౌరవాన్ని కల్పించిన మొట్టమొదటి వ్యక్తి ఆచార్య బిరుదురాజు రామరాజుగారు. వీరి సిద్ధాంతవ్యాసం ''తెలుగు జానపదగేయ సాహిత్యము'' విశిష్టమైన గ్రంథం. వీరి అడుగుజాడల్లో వీరగాథల (Heroic Ballads)ను గురించి నేనూ, శక్తి కథలలోని మానవశాస్త్ర (Anthropology) విషయాలను గురించి ఆచార్య నాయని కృష్ణకుమారిగారూ పరిశోధన చేశాం. మా తరువాత డా॥ ఆర్వీయస్.సుందరం, డా॥ జి.యస్. మోహన్, డా॥ రావి ప్రేమలత, డా॥ కె. శ్రీలక్ష్మి మొదలైనవారు ఈ రంగంలో ప్రవేశించారు. నిరంతరం పరిశోధన చేస్తూ కీర్తి ప్రతిష్ఠలు గడిస్తున్నారు.

డా॥ జి.యస్. మోహన్ ఆచార్య నాయని కృష్ణకుమారి దగ్గర తెలుగు ఎం.ఏ. చదివాడు. అప్పుడు నూతనంగా ప్రవేశపెట్టబడిన ''జానపద సాహిత్యం'' ఐచ్ఛిక విషయంగా గ్రహించాడు. తరువాత బెంగుళూరు విశ్వవిద్యాలయానికి వచ్చి ''అనంతపురం జిల్లా స్త్రీల పాటలు'' అనే అంశంపై నా దగ్గర పరిశోధన చేసి పిహెచ్.డి. డిగ్రీని పొందాడు. బెంగుళూరు విశ్వవిద్యాలయంలోనే అధ్యాపకుడుగా ప్రవేశించి, రీడరుగా, రొటేషన్‌లో శాఖాధ్యక్షుడుగా సేవలు అందిస్తున్నాడు. డా॥ సుందరంతో కలిసి ''ఫోక్ కల్చర్ ట్రస్టు''ను స్థాపించి, ''దేశి'' అనే బులెటిన్ తీసుకు వస్తున్నాడు. తన పరిశోధన కృషిని పిహెచ్.డి.తో నిలిపి వేయకుండా, నిత్యనూతన మార్గాలలో ముందుకు వెడుతున్నాడు. డా॥ చిలుకూరి నారాయణరావుగారి దౌహిత్రుడు కావడంవల్ల నిరంతర పరిశోధన ఇతనికి రక్తగతమైన గుణం!

ఈనాడు జానపద సాహిత్యం - జానపద విజ్ఞానంగా, గిరిజన విజ్ఞానంగా విస్తరించి అనేక శాఖలుగా అభివృద్ధి చెందుతోంది. ప్రపంచవ్యాప్తంగా 'జానపద సంస్కృతి' (Folk-culture) ప్రాధాన్యాన్ని సంతరించుకుంటోంది. కేవలం

సాహిత్యం, భాష అనే అంశాలే కాకుండా జానపదుల ఆచార వ్యవహారాలూ, వస్తు సంస్కృతి, విజ్ఞాన విషయాలు, ప్రదర్శన కళలు ఇత్యాదిగా సహస్రఫణాళితో నృత్యం చేస్తోంది. జానపద విజ్ఞానాధ్యయనంలో క్రొత్తక్రొత్త సిద్ధాంతాలు బయలు దేరుతున్నాయి. ఇవన్నీ దృష్టిలో ఉంచుకొని డా॥ జి. యస్ మోహన్ ఈ గ్రంథాన్ని సిద్ధం చేశాడు. అదే సమయంలో ఇది శాస్త్ర విషయాలతో 'అయఃపిండం'లా రూపుదాల్చకుండా జాగ్రత్త పడ్డాడు. ఎం.ఏ. విద్యార్థుల్నీ, పోటీ పరీక్షలకువెళ్ళే యువకుల్ని దృష్టిలో పెట్టుకొని, జానపద విజ్ఞానంలో అన్ని శాఖల్నీ, సరళంగా, సుబోధకంగా, హితంగా, మితంగా పరిచయం చేశాడు. గిరిజన విజ్ఞానం, నగర జానపద విజ్ఞానం, జానపదుల తిట్లు, జానపద వైద్యం, జానపదుల వంటా-వార్పూ, హస్తకళలు, వస్తు ప్రదర్శనశాలలు, క్షేత్రకార్యం - మొదలైన నూతన శాఖలు మనముందు ఉంచుతున్నాడు. గ్రంథం చివరలో ప్రసిద్ధ జానపద విజ్ఞానవేత్తల్ని గురించి చెప్పడం ఈ రచనకు ఒక అందమైన ముగింపును ఇస్తోంది. ''జానపద విజ్ఞానాధ్యయనం'' అనే ఈ విలువైన, విశిష్టమైన పుస్తకాన్ని రచించిన నా ప్రియశిష్యుడు డా॥ జి. యస్. మోహన్‌ను మనసారా అభినందిస్తున్నాను; ఆశీర్వదిస్తున్నాను.

బెంగుళూరు — **తంగిరాల వేంకటసుబ్బారావు**

8-2-2001

గురుపూర్ణిమ

# ఆప్తవాక్యం

**డా॥ ఆర్వీయస్. సుందరం**
ఆంధ్రాచార్యుడు
మైసూరు విశ్వవిద్యాలయము
మానసగంగోత్రి, మైసూరు - 570 006

డా॥ జి.ఎస్.మోహన్ జానపదవిజ్ఞాన క్షేత్రంలో చేసిన కృషి ప్రవాసాంధ్రులకు గర్వకారణం. ఆంధ్రులకు దూరంగా ఉన్నా తెలుగు సాహిత్య సంస్కృతుల కోసం, జానపద విజ్ఞానం కోసం నిరంతరాన్వేషణ, పరిశీలన సాగిస్తున్న చాలా కొద్దిమందిలో డా.జి.ఎస్.మోహన్ ఒకరు. ముఖ్యంగా జానపద విజ్ఞానానికి, తులనాత్మక అధ్యయనానికి ఆయనవల్ల ఎంతో మేలు జరిగింది.

డా॥ జి.ఎస్.మోహన్ జానపద విజ్ఞానంలోని ఏదో ఒక్క శాఖకు పరిమితమైన వారు కారు. ఆయన పిహెచ్.డి. పరిశోధన జానపద గేయాలను గురించినదైనా తర్వాత తమ పరిశోధన పరిధిని ఆయన విస్తరించుకున్నారు. జానపద విజ్ఞాన వ్యాసావళి ద్వారా అన్ని శాఖలనూ పరిచయం చేశారు. తర్వాత జానపద కథలు, నమ్మకాలు, తిట్లు, కళలు వంటి వివిధ జానపద విజ్ఞాన శాఖల్లో కృషిచేశారు. జానపద విజ్ఞాన గ్రంథాల పట్టీని ప్రచురించారు. ప్రస్తుతం జానపద విజ్ఞానాధ్యయనం గురించి పుస్తకాన్ని ప్రచురించడానికి పూనుకున్నారు.

ప్రస్తుతగ్రంథం విద్యార్థులకు, పరిశోధకులకు, ఈ క్షేత్రంలో ఆసక్తి ఉన్న ప్రతి ఒక్కరికీ అత్యంత ఉపయోగకరమూ, ఆకర గ్రంథమూ అవుతుందనడంలో సందేహం లేదు. దీని వెనక రచయితకున్న ఆసక్తి, అభినివేశము, అధ్యయన తత్పరత వ్యక్తమవుతున్నాయి. తెలుగువారు ఈ గ్రంథంవల్ల ప్రయోజనం పొందుతారని ఆశిస్తున్నాను.

మైసూరు — **ఆర్వీయస్. సుందరం**
9-2-2001

# నా మాట

తెలుగు జానపద విజ్ఞానం రెండు దశాబ్దాలుగా తన ఉనికిని నిలబెట్ట గలుగుతోంది. దీనికి కారణం ఈ విజ్ఞానం ఒక విజ్ఞాన సర్వస్వం, కనుక ఆ విజ్ఞాన సర్వస్వంలోని సర్వస్వాన్ని మనం ఆస్వాదించాలన్న తపనతో, ఆసక్తితో జానపద విజ్ఞానాంశాలను సేకరించడం, అధ్యయనం చేయడం జరుగుతోంది. వివిధ ప్రక్రియల మీద పరిశోధనలు జరిగాయి; జరుగుతున్నాయి; ఇంకా జరగాల్సింది ఎంతో ఉంది.

మన దగ్గర జానపద విజ్ఞానానికి సంబంధించి లెక్కలేనంత ముడిసరుకు ఉంది. అయితే వాటిని విశ్లేషించడానికి చెప్పుకోదగ్గ సిద్ధాంతాలు (Theories) లేవు. అందువల్ల అధ్యయనంలో లోపాలు కన్పిస్తున్నాయి. సరయిన అవగాహన లేకుండా పరిశోధనలు జరుగుతున్నాయి; పరిశోధన గ్రంథాలు వెలువడుతున్నాయి.

తెలుగు జానపద విజ్ఞానరంగంలో జానపద విజ్ఞానాంశాలన్నింటికీ చెందిన సిద్ధాంత పరమైన గ్రంథాలు ఒకటి, రెండు మాత్రమే వెలువడ్డాయి. అలా వెలువడ్డ వాటిలో నేను 1981లో ప్రచురించిన 'జానపద విజ్ఞాన వ్యాసావళి' మొట్ట మొదటిదని విజ్ఞుల ప్రశంసల నందుకొన్నది. ఇది 17 వ్యాసాల సంకలన గ్రంథం. అప్పట్లో అది గ్రాంథికంలో వ్రాయబడింది. అందులోని వ్యాసాలను కొంత మార్పులు, చేర్పులు చేసి వ్యావహారికంలో వ్రాశాను. వాటిని ప్రస్తుత గ్రంథం 'తెలుగు జానపద విజ్ఞానం' లో చేర్చాను. అలాగే నేను వివిధ జాతీయ చర్చా సదస్సులలో సమర్పించినవీ, వివిధ సాహిత్య పత్రికలలో ప్రచురించినవీ - 16 వ్యాసాలను 17 వ్యాసాలతో కలిపి మొత్తం 33 వ్యాసాలను ఒక సంకలన గ్రంథంగా రూపొందించాను. ఆ వ్యాసాలు వివిధ జానపద విజ్ఞాన ప్రక్రియలకు, అంశాలకు సంబంధించినవి. అవి: గిరిజన విజ్ఞానం, నగర జానపద విజ్ఞానం, జానపద విజ్ఞానం, జానపద సాహిత్యం, జానపదగేయాలు, జానపదగేయకథలు, గద్యకథనాలు, జానపద కథలు, కథన ఘటకాలు, సామెతలు, తెలుగు సామెతలు - సాంఘిక జీవితం, పొడుపు కథలు, జానపదుల భాష, జాతీయాలు, జానపదుల తిట్లు, సాంఘిక జానపద ఆచారం, జానపద మతం - గ్రామదేవతలు, జానపదుల పండుగలు - జాతరలు-ఉత్సవాలు, జానపదుల నమ్మకాలు, జానపద వైద్యం, జానపద క్రీడలు, జానపదుల వంటావార్పు, జానపద నృత్యం, జానపద సంగీతం, జానపద నాటకం, జానపద

కళారూపాలు, జానపద హస్తకళలు, జానపద విజ్ఞాన వస్తు ప్రదర్శనశాలలు, జానపద విజ్ఞానక్షేత్ర కార్యం, సందర్శన పద్ధతి, ప్రశ్నావళి, ఆంధ్రప్రదేశ్‌లో జరిగిన జానపద విజ్ఞానాధ్యయనం, ప్రసిద్ధ జానపద విజ్ఞానవేత్తలు ఇత్యాది. నేను ప్రచురించిన 'సాంఘిక జానపద ఆచారాలు ( అనంతపురం జిల్లా)', 'పరిశోధన - సామగ్రి సేకరణ', 'ప్రసిద్ధ జానపద విజ్ఞానవేత్తలు', 'తెలుగులో ధార్మిక, సాంస్కృతిక జానపద కథలు' - ఈ గ్రంథం వ్రాయడానికి చాల తోడ్పడ్డాయి. అలాగే ఈ వ్యాసాలను వ్రాయడానికి నాకెన్నో తెలుగు, కన్నడ, ఇంగ్లీషు గ్రంథాలు సహకరించాయి. పరోక్షంగా సహకరించిన ఆయాగ్రంథాల రచయితలకు నేను సర్వదా కృతజ్ఞుణ్ణి.

తెలుగు జానపద విజ్ఞానక్షేత్రంలో అన్ని ప్రక్రియలకు సంబంధించిన అంశాలు ఒకే గ్రంథంలో చోటు చేసుకొని ఉండడం చాల అరుదు. ఆ లోటును తీర్చాలన్న ఉద్దేశంతో ఈ సంకలన గ్రంథాన్ని మీ ముందుంచుతున్నాను. మరెన్నో జానపద విజ్ఞానాంశాలు మిగిలి ఉన్నాయి. వాటిని మరో సంపుటంలో ప్రచురించాలన్న తపన నాలో ఉంది.

ఈ గ్రంథం ఎం.ఏ., ఎం.ఫిల్., ప్రీ-పిహెచ్.డి.; పిహెచ్.డి విద్యార్థులకే కాకుండా **UPSC, APPSC, UGC-NET, SLET** పరీక్షలకు కూర్చొనే విద్యార్థులందరికీ కరదీపిక కాగలదని నా విశ్వాసం. సహృదయులు ఈ గ్రంథాన్ని ఆదరిస్తారన్న నమ్మకం నాకుంది.

ఈ గ్రంథం అచ్చుకావడానికి మూలకారకులు Central Institute of Indian Languages వారు. వారిచ్చిన ఆర్థిక సహాయం వల్లనే ఈ గ్రంథం వెలుగు చూస్తోంది.

నేను కోరగానే 'ఆశీస్సు'లను అందించిన అస్మద్గురువర్యులు ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారికి, 'ఆప్తవాక్యం' వ్రాసిన మాన్యమిత్రులు ఆచార్య ఆర్వీయస్. సుందరంగారికి మనసారా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. నన్ను అభిమానించి సహకారాలను అందించిన సహృదయులు డా. విశ్వనాథంగారికి, డా. ప్రభాకర్‌గారికి (సి.ఐ.ఐ.ఎల్, మైసూరు) కృతజ్ఞుణ్ణి. అందంగా అచ్చువేసి అందించిన శ్రీ లక్ష్మి ఆర్ట్సప్రింటర్స్, బెంగుళూరు వారికి కృతజ్ఞుణ్ణి.

బెంగుళూరు విశ్వవిద్యాలయం, బెంగుళూరు — **- జి. ఎస్. మోహన్**

# జానపద విజ్ఞానాధ్యయనం

## విషయ సూచిక

# 1. గిరిజన విజ్ఞానం
## (Tribal Lore)

భారతదేశానికి ఆర్యులు ఆసియా మధ్యభాగం నుండి రాకపూర్వం ద్రావిడులు వచ్చారనీ, ఆ ద్రావిడులు రాక పూర్వం దేశంలో ఉన్నవాళ్ళను ఆదిమ నివాసులంటారనీ చరిత్రకారుల అభిప్రాయం. ఇలా మనదేశం ఆదిమజాతుల్ని అధిక సంఖ్యలో కలిగిన దేశంగా పరిగణింపబడుతోంది. భారతదేశంలోని మొత్తం జనాభాలో దాదాపు 7 శాతం ఆదిమజాతులున్నట్టు చెప్పబడుతోంది. భారత ప్రభుత్వం 1950లో 571 ఆదివుజాతుల్ని Scheduled Tribes గా పరిగణించింది.

మానవుడికి సంబంధించింది 'మానవ శాస్త్రం'. దీన్ని ఇంగ్లీషులో 'Arthropology' అంటారు. 'Anthropos' అంటే మానవుడు. 'Logos' అంటే శాస్త్రం. మానవశాస్త్రం మానవాభ్యుదయానికి కృషి చేస్తుంది. అది రాజకీయ వ్యవస్థలు, ఆర్థిక విధానాలు, సామాజిక నడవడుల ప్రాచీన స్వరూపాలని పరిశీలించడమే కాక మానవ సంస్కృతిని, వికాసాన్ని వెలికి తీయడానికి సిద్ధాంతాలను ప్రవేశపెడుతుంది. అంతేకాక ప్రపంచంలోని విభిన్న జాతులను గురించి పరిశోధన జరిపి, ఆయా జాతుల సమస్యల్ని పరిష్కరించడానికి పూనుకొంటుంది.

నేటికాలంలో ప్రపంచమానవుల్ని రెండురకాలుగా గుర్తించవచ్చు. ఇందులో మొదటి రకంవారు ప్రపంచ పరిస్థితులు, నాగరికతను అవగాహన చేసుకొని జీర్ణించుకొన్న సభ్యసంఘీయులు. రెండోరకం సభ్య సంఘానికి దూరంగా నివసిస్తూ అడవుల్లో కానీ, కొండగుహల్లో కానీ కాలం గడుపుతూ, ప్రత్యేకంగా తమ సాంఘిక చట్టం, నడవడులు, మతం, విజ్ఞానం మొదలైన వాటిని నిర్మించుకొన్న వాళ్ళు. మొదటిరకం వారి విజ్ఞానం భౌతికాభివృద్ధికి దోహదం చేస్తే, రెండోరకం ప్రజల్లో ఈ భౌతికాభివృద్ధి కన్పించదు. వీళ్ళని 'అసభ్యుల' ని సభ్యసంఘీయులు పిలుస్తారు. మన దేశంలోని దస్యులు, తదితర ఆదిమ నివాసులు కూడ ఈ అసభ్యుల క్రిందికే వస్తారు.[1]

---

*1. మానుష శాస్త్రం - ఆదిమ నివాసులు, పుట.3*

ఆదిమ నివాసుల్ని 'Aboriginals' అంటారు. వీళ్ళు చిన్న చిన్న ముఠాలుగా నివసిస్తారు. వీళ్ళు అనాగరికులు. వీళ్ళ ఆచార వ్యవహారాలు, సంప్రదాయాలు, పద్ధతులు అన్నీ భిన్నంగా ఉంటాయి. ఆంగ్లంలో ఇలాంటి వాళ్ళని 'Tribes' అంటారు. ఆంగ్లంలో 'కులం' అంటే 'Caste'. డా. అయ్యప్పన్ హిందూమతం అవలంబించే వాళ్ళని Caste అనే పేర్తోను, తక్కిన వాళ్ళని Tribes అనే పేర్తోను పిలిచారు.[2]

'Any primitive or barborous people under a chief with a common language and sense of solidarity and who trace their descent from a common ancestor'[3] అనే శాస్త్రకారుని వివరణ 'Tribe' అన్న పదానికి సరిపోతుంది. శ్రీ సోమసుందరంగారు తమ 'మానుషశాస్త్రం-ఆదిమనివాసులు' అన్న గ్రంథంలో ఆదిమ నివాసుల్ని గురించి వివరిస్తూ 'ఆదిమ నివాసులంటే ఆర్యాక్రమణకు పూర్వం మనదేశమందు నివసించుచూ, ఆర్యులచేత తరుమబడి, కొండగుహలయందును, అరణ్య ప్రాంతములలోను తలదాచుకొని, ప్రస్తుత నాగరికతా ప్రపంచమునకు దూరులై, మన కంటికి కేవలము మృగతుల్యుల వలెనగుపించుచు, ఆర్యుల తాకిడి వలన, సభ్యసంబంధము వలన, తమతమ ప్రత్యేక ఆచార, సాంప్రదాయ విశిష్టతలను గోలుపోక, చిన్న చిన్న గుంపులుగా కాలము వెళ్ళబుచ్చుకొనుచున్న జాతులు' అని నిర్వచించారు. మానవశాస్త్రవేత్తలు Tribes గురించి చేసిన వివరణాత్మక అధ్యయనాన్ని Ethnography అంటారు.

కొన్ని కుటుంబాలు లేదా తెగలు ఏకమై ఒక జాతి (Tribe)గా రూపొందుతుంది. జాతి అనేది సంఘం యొక్క ప్రాచీనతమ రూపాల్లో ఒకటి.[4] 'ఆదిమజాతి' అనగా ప్రాంతీయ సంబంధము కలిగి అంతర్వివాహములు జేసికొనుచు వంశపారంపర్యముగా ఏర్పడిన జాతి నాయకులచే పాలింపబడుచు, ప్రత్యేక వృత్తులు లేకుండా, ఏకభాష మాట్లాడుచు, తదితర జాతులకు సాంఘికముగా దూరముగా ఉండి, ఎట్టి సాంఘికాపవాదములు లేకుండ, తమతమ జాతి సంప్రదాయములను, ఆచారములను, నమ్మకములను అనుసరించుచు

---

*2. Ibid.*

*3. Ibid పీఠిక, పుట VIII.*

*4. విజ్ఞాన సర్వస్వం - సంపుటం 10, సాంఘిక శాస్త్రములు, పుట 393*

విదేశీయ భావములతో పొత్తు గలియకుండా జాతీయ ప్రాంతీయ భావావేశముగల 'సాంఘిక గణము' లేదా 'జాతి' ఆదిమజాతిగా పేర్కొనబడి ఉండవచ్చును లేదా అట్లు పేర్కొనబడి ఉండక పోవచ్చును. సంపూర్ణముగనో అసంపూర్ణముగనో నాగరికతా ప్రభావమునకు లోబడి ఉండవచ్చును.[5]

పై అంశాలను గమనిస్తే ప్రత్యేక సంస్కృతి కలిగిన సమాజాలను Tribes అని పిలువవచ్చు. ఈ సంస్కృతి గ్రామీణ, నగర సంస్కృతుల కంటె భిన్నంగా ఉంటుంది; అనాగరకంగా ఉంటుంది. ఈ సమాజంలో రక్తసంబంధానికి అధిక ప్రాధాన్యం కన్పిస్తుంది. వ్యక్తుల మధ్య సంబంధం అధికంగా ఉంటుంది. సాంస్కృతికంగా అత్యంత కఠినమైన విధినిషేధాలను కలిగి ఉంటుంది. తమ జాతుల వాళ్ళని కాకుండా ఇతరుల్ని అనుమానంతో చూసే ప్రవృత్తి ఎక్కువగా ఉంటుంది. వీళ్ళకి ప్రత్యేకమైన జీవన విధానం, భాష ఉంటాయి. ఇలాంటి సామాజిక సమూహాలని సాంస్కృతిక మానవశాస్త్రంలో Tribes అంటారు.

ఆదిమవాసుల్లో కన్పించే మరో విశిష్ట లక్షణం ఏమిటంటే ఒక్కో తెగ (జాతి) కి చెందిన వాళ్ళలో కొన్ని విశిష్టమైన శారీరక లక్షణాలు కన్పిస్తాయి. ఈ లక్షణాలు ఇతర తెగలనుంచి వీళ్ళను వేరుచేస్తాయి. దీనివల్ల వీళ్ళు ఏ తెగకు చెందిన గిరిజనులో నిర్ణయించడానికి వీలవుతుంది.

జాతుల పునరుద్ధరణ నిమిత్తం వారి సాంస్కృతిక నాగరికత దశలను బట్టి చేయబడ్డ వర్గీకరణాన్ని అనుసరించి వీళ్ళు మూడు వర్గాలవారుగా విభజింపబడ్డారు.[6]

1. సాంస్కృతికంగా గ్రామీణ నాగరక కుటుంబాల వారితో ఎలాంటి పొత్తులేని జాతులు.
2. నాగరకతా ప్రభావానికి లోనై దానివల్ల సంభవించిన సమస్యల్ని ఎదుర్కొంటున్న జాతులు.
3. గ్రామీణ నాగరక జనులతో పొత్తు కలిగి ఉండీ, ఏ తత్ఫలితంగా ఏర్పడ్డ బాధల్నీ, సమస్యల్నీ అధిగమించి నేటి గ్రామీణ నాగరక సంస్కృతితో పొత్తు కలిసిన జాతులు.

---

*5. Ibid* పుట *192*

*6. Ibid.*

మన సంస్కృతిలో మూడురకాలైన దశలు కన్పిస్తాయి.[7] 1. అరణ్య జీవన స్థితి. 2. అనాగరక స్థితి. 3. నాగరక స్థితి. వీటిలో జానపదులు అనాగరక స్థితికి చెందినవారు. వీళ్ళు అటు నాగరికులూ కాదు, ఇటు ఆటవికులూ కాదు. గ్రామాల్లో నివసించేవారు. అనాగరక, నాగరక స్థితులకు భిన్నంగా అడవుల్లో, కొండల్లో నివసిస్తూ జానపద నాగరక సమూహాలకు దూరంగా ఉంటూ ప్రత్యేక లక్షణం కలిగినవాళ్ళే ఆదిమవాసులు. వీళ్ళమీద ప్రకృతి ప్రభావం అమితంగా కన్పిస్తుంది; ఈ జాతుల్లో వేట ప్రాధాన్యం వహిస్తుంది. జానపదుడిమీద నాగరకుని ప్రభావం కొట్టొచ్చినట్టు కన్పిస్తుంది. నాగరికుణ్ణి అనుసరించడానికి, అనుకరించడానికి జానపదుడు ప్రయత్నిస్తాడు.

పైన పేర్కొన్న సంస్కృతిలోని మూడుదశల్ని 1. ఆదిమవాసుల సంస్కృతి, 2. గ్రామీణ సంస్కృతి, 3. నగర సంస్కృతి అని వింగడించవచ్చు. మానవ సమూహాలు మౌలికంగా సమతల ప్రదేశాల్లో నివసించినా, ఆ మానవ సమూహాల్లోని కొంతమంది అరాచక ప్రవృత్తుల కారణంగా భయపడి పారిపోయిన వాళ్ళు కొండల్ని, గుట్టల్ని, లోయల్ని తమ స్థావరాలుగా చేసుకొన్నారు. మరికొంతమంది చుట్టుప్రక్కల ఉన్న గ్రామాలను ఆశ్రయించి స్థిరపడిపోయారు. క్రమంగా వీళ్ళు నగర వాతావరణానికి అలవాటు పడి నగరవాసులయ్యారు. ఇలా కొన్ని శతాబ్దాలుగా కొండలు, గుట్టలు, లోయల్లో నివసిస్తూ గ్రామీణ, నాగరిక సంస్కృతుల ప్రభావానికి లోనుకాక తమదే అయిన ప్రత్యేక సంస్కృతిని నిలుపుకొన్న సంస్కృతే ఆదిమవాసుల సంస్కృతి. వీళ్ళకు తమవే అయిన నడవడులు, కట్టుబాట్లు, సంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు, సాహిత్యం, మాండలిక భాషలు ఉన్నాయి. వీళ్ళు సమిష్టి జీవనాన్ని కాంక్షిస్తారు.

ప్రకృతిలో లీనమవుతూ, ప్రకృతి ప్రసాదించిన పండ్లు, కాయలు, దుంపలు, కొండధాన్యాలను తింటూ పొట్ట పోసుకొంటారు ఆదిమజాతులవాళ్ళు. వాతావరణ వైపరీత్యాల వల్ల ఏర్పడే ఆటంకాలను ఏ మాత్రం లెక్కపెట్టక, అవి కేవలం తమ దేవతల ఆగ్రహం వల్లే కలుగుతాయని విశ్వసిస్తారు వీళ్ళు. బయటి ప్రపంచంతో సంబంధాన్ని పెట్టుకోక నిజమైన మానవ జీవిత మాధుర్యాన్ని చవిచూస్తారు. ఈ జాతుల కళాకౌశలం, అమాయకత్వం, నిర్భయత్వం,

7. *ఆంధ్రుల జానపద విజ్ఞానం, పుట 2*

నిరాడంబరత్వం, నిజాయితీ మనల్ని ఆకర్షించక మానవు. నేడు నాగరికత ప్రబలుతున్న కారణంగా ఈ జాతుల్లో కూడ సభ్యతా సంబంధాలు అలవడుతున్నాయనడంలో సందేహం లేదు.

ఆంగ్లంలోని 'Tribe' అనే పదానికి సమానార్థకంగా మనం 'ఆదిమజాతి', 'ఆదిమ నివాసి', 'ఆదివాసి', 'గిరిజన' అనే పర్యాయపదాలను వ్యవహరిస్తున్నాం. వీళ్ళ విజ్ఞానాన్ని ఆంగ్లంలో 'Tribal Lore' అంటారు. మనం దీనికి సమానార్థకంగా 'గిరిజన విజ్ఞానం' అంటున్నాం. కన్నడంలో 'ఆదివాసి జానపద' అన్నపదం వ్యవహారంలో ఉంది. హైదరాబాదులోని ఆదిమజాతులకి సంబంధించిన శిక్షణ సంస్థ 'ఆదివాసి సాంస్కృతిక పరిశోధన మరియు శిక్షణ సంస్థ' అన్న పేర్తో ఉంది. పైన పేర్కొన్న ఆదిమజాతి, ఆదిమనివాసులు, గిరిజనులు అన్నపదాలకు సమానంగా 'ఆదివాసి' పదాన్ని స్వీకరిస్తే సమంజసమనిపిస్తుంది. వీళ్ళ విజ్ఞానాన్ని 'ఆదివాసి విజ్ఞానం' (Tribal Lore) అంటే సరిపోతుంది. గిరిజన శబ్దం కేవలం కొండలు, గుట్టల్లో నివసించే ప్రజలకి మాత్రమే పరిమితంగా కన్పిస్తుంది. ఈ ఆదిమవాసులు కేవలం కొండలు, గుట్టల్లో మాత్రమేకాకుండా మైదాన ప్రాంత గ్రామాల్లో కూడ నేడు నివసిస్తూ ఉండడం వల్లా, వీళ్ళ విజ్ఞానం అపరిమితంగా ఉన్నందువల్లా, ఈ విజ్ఞానాన్ని అధ్యయనం చేయాల్సిన అవసరం ఉన్నందువల్లా Tribal lore అన్నపదానికి సమానార్థకంగా 'ఆదివాసి విజ్ఞానం' అన్న పదాన్ని స్వీకరించి అధ్యయనం చేయడం సమంజసమనిపిస్తుంది. అయితే 'గిరిజన విజ్ఞానం' అన్నపదం చాలకాలంగా ప్రాచుర్యంలో ఉన్నందువల్ల ఈ పదాన్నే స్వీకరించడం మంచిది.

మానవశాస్త్ర అధ్యయనంవల్ల ఆదిమమానవులు లేదా గిరిజన సంస్కృతి స్వరూపం వెల్లడవుతుంది. అంతేకాకుండా ఇది నగర లేదా గ్రామీణ సంస్కృతులకు ఎలా పూరకంగా ఉంటుందో విశదపరుస్తుంది. గిరిజనుల్ని గురించి అధ్యయనం చేయాల్సిన ప్రధాన కారణాల్లో గమనింపదగ్గది - నాగరికతా ప్రభావానికి లోనై గిరిజన సంస్కృతి మారడానికి ముందే దాన్ని మౌలికంగా సంగ్రహించాల్సిన అగత్యం. ఇలా ఈ సంస్కృతిని అధ్యయనం చేయడంవల్ల గిరిజన సంస్కృతి నుంచి నేటి ఆధునిక సంస్కృతివరకు ఉన్న దశల్ని గుర్తించడానికి వీలవుతుంది.

మానవశాస్త్రవేత్తలు ఆదిమజాతులమీద అధ్యయనం చేసినట్టుగానే జానపద విజ్ఞానులు కూడ విభిన్న దృక్కోణాలతో ఈ జాతులమీద అధ్యయనం

చేస్తున్నారు. మానవ శాస్త్రవేత్తలు దేన్ని ఆదిమజాతిగా పరిగణిస్తారో దాన్ని జానపద విజ్ఞానంలో Folk group గా పరిగణిస్తారు. మానవశాస్త్రం మొదట్నుంచీ ఆయా ఆదిమజాతుల జీవన విధానంమీద దృష్టిని ప్రసరిస్తే జానపద విజ్ఞానం ఆయా జాతుల మౌఖిక సాహిత్యం, కళలకు ప్రాధాన్యం ఇచ్చింది. జానపద విజ్ఞానంలో తమవే అయిన Social groups ని అధ్యయనం చేసే పద్ధతి ఉంటే మానవశాస్త్రంలో విభిన్నమైన, తమది కాని సంస్కృతిని అధ్యయనం చేసే పద్ధతి కన్పిస్తుంది. ఇది ఈ రెండు విజ్ఞానాలకు ఉన్న ముఖ్య భేదం. అందువల్ల విభిన్న సంస్కృతుల్లో కార్యం నిర్వహించే మానవ శాస్త్రవేత్త కంటె, తమదే అయిన సంస్కృతికి చెందిన ఆదిమ జాతుల గురించి జానపద విజ్ఞానం అధ్యయనం చెయ్యడం సులభతరంగా ఉంటుంది.[8]

గిరిజన విజ్ఞానం గురించి పరిశోధన చేసే జానపద విజ్ఞాని జానపద విజ్ఞాన తత్వాన్ని అవగాహన చేసుకొని ఉండడంతో పాటు మానవశాస్త్ర తత్వాన్ని కూడ తెలుసుకొని ఉండాలి. అలా అయినప్పుడే క్షేత్రకార్యం (Field work) రాణిస్తుంది.

'సవరలు, కోదులు, చెంచులు, ఎరుకలు, ఏనాదులు, లంబాడీలు మొదలయిన ఆదిమనివాసులు నాగరికత, విజ్ఞానము లేని పశుప్రాయులవలె మనకు కనబడుతున్నారు; కాని, మనకు కనపడినంత అనాగరికులు, అజ్ఞానులు కారు. ప్రాచీన కాలమందు శబరులు ఆర్యులకు చేరువగానే ఉండి, ఆర్యుల విజ్ఞానమును కొంత వరకు అన్ని విషయములలోను గ్రహించిన వారని చెప్పగలము. అందులో చాలభాగము నేటివరకున్న సవరలలో నిలచియున్నది.... వైద్య విషయములో సవరలు, చెంచులు, ఎరుకలు కొంత జ్ఞానము, అనుభవము గలవారు. నాగరికులయిన మనవారు కొందరు వారి మందులు పుచ్చుకొంటున్నారు; వారి మంత్రాలవల్ల రోగములు కుదుర్చుకొనుటకున్ను, భూతపిశాచముల బాధ తొలగించు కొనుటకున్ను ప్రయత్నిస్తున్నారు. వేట విషయములో ఈ ఆదిమనివాసులు ప్రజ్ఞావంతులన్న విషయము సంస్కృతాంధ్రకావ్యములందు పెక్కుచోట్ల వర్ణించడము కనబడుతుంది. సత్యము పలుకుటలోను, పాతివ్రత్య విషయములోను సవరలు మొదలయిన ఆదిమనివాసులు మంచి పేరు పొందినారు. ఇప్పుడిప్పుడు పల్లప్రదేశ నాగరికుల సంపర్కము వల్ల పైని చెప్పిన సద్గుణములు వారిలో తగ్గిపోతున్నవి'.[9]

---

*8. కర్నాటక జానపద.*

*9. ఆంధ్ర సర్వస్వము, పుట 104.*

పై విషయాలు సత్యదూరం కావనిపిస్తాయి. గిరిజనుల ఆచార వ్యవహారాలు, సంప్రదాయాలు, కళలు, సాహిత్యం మొదలైన విజ్ఞానాంశాలను గమనిస్తే గిరిజన విజ్ఞానం ఏ విజ్ఞానికీ తీసిపోయేది కాదు. వాటిని మరింత లోతుగా పరిశీలిస్తాను.

గిరిజనుల జీవిత విశిష్టతలలో వాళ్ళ సంప్రదాయం, పద్ధతుల్ని ముఖ్యంగా చెప్పుకోవాలి. వీటిని వాళ్ళు పట్టుదలతోను, భక్తితోను అవలంబిస్తారు. ఇది వాళ్ళు సలిపే పూజాపురస్కారాలలోను, మతకర్మల విషయంలోను వ్యక్తమవుతుంది. సవరలు పూజించే దేవతల సంఖ్య రెండువందలకు పైగా ఉందట.[10] కొందరి మతంలో సూర్యుడు ముఖ్యదేవత, సృష్టికర్త. మరికొందరి మతంలో సూర్యుని మించిన సృష్టికర్త మరొకడు ఉన్నాడు. వ్యాధులన్నీ దేవతలవల్లనే - అందులోను క్షుద్ర దేవతల వల్లనే కలుగుతాయన్న నమ్మకం వీళ్ళలో ఉంది. అందువల్ల ఆ దేవతలని పూజిస్తూ వారికి బలులను కూడ సమర్పిస్తారు.

గిరిజనుల్లో ఆత్మారాధన పద్ధతులు అధికంగా కన్పిస్తాయి. చనిపోయిన వాళ్ళ ఆత్మలతో సంభాషించడానికి వారి ఆత్మలను తమకాయాలలోనికి ప్రవేశింప చేసుకోగల శక్తి సవరలలో కొందరికి ఉందట. అప్పుడు వాళ్ళు మాట్లాడే మాటలన్నీ ఆ ఆత్మలు మాట్లాడుతూ ఉన్నట్టే భావించి ఆ చనిపోయిన వారి ఆత్మలతో ఇతరులు కొంతసేపు ప్రసంగించి తెలుసుకోవలసిన విషయాలను తెలుసు కొంటారట. ఆదిమవాసులకి మరణించిన వాళ్ళమీద భయభక్తులు అధికం. ఈ భయభక్తులవల్లే ప్రాచీన మానవసంఘంలోని మతవ్యవస్థలు ఆవిర్భవించి ఉంటాయి.

సవరలులాగే కోదులు కూడ దేవతలకు కోడి, మేక, ఎనుబోతు మొదలైన జంతువుల్ని బలి ఇచ్చే ఆచారం ఉంది. చెంచులకి ఆకాశమ్మ, భూమి అమ్మ, అమ్మతల్లి (అమ్మవారు) ముఖ్యదేవతలు. ఆకాశదేవత అన్ని దేవతలకి పై దేవత అని వీళ్ళ నమ్మకం. వీళ్ళు సూర్యుణ్ణి కూడ ఆరాధిస్తారు.

ఆదిమనివాసుల్లో చెప్పదగ్గ మరోజాతి ఏనాదుల జాతి. అనాది శబ్దం నుంచి ఏనాది శబ్దం వచ్చి ఉంటుందన్న అభిప్రాయం ఉంది. ప్రకృతిశక్తుల్ని దేవతల్లా భావించి పూజించడం, రోగాలన్నీ క్షుద్రదేవతల కోపాలవల్లే కలుగుతాయనీ, చిల్లంగి ప్రయోగాలవల్ల కూడ రోగాలు, మరణాలు కలుగుతాయనీ వీళ్ళు పూర్తిగా నమ్ముతారు.[11]

---

*10.* ఆంధ్ర సర్వస్వము, పుట *97*

*11. Ibid.* పుట *103*

ఆదిమనివాసుల్లో మ్యాజిక్కూ అన్నా, ప్రయోగాలన్నా నమ్మకం అధికంగా ఉంది. దేవతలను సంతోషపెట్టడానికీ, తమ కోర్కెలు నెరవేర్చుకోవడానికీ, శత్రువుల మీద కక్ష సాధించడానికీ వీటిని ఉపయోగిస్తారు. సాధారణంగా ప్రతి ఆదిమజాతిలోను మాంత్రికుడు, మ్యాజిక్ చేసేవాడు ఉంటారు. మ్యాజిక్ పద్ధతులవల్ల రోగాలు నయం కావడం, వర్షాలను రప్పించడం మొదలైన సాంఘికావసర కార్యాలు సాధ్యం అని వీళ్ళ విశ్వాసం. దీన్ని Sympathetic magic అంటారు. పూర్వకాలంలో ఈ పద్ధతి నుపయోగించి 'కామెర్ల' రోగాన్ని నయం చేసేవాళ్ళుట.[12] ముండాజాతి వాళ్ళు వర్షం కోసం కొండమీది నుంచి పెద్ద పెద్ద బండల్ని దొర్లిస్తారట. (Rain Magic)[13]

ప్రయోగాలు, చేతబడులు సాధారణంగా ఆదిమవాసుల్లో కన్పిస్తాయి. ప్రయోగం మూలంగా మానవుడు రోగగ్రస్తుడవుతాడనీ, చంపబడతాడనీ కోయ, లంబాడీ, ఎరుక జాతుల్లో విశేషంగా వ్యాపించి ఉన్నట్లు తెలుస్తుంది. ఇంతే కాక కోయ, కడుంబరు జాతులవాళ్ళు పెద్దపులి నోరు కట్టేస్తారని, మంత్రాలతో ప్రయోగాలు చేస్తారని అంటారు.[14]

గిరిజనుల్లో 'Totem' పద్ధతి ఉంది. ఇది ఆస్ట్రేలియా, ఆఫ్రికా ఆదిమ జాతుల టోటమ్ పద్ధతిని గుర్తు చేస్తుంది. ఆయా జంతువు లేదా వృక్షాన్ని తమ కులదైవం అని గుర్తించి వీళ్ళు దాన్ని నాశనం చేయరు లేదా తినరు. ఈ జంతు వృక్ష పూజలే ప్రస్తుత ఆదిమ నివాస సంఘాల మతానికి ప్రాతిపదికలుగా చెప్పబడుతున్నాయి.[15]

సమిష్టి జీవనం గిరిజనుల ప్రత్యేకత. వీళ్ళల్లో ముఠా లేదా జాతి లేదా కుల పంచాయితీ ఉంటుంది. ఇదే వాటి ముఖ్యమైన రాజకీయ వ్యవస్థ. ప్రతి పంచాయితీ తన జాతికి అనుగుణంగా విధుల్ని, న్యాయ చట్టాలను నిర్మించుకొంటుంది. ఆయా గిరిజన జాతులకి ఒక్కొక్క నాయకుడుంటాడు. అతని మాటే చెల్లుబడి

---

*12.* *మానుష శాస్త్రం - ఆదిమ నివాసులు పుట 66 నుండి ఉద్ధరింపబడింది.*
*(చూడు Magic and Religion, P.33, Sir J.G. Frazer.)*

*13.* *Ibid పుట 67*

*14.* *Ibid.*

*15.* *Ibid పుట 65*

అవుతుంది. గిరిజనుల్లో ప్రతివ్యక్తీ తాను తయారు చేసే వస్తువుల్ని ఇతరులకి పంచి పెడతాడు. దాని మూలంగా సాంఘిక ఔన్నత్యాన్ని పొందడానికి ఇష్టపడతాడు. ఇదే వాళ్ళ ఆర్థిక విధానం అని చెప్పొచ్చు. ఈ ఆదిమవాసుల ఆర్థిక వ్యవస్థనుంచే జానపద ఆర్థికవ్యవస్థ ఏర్పడిందనవచ్చు.

పండుగ పబ్బాల సమయాల్లో గిరిజనులందరూ కలిసి పండుగ చేసుకొంటారు. విందులు, వినోదాల్లోను మద్యం సేవించడం, నాట్యం చేయడం, పాటలు పాడడంలోను వీళ్ళ సమిష్టిజీవనం వ్యక్తమవుతుంది. ఆడవాళ్ళూ, మగవాళ్ళూ కలిసి నాట్యం చేస్తారు. గొబ్బి తట్టుతూ నాట్యం చేయడం సవరలు, చెంచులు మొదలైన జాతుల్లో కన్పిస్తుంది. చెంచు వాళ్ళలోనే నెమలి ఆట, కొండముచ్చుల ఆట కూడ ప్రధానమైనవి. గోండు జాతుల్లో 'దున్నపోతు కొమ్ముల నృత్యం' ముఖ్యమైంది. భద్రాచలం, పోలవరం మొదలైన అరణ్యప్రాంతాల్లో నివసించే కోయల వివాహ సమయాల్లో ఈ నృత్యం ప్రాధాన్యం వహిస్తుంది. గ్రామంలో ఉన్నవాళ్ళంతా ఈ నృత్యంలో పాల్గొంటారు. గిరిజనుల్లో నృత్యం ప్రధానమైన వ్యాయామ క్రీడగా భాసిస్తుంది. కొండరెడ్ల మామిడినృత్యం, అరకులోయలోని థింసా నృత్యం, లంబాడీ నృత్యం, సిద్ధినృత్యం మొదలైనవి మరికొన్ని గిరిజన నృత్యాలు.

గిరిజనుల్లో ఇళ్ళ నిర్మాణం విశిష్టంగా కన్పిస్తుంది. ఏనాదులు గుడెసెల్ని వెదురుతోను, తాటికమ్మలతోను కట్టుకొంటారు. మీదికి కొనదేరిన పెద్దపిట్ట గూడులాగ గుడిసె కన్పిస్తుంది. లోపలికి వెళ్ళడానికి ఒక్కటే ద్వారం ఉంటుంది.

కోదులలో 'ప్రేమిక సదనా' లకు ప్రాధాన్యం కన్పిస్తుంది. ప్రతిగ్రామంలోను పెళ్ళికాని కన్యలకు ఒక ఇల్లూ, పెళ్ళికాని యువకులకు ఒక ఇల్లూ, ప్రత్యేకించి ఏర్పరుస్తారు. ఎవరికి నియమించిన ఇళ్ళల్లో వాళ్ళు రాత్రిళ్ళు పడుకోవాలి. కన్యలకోసం ఏర్పరచిన ఇంట్లో ఒక ముసలామె కన్యలకు తోడుగా ఉంటుంది. ఆమెద్వారా యువకులకు పరిచయం ఏర్పడుతుంది; నియమాన్ని అనుసరించి ప్రేమబంధం ఏర్పడుతుంది. దాన్ని గమనించి పెద్దలు పెళ్ళి చేస్తారు.[16] నక్షత్రాలనుబట్టి సవరలు ముహూర్తాలను నిర్ణయిస్తారు.

---

*16.* ఆంధ్ర సర్వస్వము, పుట *98*

సాధారణంగా గిరిజన స్త్రీలు రవికెలు ధరించరు. పూర్వం ఖోందులు 'సంబార్' ఎముకతో జుట్టుముడుల్లో అలంకరించుకొనే సూదుల్ని తయారు చేసేవాళ్ళు. ఆదిమవాసులకు హారాలంటే చాల ఇష్టం. మెడచుట్టూ పూసల హారాలను ధరిస్తారు. ప్రకృతిలో లభించే రాళ్ళతోను, ఆలిచిప్పలతోను అలాంటి హారాలను తయారు చేసుకొంటారు. పచ్చబొట్టు పొడిపించుకునే ఆచారం/ సంప్రదాయం గిరిజనుల్లో అధికంగా కన్పిస్తుంది.

చెంచులు, ఎరుకలు బుట్టలు అల్లడంలో నేర్పరులు. ఇది వాళ్ళవృత్తిగా ఉంది. వెదురుగడల్ని చిన్న చిన్న వాద్యాలుగా చేయడంలో వీళ్ళు నేర్పరులు.

గిరిజనులు వేటాడడంలో ఆరితేరినవారు. తేనేపట్టడం కొంతమందికి వృత్తిగా కన్పిస్తుంది. పాముల్ని పట్టి ఆడించడంలో ఏనాదులు ప్రసిద్ధులు.

వైద్య విషయంలో సవరలు, చెంచులు, ఎరుకలు, కోయలు పరిజ్ఞానం, అనుభవం ఉన్నవారు. నాగరికులు కూడ వీళ్ళిచ్చే మందుల్ని ఉపయోగిస్తారు. అలాగే వీరి మంత్రాలవల్ల రోగాలను, భూతపిశాచాల బాధలను తొలగించుకోవడానికి ప్రయత్నిస్తున్నారు.

గిరిజనుల్లో శకునాల మీద నమ్మకం, విశ్వాసం కన్పిస్తుంది. ఖోందుల్లో శకునాలమీద విశ్వాసం అధికం. వేటకు బయల్దేరేటప్పుడు స్త్రీలు ఎదురుగా రాకూడదు. భార్య ఋతుమతిగా ఉన్నప్పుడు భర్త వేటకు వెళ్ళకూడదు. గుడ్లగూబ అరుపు అశుభం. చిరుతపులి ఎదురవుతే శుభసూచకం.

గిరిజనుల పండుగల్లో - కమ్మరుల గంగాదేవి పండుగ లేక ఇటుకల పండుగ, నంది పండుగ, వ్యవసాయపు పండుగలైన కొర్రకోత, బుడమకోత పండుగలు; కొండదొరల పూసపండోయి పండుగ, కడకు పండోయి పండుగ, గదబల చైత్రపర్వం, బలిజాత్ర, పుష్యపండుగలు చెప్పుకోదగ్గవి.

గిరిజనుల సాహిత్యం ఏ సాహిత్యానికీ తీసిపోదు. ప్రాచీన సంస్కృత సారస్వతంలో చెప్పబడ్డ శబరవంశం వాళ్ళే సవరలన్న అభిప్రాయం ఉంది. ఈ శబరులు ఆర్యులకంటే, ద్రావిడులకంటే ముందు మనదేశంలో ఉన్నట్టు

తెలుస్తుంది.[17] శాబర మంత్రాల ప్రసిద్ధి ప్రాచీన సంస్కృత సారస్వతంలో కన్పిస్తుంది. వేదబుక్కలలాగా వీరి పాటలు కూడ 3,4 స్వరాలతో ఉన్నాయి.

'తెలుగు గిరిజన గీతాల' మీద పరిశోధన చేసిన డా. పేరాట్ల శివరామకృష్ణ గిరిజన గీతాలను పెక్కింటిని సేకరించి, తమ సిద్ధాంత వ్యాసంలో విశ్లేషించారు ఆయన గిరిజన గీతాలతోపాటు సామెతలు, పొడుపుకథలు, నమ్మకాలు పెక్కింటిని పేర్కొన్నారు. వాటిలో కొన్నింటిని పేర్కొంటాను.

**సామెతలు:**

పిందె పట్టిన (పాతబడ్డ) చేనుచేయకు
చేను చెయ్యవాలె, చేటపాక వెయ్యవాలె... ఇత్యాది

**పొడుపుకథలు:**

'రాజుమీద ఓజులోడు'
'అడవికి ఆటగాడు (నెమలి)
'చేనుకు చేటుగాడు (చెవులపిల్లి)
'దారికి దడ్డడు' (పులి)

పైన వివరించిన అంశాలను గమనిస్తే జానపద విజ్ఞానాన్ని నిర్వచించి, వింగడించినట్టే గిరిజన విజ్ఞానాన్ని నిర్వచించి, వర్గీకరించి అధ్యయనం చేయాల్సిన అవసరం ఉంది

నగరాల్లోను, గ్రామాల్లోను నివసించే ప్రజల్ని మినహాయించి తక్కిన ప్రదేశాల్లో అంటే అడవులు, కొండలు, గుట్టలు, లోయలు, తీరప్రాంతాల్లో జీవిస్తూ తక్కిన ఇతర ప్రజలందరికీ దూరంగా ప్రత్యేకంగా నివసించే, ప్రత్యేక సంస్కృతి కలిగిన సమాజాలలోని జాతుల (Tribes) విజ్ఞానాన్ని 'గిరిజన విజ్ఞానం' అని నిర్వచించవచ్చు.

గిరిజన విజ్ఞానాన్ని 1. మౌఖిక గిరిజన సాహిత్యం 2 సాంఘిక గిరిజన ఆచారాలు 3. వస్తు సంస్కృతి 4. గిరిజన నృత్యాలు 5. గిరిజన భాష అని వర్గీకరించవచ్చు. మౌఖిక సాహిత్యంలో కవిత్వం (గేయాలు, కథాగేయాలు),

---

*17. Ibid.*

గిరిజన కథలు, సామెతలు, పొడుపు కథలు చేర్తాయి. సాంఘికాచారాలలో పుట్టుక, పెండ్లి, మరణం మొదలైన సంస్కారాలకు చెందిన ఆచార వ్యవహారాలు, సంప్రదాయాలు; పండుగలు; క్రీడలు- వినోదాలు; వైద్యం; మతం; నమ్మకాలు - విశ్వాసాలు ప్రాధాన్యం వహిస్తాయి. వస్తు సంస్కృతిలో చిత్రకళ, వాస్తుకళ, వృత్తుల పరికరాలు, దుస్తులు - ఆభరణాలు; ఆహార పానీయాలు మొదలైనవి భాగంగా ఉంటాయి. వివిధరకాలైన నృత్యాలు గిరిజన నృత్యాల్లో ప్రాధాన్యం వహిస్తాయి. మాండలికాలు, నుడికారాలు, తిట్లు, ఒట్లు మొదలైనవి గిరిజన భాషలో ముఖ్యమైనవి.




'మనకన్న తక్కువవారిగా చూడబడు ఈ అరణ్యదొరల జీవితములోని ఆర్థిక వ్యవస్థలు, సాంఘిక కట్టుబాట్లు చూచినచో, వారిపైన మనకుగల దురభిప్రాయము పోవుటయేగాక, వారిపురాతన విజ్ఞానము నుండియే మన

నాగరికతయందలి ఉత్కృష్ట లక్షణములు ఆవిర్భవించినవని మనకు తోచును. ఇది వాస్తవము' 'అన్న ఎ.ఎం. సోమసుందరంగారి అభిప్రాయముతో తప్పక ఏకీభవింపవచ్చును.[18]

సాధారణంగా వృత్తి, జీవనవిధానాన్ని బట్టి ఆంధ్రప్రదేశ్‌లోని గిరిజన తెగల్ని

1. అడవిలో ఆకులలాలు ఏరుకొనేవాళ్ళు, మైదాన ప్రదేశాల్లో చేపలు, ఎలుకలు పట్టుకొని జీవించేవాళ్ళు.
2. పశువులు కాచుకొని జీవించవాళ్ళు
3. అడవి నరకి, కాల్చి, పోడు వ్యవసాయం ద్వారా జీవించేవాళ్ళు.
4. నాగలితో వ్యవసాయం చేసి జీవించేవాళ్ళు

అని వింగడించడం జరిగింది.[19]

ఆంధ్రప్రదేశ్‌లో 33 గిరిజన జాతులున్నాయి. 1971 జనాభాలెక్కల ప్రకారం వీరి జనాభా 16.57 లక్షలు. ఇందులో శ్రీకాకుళం, విశాఖపట్టణం, ఉభయగోదావరిజిల్లాలు, ఖమ్మం, ఆదిలాబాదు, వరంగల్లు, మహబూబ్‌నగర్ జిల్లాల్లో 11,595 చ.మై. విస్తీర్ణంలో అనుసూచిత ప్రదేశంలోని మన్యప్రాంతాల్లో ఇంచుమించు 8 లక్షల జనాభా కలిగిన గిరిజనులు నివసిస్తున్నారు. తక్కిన గిరిజనులు ఎరుకలు, యానాది, సుగాలీ మొదలైనవాళ్ళు మైదానప్రాంతపు గ్రామాల్లో అభివృద్ధి చెందుతున్న గిరిజనేతర జాతులమధ్య నివసిస్తున్నారు.[20] 1981 జనాభా లెక్కలప్రకారం గిరిజనుల జనాభా 33 లక్షలు. ఇందులో అతి తక్కువ జనాభా ఉన్నవారు రోణులు.

ఆంధ్రప్రదేశ్‌లోని గిరిజన జాతులు 1.ఆంధ్ 2.ఎరుకుల 3.కమ్మర 4. కొండదొర 5.కొండరెడ్డి 6.కోలాము 7.కోయ 8. కోందు 9. కోటియా 10.కులియా 11 గదబ. 12. గోండు 13.గౌడు, 14. చెంచు 15. తోటీ 16. నాయకపోడు, 17. ప్రధాని, 18.పొరజ, 19.భగత, 20.భిల్లు, 21.మన్నెదొర

---

*18. మానుష శాస్త్రం - ఆదిమ నివాసులు, పుట 68*

*19. ఆంధ్రప్రదేశ్ ఆదిమజాతులు, (పుటలు iii - iv)*

*20. Ibid.*

22. మాలీ/మహలీ, 23. మూకదొర, 24. యానాది, 25.రెడ్డిదొర, 26.వాల్మీకి, 27. సవర, 28.సుగాలీ మొదలైన జాతులు 'ఆంధ్రప్రదేశ్ ఆదిమజాతులు' అన్న గ్రంథంలో పేర్కొనబడ్డాయి. తక్కిన ఐదుజాతులు - కొండకాపులు, జాతపులు, హిల్‌రెడ్లు, రోణులు, పొరిజలు.

పై తెగల్లో ఉపతెగలు కూడ ఉన్నాయి. తెలుగు మాతృభాషగా ఉన్న తెగల్లో బగత, చెంచు, కమ్మర, కొండదొర, కొండకాపు, కొండరెడ్డి, వాల్మీకి మొదలైన తెగలు ముఖ్యమైనవి. గిరిజనుల్లో తిరుగుబోతు జాతులు లేదా సంచార జాతులు (Nomadic Tribes) ద్రిమ్మరులు (Vagrants), దొంగజాతులు (Criminal Tribes) మొదలైన జాతుల్ని గుర్తించడం జరిగింది.

భారతదేశంలో గిరిజనుల గురించి విశేషమైన పరిశోధన చేసిన వాళ్ళలో పేర్కొనదగ్గవారు వెరియర్ ఎల్విన్. క్రైస్తవమత ప్రచారం కోసం ఇంగ్లాండు నుంచి భారతదేశం వచ్చిన ఎల్విన్ భారతదేశపు సంస్కృతికి, అందులోను గిరిజన సంస్కృతికి ఆకర్షితులయ్యారు. గిరిజనులకు సంబంధించిన కృతులనెన్నింటినో రచించారు. సవరజాతి విజ్ఞానాన్ని గురించి విశేషంగా శ్రమించిన వాళ్ళల్లో ఎన్నదగ్గవారు గిడుగు రామమూర్తి పంతులుగారు, డా. గిడుగు వెంకట సీతాపతిగారు.

క్రిస్టఫ్ వాన్ హెమొండార్ఫ్ 1945 లో 'ది చెంచూస్ ఆఫ్ హైద్రాబాద్, ది రెడ్డీస్ ఆఫ్ బైసన్ హిల్స్' అన్న గ్రంథాన్ని ప్రచురించి ఆంధ్రదేశంలో గిరిజనులను గురించి అధ్యయనం చేయ్యడానికి దోహదం చేశారు. శ్రీ వెన్నెలకంటి రాఘవయ్యగారు యానాదుల గురించి పరిశ్రమ చేసి 'The Yanadis' అన్న గ్రంథాన్ని 1962లో ప్రకటించారు.

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో డా. మునిరత్నం రెడ్డి బగతల గూర్చి పరిశోధన చేసినట్టు తెలుస్తుంది. 1982లో డా. పిరాట్ల శివరామకృష్ణ ఉస్మానియా విశ్వవిద్యాలయంలో డా. బిరుదురాజు రామరాజుగారి పర్యవేక్షణలో 'తెలుగులో గిరిజన గీతాల' మీద పిహెచ్.డి. చేశారు. ఇది గిరిజన గీతాలమీద మొదటి పరిశోధన. 'మారేడుమిల్లి గిరిజనగేయాలు' మీద శ్రీ పిరాట్ల సుబ్రహ్మణ్యశాస్త్రి తెలుగు విశ్వవిద్యాలయం, రాజమండ్రి ప్రాంగణంలో 1990లో ఎం.ఫిల్ చేశారు. ఆయనే గిరిజన విజ్ఞానానికి సంబంధించి 'తూర్పుగోదావరి జిల్లాలోని గిరిజనుల

కథలు' అన్న అంశం మీద తెలుగు విశ్వవిద్యాలయంలో 1992లో పిహెచ్.డి. చేశారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో 'గిరిజనుల సామెతల' మీద డా. మురళీకృష్ణ పరిశోధన చేశారు.

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎం.డి. రాజ్ మహమ్మద్ 'తెలంగాణ గిరిజనుల మౌఖిక సాహిత్యం' మీద పి.హెచ్.డి. చేశారు. 'కరీంనగర్ జిల్లా లంబాడీల ఆచార వ్యవహారాలు' అనే అంశంమీద ఉస్మానియా విశ్వవిద్యాలయంలో జనపాల శంకరయ్య ఎం.ఫిల్‌చేశారు (1993). ఆయనే 'తెలుగు లంబాడీలగేయ సాహిత్యం' మీద పరిశోధన చేసి పిహెచ్.డి., పట్టం పొందారు (1999). బెంగుళూరు విశ్వవిద్యాలయంలో డా.జి.ఎస్.మోహన్‌పర్యవేక్షణలో శ్రీ పి.ఎమ్. మునిరెడ్డి 'కొండరెడ్ల గిరిజన సాంఘికాచారా'ల మీద పిహెచ్.డి. చేశారు (1999).

నాకు తెలిసినంతవరకు ఆంధ్రదేశంలోని తెలుగు విభాగాల్లో గిరిజన విజ్ఞానం గురించి పరిశోధనలు అంతగా జరగలేదు. తక్కిన విభాగాలైన సాంఘిక మానవశాస్త్ర శాఖల్లో పరిశోధనలు జరిగిన వివరాలు లభించలేదు.

గిరిజనుల ఆచార వ్యవహారాలు, పండుగలకు సంబంధించిన వివరాలు కొన్ని కేంద్రప్రభుత్వం వారు ప్రచురించిన **The census of India, Vol.II, Part-VII - B Fairs and Fertivals of Andhra Pradesh** అన్న గ్రంథంలో లభిస్తాయి. అలాగే ఆదివాసి సాంస్కృతిక పరిశోధన మరియు శిక్షణ సంస్థ పక్షంలో ఆ సంస్థ డైరెక్టరు శ్రీ డి.ఆర్. ప్రతాప్ 1976లో ప్రచురించిన 'ఆంధ్రప్రదేశ్ ఆదిమజాతులు' అన్న గ్రంథంలో గిరిజనుల వివరాలతో పాటు వాళ్ళ ఆచారవ్యవహారాలు, సంప్రదాయాలు, విశ్వాసాలు చెప్పబడ్డాయి. ఆంధ్రప్రదేశ్‌లోని గిరిజనులను గురించి ఈ గ్రంథం మనకు ఎక్కువ సమాచారం అందిస్తుంది. అలాగే శ్రీ ఎ.ఎం. సోమసుందరంగారి 'మానుషశాస్త్రం - ఆదిమనివాసులు' గ్రంథం (1945) ప్రపంచ జాతుల్ని, భారతదేశ ఆదిమనివాసుల్ని, ఆంధ్రదేశ ఆదిమనివాసుల్ని గురించీ చక్కగా వివరిస్తుంది. వీరు ఎం.ఏ., డిగ్రీకోసం లంబాడీలకు సంబంధించి సిద్ధాంతవ్యాసం లక్నో విశ్వవిద్యాలయానికి సమర్పించారు (1944).

గిరిజనులకు సంబంధించిన మరికొన్ని గ్రంథాలు:

1. Castes and Tribes of Southern India - Edger Thurston
2. Races and Cultures of India - D.N. Majumdar
3. A Tribe in Transition - D.N. Majumdar
4. Gonds and Gondwana - Indrajit Singh.
5. The Aboriginals - Dr. Verrier Elvin
6. The problem of the Tribes in India Primitive - Dr. A.Aiyappan.
7. The Fortunes of a Primitive Tribe
   - Von christopher F. Haimendorf
8. The Yanadis (Thesis) - P.C. Reddy
9. Interpretation of Aryan and Primitive Cultures
   - Dr. G.V. Sitapati.
10. The Soras and Their Poetry - Dr. G.V. Sitapati
11. Castes and Tribes of Hyderabad - Shiray - Ul-Hussain
12. The Lambadis (Thesis) - A.M. Somasundaram.
13. The problem of the Vagrants, Nomads and Criminals
    - A.M. Somasundaram
14. Tribal Life in India - Nirmal Kumar Bose
15. The Religion of an Indian Tribe - Verrier Elwin.
16. Introduction to sociology of Rural and Tribal India
    - P.T.K. Nair

మొదలైన గ్రంథాలు గిరిజనులను గురించి వెలుగును ప్రసరిస్తాయి.

* * *

# 2. నగర జానపద విజ్ఞానం
## (Urban Folklore)

జానపద విజ్ఞానం కేవలం జనపదాల్లో మాత్రమే ఉందన్న అభిప్రాయం ఉంది. అయితే నగరవాసుల్లో సైతం ఈ జానపదత్వం ఉందన్న సత్యాన్ని మనం గమనించాల్సిన అవసరం ఉంది. జానపద విజ్ఞాన ప్రక్రియలైన జానపదగేయాలు, కళలు, వైద్యం, నమ్మకాలు, సంప్రదాయాలను గమనిస్తే ఈ అంశం స్పష్టమవుతుంది. ప్రతిరోజూ నాగరకుడు సైతం తన జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక విధంగా పై జానపద విజ్ఞానాంశాల్ని అలవరచుకుంటూనే ఉన్నాడు.'It is not the folk but the folkishness that matters' అన్న అంశాన్ని ఇక్కడ గుర్తుంచుకోవాలి.

గ్రామసీమల్లో జానపద విజ్ఞానాంశాలు కన్పిస్తునట్టుగానే నగరాల్లో కూడ జానపద విజ్ఞానం ఉందనే విశ్వాసం ఈ 'నగర జానపద విజ్ఞానం' అనే పారిభాషిక పదసృష్టికి దారితీసిందని చెప్పవచ్చు. 'నగరం' అన్న పదసృష్టి కేవలం నేడు పారిశ్రామిక విప్లవం పరిణామంగా రూపుదిద్దుకొన్నట్టు భావించవచ్చు.

జానపద విజ్ఞానాన్ని శాస్త్రీయంగా అధ్యయనం చేసే పద్ధతుల్ని మనం పాశ్చాత్యుల నుండే స్వీకరించాం. అలాగే 'నగర జానపద విజ్ఞానం' అనే పదాన్ని కూడ మనం వాళ్ళనుండే స్వీకరిస్తున్నాం.

మనలో 'మార్గ', 'దేశి' అనే వ్యత్యాసం ఉంది. ఇది 'నగరం', 'గ్రామం' అనే భేదానికి అనుగుణంగా ఉంది. నన్నయాది ప్రాచీన కవుల్లో శిష్టులు, జానపదుల విషయంలో నిర్దిష్టమైన అభిప్రాయం ఉన్నట్టు మనం గమనించవచ్చు. అయితే ఈ అభిప్రాయం కేవలం సాహిత్యానికి సంబంధించిందే కాని జనుల జీవన విధానానికి సంబంధించింది మాత్రం కాదనేది స్పష్టం.

జానపద విజ్ఞానాన్ని నిర్వచించేటప్పుడు 'జానపదం' అనే పదానికి 'Country, which is opposite to the town or city' అనే అర్థాన్ని పరిగణనకు తీసుకున్నాం. అంటే 'గ్రామానికీ' 'నగరానికీ' భిన్నత్వం ఉందన్నమాట. నగర

వాతావరణానికి భిన్నంగా గ్రామాల్లో నివసించేవాళ్ళ జీవన విధానం, సంస్కృతి జానపద విజ్ఞానం అనిపించుకుంటుంది.

పదహారో శతాబ్దం తర్వాత పాశ్చాత్యదేశాల్లో విజ్ఞాన, ఆర్థిక, పారిశ్రామిక రంగాల్లో జరిగిన అభ్యుదయం కారణంగా నగరాలు సవృద్ధంగా పెరగనారంభించాయి. ఇవి జనపదాలకు భిన్నంగా నిలచాయి. ఇలాంటి నాగరికుల్లో కూడ జానపద విజ్ఞానానికి చెందిన ఆ సమానాంశాలను పండితులు గుర్తించడం వల్ల ఇది 'నగర జానపద విజ్ఞానం' అనిపించుకుంది. అజ్ఞాన కర్తృత్వం, నిరక్షరాస్యత అనేవి జానపద విజ్ఞానం విశిష్ట లక్షణాలు. అలాగే నగరాల్లో గోడలమీద వ్రాయబడ్డ వ్రాతలు, బొమ్మలు (mural writings), Jokes, Greeting Cards మొదలైన వాటిని 'లిఖిత జానపద విజ్ఞానం' లేదా 'నగర జానపద విజ్ఞానం'గా అధ్యయనం చేయడం జరుగుతోంది.

ఆంగ్ల భాషాసంస్కృతుల ప్రభావంవల్ల మనదేశంలో కూడ నగరాల్లో సామాజిక వ్యవస్థ కొత్త రూపుదిద్దుకున్నది. నగరాల చుట్టూ ఫ్యాక్టరీలు నెలకొల్పబడ్డాయి. ఫలితంగా భుక్తికోసం ఉద్యోగాలను వెతుక్కుంటూ గ్రామవాసులు నగరాలకు వలసరావడం ఆరంభించారు. వాళ్ళతోపాటు జానపద విజ్ఞానాంశాలు కూడ నగరాలను ప్రవేశించాయి. ఉదాహరణానికి కార్మికులు పాటలుపాడుకోవడం, వినోద కాలక్షేపాలకోసం నాటకాలు, బయలాటలు ప్రదర్శించడం కన్పిస్తుంది. చుట్టుప్రక్కల ఉన్న గ్రామాలు నగరాల్లో కలిసిపోవడం వల్ల కూడ పల్లెల్లో ఉన్న జానపద విజ్ఞానాంశాలు నగర జానపద విజ్ఞానంగా మారాయి.

నగరాలు ఎంత ఆధునికత్వాన్ని సంపాదించుకొన్నా బాగా ఆలోచిస్తే 'జానపదత్వం' అనేది ఇంకా నగరాలనుండి తొలగిపోలేదు. నేటి అత్యాధునిక విజ్ఞానం నగరవాసుల్ని సుఖమయ ప్రపంచంలోకి తీసుకువెళ్ళడానికి ప్రయత్నించినా అది పూర్తిగా వాళ్ళని జానపదత్వం నుండి తొలగించలేక పోతోంది. అందువల్లే నగరవాసుల్లో ఉన్న జానపద విజ్ఞానాంశాలను అధ్యయనం చేయడం జరుగుతోంది.

సంప్రదాయ బంధంలో మానవుడు అనాదినుంచీ బంధింపబడి వస్తూనే ఉన్నాడు. సంప్రదాయ పంజరంలో చిక్కుకుపోయిన ఈ మానవుడికి నమ్మకాలు,

కట్టుబాట్లు, అలవాట్లు, పద్ధతుల్ని త్రెంచుకోవాలనే కోరిక కానీ, అంతకంటే అవకాశం కానీ నేటి ఆధునిక ప్రపంచంలో లభించడంలేదు. అలా అని నగరవాసు లందరూ సంప్రదాయాన్ని జీర్ణించుకొన్నవారని చెప్పడానికి వీల్లేదు.

నగర జానపద విజ్ఞానం నగరాల్లో పుట్టిందికాదు. అయితే దాన్ని నగరానికి ప్రాకిన జానపదంగా భావించాలి. సంప్రదాయం అనేది ఒక విశ్వాసం. రక్తగతంగా మనలో జీర్ణించుకొన్న ఒక నమ్మకం. ఈ సంప్రదాయానికి మూలం జానపదం. జానపదులలాగానే నగరవాసులు కూడా ఈ సంప్రదాయాన్ని తమ జీవితంలో అలవరచుకొంటూ వస్తూన్నారనడానికి అనేకంగా ఉదాహరణాలు కన్పిస్తాయి. ఈ జానపద విజ్ఞానాంశాలను గమనిస్తే నగరాల్లోను జానపదత్వం ఎలా వేరుదన్నివుందో గ్రహించవచ్చు.

నగరాల్లో నివసిస్తున్న విద్యావంతుల ఇళ్ళల్లో ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక సంప్రదాయబద్ధమైన ఆచరణ వంశపారంపర్యంగా వస్తూండడాన్ని గమనించవచ్చు. నగరవాసుల్లో ఆస్తికులూ ఉన్నారు, నాస్తికులూ ఉన్నారు. దైవభక్తి కలిగి, అత్యాధునికంగా కట్టించుకున్న వాళ్ళ ఇళ్ళల్లో కూడ ప్రత్యేకంగా 'దేవుడిల్లు'ను మనం చూడవచ్చు. ఆ దేవుడింటికి మామిడాకుల తోరణాలను లేదా ప్లాస్టిక్ తోరణాలను, వత్తుల దీపాలను లేదా విద్యుత్ బల్బులను అలంకరింపచేస్తున్నారు. అలాగే ప్రభుత్వ కార్యాలయాల్లో కూడ దేవుడి ఫోటోలను ముఖ్యంగా గణపతి, లక్ష్మి ఫోటోలను ఉంచి ఆరాధిస్తున్నారు. శుక్రవారాల్లో మనం ఈ పూజల్ని గమనించవచ్చు. అలాగే దైవప్రార్థనతోనే స్కూళ్ళు ప్రారంభం కావడం, ఏ కార్యక్రమం మొదలుపెట్టినా దేవుడి ప్రార్థనతోనే ఆరంభంకావడం నాగరికుల్లో దేవుడిమీదున్న నమ్మకాన్ని, విశ్వాసాన్ని చెప్పకచెప్తాయి. కొన్ని సంవత్సరాల క్రితం జరిగిన 'అష్టగ్రహ కూటమి', 'సంపూర్ణ సూర్యగ్రహణం' నగరవాసుల్ని కూడ భయభ్రాంతులకి లోనుచేశాయి. జానపదుల్లో ఉన్నట్టుగానే నాగరికుల్లోను శుభాశుభ శకునాలు కన్పిస్తాయి. ఎక్కడికైనా బయల్దేరేటప్పుడు పిల్లి ఎదురవుతే లేదా ఎవరైనా తుమ్మితే అశుభంగా పరిగణించడం నగరవాసుల్లో కూడ కన్పిస్తుంది.

బెంగుళూరు గ్రామదేవత అణ్ణమ్మ. అణ్ణమ్మ ఉత్సవాలను బెంగుళూరు నగరం అంతటా జరుపుకుంటూ ఉండడం గమనించదగ్గ విశేషం. ఊరేగింపులో

నాట్యంచేయడం, వాద్యాలను ఉపయోగించడం జానపద విజ్ఞానాంశాలే. అలాగే బెంగుళూరు కరగ. ఈ సంప్రదాయం చాలకాలంగా ప్రాచుర్యంలో ఉంది.

వినాయకుడి ఉత్సవాలను బొంబాయి, హైదరాబాదు, బెంగుళూరు మొదలైన మహానగరాల్లో మహావైభవంగా జరుపుతారు. జానపద నాటకాలు హరికథలు, నృత్యాలు ఈ ఉత్సవంలో భాగంగా ఉంటాయి. అలాగే కలకత్తా నగరంలో దుర్గోత్సవాలను మహావైభవంగా జరుపుకుంటారు.

వైద్యులు, శాస్త్రజ్ఞులు, విజ్ఞానులు సైతం దసరా పండుగ సందర్భంగా ఆయుధపూజ నాడు తమ ఉపకరణాలని శుభ్రం చేసి పూజచేసే పద్ధతిని నేటికీ కొనసాగిస్తున్నారు.

నాగదేవత ప్రతిరూపాలైన శిలలను (రాళ్ళను) ఆరాధించడం, పుట్టల్ని పసుపు కుంకుమలతో పూజించడం, తులసిచెట్లను గృహప్రాంగణంలో ఉంచుకొని రోజూ పూజచేయడం, అశ్వత్థ వృక్షానికి ప్రదక్షిణ చేయడం కేవలం జానపదులే కాదు నగరవాసులు కూడ చేస్తూ ఉండడం గమనించవచ్చు.

జనపదాల్లో బాలిక ఋతుమతి అయినప్పుడూ, పెళ్ళిళ్ళ సందర్భాల్లోనూ ఆచరించే ఆచారవ్యవహారాలు, సంప్రదాయాలు, వేడుకలు, పాడబడే పాటలు పట్టణాల్లోను, నగరాల్లోను శిష్టులు కూడ ఆచరిస్తూ ఉండడం గమనిస్తే జానపదత్వానికి జనపదాలు, నగరాలు అన్న భేదం లేదని ఋజువు చేస్తాయి.

ప్రతిరోజు ఇంటిముందు నీళ్ళు చల్లి ముగ్గులు వెయ్యడం, పండుగ పబ్బాల సమయంలో కొత్త గుడ్డల్ని ధరించి దేవాలయాలను దర్శించడం, మరణించిన వాళ్ళకి శ్రాద్ధకర్మలు చేయడం, నగరవాసుల్లోను ఉన్న సంప్రదాయాలే. పిల్లలకు పేర్లు పెట్టే సమయాల్లో (నామకరణం) ఊయెలను అలంకరించడం, పద్ధతులు, పాటలు పాడడం మొదలైన జానపద సంప్రదాయాలు నగరాల్లోనూ ఉన్నాయి.

'సామెతలేని మాట ఆమెతలేని ఇల్లు' అన్నట్టుగా నాగరకుడు సైతం ఇతరులతో వ్యవహరించేటప్పుడు ఎప్పుడో ఒకప్పుడు సామెతలను ప్రయోగిస్తూనే ఉన్నాడు. జానపద సాహిత్యాన్ని అనుకరిస్తూ నగరాల్లోని నాగరికులు సామెతలనే కాక పొడుపుకథల్ని కూడ కట్టి ప్రచారంలోకి తీసుకుని వస్తుండడం మనం గమనిస్తున్నాం.

పై విషయాలను గమనిస్తే ఎం.హోర్మన్ చెప్పినట్టుగా జానపద విజ్ఞానం ఏ వస్తువులో అయినా, ఏ వ్యక్తిలో అయినా లేదా సమూహంలో అయినా, ఏ సమయంలో అయినా లేదా ఏ స్థలంలో అయినా కన్పించవచ్చు.[1] సి.ఎఫ్. పాటర్ చెప్పినట్టుగా 'Folklore is a lively fossil which refuses to die' అన్న విషయాన్ని మనం ఇక్కడ గమనించాలి.

పాశ్చాత్యుల్లో శుద్ధనగరాలు లేదా గ్రామాలు 'నగరం-జానపదం' అనే పారిభాషిక పదాల కల్పనకు అధిక ప్రాధాన్యం కన్పించినట్టుగా మనలో జనపదాలకు, నగరాలకు పెద్ద తేడా కన్పించదు. ఈ తేడా అంతా ఆధునిక జీవన విధానంలోనే కన్పిస్తుంది. ఈ వ్యత్యాసాన్ని గుర్తించడానికి మనం ప్రత్యేకంగా 'నగర జానపద విజ్ఞానం' అనే పదాన్ని ఉపయోగించవలసి వస్తోంది.

సాహిత్య, రాజకీయ ఉద్దేశాలకు అనుగుణంగా జానపద మాధ్యమంగా బుర్రకథల్ని విద్యావంతులు ఉపయోగించడం మొదలైన అంశాలను మనం అధ్యయనం చెయ్యాల్సిన అవసరం ఉంది. ఇలా నగరాల్లో కూడ ఉన్న జానపద విజ్ఞానాంశాలను మనం గమనించి అధ్యయనం చెయ్యాలి.

* * *

---

1. *'Folk lore may crop up in any subject, any group or individual at any time and place' - Standard Dictionary of Folklore*

# 3. జానపద విజ్ఞానం
## (Folk Lore)

ప్రాచీన కాలం నాటి విభిన్న సాంస్కృతిక సమూహాల సంస్కృతీ వికాసాలను గుర్తించడానికీ, వారి ఆచార వ్యవహారాలు, విశ్వాసాలు, సంప్రదాయాలు, కళలు, సాహిత్యాది విషయాల్ని గమనించడానికీ మనకు ద్వివిధాలైన సామగ్రి లభిస్తోంది. ఒకటి తరతరాలుగా గ్రంథస్థం కాక కేవలం మౌఖిక సంప్రదాయంలో (Oral Tradition) నిలిచి పోయిన విజ్ఞానం. మరొకటి నాగరకతా ప్రవాహానికిలోనై గ్రంథస్థరూపం పొందిన విజ్ఞానం. మొదటిది సాంప్రదాయిక విజ్ఞానం. దీన్నే జానపద విజ్ఞానమని (Folk Lore) అంటాం. రెండోది గ్రాంథిక విజ్ఞానం (Book Lore).

ప్రాచీన మానవ సంస్కృని పరిశీలించడానికి జానపద- విజ్ఞానాధ్యయనం (Folk lore study) అత్యంతావశ్యకమైనది. గడచిన శతాబ్దంలో జర్మనీ, ఫ్రాన్సు, ఇంగ్లండు, స్కాటులాండు, అమెరికా మొదలైన దేశాల్లోని విజ్ఞులు ఈ విజ్ఞానం పై కనబరచిన ఆసక్తి, జానపద విజ్ఞానం ఒక ప్రత్యేక శాఖగా రూపొందడానికి దోహదం చేసింది.

మానవుడు బుద్ధిజీవి. సంఘజీవి. సంఘమంటే సంస్కృతిని ఆచరణలో పెట్టే మనుష్య సమాహారం. అంతేకాక పరస్పరాపేక్షతో తమకుతాము సాంఘిక ఆర్థిక రంగాల్లో కొన్ని కట్టుబాట్లను నిర్ణయించుకొని ఒక ప్రత్యేకమైన వ్యక్తిత్వంతో నిర్మింపబడ్డ మనుష్య సముదాయం. సంస్కృతి అంటే సంఘంలో ఒక సభ్యుడుగా మానవుడు ఆ సంఘంలో అలవాట్లను, ఆచార వ్యవహారాలను, కళాస్వరూపాలను గ్రహించడమని అర్థం. అలాంటి మానవసంఘ సంస్కృతిని అధ్యయనం చేయటమే జానపద విజ్ఞానం. ఒక్కమాటలో చెప్పాలంటే మానవసంఘ సంస్కృతినీ, జీవన విధానాన్నీ, ప్రాచీన సంస్కృతినీ ప్రతిబింబించే దర్పణం వంటిది జానపద విజ్ఞానం. మనుష్య జాతిలాగే జానపద విజ్ఞానం కూడ అతి ప్రాచీనమైనప్పటికీ 'జానపదం' (Folk) అనే పదసృష్టి మాత్రం ఇటీవలిదే. ప్రాచీనులు ఈ విజ్ఞాన సంబంధ విషయాల్ని జనప్రియాలైన ప్రాక్తన విషయాలు (Popular Antiquities) అని, పిలిచేవారు. ప్రప్రథమంగా ఈ విజ్ఞానం పై ఆసక్తి కనబరచినవారు గ్రిమ్ సోదరులైన

విల్‌హెల్మ్ మరియు జాకోబ్. వీరు తమ కాలంలో ప్రసిద్ధి పొందిన జానపద కథల్ని సేకరించారు. వీరు 'Popular Antiquities' ను 'Volkskunde' అనే పేరుతో పిలిచారు. ఇది జర్మను భాషాపదం. Popular Antiquities అనే పదానికి సమార్థకంగా మొట్టమొదట William John Thoms అనే ఆంగ్లేయుడు 'Folk lore' అనే ఒక మంచిసాక్షను సమాసాన్ని ప్రయోగించాడు. ఆయన 'Ambrose Merton' అనే కలం పేరుతో 1846 ఆగస్టు 22వ తేదీనాటి 'The Athaenaeum' అనే పత్రికలో ఈ పదాన్ని సూచించాడు. 'Manners, Customs, Observances, Superstitions, Ballads, Proverbs అనేవి Folklore లో చేరదగ్గ అంశాలుగా పేర్కొన్నాడు. Folklore అనేది ప్రజల విజ్ఞానం. దాంట్లో సాహిత్యం కంటే విజ్ఞానానికి అధిక ప్రాధాన్యం ఉంటుందని థామ్స్ చెప్పాడు.[1]

Folklore అనేది సమస్త పదం. 'Folk' మరియు 'Lore' అనే పదాల సమ్మేళనం. Thoms అర్థంలో 'Folk' అంటే unlettered peasantry. అంటే నిరక్షరకుక్షులైన కర్షకులు. వాళ్ళు నిరక్షరకుక్షులైన కర్షకులనడంకంటే ప్రాచీన సంప్రదాయాన్ని తరతరాలుగా నిలుపుకొంటూ వస్తున్న ప్రజాసమూహమనడం సమంజసమనిపిస్తుంది. 'Lore' అంటే పాండిత్యం లేక విజ్ఞానం.

థామ్స్ 'Folklore' పదాన్ని సృష్టించిన ఐదేళ్ళ తరువాత Thomas sternberg అనే ఆయన ప్రప్రథమంగా ఈ పదాన్ని ఒక గ్రంథనామంగా సూచించాడు.[2] ఈపదమే తర్వాతి కాలంలో జానపద విజ్ఞానవేత్తల్లో జానపద విజ్ఞానాన్ని అధ్యయనం చేయాలనే కుతూహలాన్ని రేకెత్తించింది.

Folklore అనే పదాన్నే కొందరు Folklife అని పిలుస్తున్నారు. స్వీడీషు భాషలో Folk live అని, జర్మను భాషలో Volksleben అని సమాసార్థకాలైన పదాలు వ్యవహారంలో ఉన్నాయి. నేటి జానపద విజ్ఞానవేత్తలు Folklore కంటె Folklife (జానపద జీవితము) అన్న పదానికే ప్రాధాన్యమివ్వడాన్ని గమనింపవచ్చు. 'జానపద జీవిత పరిశోధనం మరియు జానపద జీవితాధ్యయనం' (Folk life Research and Folklife Studies) అనే ఈ ఆంగ్లపదాలు స్వీడీషు భాషలోని Folklivs for skning అను పదానికీ, జర్మను భాషలోని Volks Kunde అనే

1. *Alan Dundes, The Study of folklore, Pp. 4-5*
2. *Richard M. Dorson, Amencan Folklore P.1*

దానికి సమానం. జానపద జీవిత పరిశోధనం మరియు జానపద జీవితాధ్యయనం అనే ఈ రెండు పదాలు నేడు అమెరికాదేశపు విద్వాంసుల మన్ననలకు పాత్రమై చలామణిలో ఉన్నాయి.

నేడు మనం Folklore అనే ఆంగ్లపదానికి సమానార్థకంగా 'జానపద విజ్ఞానము' అనే పదాన్ని వాడుతున్నాము. ఈ 'జానపదము' అనే పదం 'ఒక దేశ విభాగము,' 'గ్రామము' అనే అర్థంలో వాడబడుతోంది. జనపద, జానపద శబ్దాలు రెండింటికీ సమానమైన అర్థం ఉందని విశ్వ నిఘంటువులోని 'భవేజ్జనపదో జానపదోపి జనదేశయోః' అను శ్లోకపాదాన్ని పేర్కొన్నారు శ్రీ ఓగేటి అచ్యుతరామ శాస్త్రిగారు. అంటే జనులకు, దేశానికి రెండింటికి జనపద, జానపద శబ్దాలు రెండూ అన్వయించబడతాయి.

సుప్రసిద్ధులైన ప్రాచీన సంస్కృత నాటకకర్తలలో జనపద, జానపద శబ్దాలను ఆయా అర్థాలలో ప్రయోగించడంలో 'క్రీడ' సల్పినవాడు మహాకవి భవభూతి అని పేర్కొని వీరు కొన్ని ఉదాహరణాలనిచ్చి నిరూపింప యత్నించారు. ఉదాహరణానికి ఉత్తరరామ చరిత్ర ప్రథమాంకంలో దుర్ముఖుడు రాముడితో 'ఉపస్తువంతి దేవం పౌరజానపదాః' అన్నాడు. ఇక్కడ పౌరశబ్దానికి పురవాసులని, జానపద శబ్దానికి గ్రామవాసులని అర్థం. భవభూతి ప్రయోగించిన 'పౌరజానపదాః ప్రజాః' అనే పదాన్ని ఎఱ్ఱన స్వీకరించి 'జానపదుల్ పురీజనులు' అని ప్రయోగించి యుండవచ్చునన్న అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. ఇది సత్యదూరం కాదు. కాళిదాసు మేఘ సందేశంలో 'జనవధూ' అని పల్లెపడుచును, 'బ్రహ్మావర్తం జనపదం' అని దేశాన్ని ఉద్దేశించి ప్రయోగించి యుండడాన్ని గమనించవచ్చు.

## నిర్వచనం:

జానపద విజ్ఞానాన్ని పలువురు పండితులు పలురకాలుగా నిర్వచించారు. జానపద విజ్ఞానకోశంలో దీనికి 21 నిర్వచనాలు ఇవ్వబడ్డాయి.

William R. Bascom జానపద విజ్ఞానాన్ని 'శాబ్దిక కళ' లేదా 'వాగ్రూప కళ' (Verbal Art) అని పేర్కొని 'మానవ శాస్త్ర పరిభాషలో జానపద విజ్ఞాన మంటే మౌఖిక ప్రచారంలో ఉన్న పుక్కిటి పురాణాలు, ఐతిహ్యాలు, జానపద

కథలు, సామెతలు, పొడుపు కథలు, కవిత్వం మరియు కళాత్మక వ్యక్తీకరణం ఉన్న అనేక ఇతర ప్రక్రియలు' అని తెలియ బరచాడు.

B.A. Botkin అభిప్రాయంలో 'శుద్ధమయిన వాగ్రూపమయిన సంస్కృతిలో ఏదయినా జానపద విజ్ఞానమే'. గిరిజన సమాజంలో ఈ విషయం నేటికీ సత్యమే.

Marius Barbeau అభిప్రాయంలో సంక్షిప్తంగా 'లాలిపాటలు, పొడుపు కథలు, పాటలు ఇత్యాదులు పాఠశాలలలో పిల్లలకు బోధించేటప్పుడు, నృత్యగీతాలాపన గావించే టప్పుడు, తల్లి కుమార్తెకు వంటవార్పటం, కుట్టుపని, నేతపని మొదలైన వాటిలో శిక్షణ నిచ్చేటప్పుడు, తండ్రి కుమారుడికి వ్యావసాయిక సంబంధమైన విషయాలను బోధించేటప్పుడు, వడ్రంగి, కమ్మరి, కుమ్మరి, చెప్పులు కుట్టేవాడు మొదలైన వృత్తులవారు తమ పనివాండ్రకు ఆయా వృత్తులను నేర్పించేటప్పుడు, ప్రాచీనుల అనుభవాలు, అలవాట్లు, తెలివితేటలు, చాతుర్యాలు ఇత్యాదులు వ్రాతపూర్వకంగా కాక మౌఖికంగాను, ఉదాహరణ పూర్వకంగాను తరతరాల వారికి సంక్రమించే టప్పుడు జానపద విజ్ఞానం అతి విస్తృతంగా మనకు గోచరిస్తుంది'.

Aurelio M. Espinosa - 'జానపద విజ్ఞానము లేదా జనప్రియ విజ్ఞానం (Popular knowledge) మానవుడు తరతరాలుగా సంపాదించిన, అనుభవించిన సాంప్రదాయక నిధి. ఇది విజ్ఞానశాస్త్రం (Scientific knowledge) కంటె భిన్నమైనది' అని నిర్వచించాడు.

కొందరి మతంలో 'మౌఖిక ప్రసరణంలో ఉన్న సాహిత్యమే జానపద విజ్ఞానం' Tristram coffin జానపద జీవనం (Folklife) పదాన్ని స్పష్టీకరిస్తూ 'The term folklife is intended to include the total range of folk cultural phenomena, material as well as oral and spiritual' అని పేర్కొన్నాడు.

Richard M. Dorson 'Volkskunde' అనే పదాన్ని విపులీకరిస్తూ 'Volkskunde embraces the total rural life, including the physical objects produced by household artisans' అన్నాడు.

పై నిర్వచనాలను బట్టి చూస్తే W.J. Thoms, 'Folklore' అనే పదాన్ని సృష్టించడానికి మునుపే, Volkskunde అన్న పదం యొక్క అర్థ విస్తృతిని దృష్టియందుంచు కొన్నట్లుగా గ్రహింపవచ్చు. 'విద్యాగంధం లేని సామాన్య జనులలో అనేక రూపాలలో వాగ్రూపంలోను, ఉదాహరణ పూర్వకంగాను ప్రవహిస్తున్న సంప్రదాయబద్ధమైన సాంస్కృతిక విజ్ఞానమే జానపద విజ్ఞానం' అని నిర్వచించవచ్చు. ఇది ప్రజలయొక్క, ప్రజల చేత, ప్రజల కొరకు వ్యక్తీకరింపబడిన సామూహిక విజ్ఞానం. నిరక్షరాస్యుల అభిరుచులు, అలవాట్లు, ఆచార వ్యవహారాలు, కళలు, వృత్తులు ఇత్యాదులను నిక్షిప్తం గావించుకొన్న విజ్ఞాన ఖని. అక్షర జ్ఞానం రూపురేఖలు దిద్దుకోడానికి ముందే సమస్త విద్యలూ ఈ విజ్ఞానం మూలంగానే మౌఖిక ప్రచారంలో అందింపబడుతుండేవి. కనుకనే ఇది వాస్తవమైన, నిష్కపటమైన ఆదిమ మానవుని మేధా సంపద.

## సార్వత్రిక లక్షణాలు:

జానపద విజ్ఞానంలో మూడు సార్వత్రిక లక్షణాలను గుర్తింపవచ్చును. అవి 1. సాంప్రదాయిక వ్యాప్తి (Traditional Circulation), 2. విభిన్న పాఠాంతరాలు (Different Versions), 3. సార్వజనీనత (Popularity).

## 1. సాంప్రదాయక వ్యాప్తి:

తరతరాలుగా జానపద విజ్ఞానం ఒకరి నుండి మరియొకరికి సంక్రమిస్తున్న విజ్ఞానభాండం. ఈ సంక్రమణ జానపదుల జ్ఞాపకశక్తిపై ఆధారపడి ఉంది. జ్ఞాపకశక్తి వినికిడి మరియు పునరుద్ఘాటనా శక్తుల పైనా, వీక్షణం మరియు అనుకరణ శక్తుల పైనా ఆధారపడి ఉంది.

సాంప్రదాయిక వ్యాప్తి రెండు ఉపలక్షణాలను కలిగి ఉంది. 1. మౌఖిక సంప్రదాయ ప్రసరణం, 2. వీక్షణ సంప్రదాయ ప్రసరణం. మొదటిది శాబ్దిక కళల (Verbal Arts) కు సంబంధించినది. సంగీత సాహిత్యాలు వాగ్రూపంలో ప్రసరింపబడు తుండడం వల్ల ఇందులో వినికిడి మరియు పునరుద్ఘాటనాశక్తులు కేంద్రీకరింపబడ్డాయి. రెండవది శాబ్దికేతర కళల (Non-verbal Arts) కు సంబంధించినది. వాగ్రూపం కానట్టి కళలన్నీ శాబ్దికేతర కళలే. ఉదా: చిత్రకళ,

వాస్తుకళ, నృత్యకళ ఇత్యాదులు. ఇలాంటి కళలు వీక్షణం మరియు అనుకరణశక్తుల మీద ఆధారపడి ఉన్నాయి. కనుకనే ఇవి అభ్యాసం వల్లనే సిద్ధిస్తాయి. మౌఖిక, వీక్షణ ప్రసరణలలో సాధారణమైన అంశం 'సంప్రదాయం'. కనుక శాబ్దిక, శాబ్దికేతర కళలన్నీ సంప్రదాయబద్ధాలు.

## 2. విభిన్న పాఠాంతరాలు:

ఒక మంచి కథకుడు తన జీవిత కాలంలో అనేకమార్లు ఒక కథను చెప్తుంటాడు. అన్ని సమయాల్లోను ఒకే రీతిగా ఒక కథను పునరుద్ఘాటించడం అసాధ్యం. కాబట్టి కాలక్రమంలో ఆ కథలో కొన్ని మార్పులు సంభవిస్తుంటాయి. అంతేకాక రాముడొక కథను సోముని నుంచి గ్రహించాడనుకొందాం. అతడదే కథను కొన్ని సవరణలతో భీమునికి విన్నవిస్తాడు. ఇలా ఒక కథ లేదా ఒకగేయ కథ అనేక విభిన్న పాఠాంతర సమన్వితమై ఉండటాన్ని గమనింపవచ్చు.

## 3. సార్వజనీనత:

జానపద విజ్ఞానం ఏ జాతి ప్రజలందైనా తన ఉనికిని స్థిరపరచుకోగలదు. ఇక్కడ 'జాతి' అనేది 'నాగరక', 'అనాగరక' సంఘాలకు ఉద్దేశింపబడ్డది. కారణము ఈ విజ్ఞానం కేవలం పల్లెపట్టులందు నివసించు అనాగరిక లేదా నిరక్షరాస్యుల మధ్యనేకాక నవనాగరక నగరాల్లో స్థిరపడిన జనుల చెంతా, ఉదర పోషణార్థమై గ్రామసీమలను వదలి నగరాల్లో కూలీ నాలీ చేసుకొని జీవితం గడుపుతున్న కార్మికుల మధ్యా కానవస్తుంది. George Herzog కూడా ఈ అభిప్రాయాన్నే వెలిబుచ్చాడు.

Folklore thus exists in the city as well as in the country side, and within groups that cut across such a division but by preference it has been that of the country side.[3]

అంతేకాక ప్రాచీన మానవుల లేదా నేటి గ్రామీణుల ఆచార వ్యవహారాలు, పండుగ పబ్బాలు, పద్ధతులు - అలవాట్లు, ఉత్సవాలు, వేడుకలు, నేటి మన నవ

---

3. *Standard Dictionary of Folklore, Mythology and Legend, P.400*

నాగరక సమాజాల్లోను వేరుదన్ని నిలిచి ఉండటాన్ని గమనిస్తే నాగరికులు సైతం ఇలాంటి జానపద సంప్రదాయాన్ని అనుసరించుచుండటం తెల్లమవుతోంది. కనుక 'జానపదం' అనే పదాన్ని కేవలం ఒక నిర్దిష్టమైన సమాజానికి ముడిపెట్టడం కంటే ప్రజల మానసిక స్థితిగతులను సూచించే సంఘంగా పేర్కొనటం ఉత్తమం. ఇక్కడ జానపదుని కంటే ఉత్తమం. ఇక్కడ జానపదుని కంటే 'జానపదత్వాని'కి ప్రాధాన్యమీయాలి.

'It is not the 'Folk' but the folkishness that matters'.[4]

## వర్గీకరణం:

Richard M. Darson తన Folklore and Flok life అనే గ్రంథంలో ఇచ్చిన నాలుగు శీర్షికల్లో వస్తు సంస్కృతిని పేర్కొన్నాడు.[5] అతని విభజన ఇలాగుంది.

### 1. వాగ్రూప జానపద విజ్ఞానం (Oral Folklore):

దీంట్లో జానపదాఖ్యానం (Folk narrative), ఆఖ్యాన జానపద కవిత్వం (Narrative Folk Poetry) జానపదేతిహాసం (Folk Epic), సామెతలు, సామెతలను పోలిన వ్యక్తీకరణాలు (Proverbs and Proverbial Expressions) పొడుపు కథలు (Riddles) జానపదుల భాష (Folk speech) అనే ఆరు భాగాలు చేరతాయి.

### 2. సాంఘిక జానపదాచారం (Social Folk Custom):

దీంట్లో పండుగలు మరియు ఉత్సవాలు (Festivals and celebrations), వినోదాలు మరియు ఆటలు (Recreations and games), జానపద వైద్యం (Folk Medicine) జానపద మతం (Folk religion ) అనేవి చేరతాయి.

---

4. *Dr. P. R.Subramanian, An Introduction to the study of Indian Folklore, P.7.*
5. విషయ సూచిక

**3. వస్తు సంస్కృతి లేదా భౌతిక సంస్కృతి (Material culture):**

దీంట్లో జానపదుల చేతి పనులు (Folk crafts), జానపద కళ (Folk art), జానపద వాస్తుశిల్పం (Folk Architecture), జానపద వస్త్రధారణ (Folk Costume) జానపద పాక కళ అనేవి చేరతాయి.

**4. జానపద కళలు (Folk Arts):**

ఇందులో జానపద నాటకం (Folk Drama), జానపద సంగీతం (Folk Music), జానపద నృత్యం (Folk Dance) అనేవి చేరతాయి.

ఈ నాలుగు ప్రధాన విభాగాలపై డార్సన్ వివరణను తెలుసుకొందాం.

**1. మౌఖిక సాహిత్యం:** మౌఖిక సాహిత్యాన్నే శాబ్దిక కళ (Verbul Art) లేదా భావాభివ్యక్తి సాహిత్యం (Expressive Literature) అని అంటారు. దీంట్లో నోటి మాటలుగా, గాన రూపంగా, ధ్వని స్వరూపంగా వెలువడే సాంప్రదాయిక శబ్దాలు చేరతాయి. మౌఖిక సాహిత్యంలోని ఒక ప్రధాన ఉపవిభాగం గద్యకథనం (Folk narrative). మరియొకటి జానపద కవిత్వం (Folk Poetry). సాంప్రదాయిక కథలు మరియు గేయాలు శిష్టసాహిత్యపు నవలాకారులకు, కవులకు వస్తువులయ్యాయి. కొన్ని సంక్షిప్త రూపాలయిన మౌఖిక అభివ్యక్తు (Oral Expressions) లను సామెతలు మరియు పొడుపు కథలుగా విభజింప వచ్చును. ఈ మౌఖిక సాహిత్యమే శిష్ట సాహిత్య సృష్టికి ఆకరమవుతుంది.

**2. వస్తు సంస్కృతి:** మౌఖిక సాహిత్యంతో ప్రత్యక్ష సంబంధాన్ని కలిగింది భౌతిక జానపద జీవనం లేదా భౌతిక సంస్కృతి. దీన్నే వస్తు సంస్కృతి అంటారు. వినటం జ్ఞప్తికుంచుకోవటం అనే అంశాల కంటే వీక్షణం, అనుకరణం అనే అంశాల అధ్యయనమే ఈ విభాగం లోని ప్రధాన ఉద్దేశ్యం. దీంట్లో నేర్పరితనం, సామర్థ్యం (Technique) జానపద వైద్యం (Folk medicine) మొదలైనవి ఈ విభాగపు వ్యాప్తికి దోహదాలై అధ్యయన విషయాలవుతాయి. పైన చెప్పబడిన విషయాలు మౌఖిక సాహిత్యం లాగే ఒక తరం నుండి మరో తరానికి సాంప్రదాయికంగా వస్తూనే వుంటాయి. ఎలా సాంప్రదాయక పురాతన సంఘం (Tradition oriental Societies) లో స్త్రీ పురుషులు తమ గృహాలను నిర్మించుకొన్నారు? వస్త్రాలనెలా

తయారుచేసికొన్నారు? ఆహారాల నెలా వండుకొన్నారు? వ్యవసాయం మత్స్యకేంద్రాలు, వ్యవసాయక్రమం, వ్యవసాయోపకరణాలు మరియు వస్తువుల అందచందాలకై వారు చేసిన అలంకరణ మొదలైన వాటిని ఎలా చేపట్టారో అనే ప్రశ్నలు, అధ్యయనాలు భౌతికసంస్కృతిని అభ్యసించే విద్యార్థి పాలిటి కర్తవ్యాలు. ఆదిమ మానవ సమాజంలో పైన చెప్పబడిన విషయాలు సాంప్రదాయకంగా వచ్చాయి. చేతి పనిముట్లయ్యాయి. ఆచరణ యోగ్యాలయ్యాయి. నేటి యాంత్రిక యుగప్రాబల్యంచే జానపద సంస్కృతి రానురాను నిర్గమిస్తోంది. జానపద జీవన అధ్యయనానికై 1963లో ఒక సంస్థ ప్రారంభించబడి కార్యాచరణమారంభించి జానపద జీవనం (Folk life) అనే పత్రికను ప్రకటింపసాగింది.

**3. సాంఘిక జానపదాచారం:** మౌఖిక జానపద సాహిత్యం మరియు భౌతిక సంస్కృతుల నడుమ ఈ రెండింటి ప్రభావాన్ని ఇముడ్చుకొన్న మరో విభాగం సాంఘిక జానపద జీవనం. ఇక్కడ వైయక్తిక ఆసక్తి కంటే ఒక సమూహంలోని ఆంతరిక చర్యకు (Group interaction) అధిక ప్రాధాన్యం ఉంటుంది. ఆంగ్ల ప్రాచీనాన్వేషకులు ఆచారం మరియు వాడుక (Custom and usage) అనే విషయాల నాధారం చేసుకొని గ్రామాల్లోని జాగీరులు, ఎల్లలు, కిరస్తానీ ఆలయాలు మొదలైన విషయాలపై సంపర్కం ఏర్పరచుకొన్న అనేక సముదాయాలను గమనింప వచ్చును. అంతేకాక జనన మరణాలు, యవ్వనం, వివాహం ఇలాంటి వాటి ఆచరణల్లో కనిపించే జానపద విశ్వాసాలను గమనింప వచ్చును. కొన్ని ఆచారాలు విశిష్టాలుగాను కొన్ని ప్రాదేశికాలు గాను ఉంటాయి.

''సాంఘిక జానపద ఆచారాలు'' అనే పదం అధికంగా పండుగ నాటి ఆచారాలు, ఉత్సవాలు, జానపద సభలు, సమావేశాలకు అన్వయిస్తుంది. మత సంబంధం (Religion) మరియు మతాతీత (Secular) విషయాలపై నిలబడ్డ ఈ సాంఘిక జానపద ఆచారాల సమయాల్లో నాటకాలు,నృత్య, సంగీత, వేష భూషణాలు (ప్రదర్శనాలు) జరుపబడుతుంటాయి. కనుకనే అనేక జానపద జీవన ప్రక్రియల సంగమం ఇలాంటి సమారంభాల్లో నడుస్తుంటుంది.

సాంఘిక జానపద ఆచారాల్లోను మత సంబంధాలు, దేవతలు లేదా కులసమూహాల దేవతారాధనలతో కూడి వుంటాయి. జానపదవైద్యానికి జానపద ధార్మిక ప్రభావం ఉంది. ఈ విషయంలో కొన్ని నమ్మకాలు ప్రచారంలో వున్నాయి.

భగవంతునిపై విశ్వాసముంచిన వాడు తన రోగాల్ని నయం చేస్తాడని దేవునిపై భారం వేసి మానసిక శాంతిని పొందుతాడు. ఎందరో దేవాలయ అర్చకులు రోగాల్ని నయంచేసే జానపద వైద్యులుగా కూడా ఉంటారు. ఈ విధంగా జానపద వైద్యంపై మత ప్రభావం అధికంగా వుంటున్నందున డార్సన్ జానపద వైద్యాన్ని సాంఘిక జానపద ఆచారాల్లో చేర్చాడు.

**4. జానపద కళలు:** జానపద విజ్ఞానం మరియు జానపద జీవనంలో నాల్గవ ప్రధాన విభాగం జానపద కళలు. ఇది సాంప్రదాయిక సంగీతం, నృత్యం, నాటకాల ఉత్పత్తి వికాసాలు మరియు వాటి అభివృద్ధి వికాసాల అధ్యయనానికి సంబంధించినది. ఇక్కడ కూడా జానపద సంగీత నాటకాలకు, జానపదగేయాలు, జానపద కథలే ఆకరాలవుతున్నాయి. మరియు జానపద వాద్య విశేషాలతో, నృత్య సాంప్రదాయాలతో ఒక సమూహం లేదా ఒకే వ్యక్తి నిర్వహించబడేవిగా వుంటాయి. ఇలా నిర్వహింపబడే జానపద కళలు శిష్టకళలతో ఆంతరంగిక సంబంధం కలిగి వుంటాయి. ఐరోపా, అమెరికా, ఆసియా మరియు ఆఫ్రికా దేశాల్లో ప్రాంతీయ రైతు వర్గాల, ఆదిమవాసుల నృత్యాలు, గీతాలు మరియు సంగీతం ఇలాంటివి నగర సంస్కృతి యొక్క ప్రేక్షక వర్గపు మనోరంజనానికి పాత్రమయ్యేంత విశిష్టతను పొంది ఉన్నాయి. జానపదుల ఈ కళా కౌశల్యాలు నాగరక సమాజాల్లో వ్యాపించడమే కాక నగర సంస్కృతి యొక్క అనేక కళా సంపదలు సైతం జానపద భాండారాన్ని చేరుతూనే ఉన్నాయి. సంస్కృతియొక్క ఇలాంటి ఆదాన ప్రదానాలు నాగరక జానపద సమాజాల్లో క్రొత్తవేమీ కావు. తరతరాలుగా వస్తున్నట్టివే.

పైన పేర్కొనబడిన రిచర్డ్‌డార్సన్ వర్గీకరణం జానపద విజ్ఞానం మరియు జానపద జీవన అధ్యయనాలు సమస్యలను సంపూర్ణంగా పరిహరిస్తాయని చెప్పజాలం. ఆయనే పేర్కొన్నట్లు 'The four divisions skectched here are not all inclusive or mutually exclusive'.

రిచర్డ్ డార్సన్ జానపదుల భాష (Folk speech) ను మౌఖికసాహిత్యంలోకి చేర్చాడు. జానపద శబ్దవ్యుత్పత్తి, మాండలిక భాషలు, వ్యక్తి నామాలు, గ్రామ నామాలు, దీవెనలు, శాపాలు, ప్రమాణాలు మొదలైనవి భాషకు చెందినవి. కాబట్టి వీటిని ప్రత్యేకంగా అధ్యయనం చేయాల్సిన ఆవశ్యకత ఎంతైనా వుంది. కాబట్టి

డార్సన్ మౌఖిక సాహిత్యంలో పేర్కొన్న జానపదుల భాషను ప్రత్యేకంగా వర్గీకరిస్తే జానపద విజ్ఞానాన్ని ఐదు ముఖ్య విభాగాలుగా విభజింపవచ్చు. అవి క్రమంగా

1. మౌఖిక జానపద సాహిత్యం (Oral Folk Literature) దీంట్లో గేయాలు, గేయకథలు, గద్యకథనాలు, సామెతలు, పొడుపుకథలు చేరతాయి.
2. సాంఘిక జానపద ఆచారం (Social Folk Custom)
3. వస్తు సంస్కృతి (Material culture) లేదా భౌతిక సంస్కృతి
4. జానపద కళలు (Folk Arts)
5. జానపదుల భాష (Folk Speech)

వివరాలకు పక్క పేజీలోని పట్టికను చూడండి.

## వైశిష్ట్యం:

జానపద విజ్ఞానంలోని ప్రాచీన సంస్కృతియొక్క ఛాయలు నేటికీ నవీన సంస్కృతిలో చోటుచేసికొని దానితో విడదీయరానంతటి సంబంధం ఏర్పరచుకొన్నాయి. జానపద విజ్ఞానం ఒక విజ్ఞాన సర్వస్వంలాంటిది. కాబట్టి ఆయా శాస్త్రాల్లో ప్రావీణ్యతను సంపాదించిన శాస్త్రవేత్తలు తమకు కావలసిన విషయ పరిజ్ఞానాన్ని జానపద విజ్ఞానానికి అన్వయించి తమ శాస్త్ర సమాచారాల్ని సేకరించుకొంటున్నారు. సాహిత్య పరిశోధకుడు (Literary Scholar) ఈ విజ్ఞానాన్ని తన సాహిత్య గ్రంథాలకు కావలసిన ముడిసరకుగా భావిస్తున్నాడు చారిత్రక పరిశోధకుడు (Historijan) జానపదుని మనోభావాలకు సంబంధించిన చారిత్రక సంఘటనలపై మనస్సును కేంద్రీకరింప చేస్తున్నాడు. మానవ శాస్త్రజ్ఞుడు (Anthropologist) మానవ జీవిత చరిత్రను, సంస్కృతిని అవగాహన చేసుకోవటానికి జానపద విజ్ఞానాధ్యయనం గావిస్తున్నాడు. మానసిక శాస్త్రవేత్త (Psychologist) మానవుల మానసిక ప్రవృత్తిని పరిశీలించటానికి ఉత్సాహాన్ని కనబరుస్తున్నారు. తులనాత్మక భాషా శాస్త్రవేత్త (Comparative-Linguist) వివిధ భాషలను తులనాత్మకంగా పరిశీలించటానికి జానపద విజ్ఞానాన్ని ఒక సాధనంగా పరిగణిస్తున్నాడు. ఇలా జానపద విజ్ఞానాన్ని ఏ దృష్టితో గమనించినా అది సర్వ విషయసార సంగ్రహంగాను, సర్వశాస్త్రాలకు తల్లి వేరుగాను ఉందనటంలో విప్రతిపత్తి లేదు.


జానపద విజ్ఞానం (Folk Lore)
మౌఖిక జానపద సాహిత్యం
(Oral Folk Literature)
సాంఘిక జానపదాచారం
(Social Folk Custom)
వస్తు సంస్కృతి
(Material Culture)
ఉదా: జానపదుల చేతిపనులు,
గృహోపకరణాలు,
వేషభూషణాలు,
వ్యవసాయోపకరణాలు,
దుస్తులు మొదలైనవి.
జానపద కళలు
(Folk Arts)
ఉదా: నృత్యం
సంగీతం,
రూపకం,
చిత్రకళ,
వాస్తుకళ
జానపదుల భాష
(Folk Speech)
జానపద వ్యుత్పత్తి,
మాండలిక భాషలు,
వ్యక్తి నామాలు,
గ్రామ నామాలు,
దీవెనలు, శాపాలు,
ప్రమాణాలు
జానపద కవిత్వం
(Folk Poetry)
గద్య కథనాలు
(Prose narratives)
సామెతలు
(Proverbs)
పొడుపు కథలు
(Riddles)
గేయాలు
(Folk Songs)
గేయకథలు
(Narrative Folk Songs)
జానపదుల సాంఘికాచారాలు
జానపదుల క్రీడలు- వినోదాలు
జానపద వైద్యవిధానం
జానపదుల నమ్మకాలు- మూఢవిశ్వాసాలు
(Folk beliefs and Superstitions)
పండుగలు- ఉత్సవాలు
(Festivals & Celebrations)
లౌకికాలు లేదా మతాతీతాలు
(Secular)
మతసంబంధాలు
(Religious)

జానపద విజ్ఞానం

Charles Francis మాటల్లో చెప్పాలంటే 'Folklore is a lively fossil which refuses to die. It is a precipitate of the scientific and cultural log of centuries and millenia of human culture' [6]. మంజుభాట్నగర్ అన్నట్లు 'Folklore is one of the most important medium for the transmission of thought, values and expectations. It conveys beliefs and experiences of its bearers'[7].

చివరిగా R.S. Boggs మాటల్లో చెప్పాల్సి వస్తే 'Folklore materials thrive in society in which there are people of considerable native intelligence, artistic appreciation, memory, imagination and creative urge, who can comprehend value, remember and recreate their native folklore and thus propagate it as a living tradition[8].

* * *

---

6. *Standard Dictionary of Folklore, Mythology and Legend, P.401-402*
7. *Women in Indian Folklore, ed. by Shankar-Sen Gupta, P.59*
8. *Standard Dictionary of Folklore; Mythology and Legend, P.691*

# 4. జానపద సాహిత్యం
## (Folk Literature)

జానపద సాహిత్యాన్ని ఔత్తరాహులు 'గ్రామ్ సాహిత్య్' అనీ 'లోక్ సాహిత్య్' అనీ వ్యవహరిస్తారు. కన్నడిగులు 'జనపద సాహిత్య' మనే వ్యవహరిస్తున్నారు. ఇక్కడ 'జనపద' శబ్దం విశేషణం.[1]

ఏ సాహిత్యంలో అయినా 'మార్గ', 'దేశి' కవిత్వాలనే రెండు శాఖలు తమవే అయిన విశిష్ట లక్షణాల్ని కలిగి వుండటాన్ని పరిశీలింపవచ్చు. తెలుగులో ఈ ద్వివిధాలైన కవితలు ఒకదాన్నొకటి పెనవేసికొన్న కవితా లతలుగా మనకు కనిపిస్తాయి. రాజులు, రారాజులు, పండిత కవులు చేపట్టి ఆదరించిన సాహిత్యం 'మార్గ' సాహిత్యం కాగా, కేవలం పామర జనులచే పోషింపబడ్డ సాహిత్యం 'దేశి' అయింది. అయినా ప్రాచీనకవులు తమ 'మార్గ' సాహిత్యంలో 'దేశి' ని అనుసరించి వుండటాన్ని ఆయా కవుల గ్రంథాలనుంచి తెలుసుకోవచ్చు[2]. మార్గ సాహిత్యాన్ని నేడు 'ప్రౌఢ' లేదా 'శిష్ట' సాహిత్యమనీ, దేశి సాహిత్యాన్ని ''జానపద సాహిత్య'' మనీ వ్యవహరిస్తున్నాం.

జానపద, శిష్టసాహిత్యాలు తెనుగు సాహిత్యపు విభిన్న రూపాలు. శారదాదేవి నేత్రద్వయాలు. ఒకటి నాగరిక ప్రగతిని దర్శింపచేసే జ్ఞానచక్షువు. మరొకటి అనాగరిక సంస్కార వికాసాన్ని సూచించే విజ్ఞాన నేత్రం. నేటి పండిత లోకంలో చిన్న చూపు చూడబడి ''అనాదరణీయ సాహిత్యం'' గా పేరు పడసినా జానపద సాహిత్యం తన వ్యక్తిత్వాన్ని కోల్పోక నిత్యనూతన కామినిలా సర్వజనులకు హృదయాహ్లాదం కలిగించే దివ్య సంజీవనిలా ఉందనటంలో అతిశయోక్తి ఇసుమంత కూడా లేదు.

నిత్య జీవితంలో సామాన్యుడనుభవించే సుఖదుఃఖాలు, అనుభూతులు ఇలాంటివన్నీ ఒక్కమారుగా పొంగి పొరలి వచ్చిన ''రసమాధురి'' యే జానపద

---

1. *Folk* - జనపద; *Folklore* - జానపద; *Folk literature* - జనపద సాహిత్యం; *Folk Culture* - జనపద సంస్కృతి ౹౹మొ౹౹
2. నన్నెచోడుడు, పాల్కురికి సోమనాథుని గ్రంథాలు

గేయ సాహితి. నాటి సంఘ చరిత్రను, చారిత్రిక విశేషాల్ని భాషా పరిణామాన్ని తనలో ఇముడ్చుకొన్న ''చైతన్య స్రవంతి'' యే జానపద సరస్వతి. నెలవంక, చంద్రికలుగా సంగీత సాహిత్యాలతో మేళవించిన ''కవితా ప్రకృతి'' యే జానపద సాహిత్య చమత్కృతి. ఉవ్వెత్తున లేచే గోదావరీ తరంగిణిలా డెందంలో చిందులు త్రొక్కే ''నాట్యమయూరి'' జానపద సాహితీ కళామవల్లి.

వ్రాతపూతల సహాయంలేకనే శుద్ధమైన వాక్పరంపరలో పుట్టి, పెరిగి, జీవంతమైన సాహిత్యం ''జానపదుల'' సాహిత్యం. దీనికి కారకులు నిరక్షరాస్యు లయిన సామాన్యులు. ఆ సామాన్యుల్లో కొందరు చదువు సంధ్యలు నేర్చిన వారు కాని, లేఖకులు కాని వుంటే ఉండొచ్చు. కాని వారు దేన్నీ గ్రంథస్థం చేసి వుండ లేదనడం మాత్రం నిర్వివాదాంశం. అలా గ్రంథస్థం చేసివుండినట్లయితే ఈ సాహిత్యంలో మార్పులు, చేర్పులు లేక ఇది జానపద సాహిత్యమా అనేంత సంశయాన్ని తెచ్చిపెట్టి వుండేదేమో!

గేయకర్త లేదా గేయకథాకర్త ఒక దృశ్యాన్ని కన్నులార గాంచినప్పుడు, దాన్ని ఆధారంగా అనేక గేయాలను, కథలను అల్లి చెబుతాడు. నాటి మానవుడు తనకు తానుగా పాటలు కట్టాడు. పాడి విన్పించాడు. కథలను అల్లాడు. పదిమందికి ఆలపించాడు. 'భావన', ధారణ, రాగా లాపన' - నాటి మానవుని తొలి వికాసాలు. జానపద సాహిత్యంలో ఈ మూడు ప్రధానాంశాలు.

## ప్రాచీన భారతీయ గ్రంథాల్లో జానపదాంశాలు:

జానపద సాహిత్య సాంస్కృతిక విషయాల్లో భారతదేశపు పాత్ర అగ్రగణ్యమైంది. ప్రపంచ భాషల్లో ఋగ్వేద గ్రంథం అతిప్రాచీనమైంది. దీంట్లో జానపదగేయాలు, వీరగాథలు పేర్కొనబడ్డాయి. అధర్వణ వేదంలో జానపదుల నమ్మకాలు, మూఢవిశ్వాసాలు, ఆచార వ్యవహారాలు, మంత్రోచ్చారణలు, కర్మకాండలు విస్తారంగా ఉదాహరింపబడ్డాయి. పంచతంత్ర కథలు జానపద కథలకు, కట్టుకథలకు పెట్టింది పేరు. ఇలాంటి కథలకు పుట్టినిల్లు భారతభూమి.

రామాయణ మహాభారతాలు జానపద కథలకు, ఐతిహ్యాలకు మూలకేంద్రాలు. ఉపనిషత్తుల్లోను, జాతక కథల్లోను అనేక గాథలు ఉన్నాయి. బృహత్కథలో జానపద కథలు, కట్టుకథలు అపరిమితాలు. అష్టాదశపురాణాలు

ఐతిహ్యం, మతం, నమ్మకాలు, మూఢవిశ్వాసాలకు జన్మస్థానం. మన ప్రాచీన సాహిత్యాలను పరికిస్తూ పోతే నాటి జానపద జీవితచ్ఛాయలు ప్రస్ఫుటంగా గోచరిస్తాయి.

## తెలుగు జానపద సాహిత్య వర్గీకరణం:

తెలుగు జానపద సాహిత్య వర్గీకరణ విధానంలో పలువురు పలుత్రోవల్ని చేపట్టారు. చాలమంది గేయత్వానికి ప్రాధాన్యమిచ్చి విభజించడం జరిగింది. జానపద సాహిత్య ప్రక్రియలైన గద్యాఖ్యానాలు, పొడుపు కథలు, సామెతలు స్పృశింపబడలేదు. అందుచేత అది అసమగ్రమనిపించుకొంటుంది. ఈ సాహిత్య వర్గీకరణంపై పలువురి మార్గాలను ఉట్టంకిస్తాను.

శ్రీ టేకుమళ్ళ అచ్యుతరావుగారు 1924లో ఆంధ్రదేశంలోని పదాలు, పాటల్ని (Andhra Songs and Ballads) నాలుగు తరగతులుగా విభజించారు. అవి 1. పాటక వర్గాలవారు విశ్రాంతి కోసంగాని, ఉబుసుపోకకు గాని పాడే తందాన పదాలు, వీటిని పాడేటప్పుడు నృత్యం కూడ చేస్తుంటారు. ఇవి సామాన్యంగా రామకథలతోను, కృష్ణలీలలతోను సంబంధించి ఉంటాయి. 2. మన స్త్రీలు పాడే పాటలు, తరచుగా రామకృష్ణుల చరిత్రల్నే అభివర్ణిస్తుంటాయి. కుశలవుల కథ, లంకాయాగం, లక్ష్మణ దేవర నవ్వు, హంస రాయభారం మొదలైన పవిత్ర కథలు సరసంగాను, హృద్యంగాను చెప్పబడ్డాయి. 3. గృహవ్యథలు, సాంఘికాచారాలు మొదలైన విషయాలతో సంబంధించినవి కామమ్మ కథ, లక్ష్మమ్మ కథ వగైరాలు. 4. దేశచరిత్రలోని ప్రసిద్ధ విషయాలందరికీ వెల్లడి అయ్యేలా మృదుమధురశైలిని పాటలరీతిగా ఏర్పరుచబడ్డాయి. పల్నాటి వీరుల కథ, మరాఠీ కథ, బొబ్బిలి కథ మొదలగునవీ తరగతిలో చేరతాయి[3]. పై వర్గీకరణ విధానంలో పదాలు, పాటలకే ప్రాధన్యమీయబడింది.

శ్రీహరి ఆదిశేషువుగారు జానపద వాఙ్మయాన్ని తొమ్మిది రీతులుగా వింగడించారు[4]. 1. శృంగార రసాత్మక గేయములు, 2. వీరకథా వాఙ్మయము,

---

3. ఆంధ్ర పదములు - పాటలు *(Andhra Songs and Ballads)* సీతారామ ముద్రాక్షర శాలయందు ముద్రింపబడినది, *1924*.
4. జానపద గేయ వాఙ్మయ పరిచయము, విషయ సూచిక

3. సాహసిక కథావాఙ్మయము, 4. కరుణ రసాత్మక కథా వాఙ్మయము, 5. అద్భుత రస ప్రధాన కథా వాఙ్మయము, 6. వేదాంత భక్తిరస ప్రధానమైన రచనలు, 7. స్త్రీల పాటలు, బాలబాలిక గేయములు, 8. ప్రకీర్ణములు. ఈ వర్గీకరణ విధానంలో గేయాలు, గేయకథలు ప్రత్యేకంగా వర్గీకరింపబడలేదు. వీర కథావాఙ్మయం, సాహసిక కథా వాఙ్మయం ఒకే కోవకు చెందేవి. కాని రచయిత సౌలభ్యం కోసం విభజింపబడిందని పేర్కొన్నారు[5]. స్త్రీల పాటలు, బాలబాలికా గేయాల్ని ఒకే ప్రకరణంలోనే పేర్కొన్నారు. సామెతలు, పొడుపు కథలు, గద్యాఖ్యానాల ప్రసక్తే లేదు. కాబట్టి ఈ విభజన అసంపూర్తిగా తోస్తుంది.

డా. బిరుదురాజు రామరాజుగారు తమ తెలుగు 'జానపద గేయ సాహిత్యము' లో గేయ సాహిత్యం అంతటినీ పదకొండు విధాలుగా విభజించారు.[6] అవి. 1. పౌరాణిక గేయములు - రామాయణ సంబంధములు; భారత సంబంధములు; భాగవత సంబంధములు; ఇతరములు. 2. చారిత్రకగేయములు - చారిత్రములు; అస్పష్ట చారిత్రములు; 3. మతసంబంధగేయములు - శైవమత సంబంధములు, వైష్ణవ మత సంబంధములు, 4. పారమార్థికగేయములు - భక్తి గేయములు, వేదాంత సంబంధములు, కర్మ మార్గ సంబంధములు, 5. స్త్రీల పాటలు, 6. శ్రామికగేయములు, 7. పిల్లల పాటలు, 8. శృంగారగేయములు, 9. అద్భుత రస గేయములు, 10. కరుణరస గేయములు, 11. హాస్యపు పాటలు. ఈ వర్గీకరణ విధానంలోను గేయాలు, గేయకథలు ప్రత్యేకంగా వర్గీకరింప బడలేదు. విషయ ప్రాధాన్యాన్ని బట్టి ఈ విభజన సమంజసంగా వున్నా, జానపద సాహిత్య ప్రక్రియల విషయంలో లోటు స్పష్టంగా కన్పిస్తోంది. భాషా సారస్వతాల్లో సామెతల్ని పేర్కొన్నారు. కాబట్టి ఇతర ప్రక్రియలైన గద్యాఖ్యానాల్ని, పొడుపు కథల్ని చేరిస్తే జానపద సాహిత్య విభజన పరిపూర్ణమవుతుంది.

డా. తంగిరాల వెంకట సుబ్బారావుగారు జానపద సాహిత్యాన్ని ఐదు విధాలుగా విభజించారు[7]. అవి. 1. గద్యాఖ్యానములు, 2. జానపద గేయములు, 3. వీరగాథలు, 4. పొడుపు కథలు, 5. సామెతలు. గద్యాఖ్యానములను పుక్కిటి

---

5. *Ibid* పుట 80
6. చూ. విషయ సూచిక.
7. *జానపద సాహిత్యము - వీరగాథలు పుట 13.*

పురాణములు (Myths), ఐతిహ్యాములు (Legends), జానపద కథలు (Folk tales) అనీ, వీరగాథల (Ballads)ను లఘు వీరగాథలు (Ballad Lings) వీరగాథలు (Ballads), వీరగాథా చక్రవములు (Ballad-cycles) అనీ విభజించారు. వీరి దృష్టిలో గేయకథలే వీరగాథలు. వీరగాథ అనే శబ్దంలోనే వీరగాథలలో వీరత్వానికే ప్రాధాన్యం వుందని తెలుస్తోంది. అలాగని గేయ కథలన్నిటిలోను మనం వీరత్వాన్ని దర్శింపలేం. ఉదాహరణకు స్త్రీల కథల పాటల్లో వీరత్వానికి ప్రాధాన్యం లేదు. ఆంగ్లంలో 'Ballad' అంటే వీరగాథ. దీన్నే 'heroic ballad' అనవచ్చు. కాబట్టి గేయ కథల్లో వీరగాథల్ని ఒక శాఖగా గుర్తింపవచ్చు. తంగిరాల వారి మతంలో స్త్రీల పాటలు జానపద సాహిత్యం కంటే ఉన్నతమైన 'జాతిదేశి' కి సంబంధించినవి. కాని నేటి అమెరికను విద్వాంసులు మౌఖిక సంప్రదాయంలో వుండే ప్రతి గీతాన్నీ జానపద గీతమంటున్నారు.

డా. శ్రీమతి నాయని కృష్ణకుమారిగారు జానపద వాఙ్మయాన్నంతటిని ఈ క్రింది విధంగా విభజించారు[8].

వీరు జానపద వాఙ్మయాన్ని ప్రధానంగా గేయశాఖ, వచనశాఖ, దృశ్యశాఖ అని విభజించి గేయశాఖను కథారహితము, కథా సహితము అని విభజించారు. కథా రహితశాఖను శ్రామిక గేయములు, పారమార్థిక గేయములు, కౌటుంబిక గేయములు (Family songs) అని వింగడించారు. కథా సహిత శాఖను శ్రామిక గేయములు, స్త్రీల పాటలు, కొన్ని కులములవారు పాడునవి (వృత్తి పదములు)గా వింగడించారు. కథా విరహిత శాఖలోని శ్రామికగేయాల్ని శృంగార ప్రధానములు, హాస్య ప్రధానములు, కరుణ ప్రధానములనీ; పారమార్థికగేయములను మార్మిక గేయములు (Mystic songs) అనీ; కౌటుంబిక గేయములను బంధుత్వ ప్రదర్శకములు (Songs of relation), ఆచార ప్రదర్శకములు (Ceremonious songs) అనీ విభజించి, బంధుత్వ ప్రదర్శకవములను తిరిగి పెద్దలకు సంబంధించినవి, పిల్లలకు సంబంధించినవి అని వింగడించారు. పిల్లలకు సంబంధించిన వాటిలో క్రీడాత్మకాలు, జోలపాటలను చేర్చారు.

కథాసహిత శాఖలోని స్త్రీల పాటల్ని వ్రతకథలు, పౌరాణిక కథలనీ; వృత్తి పదాలను వీరగాథలు, అద్భుతగాథలు, మతగాథలు, చారిత్రకగాథలు, స్త్రీ సంబంధి

---

8. తెలుగు జానపద గేయ కథలు, చూ. పట్టిక

గాథలనీ; మతగాథల్ని పురాణగాథలు, గ్రామదేవతల కథలనీ; చారిత్రకగాథల్ని స్పష్ట చారిత్రకాలు, అస్పష్ట చారిత్రకాలనీ విభజించారు.

వచన శాఖనుకూడ కథారహితం, కథాసహితమని విభజించి పొడుపు కథలు, సామెతల్ని, కథారహితంలోను; నీతికథలు (Diadectics), వీరకథలు (Epics), అద్భుత కథలు (Fairy tales), పురాకథలు (Myths), పురాకల్పిత కథలు (Legends), పేదరాశిపెద్దమ్మ కథల (Fables)ను కథా సహితంలోను చేర్చారు.

ఇక దృశ్యశాఖను మనుష్యులు ఆడే ప్రక్రియ అనీ, మనుష్యులు ఆడించే ప్రక్రియ అనీ వింగడించి పగటి వేషాలు, వీధి నాటకం, యక్షగానాల్ని మనుష్యులు ఆడే ప్రక్రియలోను; తోలుబొమ్మలాట, చెక్కబొమ్మలాటను మనుష్యులు ఆడించే ప్రక్రియలోను చేర్చారు.

జానపద వాఙ్మయ స్వరూపాన్ని స్థూల దృష్టితో పరికించినప్పుడు ఈ వర్గీకరణ విధానం సరైనదని అంగీకరింపవచ్చును.

డా. ఆర్వీయస్. సుందరంగారు జానపద సాహిత్యానంతట్నీ నాలుగు విధాలుగా వింగడించారు[9]. అవి. 1. జానపద కవిత్వం, 2. గద్యాఖ్యానాలు, 3. సామెతలు, 4. పొడుపు కథలు. జానపద కవిత్వాన్ని గేయాలు, కథా గేయాలని ద్వివిధాలుగాను, గద్య కథనాల్ని పురాణాలు, జనప్రియ కథలు, ఐతిహ్యాలు అని మూడు విధాలుగా విభజించారు.

పైన పేర్కొనబడ్డ పలువురి వర్గీకరణ విధానాల్ని మనసునందుంచుకొని జానపద సాహిత్యాన్ని ఈ క్రింది విధంగా విభజింపవచ్చును.

1. **గద్యాఖ్యానాలు:** ఇది పుక్కిటి పురాణాలు, ఐతిహ్యాలు, జానపద కథలు అని మూడు విధాలు,
2. **జానపద కవిత్వం:** ఇది జానపదగేయాలు, జానపదగేయకథలు అని రెండు విధాలు.
3. **సామెతలు**
4. **పొడుపు కథలు** (వివరాలకు పట్టిక చూడండి)

---

*9.* జానపద సాహిత్య స్వరూపం

**జానపద సాహిత్యం (Folk Literature)**

లేదా

**మౌఖిక సాహిత్యం (Oral Literature)**

లేదా

**శాబ్దిక కళ లేక వాగ్రూప కళ (Verbal Art)**

లేదా

**అభివ్యక్తి (భావ ప్రకాశక) సాహిత్యం (Expressive Literature)**



## జానపద శిష్ట సాహిత్యాల తారతమ్యం:

జానపద శిష్ట సాహిత్యాలకుండే వ్యత్యాసాన్ని స్పష్టీకరిస్తే జానపద సాహిత్యానికి వున్న 'అనాదరం' తొలగుతుందని నా అభిప్రాయం.

1. శిష్టసాహిత్యం అల్పసంఖ్యాకుల ఆదరణీయ సాహిత్యమే అయినా జానపద సాహిత్యంలా అధిక సంఖ్యాకుల మనఃప్రవృత్తికి ఊపిరిపోసే సాధనం మాత్రం కానేరదు.

2. శిష్ట సాహిత్యం రసాలంకారాదులకు శాస్త్రగతమైన ప్రాధాన్యం వహించి కేవలం పాండిత్య ప్రకర్షను ప్రకటించే సారస్వతం కాగా, జానపద సాహిత్యం ప్రాచీనాలంకారికుల మతాలకు కట్టుబడక, కావ్య లక్షణాలను జొప్పింపక, సర్వజన సుబోధకమై మూర్తీభవించే నిస్వార్థ కళాస్వరూపంగా కనబడుతోంది.

3. శిష్ట సాహిత్యంలో ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసాలకు అగ్రస్థానం. ఇవి లేనట్లయితే కవిత రాణింపదు. జానపద సాహిత్యంలో భావోద్రేకమే ప్రధానం కాబట్టి పై సాధన సామగ్రి అనుచితం; అనవసరం.

4. శిష్టసాహిత్యం మానవజీవితంలో వుండే మంచి చెడుల్లో మంచికే ప్రాధాన్యమిచ్చి, నగ్నసత్యాన్ని రూపుమాపటానికి యత్నిస్తుంది. జానపద సాహిత్యం మంచిని మంచిగా, చెడును చెడుగా చిత్రీకరించి, మంచి చెడ్డల లోతుపాతుల్ని, సత్యా సత్యాల్ని బహిర్గతం చేస్తుంది.

5. శిష్ట సాహిత్యంలో కవి, చదువరి, శ్రోత, వేరుగా వుంటారు. జానపద సాహిత్యంలో ఇలాంటి అంతరం కనిపించదు. దీంట్లో ముగ్గురూ సమానమే. శ్రోత రచయిత కావవచ్చు. రచయిత శ్రోత కావచ్చు. ఇది మౌఖిక ప్రచార సాహిత్యం కనుక 'చదువరి' కిక్కడ స్థానం లేదు. చదువరి స్థానంలో 'గాయకుడు' ప్రాధాన్యం వహిస్తాడు. ఈ గాయకుడే రచయిత, శ్రోత అయి వుండవచ్చు.

6. శిష్ట సాహిత్యానికి జానపద సాహిత్యానికి వుండే మరొక ముఖ్యభేదం హాస్యరస పోషణ. శిష్ట సాహిత్యంలో విస్మరింపబడ్డ హాస్యం జానపదుల మృదు మధుర భావాల్లో కన్పించి ఆ లోటును తీరుస్తుంది.

# 5. జానపద గేయాలు
## (Folk Songs)

జానపద కవిత్వంలో ప్రధానాంగం జానపదగేయాలు (Folk Songs). వ్రాతకోతలతో నిమిత్తంలేని జానపదులు రసోద్రేకులై ఆలపించు సుమధర భావనిర్భర గీతాలే జానపద గేయాలు. కర్ణాకర్ణిగా మౌఖిక ప్రసరణంలో సంక్రమించిన సామాన్య ప్రజా సమూహ గీతాలే జానపదగేయాలు. వీటిలో ముఖ శ్రవణేంద్రియాల ప్రాధాన్యమే కాని నేత్రహస్తాల ప్రాధాన్యం లేదు. ఉదర పోషణార్థమై, జీవన భృతికై మహారాజుల ఆస్థానాల్లో జానపద గేయ సాహిత్య సృష్టి జరుగలేదు. కేవలం బ్రతుకులోని తీయందనాన్ని, విషాదాన్ని చవిచూచిన జానపదుడు తన గుండెల నిండా మార్మోగించిన శంఖారావమే జానపదగేయంగా రూపొందింది.

జానపద సంస్కృతి ఎలా నాగరక సంస్కృతి కంటే భిన్నమైందో అలాగే జానపద గేయ కవిత్వం కూడ నాగరక (శిష్ట) సాహిత్యం కంటే కొన్ని మూల భూతాంశాలకు భిన్నంగా వుంటుంది. మార్గ సాహిత్యానికి ఇక్కడ స్థానం లేదు. శిష్టసాహిత్యంలో లాగా జానపదగేయ కవిత్వంలో ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసల ప్రసక్తే వుండదు. ఇది సహజస్ఫురణ శక్తి (Spontaneous expression) కలిగిన ఒక అనాలోచితమైన కళ (Unpremedidated art). Words worth కవిత్వాన్ని గూర్చి చెప్పిన, 'Poetry is the spontaneous overflow of powerful feelings' అనే నిర్వచనాన్ని సహజసుందరం, కృత్రిమ రహితం అయిన జానపద గేయ కవిత్వానికీ అన్వయించుకోవచ్చు.

సంగీత సాహిత్యాలతో కూడిన నిరక్షరాస్యుని భావగీతమే జానపదగేయం, Krappe అన్నట్లు 'A Folk song is a lyric song which originates among illiterate'.

ఒక భావంలో లీనమైనప్పుడు, ఒక రసంలో తన్మయత్వం పొందినప్పుడు అపుర్వానుభూతితో పాటు హృదయ స్పందన అవుతుంది. అదే జానపదగేయంగా ప్రచారమవుతుంది. కాబట్టి జానపద గేయం స్వయంభువు. Grimn పేర్కొన్న 'Folk song composes itself' అనే వాక్యం సమంజసంగా వుంది. 'జనపదాల్లో

గంధవహుని వలె విహరించి ఆనోటి నుండి ఈ నోటికి ఎగిరిపోయేది జానపద గేయం[1] అని శ్రీ పాద గోపాల కృష్ణమూర్తిగారి నిర్వచనం. డా. ఆర్వీయస్. సుందరం జానపద గేయాన్ని నిర్వచిస్తూ 'గేయరూపంలో భావ ప్రధానంగా వెలువడే ఆశురచన జానపదగేయ'[2] మని పేర్కొన్నారు.

## జానపద గేయ లక్షణాలు:

**1. అజ్ఞాన కర్తృత్వం:** జానపద గేయాల ప్రధాన లక్షణం కవిని గురించి తెలియక పోవడం. జానపదగేయాలకొక ప్రత్యేక కవి వుండడు. పుట్టుకలో ఇవి వైయక్తికాలే అయినా, తరతరాలుగా ఒక వ్యక్తి నుంచి మరో వ్యక్తికి అందింపబడటం వల్ల అవి సమిష్టి సంపదలయ్యాయి. అందుచేతనే ప్రత్యేక కవిని గూర్చిన శ్రద్ధాలోచనలు జానపదులకు గాని గేయ రచయితకుగాని ఏర్పడలేదు. డా.బి. రామరాజుగారన్నట్లు 'జానపదగేయ రచయిత లందరును మన గుళ్ళు గోపురములు కట్టి పోయిన అజ్ఞాత శిల్పులవంటివారు''. కాబట్టి జానపదగేయాలు వ్యక్త్యతీతాలు (Impersonal).

శిష్టకవి ఒకని చేతనే సాహిత్య సృష్టి జరిగినట్లు జానపద కవిత్వ సృష్టి జరుగదు. జానపదుడు భావావేశంలో ఏ కూని రాగమో తీస్తారు. అదే గేయ రూపంలో నలుగురి చెవుల బడి వ్యాపిస్తుంది. ఇలా అనుశ్రుతంగా వ్యాపించటం వల్ల తొలుత గేయాన్ని కట్టిన రచయిత కనుమరుగై పోతాడు. 'Normally the original composer of folk song is not known at all'[3]. The chief characterstic of folk song is its anonymity'[4]. అంతేకాక ఎప్పటికప్పుడు ఉద్భవించే గుణం (Sporadic) జానపదగేయానికి ఉంది. కనుకనే దానికి వైయక్తిక ముద్ర పడవలసిన అవసరం లేదు. ఠాకూర్ రామసిన్హా అన్నట్లు 'These songs are the product of the group, no matter who first began a particular song'[5]. దీన్ని బట్టి నిర్దిష్టమైన కవి ఎవరూ లేకపోవడం చేత జానపదగేయాలన్నీ

---

*1. తెలుగు విజ్ఞాన సర్వస్వము, సంపుటము - 3, పుట - 802.*
*2. జానపద సాహిత్య స్వరూపం, పుట - 9*
*3. Standard Dictionary of Folklore, P-1034*
*4. Durga Bhagavathi, An Out line of Indian Folklore, P-50.*
*5. Women's songs of Rajputana, P-16*

సమష్టి కర్తృత్వాలు (Collective creations of the folk) అని చెప్పటంలో సందియం లేదు.

**2. అవిదిత కాలనిర్ణయం:** జానపద గేయాలు అజ్ఞాత కర్తృకాలయినట్లే రచనాకాలం కూడ అజ్ఞాతమే. ఇది రెండో లక్షణం. శిష్ట సాహిత్యంలో కవే తన్ను గూర్చి, తన వంశాన్ని గూర్చి, సమకాలికులను గూర్చి ప్రస్తావిస్తాడు. అంతేకాక చారిత్రకాధారాలు సైతం రచనాకాలాన్ని కొంతకు కొంత తెలియజేస్తాయి. Grimm అన్నట్లు 'జానపదగేయం అధునాతనమూ కాదు, ప్రాచీనమూ కాదు. అది భూతకాలంలో అన్నట్లు లోతుగా వేరుదన్ని, సతతం కొంగ్రొత్తశాఖలు, పత్రాలు, ఫలాలను వ్యాపింపచేసే అరణ్య వృక్షాలవలె ..... అందు కాలము లేదా కర్తృత్వ ప్రశ్న అముఖ్యము ..... జానపద గేయముసదా ప్రాతదానిపై క్రొత్తదనాన్ని కల్పించుచునే ఉండును ... ... అది నిరంతరం నవ చైతన్యాన్ని పొందుచునే యుండును[6]. కనుక జానపద గేయాన్ని ప్రాత క్రొత్తల మేలు కలయికగా భావింపవచ్చు.

జానపద గేయాలకు కర్త ఎవరు? రచనాకాలమేది? అనే ప్రశ్నలకు సమాధానంగా 'It is not question of age or authorship that is important in a folk song but that of spontaneousness and beauty'[7] అని చెప్పబడింది. కనుక జానపదగేయాల్లో మనకు ప్రధానమైంది నిరర్గళత మరియు భావ సౌందర్యమే కాని కవి కాలాదులు కావు. ఋషి మూలం, నదీ మూలం, దైవమూలం అగమ్యగోచరాలయినట్లే జానపదగేయాల మూలం కూడ అవిదితమే. కనుక రచనా కాలం ఇదమిత్థంగా తెలియక పోవటం చేత కాలనిర్ణయం అసాధ్యమని తేల్చుకోవచ్చును.

**3. సాంప్రదాయిక వమౌఖిక ప్రసరణం (Traditional oral circulation):** జానపద గేయాల మూడో లక్షణం అది వమౌఖికంగానే ప్రచారమందడం. జానపద గేయ సాహిత్యం ఒక తరం నుంచి మరొక తరానికి సంక్రమించే సాంప్రదాయక కళాస్వరూపం. ఈ సాంప్రదాయం మౌఖిక ప్రసరణం వల్లే నిలద్రొక్కుకున్నది. మౌఖిక ప్రసరణం జానపదుల జ్ఞాపకశక్తిపైనా, జ్ఞాపకశక్తి

---

*6. Encyclopaedia of Britanica, P-16*

*7. Ibid.*

వారి వినికిడి మరియు పునరుద్ఘాటనా శక్తులపైనా ప్రధానంగా ఆధారపడి వుంది. కనుక ఇది ఒకరు చెప్పే మరొకరు వినే సాంప్రదాయిక విధానం. అంటే ఇది ముఖ-శ్రవణ పద్ధతి (Oral-aural process). కేవలం వినికిడి వల్లే వీటిని నేర్చుకొని జ్ఞప్తియందుంచు కొంటారు[8].

**4. గానయోగ్యం:** జానపదగేయాల నాల్గవలక్షణం గానయోగ్యం. గేయమనే ఈ అర్థంలోనే ఈ లక్షణం ఇమిడి వుంది. గీతరూపంలో ఉండి పాడటాని కనువైంది గేయం. కనుక జానపదగేయాలన్నీ గాన యోగ్యతను ప్రదర్శించే విశిష్ట లక్షణాలను కలిగి వున్నాయి. ఈ విశిష్ట లక్షణమే జానపదులు గేయాల్ని జ్ఞప్తికుంచు కొనటానికి ఉపకరిస్తుంది. 'Folk song comprises the poetry and music of groups....'[9] అనే వాక్యాల్ని బట్టి సంగీత సాహిత్య కళాస్వరూపం జానపద గేయమనవచ్చును. గేయాలు జన ప్రియత్వమందటానికి ఈ గానానుకూలత మిక్కిలి అవసరం. 'శిశుర్వేత్తి, పశుర్వేత్తి, వేత్తి గానరసం ఫణిః' అనే మహత్తర శక్తి జానపద గేయాలకూ ఉండటం చేతనే ఇవి జన ప్రియత్వం అందాయి.

**5. విభిన్న పాఠాంతర సమన్వితం:** డా. రామరాజుగారు ఈ లక్షణాన్నే నియమిత స్వరూపం లేకపోవుట అన్నారు. ఇదే ఐదో లక్షణం. ఒక జానపద గాయకుడు అనేకమార్లు ఒకగేయాన్ని గానం చేసేటపుడు ఒక పదాన్ని కాని, పూర్తిగా ఒక వాక్యాన్ని కాని విస్మరించటానికి అవకాశం వుంది. అలాంటి సమయాల్లో అతడు స్వశక్తితో లోపించిన దాన్ని పూరిస్తాడు. మరొకడు రెండు గేయాల్లోని వస్తువుల్ని కలగాపులగం చేసి పాడుకొనటం కూడా కద్దు. '(Again, because) a folk singer has no standard version that he can look up in a book he may combine material from two songs'.[10] ఇలా పాడటం వల్ల గేయం తొలుతటి స్వరూపమే మారిపోయి మార్పుల్ని, కూర్పుల్ని సంతరించుకొని విభిన్న పాఠాంతరాలతో ప్రచార మవుతుంటుంది. 'The body of folk song grows, rather, through a process of recreation of materials already in existence... Singers constantly add, often unconsciously their small modification. These changes in time lead gradually to different

---

8. *'Songs are learned and remembered by hearing' - Standard Dictionary of Folklore, P-1033.*
9. *Ibid, P-1032.*
10. *Tristam Coffin 111, American Folklore, P-136.*

local versions and variants to regional varients, to the growth of song families and to the branching off and emergence of new texts and melodies'.[11]

**6. ఆశురచనం:** జానపదుని నోటినుంచి వెలువడ్డ భావ ప్రధానాలైన గేయాలన్నీ ఆశురచనలే. ఇది ఆరో లక్షణం. జానపదులు నిరక్షకుక్షులు. ఏ మాత్రం కూడ విద్యాగంధం లేనివాళ్ళు. కనుకనే వారి కవిత్వం వ్రాత, ముద్రణాల సహాయాన్ని అభిలషింపకనే కేవలం ఆశురచనలుగానే చలామణి అయింది.

**7. శైలీ నిరాడంబరం:** జానపద గేయాల శైలి ఆడంబరరహితమై నిరలంకారయుతమై, దేశీయపద ప్రయోగాలతో కూడి శోభను వెలారుస్తుంది. ఇది జానపదగేయాల ఏడో లక్షణం. భాషలోనూ, భావంలోనూ జీవకళ ఉట్టిపడు తుంటుంది. 'Simplicity and Directness is the Chief characteristic of folk song'[12] అని చెప్పవచ్చు. స్వభావోక్తి జానపదులు ఆదరించే అలంకారం. అప్రయత్న శిల్పం వారి సహజశైలి.

**8. పునరావృత్తం:** పునరావృత్తం లేక పల్లవి (refrain) అనేది ఎనిమిదో లక్షణం. పల్లవి ఒక చరణాన్ని గాని రెండు చరణాల్ని గాని కలిగివుంటుంది. ఇది తరచుగా పునరావృత్తమవుతుంటుంది. ఒక్కోసారి ఆ చరణాలు కేవలం ధ్వనిపూర్వకాలైన పదాలతో ముగింపబడుతుంటాయి. వాటికి నిర్దిష్టమైన అర్థం లేకున్నా అవి భావవ్యక్తీ కరణానికి తోడ్పడి గేయానికి సౌందర్యం ఇస్తాయి.

**9. భావనిర్భరం:** ఇది జానపద గేయాల తొమ్మిదోలక్షణం సుఖదుఃఖాల కలయిక మానవ జీవిత ప్రధాన తత్త్వం. సుఖం కలిగినప్పుడు సంతోషించటం. దుఃఖం కలిగినప్పుడు విచారించడం సర్వసాధారణాలు. భావాశ్రయుడైన జానపదుడు ఆవేశపూరితుడై తన భావాలకు, అనుభవాలకు రూపకల్పన చేసి ఎలుగెత్తి పాడతాడు. కనుక జానపద గేయాలు ముప్పాతిక మువ్వీసం అతని జీవితాన్ని విడదీయరాని అనుబంధంతో పెనవేసుకొన్నాయి.

---

11. *Standard Dictionary of Folklore.*

12. *Studies in Indian Folk Culture, P-4, Editors: Shankar sen Gupta & K.D. Upadhyaya*

**10. కథారహితం:** కథకు ప్రాధాన్యం లేకపోవటమే జానపద గేయాల పదో లక్షణం. కనుకనే వీటిని ముక్తకాలుగా పేర్కొనవచ్చును. జానపదుడొక దృశ్యాన్ని కనులార గాంచినపుడు అతని మనోవీథిలో అనేక భావాలు ఉప్పొంగుతాయి. ఆ భావాలు అప్రయత్నంగా కథారహితమై గేయరూపంలో వెలువడతాయి.

**11. సార్వజనీనం:** ఇది పదకొండో విశిష్ట లక్షణం. జానపదగేయం పామరుల మనస్సులకు హత్తుకొని పోయినప్పుడే అది జానపదగేయ యోగ్యతను పొందటానికి వీలుంది. ఆ యోగ్యత కలగటానికి అవి సర్వజన సుభోదకంగా వుండి తీరాలి. అన్వయ క్లిష్టమైన ఏ గేయమైనా జానపదులకు అంగీకార యోగ్యం కాదు. అట్టి రచనలు శిష్టుల రచనలుగానే చలామణి అవుతాయి. కాని జానపదుల రచనలుగా పరిగణింప బడవు. సార్వజనీనత కలగటానికిగేయాలు జనపదీయాలుగా వుండాలి; జానపదుల నోళ్ళల్లో నానాలి.

**12. రసప్రధానం:** జానపదగేయాలు రసప్రధానాలనటం పండ్రెండో లక్షణం. జానపదుని నోటినుంచి ఆశువుగా వెలువడ్డ జానపద గేయరత్నం ఒక రస గుళిక. ఊహకందని విషయాల్ని, మానవాతీత శక్తుల్ని కల్పించి అద్భుత రసాన్ని అందించగలుగుతాడు. పడుచు దానిమీద వలపు నొలకబోసి శృంగార రసాన్ని చిందింపగలడు. తనకంటికి కన్పించే ఏ వీర దృశ్యాన్నైనా వీరావేశంతో, ఉద్రేకంతో అప్పటికప్పుడే పాడి వీరరసాన్ని కురిపింపగలడు. దుంఖాన్ని దిగమ్రింగి మనసు కుదుట పరచుకొనటానికి నవ్వి, నవ్వించి హాస్యరసాన్ని వెదచల్లగలడు. రౌద్ర మూర్తియై బీభత్స భయానకాల్ని సృష్టింపగలడు. ఓర్పును వహించి శాంతమూర్తి కాగలడు. ఇలా జానపదుడు తాను చవి చూచిన నవరసాల్ని గేయాలుగా అల్లి చెప్పగలుగుతున్నాడు. కనుక జానపద గేయాలన్నీ రసప్రధానాలని చెప్పటంలో అతిశయోక్తి లేదు.

ఇలా జానపద గేయాలు పండ్రెండు లక్షణాలతో కూడి వుంటాయి.

## జానపద గేయ వర్గీకరణం:

జానపదగేయ వర్గీకరణ విధానంలో పలువురు పలురీతుల నవలంబించారు. కొందరి వర్గీకరణాల నుట్టంకిస్తాను.

R.S. Boggs జానపద గేయాల్ని భావోద్వేగం (Emotion), దైనందిన జీవితం (Daily life), జీవిత చక్రంలో ఉండే ముఖ్య సన్నివేశాలు (Crucial moments in life cycle), పిల్లల పాటలు (Childrens songs), ధార్మిక గీతాలు (Religious songs) అనే ఐదు శీర్షికల్లో పేర్కొన్నాడు.[13]

Ulli Beir ఆఫ్రికా జానపద గేయాల్ని సేకరించి వాటిని మతగీతాలు, మరణగీతాలు, ప్రశంసాగీతాలు, ప్రేమగీతాలు, జంతు గీతాలు, యుద్ధగీతాలు, ప్రజాగీతాలు, శిశుగీతాలుగా విభజించాడు.[14]

Hem Barua భారతదేశపు జానపద గేయాల్ని ఐదు శీర్షికల్లో పేర్కొన్నారు.[15] అవి 1. ప్రకృతి గీతాలు (Nature songs), 2. ప్రేమ గీతాలు (Love songs), 3. వైవాహిక గీతాలు మరియు సాంసారిక గీతాలు (Marriage songs and songs of Married life), 4. లాలి పాటలు మరియు జోల పాటలు (Lullabies and cradle songs), 5. శ్రామిక గీతాలు మరియు పండుగ పాటలు (Work songs and festivel songs).

శ్రీ టేకుమళ్ళ కామేశ్వరరావు జానపదగేయాలను తొమ్మిది విభాగాలుగా గుర్తించారు.[16] అవి 1. జంగం కథలు, 2. పౌరాణిక గేయములు, 3. పూర్వాచీన పదములు, 4. స్త్రీల పాటలు, 5. అర్వాచీన పదములు, 6. వాగ్గేయములు, 7. తత్త్వములు, 8. ఖండ గేయములు, 9. జంగం చరిత్ర కథలు. వీరు గేయాల్లో జంగం కథలు, జంగం చరిత్ర కథలను చేర్చారు. కథలను గేయాల్లో చేర్చటం యుక్తం కాదు. శ్రీహరి ఆదిశేషువు, డా.బి. రామరాజు గారలు కూడా జానపదగేయాలకు జానపద గేయ కథలతో అభేదాన్ని పాటించారు.

శ్రీ కృష్ణశ్రీ 'పనిపాటలు, ఆటపాటలు, వీరగాథలు, బ్రతుకు బాటలు, వినోద గేయాలు, ఏలపాటలు, పడవ పాటలు, వేదాంతపు పాటలుగా జానపద గేయాల్ని సంకలనం గావించారు.[17]

---

13. *Standard Dictionary of Folklore, Mythology and Legend.*
14. *African Folk Poetry.*
15. *Folk Songs of India,* విషయ సూచిక
16. *ఆంధ్ర జానపద గేయ వాఙ్మయ చరిత్ర (వ్యాస సంకలనము)*
17. *పల్లెపదాలు, ప్రచురణ: ఆంధ్ర సారస్వత పరిషత్తు.*

త్రివేణిలో పిల్లల పాటలు, వేడుక పాటలు, స్త్రీల పాటలు, శ్రామిక పాటలు, వలపు పాటలు, హాస్యపు పాటలు, కన్నీటి పాటలు, పారమార్థికాలుగా గేయాలు సంకలనం గావింపబడ్డాయి.

సంగీత రచనా ధోరణిని బట్టి పి. సాంబమూర్తిగారు వర్గీకరించారు. ఇలా ఎందరు ఎన్ని విధాల వర్గీకరించినా ఆ వర్గీకరణలన్నీ అధ్యయన సౌలభ్యం కోసం చేయబడినట్టివని స్పష్టమవుతోంది. అయినా పై వర్గీకరణ విధానాల్లో ఆర్. ఎస్. బాగ్స్ గావించిన వర్గీకరణం కొంతవరకు సమంజసంగా తోస్తోంది. జానపదగేయ వర్గీకరణం ఆయా భాషా సంస్కృతులపై ఆధారపడి వుంటుంది. తెలుగులో జానపద గేయాలనన్నింటిని ఈ క్రింది విధంగా విభజించటం సమంజసమనిపిస్తుంది.

జానపద గేయాల నన్నింటిని పురుషుల పాటలు, స్త్రీల పాటలు, స్త్రీ పురుషోభయుల పాటలు, పిల్లల పాటలు అని చతుర్విధాలుగా వర్గీకరింపవచ్చు.

(వివరాలకు పట్టీ చూడండి)


జానపద గేయాలు
పురుషుల పాటలు
స్త్రీల పాటలు
స్త్రీ పురుషోభయుల పాటలు
అంతర్విభాగాలు పురుషుల పాటలాగే
పిల్లల పాటలు
తల్లులు పిల్లలకోసం పాడే పాటలు
పిల్లలు తమకోసం పాడుకొనే పాటలు
భావోద్వేగాలు
ధార్మికాలు
క్రియాన్వితాలు
వినోద సంబంధాలు
వలపు పాటలు
హాస్యపు పాటలు
కన్నీటి పాటలు
శ్రామిక గీతాలు
క్రీడా గీతాలు
నృత్య గీతాలు
మతసంబంధాలు
పారమార్థికాలు
లాలిపాటలు, జోలపాటలు
వేడుక పాటలు
భక్తి పాటలు
శ్రమజీవనపు పాటలు (శ్రామిక స్త్రీల పాటలు)
సమర్త పాటలు
పెండ్లి పాటలు
సీమంతపు పాటలు
ఇంట్లో పాడేవి (విసుర్రాతి పాటలు, దంపుడు పాటలు
బయట పాడేవి (నాటు పాటలు, కలుపు పాటలు)
మేలుకొలుపులు
పూజపాటలు
మంగళ హారతులు

జానపద గేయాలు

# 6. జానపద గేయ కథలు
## (Narrative Folk Songs)

జానపద కవిత్వంలో రెండో ప్రధానాంగం జానపదగేయకథలు. కొందరు వీటినే వీరగాథలనీ[1], మరికొందరు చారిత్రక గేయాలనీ, వీరగీతాలనీ,[2] వీరకథా వాఙ్మయమనీ, సాహసిక కథావాఙ్మయమనీ,[3] కథాగేయాలనీ[4] పిలిచారు. ఆంగ్లంలో గేయకథలను 'Ballads' లేక 'Narrative folk poetry' అని పిలుస్తారు. గేయకథ అంటే గేయ రూపంలో వుండే కథ. శైలీ, కథాకథన పద్ధతుల్లోను, వస్తువులోను జానపదగేయం కంటే భిన్నంగా వుండటం చేత, జానపద సాహిత్యంలో ఇది ప్రత్యేక శాఖగా పేర్కొనబడుతుంది.

వస్తువును బట్టి వీరగాథలు గేయకథల్లో అంతర్భాగం మాత్రమే. వీరుల నాధారంగా చేసికొని పాడబడు కథాసహిత వీరగీతాలే వీరగాథలు. ఇందు వీరరసం ప్రాధాన్యం వహిస్తోంది. పాశ్చాత్యుల దృష్టిలో ఇలాంటి వీరగీతాలు 'Heroic Ballads' అని వ్యవహరింప బడుతున్నాయి. వీరగాథలు వీర సంఘటన ఏదైనా జరిగినపుడు ఉద్భవిస్తాయి. గేయకథల్లో మరో విభాగం స్త్రీల కథల పాటలు.

మధ్యకాలపు యూరపు దేశాల్లో వృద్ధిపొందిన జానపద గేయకథలకు Ballad అనే పేరేర్పడింది. ఈ Ballad అనే పదం లాటిన్ భాషలోని 'Ballare' నుంచి వచ్చినది. 'The word ballad is derived through French from the late Latine ballare, to dance, and thus meant originally a song sung to the rhythmic movement of a dancing chorus...'[5] ఈ పదమే ఇటాలియన్ భాషలో 'Ballata' అని వ్యవహరింపబడుతోంది.

పశ్చిమ యూరపు దేశాల్లో Ballad ప్రక్రియకు ముందు మధ్యయుగంలో గానంతో పాటు నృత్తవిలసితమైన మధుర కవితా స్వరూపమొకటి ఉండేదట. అదే

---

1. *డా. తంగిరాల వెంకట సుబ్బారావు, జానపద సాహిత్యము - వీరగాథలు*
2. *డా. బి. రామరాజు, తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట 155*
3. *శ్రీహరి ఆదిశేషువు, జానపదగేయ వాఙ్మయ పరిచయము. చూ. విషయ సూచిక*
4. *డా. ఆర్వీయస్. సుందరం, జానపద సాహిత్యము*
5. *American Encyclopaedia, P. 2. 993.*

'carol' అనే ప్రక్రియ. ఒక వ్యక్తి పాడుతుండగా గుంపుగా చేరిన వ్యక్తులు చేతులు పట్టుకొని వర్తులాకారంగా నిలబడి అడుగులు ముందుకు, వెనక్కు కదుపుతూ లయతప్పక తిరుగుతూ చేసే వృత్త విశేషమే Carol . ఇట్టి కథావిరహిత గాన నృత్త ప్రక్రియనుంచి 'Ballad' ప్రక్రియ రూపుదిద్దుకొందని కొందరి అభిప్రాయం. ఈ అభిప్రాయాన్నే శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు 'చిత్ర విచిత్ర కార్యకమనీయమైన ప్రకృతి దేవతా చిద్విలాసమును చూచి యానందభరితుడై ప్రాకృత జీవియగు ప్రాక్తన మానవుడు చిందులు త్రొక్కుచూ, పాడిన పాటయే మానవలోక కవిత్వావిర్భావమునకు శ్రీకారము. ఆ కవిత్వము ఆడుచూ పాడినది గనుక దానికి ఆట-పాట లేక (నృత్యగీతము) 'Ballad dance' అనిపేరు[6] అని వివరించారు.

## జానపద గేయ కథా నిర్వచనం:

G.H. Gerould అనే పాశ్చాత్య విమర్శకుడు Ballad ను నిర్వచిస్తూ 'Ballad is a folk song that tells a story... a ballad is always a narrative is always sung to a rounded melody, and is always learned from the lips of others rather than by reading'[7] అని చెప్పాడు.

Francis B. Gummere - 'Traditional, objective impersonal as they are, ballad must also tell a definite tale'[8] అని పేర్కొన్నాడు.

గేయకథ అంటే ఒక కథను చెప్పే గేయం. లేదా గేయంలో చెప్పబడ్డ కథ[9] అని కొందరి అభిప్రాయం.

డా. తంగిరాల వెంకట సుబ్బారావు 'Ballad' శబ్దానికి సమానమైన తెలుగు పదం 'వీరగాథ' అని పేర్కొని 'జానపద గేయ రూపమున నుండి వీరరస ప్రధానమగు కథను చెప్పుచు, సంచారగాయక భిక్షువుల (Minstrels) చే పాడబడు సరళ కథాగేయమే వీరగాథ'[10] అని నిర్వచించారు. ఈ నిర్వచనం కేవలం వీరరస

---

6. *గౌతమ వ్యాసములు, పుటలు 12-13*
7. *The Ballad of Tradition, P-3*
8. *The Popular Ballad, P-63*
9. *Kenneth clarke and mary Clarke, Introducing folklore, P-57.*
10. *జానపద సాహిత్యము - వీరగాథలు, పుట-17.*

ప్రధానాలైన గేయ కథల (Heroic ballads) కు మాత్రమే పరిమితమై వుంది. కనుక 'Heroic ballad' అనే ఆంగ్ల పదానికి సమానార్థకమయిన తెనుగు శబ్దం 'వీరగాథ' అనీ, Ballad అనే పదానికి సమానపదం 'జానపద గేయకథ' (Narrative folk song) అనీ చెప్పవచ్చు. గేయకథ నిలా నిర్వచింపవచ్చు. కథాకథన రూపంలో వుండి మౌఖిక సంప్రదాయంలో తరతరాలుగా అందింపబడుతూ భిన్న పాఠాంతరాలతో కూడిన సరళ కథాగేయమే గేయకథ. ఈ నిర్వచనం వీరగాథకులకూ స్త్రీలగేయకథల (స్త్రీల కథల పాటలు) కూ అన్వయిస్తుంది. వీరగాథలన్నీ సంచార గాయక భిక్షువులచే పాడబడు గేయకథలే. ఇవి వాద్య సహితంగా వీధుల్లో పాడబడతాయి. స్త్రీల గేయకథలు స్త్రీలచే వాద్యరహితంగా గృహాల్లో పాడబడతాయి. ఇదే వీరగాథలకూ స్త్రీలగేయకథలకూ వుండే ముఖ్య భేదం.

## జానపద గేయ కథా లక్షణాలు:

డా. తంగిరాల వెంకట సుబ్బారావు వీరగాథలకు అతి ప్రధానాలైన పది లక్షణాలను పేర్కొన్నారు.[11] అవి. 1. వీరగాథ గేయ స్వరూపమున నుండును, సరళచ్ఛందము, పునరావృత్తి, గానయోగ్యత అనునవి ఇందలి ఉపలక్షణములు. 2. వీరగాథ కథానాఖ్యానాత్మకముగా నుండును. ఇది ద్వితీయ లక్షణము. నియమిత పరిణామము, యథార్థ సంఘటనా జన్యత్వము, దేశీయేతి వృత్తము, నాయకాభేదత, వీరరస ప్రాధాన్యము, కథాసారళ్యము, హఠాత్ప్రారంభత్వము, సంభాషణా సహితత్వము, వచనరాహిత్యము, విషాదాంతత, అభివర్ధిత పునరుక్తి (Incremental repetion) అను పదునొకండును ద్వితీయ లక్షణములోని ఉపలక్షణములు. 3. గాయక భిక్షువుల అశుకవనమున జనించుట వీరగాథయొక్క తృతీయ లక్షణము. కవినామము తెలిసినను వీరగాథ అప్రధాన కర్తృకముగా నుండుట తృతీయ లక్షణములోని అవాంతర లక్షణము. 4. మౌఖిక ప్రసరణము (Oral transmission) న దేశమంతయు వ్యాపించుట, మౌఖిక సంప్రదాయము (Oral tradition) న తరతరములుగా జీవించుట వీరగాథల నాల్గవ లక్షణము. బహు జనాదర పాత్రత లేక జనప్రియత్వము (Popularity) ఇందలి అవాంతర లక్షణము. 5. వీరగాథ నాటకము వంటి శుద్ధపరాశ్రయ కవిత్వము (Objective Poerty) ఇది దీని ఐదవ లక్షణము. 6. శైలీ సారళ్యమును, వారానువర్తనములను

11. జానపద సాహిత్యము - వీరగాథలు, పుటలు 24-26.

కలిగియుండుట వీరగాథల ఆరవ లక్షణము. 7. అనితర సాధ్యత ఏడవ లక్షణము. 8. అద్వితీయ గుణము (Unique Character)ను కలిగియుండుట ఎనిమిదవ లక్షణము. 9. నీతిని ధ్వనింపచేయుట తొమ్మిదవ లక్షణము. 10. జీవితమున ప్రతి ప్రస్థానము చివరను ఓటమి యున్నదను విషాద విషయమును ప్రతిధ్వనించుట వీరగాథల పదియవ లక్షణము. గేయకథలందు వీరగాథలు ప్రధానాంగం కనుక వీరు పేర్కొన్న పదిలక్షణాలూ వీరగాథలకు ప్రత్యేకంగా అన్వయిస్తాయి.

(Standard Dictionary of Folk lore) లో గేయకథలకు సార్వత్రికంగా కనిపించే ఐదు లక్షణాలు పేర్కొనబడ్డాయి. అవి. 1. కథాఖ్యానంతో వుంటాయి. 2. పాటరూపంలో వుంటాయి. 3. జనపదీయంగా వుంటాయి. 4. ఒక ముఖ్యసంఘటనమీద కేంద్రీకృతమై వుంటాయి. 5. వ్యక్త్యతీతమై వుంటాయి. ఈ సార్వత్రిక లక్షణాలతో పాటు మరికొన్ని లక్షణాల్ని పేర్కొంటేగేయ కథాలక్షణాలు సంపూర్ణమవుతాయని నా అభిప్రాయం. కనుక జానపదాగేయ లక్షణాలయిన అజ్ఞాత కర్తృత్వం, అవిదిత కాల నిర్ణయం, సాంప్రదాయిక మౌఖిక ప్రసరణం, గానయోగ్యం, విభిన్న పాఠాంతర సమన్వితం, ఆశురచనం, శైలీ నిరాడంబరం, పునరావృతం, భావనిర్భరం, సార్వజనీనం, రసప్రధానం అనే పదకొండు లక్షణాలతో పాటు కథాఖ్యానం, అభివర్ధిత పునరుక్తి, గేయ కథావారాను వర్తనాలు, నాటకీయం, ఏకైక సంఘటనా జన్యత్వం అనే మరో ఐదులక్షణాలను జానపద గేయ కథాలక్షణాలుగా పేర్కొవచ్చు. కొన్ని జానపదగేయ కథల్లో రచయితల పేర్లు పేర్కొని యుండటం గమనింపవచ్చు. కాని సర్వత్ర ఇలా పేర్కొనబడటం అరుదుగా కనిపిస్తాయి.

**కథాఖ్యానం (Narration):** గేయకథల్లో మనకు ప్రధానంగా కన్పించే కథావస్తువులు 1. ప్రేమ, 2. వీరత్వం, 3. చారిత్రకఘటనలు, 4. సామాజిక సమస్యలు, 5. పురాణ సంబంధ విషయాలు. వీరత్వం మరియు చారిత్రకఘటనలు వీరగాథలకు; ప్రేమ, సామాజిక సమస్యలు, పురాణ సంబంధ విషయాలు స్త్రీల కథల పాటలకును, వర్తించును. ఈ కథావస్తువులన్నీ ఆఖ్యానాత్మకంగా వుంటాయి. గేయకథలు కేవలం కథాకథనాలుగానే కాక స్వరమాధుర్యంతో కూడి వివరణాత్మకంగాను, భావయుక్తంగాను వుంటాయి. కనుకనే ఇవి బాహ్యస్వరూపంలో Lyricను, ఆంతర స్వరూపంలో Epicను పోలి వుంటాయని విమర్శకుల అభిప్రాయం. గేయకథలు ఒక ప్రాంతం నుంచి మరొక ప్రాంతానికి విస్తరింపబడుచుండినా దీంట్లో

ప్రధానాంశాలయిన ఆకృతి (Form) మరియు కథా కథనాలు మాత్రం స్థిరంగా వుంటాయి. కథాఖ్యానంగా వుండే గేయకథల్లో చతురంగాలు ప్రధానాలు. అవి. 1. క్రియ లేదా చలనం (action), 2. పాత్రలు (Characters), 3. కథ లేదా వస్తువు (Theme), 4. సన్నివేశ కల్పన (Setting). ఈ నాల్గింటిలోను ప్రధానాలైనవి, కథ మరియు చలనం. దీన్నే కథాగమన వేగమనవచ్చు. కొందరి దృష్టిలో కథాభాగం కంటే సన్నివేశమే ప్రాధాన్యం వహిస్తుంది. కథకు అవసరమైన సన్నివేశాలున్నట్లయితే ఎవరైనా ఆఖ్యానం చేయవచ్చునని వీరి తలంపు.

కథాఖ్యానం వల్ల గేయకథ ఒక భాషనుంచి మరో భాషకు, ఒక సంస్కృతి నుంచి మరో సంస్కృతికి వ్యాపించడానికి వీలుంది. భాష, స్థానిక వివరణ, సంగీతం మార్పు చెందినా ఆఖ్యానాంశం మాత్రం మారదు. 'Research has shown that the story told in song easily crosses language barriers, just as prose narratives will pass from one language to another and ultimately from one culture to another ....Thus we see that the narrative element may persist in a recognizable form eventhrough the language, the local detail and the music undergo repeated changes'.[12]

**అభివర్థిత పునరుక్తి:** ఒక ప్రశ్నకు బదులుగా అనేకాలైన ప్రశ్నలడగటం, ఒకే ప్రశ్నను అనేకమారులడగటం అనేవి గేయకథల్లో సాధారణంగా కన్పించే అంశాలు.

**గేయకథా వారానువర్తనాలు (Ballad common places):** కొన్ని పడికట్టు వర్ణనలు గేయకథల్లో అనేకమార్లు ప్రయోగింపబడుతుంటాయి. వీటిని ఆంగ్లంలో 'ballad common places' అనీ, 'Conventional ballad diction' అనీ పిలుస్తారు. శిష్టకావ్యాల్లో కన్పించే కవి సమయాల్లాగే, గేయకథల్లో ఇలాంటి సామాన్య గుణాలనేకం. ఒకే విధమైన రచనా ప్రణాళిక, పదబంధాలు మొదలైనవి గేయకథల్లో సమానాంశాలుగా కన్పిస్తాయి.

**నాటకీయం:** గేయకథలు నటనా చతుర్యాన్ని, సంభాషణాశైలిని కలిగి నాటకీయతను ప్రదర్శించేవిగా వుంటాయి. జానపదుల అనుభవాల్ని, ఊహాల్ని, నమ్మకాల్ని ప్రతిబింబిస్తూ అమానుష శక్తులు సైతం మానవ శక్తులుగా వ్యవహరిస్తాయనే నమ్మకాన్ని ప్రదర్శిస్తాయి.

---

*12. Introducing Folklore, P-62.*

ఏకైక సంఘటనా జన్యత్వం (Single incident): కథానికలోలాగే గేయకథలోను గేయకథకుడు ఏదో ఒక చిన్న సన్నివేశాన్ని ఆధారంగా చేసికొని కథనల్లుతాడు. ఈ విషయంలో ఇది జానపద కథ (Folk tale) కూ, జానపదేతిహాసా (Folk epic) నికీ చేరువుగా ఉంటుంది.

పైన పేర్కొ-బడ్డ లక్షణాల్లో పదకొండు జానపదగేయలక్షణాలతో పాటు కథాఖ్యానం, అభివర్ధిత పునరుక్తి, గేయకథావారానువర్తనాలు, సాంప్రదాయక స్త్రీల కథల పాటలకు; కథాఖ్యానం, గేయకథావారానువర్తనాలు ఏకైక సంఘటనా జన్యత్వం తక్కి-న గ్రామికస్త్రీల కథల పాటలకు వర్తిస్తాయి.

## జానపద గేయకథల వర్గీకరణం:

శ్రీ నేదునూరి గంగాధరంగారు 'దేశీయ సారసత్వంలో వీరపదాలు, సాహసగేయాలు అను రెండు శీర్షికలూ మూడు భాగములుగా విభజింపవచ్చును. (1) చిట్టిగేయాలు, (2) దీర్ఘగేయాలు (3) కథాగేయాలు'[13] అని వర్గీకరించారు. ఈ విభజన కేవలం వీరగాథలకు మాత్రమే వర్తిస్తుంది.

డా. తంగిరాల వెంకట సుబ్బారావు గేయకథలను (వీరగాథలను) సాంప్రదాయిక గేయకథలు (Traditional ballads) లేక జనప్రియ గేయకథలు (Popular ballads) అనీ, సాహిత్యగేయ కథలు (Literary ballads) అనీ రెండు విధాలుగా విభజించారు. సాహిత్య గేయకథలు జనప్రియ గేయకథలకు అనుకరణాలుగా వచ్చినట్టివనీ, తెలుగులో ద్విపద కావ్యలిలాంటివే అని వీరి అభిప్రాయం. సాహిత్య గేయకథలనే గేయకథాను కరణాలనవచ్చు. వీరు సాంప్రదాయిక గేయ కథలను మూడు ప్రధాన విభాగాలుగా విభజించారు. 1. వీరగాథాచక్రములు (ballad cycles), 2. వీరగాథలు (ballads), 3. వీరగాథానికలు లేక లఘువీర గాథలు (ballad lings) మొదటి విభాగాన్ని ఇతివృత్తాన్ని (వస్తువు) బట్టి, రెండో విభాగాన్ని ఛందస్సును బట్టి విభజించారు. వీరి వర్గీకరణం కాలప్రమాణాన్ని బట్టి విభజింపబడ్డది ఈ వర్గీకరణమంతా పూర్తిగా వీరరస ప్రధానాలైన వీరగాథలకు మాత్రమే అన్వయిస్తుంది.

---

*13.* జానపదగేయ వాఙ్మయ వ్యాసావళి, పుట - *169.*

మొత్తంమీద జానపద గేయకథల్ని వస్తువును బట్టి వీరగాథలు (heroic ballads), 2. స్త్రీల కథల పాటలు, 3. పదాలు (హరిహరీ పదాలు శారద పదాలు(Mythological ballads), 4. జంగం కథలు (Religious ballads) అని విభజించవచ్చు.

స్త్రీల కథలు పాటలను సాంప్రదాయక స్త్రీలు పాడేవి, శ్రామిక స్త్రీలు పాడేవి అని రెండు విభాగాలు చేయవచ్చు.

బుర్రకథలు వీరగాథానుకరణలే (ballad imitations or political ballads) కాని వీరగాథలు కావు. ఇది 1942లో బయలుదేరింది. రాజకీయ పక్షాల ప్రచారానికై ఏర్పడినటువంటివి.

వీరగాథలకు, స్త్రీల కథల పాటలకు గల వ్యత్యాసాలను కొన్నింటిని ఇలా పేర్కొనవచ్చు.


జానపద గేయ కథలు (Narrative Folk Songs)
వీరగాథలు
స్త్రీల కథల, పాటలు
పదాలు
జంగం కథలు
వీరగాథాచక్రాలు
(Ballad Cycles)
పల్నాటి వీరచరిత్ర
కాటమరాజు కథలు
వీరగాథలు
(Ballads)
బొబ్బిలి
కథాదులు
వీరగాథానికలు లేక
లఘువీరగాథలు
సాంప్రదాయిక స్త్రీలు పాడేవి
(ఇంటిలో పాడేవి)
శ్రామిక స్త్రీలు పాడేవి
(బయట పాడేవి)
రామాయణ
సంబంధాలు
భారత
సంబంధాలు
భాగవత
సంబంధాలు
ఇతరాలు
వ్రతకథలు
పాటలు
పౌరాణికపు
పాటలు
ఇతరాలు

| వీరగాథలు | స్త్రీల కథల పాటలు |
|---|---|
| 1. పురుషులు మాత్రమే పాడతారు. | స్త్రీలు మాత్రమే పాడతారు |
| 2. వాద్యాలకు అధిక ప్రాధాన్యం ఉంటుంది. | వాద్యాల ప్రమేయం ఉండదు. |
| 3. వీరత్వానికి ప్రాధాన్యత హెచ్చు. చారిత్రక గేయ కథలూ కలవు. | సాంసారిక విషయాల్లోని ప్రణయ మాధుర్యం. పౌరాణిక కథలు దీంట్లో ప్రాధాన్యం వహిస్తాయి. |
| 4. వీరరస ప్రధానమైన ఘట్టాల్లో వర్ణనలకు ప్రాధాన్యమధికం. | అక్కడక్కడా వర్ణనలున్నా కథకే ప్రాధాన్యం హెచ్చు. |
| 5. వీరగాథాకర్తలు అక్షర జ్ఞానం ఉండేవారు. చారిత్రక, పౌరాణిక విషయాల పరిచయం ఉన్నవారు. | సాధారణ (సాంప్రదాయిక) స్త్రీల గేయ కథాకర్తలు తప్ప శ్రామిక స్త్రీల గేయ కథాకర్తలు శుద్ధ జానపదులు. |
| 6. వీరగాథాకర్తల పేర్లు పేర్కొబడి వుంటాయి | సాంప్రదాయక స్త్రీల కథల పాటల్లో తప్ప శ్రామిక స్త్రీల కథల పాటల్లో కర్తృనామం పేర్కొనబడదు. |
| 7. వీరగాథా చక్రాలుంటాయి. | స్త్రీల గేయకథా చక్రాలు లేవు. అట్టి అవసరం ఉండదు. |
| 8. వీర సంఘటన ఏదో జరిగినప్పుడు వీరగాథలు ఉద్భవిస్తాయి. | కథా కథనాన్ని బట్టి ఏర్పడేది. |
| 9. వీరగాథ ప్రక్రియనుంచి ఏర్పడేది. | భక్తి కరుణరసాల ప్రాధాన్యం హెచ్చు. |
| 10. వీర కరుణ రసాల ప్రాధాన్యం హెచ్చు. | తక్కిన ఇతర రసాలూ ఉండకపోవు |

# 7. గద్యకథనాలు
# (Folk Narratives)

Narration is ageless. The impulse to tell a story and the need to listen to it have made narrative the natural companion of man throughout the history of civilization[1] - ఇది Linga Degh అభిప్రాయం.

గద్య కథనాలు వచన రూపంలో వుండే ప్రక్రియ. జానపద సాహిత్యంలో ప్రధానమైంది. జానపద గేయల్లాగే ఇదీ శ్రమాపనోదనానికై ఆవిర్భవించిందనే చెప్పవచ్చు. పొలాల్లో పనిపాటలు చేసుకొనే జానపదులు కథల్ని కట్టి ఒకరికొకరు చెప్పుకొని ఉంటారు. గద్య కథనాల్నే జానపద కథలని కూడ పిలవటం కద్దు. గద్యకథనాల్లో జానపద కథలు ఒక భాగమని మరి కొందరి అభిప్రాయం.

గద్య కథనాలు సాహిత్యాభివ్యక్తి విధానాలే కాక జానపదుల జీవన విధానాల్ని ప్రతిబింబింప చేసే సాధనాలు కూడ. జానపదగేయాలకు వలే గద్య కథనాల్లో కూడ మౌఖిక ప్రచారం, వివిధ రూపాలు, సార్వజనీనత, గద్యరూపకథనం అనేవి లక్షణాలుగా కనబడుతున్నాయి.

గద్య కథనాల స్వరూపంలో నాలుగు అంశాలు కనబడుతున్నాయి. ఇవి. 1. Types and motifs, 2. The frame work of the tale comprises the introduction and the conclusion as well as the formulaic inrerjection used by the narrator, 3. Patterned figures of speech, 4. Formulaic verbal sequences 5. Repetition of certain passages. Sequences...'[2]

## గద్యకథనాల పుట్టుక:

జానపద విజ్ఞానంలోని అనేకాంశాల్ని (గద్య కథనాలు - జానపద కథలు), వాటి పుట్టుకల్ని తెలుసుకోటానికి ప్రముఖ జానపద విజ్ఞాన వేత్తలు ప్రతిపాదించిన కొన్ని సిద్ధాంతాల్ని పరిశీలింప వలసి ఉంది. Stith Thomson తన The folktale

1. *Folklore and Folklife, P.54.*
2. *Ibid P-60.*

అనే గ్రంథంలో పేర్కొన్నట్లుగా ఒక శతాబ్దానికి ముందే జానపద కథా ప్రక్రియ అనేక ఔత్సాహికుల ఆకర్షణకు పాత్రమైంది.

జానపద కథామూలాన్ని అన్వేషించటానికి ప్రథమంగా ప్రయత్నించిన వారు గ్రిమ్ సోదరులు. 1819లో వారి Kinder-and Hausmarchen అనే గ్రంథం ప్రకటింపబడినప్పుడు కథల ఆంతరిక సమస్యను గురించి చర్చ జరిగింది. పిమ్మట ప్రపంచమంతటా అనేక జానపద కథా సంకలనాలు వెలువడ్డాయి. ప్రకటింపబడ్డ కథల్లో సామ్యం కన్పించింది. ఇలా ప్రపంచంలోని కథల్లో కన్పించే ఈ సామ్యానికేదో ప్రబల కారణముండవచ్చుననే సంశయం కలిగి వెతకటానికారంభించారు. గ్రిమ్ సోదరులు కేవలం జానపద విద్వాంసులే కారు ప్రముఖ భాషా శాస్త్రవేత్తలు కూడ. ఇండో యూరోపియన్ భాషా కుటుంబాలపై కృషి చేసివుండటం చేత జానపద కథ ఏదైనా ఒక స్థలంలో, ఒక కాలంలో మౌఖిక రూపంలో వుండి విశ్వవ్యాప్తి నందిందని నిర్ధరించారు. వీరు అధ్యయనం చేసిన జానపద కథలు ఇండో యూరోపియన్ భాషా కుటుంబంలో అధిక ప్రచారంలో ఉండటం వల్ల జానపద కథకు ఏదైనా ఒక మూలముంటే అదొక నిర్దిష్ట భాషే అయ్యుంటుందని, భాషయొక్క మూలమే కథా మూలానికే అన్వయిస్తుంది కాబట్టి ప్రపంచంలోని అన్ని జానపద కథలు ఇండో యూరోపియన్ భాషల్ని మాటలాడే ప్రజల నుండే వచ్చియుండవచ్చుననే అంతిమ నిర్ణయానికి వచ్చారు. ఇలా గ్రిమ్ సోదరులు అప్పటికే ఇండో యూరోపియన్ భాషలపై జరిగిన తులనాత్మక భాషాధ్యయనాన్ని తమ సిద్ధాంత ప్రతిపాదనకు ఉపయోగించుకొన్నారు. వీరి సిద్ధాంతం ఇలా వుంది.

1. సమాన ధర్మాలుకల జానపద కథా చక్రాలు ఇండో యురోపియన్ భాషా కుటుంబానికి చెందినవి. ఇవి ఇండో యూరోపియన్ భాషల ప్రాచీన రూపాల నుంచి విస్తరింపబడ్డాయి. ఇదే ఇండో యురోపియన్ సిద్ధాంతం (Indo - Euroean theory).

2. పురాణాలు విడగొట్టబడి ముక్కలై కథలకు మూలమయ్యాయని వీరి సిద్ధాంతం. దీన్నే Broken down Myth theory అంటారు.

గ్రిమ్ సోదరులు ఇలా భాష, ప్రజలు, ప్రాంతం సామ్యాల్ని దృష్టిలో పెట్టుకొని తమ సిద్ధాంతాన్ని ప్రతిపాదించి అనేక జానపద విద్వాంసుల్ని ఆకర్షించారు. వీరి సమకాలికులు ఈ సిద్ధాంతాన్ని సమర్థించారు. గ్రిమ్ సోదరులతో

ఇలా ప్రారంభమైన ఇండో యూరోపియన్ పురాణ మూల సిద్ధాంతం పంతొమ్మిదో శతాబ్దానికి ఇంగ్లండు దేశపు విద్వాంసుల్ని ఆకర్షించింది. వీరిలో మ్యాక్స్ ముల్లర్ పేర్కొనదగ్గవాడు. Mythology is pathology of language అని Maxmuller అభిప్రాయపడ్డాడు. ఈయన 1856లో Comparative mythology అనే వ్యాసాన్ని ప్రకటించాడు. ఈ వ్యాసం జాన్‌ఫిస్కె మరియు రాక్స్‌లను అమితంగా ఆకర్షించింది.

ఇండో యురోపియన్ సిద్ధాంతాన్ని తిరస్కరించిన వారిలో Andrew Lang ముఖ్యుడు. Maxmuller ఋగ్వేదాన్ని అధ్యయనం చేయటానికి ప్రారంభించాడు. Theodor Benfey పంచ తంత్ర కథల్ని విశ్లేషించాడు. 1838లో ఎల్.డిస్. లాంగ్ -చాంప్స్ ఐరోపా జానపద కథల మూలాన్ని భారతదేశంలో చూడవచ్చని పేర్కొన్నారు. ఈ విషయాన్నే ఒక సిద్ధాంత రూపంలో ప్రతిపాదించినవారు Theodor Bonfey. ఈయన 1858లో ప్రకటించిన భారతీయ పంచతంత్రానికి పీఠిక వ్రాస్తూ భారతదేశ కథల వ్యాప్తి మూడుదశ (Stage)ల్లో జరిగిందని పేర్కొన్నాడు.

1. పదో శతాబ్దానికి ముందు అల్ప ప్రమాణంలో కంఠస్థరూపంలో పయనించాయి.

2. పదో శతాబ్దాంతంలో గ్రాంధిక రూపాన్ని ధరించి ఇస్లాం మత ప్రభావంచే Byzantine చేరి ఇటలీ మరియు స్పెయిన్ దేశాలకు వ్యాపించి వుండొచ్చు.

3. బౌద్ధమత ప్రచారకులు మరియు వారి అనుయాయులు చైనా మరియు టిబెట్టు దేశాలగుండా పోయేటప్పుడు తమ మత ప్రచారంతో పాటు జానపద కథలను వెదచల్లారు. ఈ జానపద కథలు పిమ్మట మంగోలియా, యూరోపు మున్నగు దేశాలకు వ్యాపించి వుండొచ్చని Benfey అభిప్రాయ పడ్డాడు.

Benfey గారి Indic origin theory మీద వాద వివాదాలున్నాయి. ఈ వాదాన్ని Andrew Lang ఖండించాడు. ఈజిప్టు కథలు భారతదేశ కథలకంటె ప్రాచీనమైనవని, ఈతని అభిప్రాయం. ఏమైనా జానపద కథలకు కాణాచి వంటిది భారతదేశమనటంలో అతిశయోక్తి లేదు. 'The Indianist theory of Benfey is not utterly dead to day, but with the passing of cosquin in 1921 it

lost its appologist. Most modern folktale scholars of many stories, but that it was only one of several great centres of invention and dissemination'[3] అనే Stifth Thompson గారి అభిప్రాయం గమనింపదగింది.

జానపద కథల మూలాన్ని, తక్కిన జానపద విజ్ఞానాంశాల్ని అధ్యయనం చేయడంలో గమనింపదగ్గ ఇటీవలి సిద్ధాంతాల్లో ఫిన్‌ల్యాండ్ చారిత్రక - భౌగోళిక విధానం (Historical Geographical Method) ఒకటి. ఇది జానపద కథల చరిత్రని పునర్నిర్మించటంలో తులనాత్మక జానపద అధ్యయన కారునికి అమితంగా తోడ్పడ్డది. కథయొక్క మూల స్వరూపాన్ని, ప్రదేశాన్ని గుర్తించడమే దీని ఉద్దేశం.

ఈ చారిత్రక భౌగోళిక విధానం ప్రకారం వందలకొద్దీ పాఠాలతో వ్యాపించి వుండే కథలు ఏదైనా ఒక కాలంలో ఒక ప్రదేశంలో జనించి పిమ్మట ఇతర దేశాలకు వ్యాపించి వుండవచ్చు. ఈ విధానం బహుమూల సిద్ధాంతాన్ని (Polygenesis) అంగీకరింపదు. ఒక కథ ఒక ప్రదేశంలో పుట్టి పిమ్మట తన చుట్టు మెల్లమెల్లగా వ్యాపిస్తుంది. ఈ చారిత్రక భౌగోళిక విధానాన్ని ప్రతిపాదించిన వారిలో Julius krohn, Kaarle - Krohn, Antti Arne లు ముఖ్యులు. ఈ విధానము జానపద కథల పుట్టుకని, వికాసాన్ని అధ్యయనం చేయటంలో మిక్కిలి తోడ్పడింది. పైన పేర్కొనబడ్డ మూడు సిద్ధాంతాలూ Diffusion school కు సంబంధించినవి.

జానపద కథల మూలాన్ని కనుగొనటానికి - ఉపయోగించే సిద్ధాంతాల్లో స్వప్న మూల సిద్ధాంతం. (Ludwig Laistner మొదలైనవారు ఈ సిద్ధాంత ప్రతిపాదకులు - వీరి ప్రకారం కథల్లో కన్పించే అనేక సంఘటనలకు స్వప్నాలే కారణమట) కర్మకాండల విధానం (Ritualistic Theory). దీని ప్రకారం ధార్మిక సంబంధమైన ప్రాచీన కర్మకాండలు జానపద కథలకు మూలమట. మనో విశ్లేషణ సిద్ధాంతం (Psychoanalytical school సిగ్మండ్ ఫ్రాయ్డ్ దీని ప్రముఖ ప్రతిపాదకుడు. ఈ సిద్ధాంతం ప్రకారం జానపద కథల్లో కన్పించే సా[illegible]్యానికి 'psychic unit of man kind కారణమట) మొదలయిన సిద్ధాంతాలు పేర్కొనదగ్గవి. ఏమైనా దీంట్లో ఏ సిద్ధాంతమూ సంపూర్ణం కాదు. In fact most of folklorists despair of answering the intriguing question of origins and they have moved in to other important problems namely form, function, and transimission, where hypothesjs may be tested and

*3. The Folk Tale, P-379.*

where there are more chance of certainlty అనే Alan Dundes అభిప్రాయం గమనింప దగింది.

## వర్గీకరణం:

Max muller మొదలగువారి అభిప్రాయంలో భారతదేశం కథలకు పుట్టినిల్లు. విష్ణుశర్మ 'పంచతంత్ర కథలు' అతి ప్రాచీనమైనట్టివి. ఇందులో వుండే నీతి కథలు, జంతు కథలను బట్టి ఇవి ప్రాథమికంగా జానపద కథలయి ఉండొచ్చుని భావింప వచ్చును.

యూరోపు దేశపు విద్వాంసులు కథల్లో రెండు ప్రక్రియలను గమనించారు. అవి Marchen మరియు Saga. ఈ రెండూ జర్మను భాషాపదాలు. ఆంగ్లంలోని Fairy tale కు Marchen ను సమాన పదంగా గ్రహించటంకద్దు. దీంట్లో కల్పిత విషయం ప్రధానం. వినోదం దీని ఉద్దేశం కాని Saga లో నిర్దిష్ట ప్రదేశాలు మరియు వ్యక్తుల ప్రాధాన్యం అధికం. సత్య ప్రతిపాదనను కలిగి వుంటుంది.

Encyclopaedia of Britanica లో జానపద కథలు పురాణం (Myth) ఐతిహ్యం (Legend) జనప్రియ కథలు (Popular tales) అని మూడు విధాలుగా వింగడింపబడింది.

గద్య కథనాల్ని కట్టుకథ (Marchen) అద్భుత కథ (Fairy tale), ఐతిహ్యం (Legend), సృష్టి స్థితులకు సంబంధించిన కథలు (Etological tales), నీతికథ (Fable), పురాణం (Myth) అనే విభాగాలుగా వింగడించటం కద్దు[4]

Linda Degh ప్రధానంగా కథలను Complex tales (సంకీర్ణ కథలు), Simple tales (సరళ కథలు) అని రెండు విభాగాలు గావించారు[5]. సంకీర్ణ కథలు The Marchen or Magic tale అనీ, Religious tales (ధార్మిక కథలు) అనీ, Romantic tale or Novella అనీ మూడు విధాలూ. సరళకథల్లో ప్రధానమైనవి

---

4. *Introducing Folklore, P.p. 21-26 Kenneth W.Clarke, Mary Clarke*
5. *Folklore and Folklife, P. 62 & 68.*

Animal tales (జంతు కథలు), Jokes and Anecdotes (వినోదపు కథలు), Formula tales (లాక్షణిక కథలు).

Sith Thompson జానపద కథలను

1. ఐతిహ్యాలు మరియు సంప్రదాయాలు (Legends and Traditions).
2. అద్భుత కథలు (Fairy tales)
3. ప్రాణి కథలు (Animal tales)
4. నీతి కథలు (Fables)
5. పౌరాణిక కథలు (Myths) అని ఐదు విభాగాలుగా విభజించాడు.[6]

Boggs వర్గీకరణలో గద్యకథనాలు (Prose Narratives) B విభాగానికి చెందాయి. B 200 - Myth, B 400 - Legend, B 600 - tale మొదలైనవి.[7] శ్రీ బేకుమళ్ళ కామేశ్వరరావుగారు తమ 'సాంప్రదాయిక విజ్ఞానం' (మొదటి భాగము) లో 'కథన, ఉక్తులు' అనే పేరుతో కథల్ని ఆరువిధాలుగా విభజించారు.[8] అవి. **1. జరిగేయని చెప్పే కథలు:** వీటికి ఉదాహరణగా తెలుగు కవుల కథలు, స్థానిక చరిత్రల్లోని కథలు కొన్ని, తెనాలి రామలింగడు, తాతాచార్యులు, మర్యాదరామన్న, రేచుక్క-పగటిచుక్క మొదలగువాటిని చేర్చి వున్నారు. **2. శిశు కథలు:** తల్లి పిల్లలకు దేవతలు, రాక్షసులు, భూతాల్ని గురించి చెప్పే కథలు; ఈగ, నక్క మొదలగు కథలు. **3. కల్పనా కథలు:** ప్రకృత్యతీతాంశాలతో కలసి జరగనివి జరిగినట్లుగా కనబడే కథలు, పిట్టకథలు. **4. వినోదాలు, నీతికథలు, పెరిగే కథలు:** పెరిగే కథల్లో కథలకు పరిమితి వుండదు. మొదట వాటి పరిమాణానికి ఇప్పటి స్థితికి చాలా భేదం ఉంది. మొదట ఆకథ చాలా చిన్నగ వుండి క్రమేపీ లోకుల కల్పనలతో పెద్ద కథగా అవుతుంటుందని పెరిగే కథల్ని వివరించారు. వీటికి ఉదాహరణాలు కాశీమజిలీలు, గొల్ల సుద్దులు ఇలాటివి. **5. స్థల మాహాత్మ్యాలు; గోవు పాదాలు, కోటి లింగాలు, గోస్తనది** మొదలగు వాటిని గురించిన పురాణాలు. **6. స్థానిక చరిత్రలు.**

---

6. *Standard Dictionary of Folklore, P. 409.*
7. *Ibid, P.1139.*
8. పుటలు *11-12.*

డా. ఆర్వీయస్ సుందరంగారు వివిధ విద్వాంసుల అభిప్రాయాల్ని, వర్గీకరణల్ని పరిశీలించి కథల్లో సమస్యాత్మక కథల్ని Riddle stories చేర్చి మొత్తం ఆరువిధాలుగా విభజించి వున్నారు[9]. అవి 1.పురాణ కథలు (Mythological tales) 2. ఐతిహాసిక కథలు (Legendary tales) 3. వినోద కథలు (Merry tales) 4. అద్భుత కథలు (Fairy tales) 5. ప్రాణి కథలు(Animal tales) 6. సమస్యాత్మక కథలు (Riddle storie) ఈ విభజనలో నీతికథలు చేర్చబడలేదు. దీనికి కారణం ప్రాణికథలే తరువాతి కాలంలో నీతి కథలుగా పరిణమించాయనే అభిప్రాయం ఉంది. నీతి కథల్లో పశుపక్ష్యాదులు ప్రధాన పాత్రను వహించుటయే కాక ఈ కథల్లో నీతి ప్రధానంగా ఉంటుంది. డా. సుందరంగారి ఈ విభజన సరి అయింది. ఈ వర్గీకరణని పరిశీలిద్దాం.

పురాకథలే పుక్కిటి పురాణాలు (Myths). శ్రీమతి దుర్గాభాగవత్ పుక్కిటి పురాణాన్నే 'దైవతకథ' అని పేర్కొన్నారు[10]. పురాకథలు జానపద కథలు కావను అభిప్రాయం ఉంది. కాని అధునిక విద్వాంసుల దృష్టిలో ఇవి జానపద విజ్ఞానంలో ప్రముఖ విభాగం. పురాకథలు అవి పుట్టిన సాంస్కృతిక పరిసరాలకు సంబంధించినవే కాక గాథాకారుడు, శ్రోతలు వీనిని సత్యాంశాలుగా విశ్వసిస్తారు. ఈ విషయాన్నే శ్రీమతి దుర్గాభాగవత్ 'Myths originated when man was on the second stage of culture' అని పేర్కొన్నారు.[11] Andrew Lang ప్రకారం ఇవి 'history of man's early development' కు సంబంధించినవి.[12]

Kenneth & Mary clarke Myth ను గురించి 'A myth is a narrative dealing with Gods, demigods, or cultural heroes. The myth is concerned with creation of the world, the establisment of the present order, the origins of a people tribe or cultural trait's[13] అని వివరించారు. అంటే దేవతలు, దేవమానవులు సాంస్కృతిక వీరులకు సంబంధించిన కథనమే పురాణం. ప్రపంచ సృష్టి, ప్రపంచపు నేటి క్రమం, జనుల, జాతుల సాంస్కృతిక గుణాల మూలాన్ని పురాణం తెలుపుతుంది.

---

*9. జానపద సాహిత్య స్వరూపం, పుట - 55.*

*10. An outline of Indian Folklore.*

*11&12. Ibid.*

*13. Introducing Folklore, P-26.*

Standard Dictionary of Folklore లో కూడా ఇదే అభిప్రాయముంది. 'A story presented as having actually occured in a previous age, explaining the cosmological and supernatural tradtion of a people, their goods, heroes, cultural traits, religious beliefs etc.[14] G.L. Gomme పురాణాలు 'The science of a pre-seientific age' [15] అని పేర్కొన్నాడు.

పురాణాలు పవిత్రాలు. ఇవి తరచూ భగవంతుని స్వరూపాన్ని, భగవంతుని మీద మానవుల కుండే నమ్మకాల్ని, ధార్మిక ఆచరణల్ని వివరిస్తాయి. పురాణాల్లోని పాత్రలు సాధారణ మానవులు కారు, కాని వ రికి మానవత్వాన్ని ఆరోపించటం కద్దు. '....The myth must have religious background in that its principal actor or actors are deities ...' [16]

Dictionary of Anropology పురాణాలనిలా నిర్వచించింది. 'A story that recounts purportedly historical events to explain how tradition, major doctrines, religious and similar nuclear concepts arose'[17]

శ్రీమతి దుర్గాభాగవత్ పురాణాం స్వరూపాలనిలా పేర్కొన్నారు.[18]

1. పురాణాలు అనేక దైవాలనుపాసించే సమాజాల్లో జనిస్తాయి (Polysynthetic religious systems).

2. ప్రాచీనమతం నశించి క్రొత్తమతం దాని స్థానమాక్రమించినప్పుడు ప్రాచీన పురాణాలు (Original myths) ఐతిహ్యాలు (Legends)గాను, అద్భుత కథలు (fairy-tales) గానూ మారతాయి.

3. మతంలోని కర్మకాండలకు సంబంధించిన పురాణాల్ని ప్రత్యేక దృష్టితో చూడాలి.

4. పురాకథల్లో అతిముఖ్యమైనవి సృష్టి (tales of origin)కి, ఖగోళ విజ్ఞానా(starlore)నికి సంబంధించినవి.

---

*14,15&16. P-778.*

*17. P-376.*

*18. An outline of Indian Folklore, P.p.32-33.*

ఇంద్ర పురాణ కథలు లేదా సృష్టి కథలు, భూమ్యాకాశాలకు సంబంధించిన కథలు, సూర్య చంద్ర, నక్షత్రాలకు సంబంధించిన అనేక పురాణ కథలను శ్రీమతి దుర్గాభాగవత్‌గారు ఉదాహరించారు. ఏమైనా మానవుని నమ్మకాల్ని దృఢపరచటమే పురాకథం ప్రధానోద్దేశం.

ఐతిహాసిక కథలు లేదా ఐతిహ్యాలు కూడా పురాకథల్లాగే సత్యాంశాలను కలిగినవని గాథాకారుడు - శ్రోత నమ్ముతారు. కాని ఐతిహ్యాల్లో ధార్మిక విషయాలు అల్పంగా వుంటాయి. దీంట్లో ప్రధాన పాత్రలు మనుష్యులు. వీరు పురాకథల్లోని వ్యక్తులంతటి ప్రాచీనులు కారు. శ్రీమతి దుర్గాభాగవత్‌గారు ఈ ఐతిహాసిక కథనే ''దంతకథ'' గా పేర్కొన్నారు.

Introducing Folklore లో Legend ను గురించి 'Narratives about persons, places or events involving real or pretended beliefs are legends'[19] అని చెప్పబడింది. అంటే వ్యక్తుల, స్థలం లేదా సంఘటనలకు సంబంధించిన కథలే ఐతిహ్యాలు. ఇవి సత్యం లేదా అనుకరణాల నమ్మకాల్ని లోగొంటాయి. Standard Dictionary of Folklore కూడా ఇదే అభిప్రాయాన్ని వెల్లడించింది[20].

ఐతిహ్యాలు రెండు విధాలనే అభిప్రాయం ఉంది[21]. అవి 1. స్థానిక ఐతిహ్యాలు (Local Legends). 2. వ్యాపక ఐతిహ్యాలు (Migratory legends). Dictionary of Anthropology లో వీనికి గల నిర్వచనాలు: Local legend: A legend closely tied in with a particular place on locality. A local legend often given an origin for the place name or its meaning'. Migratory legend: 'A short prose narrative existing in a number of variants, especially in the places where the events are situated'.

1963లో International Committee నాలుగు విధాలైన ఐతిహ్యాలను లభించిన ఐతిహ్య సేకరణల నుండి వింగడించింది.[22]

---

19. P-24.
20. P-612.
21. Dictionary of Anthropology, P. 317 & An outline of Indian Folklore, P-38.
22. Folklore and Folklife, P-76.

అవి. 1. Etiological and Eschatological Legends: ఇవి ప్రపంచ సృష్టి, వస్తువుల పుట్టుక; ప్రకృతి సాధారణ భౌగోళిక పరిస్థితులు, వృక్షాలు, జంతువులపై మానవుని ప్రకృతి పరిశీలన మొదలగు వాటికి సంబంధించినవి.

2. Historical Legends and legends of the history of civilization: స్థానిక, చారిత్రక విషయాలు కథల్లో పొందుపరపబడి వుంటాయి.

3. Super natural Beings and Forces or Mythological legends: అతిమానుష శక్తులు, అసాధారణ ప్రజ్ఞ మరియు శక్తి వుండే మనుషులు ఇత్యాదులకు సంబంధించినవి.

4. Religious legends or Myths of Gods and Heroes: ధార్మిక ఐతిహ్యాలకు సంబంధించినవి.

సాధారణంగా వలసలను గూర్చి, యుద్ధాలు - జయాపజయాల్ని గురించీ, ప్రాచీన వీరులు, రాజులు, మహాపురుషుల్ని గురించీ ఐతిహ్యాలున్నాయి. అలాగే స్థలాల్ని గురించీ, గుప్తనిధుల (Buried treasures) ను గురించీ, భూతసంచారం గల గృహాలు మరియు వృక్షాలకు సంబంధించిన ఐతిహ్యాలూ ఉన్నాయి.

పురాకథకూ, ఐతిహాసిక కథకూ భేదాన్ని స్పష్టపరచటం అంత సులభం కాదు.

వినోద కథలు (Merry tales) సంక్షిప్తంగా వుంటాయి. అతిమానుష అంశాలకు వీటిలో అవకాశం తక్కువ. కొన్ని కథల్లో పశుపక్ష్యాదులు కూడా పాత్ర వహించినా, మనుష్య పాత్రలే అధికం. ఇలాంటి కథలు సాధారణంగా వంచన, చమత్కారం, వ్యభిచారం, మూర్ఖత్వం, దొంగతనం మొదలైన అంశాలతో వుంటాయి. ఇవి సామాన్యంగా హాస్య ప్రధానంగా వుంటాయి.

అద్భుత కథల్ని (Fairy tales) జర్మను Marchen తో పోలుస్తారు. ఒక సంస్కృతి లేదా ఒక దేశ చరిత్రకు అనేక అంశాల్లో అద్భుత కథా విషయాలు కూడుకొని వుంటాయి. అద్భుత కథలు ఏ దేశ కాలాలకు సంబంధించినవి కావు. అతిమానుష శక్తులు వీటిలో ప్రాధాన్యం వహిస్తాయి. అలౌకిక శక్తులైన యక్షులు, కిన్నరులు, రాక్షసులు, సర్పాలు, అప్సరసలు, భూతప్రేతాలు మొదలైనవి అదృశ్య శక్తులను కలిగి రూపం మార్చుకోగల శక్తిని, గాలితో సంచరించే శక్తిని కలిగి

వుంటాయి. ఒక ప్రదేశం నుంచి మరొక ప్రదేశానికి వ్యాపించేశక్తి అద్భుత కథల్లోనే వుంది. జనరంజకత, సాహస ప్రవృత్తి, ఈ అద్భుత కథల గుణాలు.

ప్రాణి కథ (Animal tales)ల్లో జంతువులే ప్రధాన పాత్ర వహిస్తాయి. ఇవి అతి ప్రాచీన కాలం నుంచీ వ్యాప్తిలో వున్నాయి. ప్రపంచంలోని అన్ని దేశాల్లోను ఇలాంటి కథలు ప్రచారంలో వున్నాయి. సంక్షిప్తత, నాటకీయత వీటిలోని ప్రధాన గుణాలు. ప్రాణి కథలు 'The etiological tale (కార్యకారణ కథ), The fable( నీతికథ) and the beast epic (ప్రాణి మహాకావ్యం) అని మూడు విధాలుగా వింగడింపబడింది[23].

ప్రాణికథల క్రమ వికాసమే నీతికథలని పాశ్చాత్య విద్వాంసుల అభిప్రాయం. నీతికథ (Fable)ను Dictionary of Anthropology ఇలా నిర్వచించింది. A Short story in which the protagonists are talking animals, with both human and animal traits. These stories point a moral, which is often explicitly stated at the end[24]. అలాగే Standard Ditcionary of Folklore లో 'An animal tale with a moral, a short tale in which animals appear as characters, talking and acting like human beings, though usally keeping their animal traits, and having as 'its purpose the pointing of a moral'[25] అని చెప్పబడింది. ఈ అభిప్రాయమే Introducing Folklore లో 'The fable is a short tale, usually involving animal characters, which expresses, either implicitly or explicitly a moral in principle'[26] అని చెప్పబడింది.

పై నిర్వచనాల్ని గమనిస్తే ప్రాణికథలే నీతికథలన్న అభిప్రాయం ఉంది. ప్రాణికథల్లాగే ఇవీ సంక్షిప్తంగాను, నాటకీయంగాను వుంటాయి. నీతికథ రెండు భాగాల్ని కలిగి వుంటుంది[27]. నీతి ప్రతిపాదనకు ఉదాహరణంగా వచ్చే కథన బాగం మరియు కథాంతంలో సంగ్రహరూపంగా వచ్చేడి నీతివాక్యం; అది ఒక సామెత రూపంలో వుండవచ్చును.

---

*23. Standard Dictionary of Folklore, P-61.*

*24. P-200.*

*25. P-361.*

*26. P-25.*

*27. Standard Dictionary of Folklore, P-361.*

నీతికథల్లో, అతిప్రాచీనమైనవి ఈసపునీతి కథలనే అభిప్రాయం వుంది. భారతదేశంలోని పంచ తంత్రకథలు కూడా అతి ప్రాచీనమైనవే. ఈ పంచ తంత్రకథలే ఈసపు కథలకు మూలం అనే అభిప్రాయం కూడా వుంది. మహాభారతం, జాతక కథల్లో అనేక నీతి కథలున్నాయి. శ్రీమతి దుర్గా భాగవత్ గారు నీతికథలనే 'కల్పిత కథ' అని పేర్కొన్నారు.

కథారూపంలో వుండే పొడుపు కథలను సమస్యాత్మక కథలు (Riddle stories) అంటారు. సమస్యాత్మక కథలు మొదట సాహిత్య కథలుగా వుండి పిమ్మట జానపద కథలై అయ్యుండవచ్చని థామ్సన్ అభిప్రాయం. కథా సరిత్సాగరం, భేతాళ పంచవింశతి మొదలగు గ్రంథాల్లో ఇలాంటి సమస్యాత్మక కథలు కన్పడుతున్నాయి.

'కూట-కథానక' మరియు 'కథా ప్రహేళిక' అనేవి ప్రాచీన భారతంలో సమస్యాత్మక కథలుగా వుండేవన్న అభిప్రాయం వుంది.[28]

కథల్లో కన్పించే కథన ఘటకాలు (Motifs)[29] మరియు మాదిరులు (Types)[30] సహాయంతో జానపద కథల్ని వర్గీకరించటం కద్దు.

## వైశిష్ట్యం:

ప్రపంచంలోని జానపద కథల్లో కన్పించే ప్రధానాంశం సార్వత్రికత (Universality). విభిన్న ప్రదేశాలు, భిన్న సంస్కృతులు, విభిన్న భాషలు వుండే పరిసరాల్లో పుట్టిన కథల్లో సాదృశ్యాలు స్పష్టంగా కన్పడతాయి. దీనికి కారణం ప్రపంచంలోని మానవులందరూ ఒక్కటే. వారి అలవాట్లు, ఆచారాలు, భావాలు ఒక్కటే.

జానపద కథల అధ్యయనంలో సేకరణ, పరిష్కరణ, విశ్లేషణ అనే మూడు దశలున్నాయి. ఈ మూడూ ఒక దానిపై ఒకటి ఆధారపడి వున్నాయి. సేకరణ

---

*28. Smt. Durga Bhagavath, An out line of Indian Folklore, P-44*

*29. Motif Index of Folkliterature, 6 volumes, Stith Thompson.*

*30. The Types of the Folktale. A Classification and Bibliography, Antti Aarne and Stith Thompson.*

క్షేత్రకార్యానికి సంబంధించింది కాగా, పరిష్కరణ, విశ్లేషణ శాస్త్రీయాధ్యయనానికి సంబంధించినవి.

జానపద కథలను అధ్యయనం చేయటంలో కొన్ని విషయాల్ని గమనించాలి 1. Origin of folk tales, 2. Meaning of folktales, 3. Dissemination of folktales, 4. variation in folktales, 5. Relation of different forms of the folk tales[31] అనే అంశాల్ని పరిశీలించాలి.

'The folk tales of a country, more than anything else, reflect the genius of the people, their beliefs, customs, manners, attitudes and their way of life'[32] అను మాటల్లో సత్యాంశం లేకపోలేదు. తన దేశాన్ని, తన ఇరుగు పొరుగు దేశాల్ని తెలుసుకోటానికి జానపద కథలు కొంతకు కొంతైనా సహకరిస్తాయనటంలో సందేహం లేదు.

* * *

---

*31. Standard Dictionary of Folklore, P.p-367-368.*

*32. Sterling Book fare, A monthly Journal from the house of sterling.*

# 8. జానపద కథలు
## (Folk Tales)

ప్రపంచంలో ఏ మారుమూల ప్రాంతానికి వెళ్ళినా జానపద కథలను చెప్పేవాళ్ళూ, వినేవాళ్ళూ అధిక సంఖ్యల్లో కన్పిస్తారు. అందులోనూ భారతదేశంలో కథలంటే చెవికోసుకొనేవాళ్ళే అధికం. భారతదేశం జానపద కథలకు పుట్టినిల్లు. కుతూహలాన్ని రేకెత్తిస్తూ కథను చెప్పడం ఒక కళ. ఈ కళలో ఆరితేరిన జానపద కథకులు ప్రతి గ్రామంలోనూ దర్శనమిస్తారు. కథాకథనం ద్వారా తమకు తాము ఉల్లాసాన్ని పొందడమే కాకుండా, కథలు వినేవాళ్ళ హృదయాల్ని రంజింప చేస్తారు జానపద కథకులు. కథ చెప్తుంటే ఊకొట్టడం పరిపాటి. ఈ ఊకొట్టడమే కథకునికి మరింత ఉత్సాహాన్ని కల్గిస్తుంది.

## కథ అంటే! :

నివేదించు, ప్రకటించు, ప్రదర్శించు, భావించు, వర్ణించు, వ్యాఖ్యానించు, ఇత్యాది అర్థాలు ఉన్న 'కథ్' మూలధాతూపపన్నం 'కథ'. 'కథ్యతేయితి కథా'. 'కథ్' - ధాతుజన్యమైనది కథ అనేవి - కథకు సంబంధించిన కొన్ని వివరణలు.

'కథా' శబ్దానికి సంభాషణమనే ప్రయోగం మనుస్మృతిలోనూ, మహాభారతంలోనూ, ఆశ్వలాయనగృహ్యసూత్రాలలోనూ కన్పిస్తాయి. కథ అంటే కల్పిత గాథ అని కావ్యాదర్శ, సాహిత్య దర్పణాదులు నిగమనం అనీ, చర్చ అనే అర్థంలో కథా శబ్దాన్ని సర్వదర్శన సంగ్రహం ప్రయోగించిందనీ, వివరణ పూర్వాఖ్యానమన్న దృష్టిలో కథాలాప శబ్దాన్ని కథా సరిత్సాగరం వాడుక చేసిందనీ డా. తూమాటి దొణప్పగారు తమ 'తెలుగు హరికథా సర్వస్వం' లో వివరించారు. దేవతా పరమైన ఆఖ్యానాన్ని కథ అనీ, తదితరుల ప్రసక్తి గల వాటిని 'గాథ'లనీ అంటారట.

'కథ' అంటే వృత్తాంతం. కొన్ని సత్యాంశాలతో కూడుకొన్న కల్పిత కథనం. గేయ రూపకంగా కాక, కథన రూపకంగా ఉన్న వచనం. జానపదత్వంతో కూడుకొని, కొన్ని సత్యాంశాలతో మేళవించిన కథన రూపకంగా ఉన్న కల్పిత కథ 'జానపద కథ'.

కథ ఈనాటిది కాదు. ఏనాటిదో? మన దృష్టిలో మొదట్నుంచీ 'కథకు, 'జానపద కథ' కు భేదమే లేదు. మనక్కావలసింది కథ. అయితే అన్ని కథల్లోనూ జానపద కథాలక్షణాలు ఉన్నాయని చెప్పలేం. నిజానికి జానపద కథా లక్షణాలే వేరు. వాటిని తర్వాత వివరిస్తాను. ఆంధ్రదేశంలో ఇంత వరకూ అసలైన జానపద కథల సేకరణ కానీ, అధ్యయనం కానీ జరగలేదు. జరగక పోవడం వల్లనే మనకు తెలిసిన కథలన్నీ జానపద కథలనే అపోహకు గురయ్యాం. కొన్ని కథలు సంస్కృతం నుంచి అనువాదం చేయబడ్డాయి. మరికొన్ని ఆనోటా ఈ నోటా విన్న కథలకు తమ సొంత కవిత్వమూ చేర్చి అల్లబడ్డ కల్పిత కథలు. ఇవి అనుకరణ కథలు. పోతే నిజమైన జానపద కథలు జానపదుల్లో దాగి ఉన్నాయి. అనువాద కథలూ, అనుకరణ కథలూ ఒక విధంగా చదువూ, వ్రాతా వచ్చిన వాళ్ళను ఆధారంగా చేసికొని బయల్దేరినట్టివైతే, జానపద కథలు పల్లెల్లో జానపదులు స్థానికంగానూ, చారిత్రకం గానూ తాము విన్న కథల్ని తమ భాషలో తమదే అయిన రీతిలో మలచుకొన్నట్టివి. అనక్షరస్తుల నోళ్ళల్లో అనేక మార్పులూ, చేర్పులూ చేరి ఇంకా నిలద్రొక్కు కొన్నాయి. అందువల్లనే వీటిని అసలైన జానపద కథలనాలి. ఈ దృష్టితో చూచి నప్పుడు మనకు లభిస్తున్న జానపద కథల్ని మూడు రకాలుగా విభజిస్తే సరిపోతుంది.

1. **అనువాద కథలు:** ఉదా: జాతక కథలు (పాలీభాషనుండి అనువాదితం, భట్టి విక్రమార్కుల కథలు (సంస్కృతం నుండి అనువాదితం), కథా సరిత్సాగరం (సంస్కృతం నుండి అనువాదితం)

2. **అనుకరణ కథలు:** ఉదా: కాశీ రామేశ్వర మజిలీ కథలు - వీటిని శ్రీ మద్దూరి శ్రీరామమూర్తిగారు రచించారు.

3. **అసలైన జానపద కథలు:** పాట, వచనం - ఈ రెండింటిలో జానపద కథ వచన ప్రక్రియకు సంబంధించింది. కేవలం ఆనోటి నుండి ఈ నోటికి, ఆ చెవి నుండి ఈ చెవికి తర తరాలుగా సంప్రదాయ బద్ధంగా అందించబడ్డ కథా కథనమే జానపద కథ. ఆంగ్లంలోని 'ఫోక్ టేల్' కు ఇది సమాన పదం. కొంతమంది దృష్టిలో జానపద కథలోనే జానపద పురాణం, జానపద ఐతిహ్యం చేర్తాయి. స్టిత్ థాంసన్ దృష్టిలో 'సాంప్రదాయిక గద్య కథ' (Traditional prose Narrative) యే జానపద కథ. "The story which has been handed down from generation to generation either in writing or by word of mouth" (The folktale,

1951 p.4) ఇది విశాలార్థంలో ఉపయోగించబడింది. The Folklore అన్న గ్రంథంలో పురాణం, ఐతిహ్యాలను జానపద కథా ప్రక్రియగానే విశ్లేషించారు. సాంప్రదాయికగద్య కథ అన్నప్పుడు జానపద కథ, పురాణం, ఐతిహ్యం - మూడూ అందులో చేర్తాయి. అయితే జానపద కథ అని ప్రత్యేకంగా చెప్పినప్పుడు పురాణం, ఐతిహ్యాలను జానపద కథ నుండి వేరు చేయాల్సి వుంటుంది. జానపద కథకూ, పురాణం, ఐతిహ్యాలకూ స్వరూపంలోనే వ్యత్యాసం కన్పిస్తుంది. వస్తువును దృష్టిలో పెట్టుకొంటే ఈ మూడింటిలో సమానత కన్పిస్తుంది. అయితే కాలం, స్థలం, వ్యక్తి - ఈ మూడింటిని గమనించినట్లైతే పురాణం, ఐతిహ్యాలు రెండూ జానపద కథ కంటే భిన్నాలని చెప్పొచ్చు. అంతే కాకుండా కథన శైలిలోనూ భిన్నత్వం కన్పిస్తుంది. అయితే ప్రాచీన సమాజాలలో ఈ మూడు అభిన్నాలే అని తోస్తుంది.

## శిష్టకథ – జానపద కథ:

కథా సాహిత్యంలో రెండు రకాలైన సంప్రదాయాలను గుర్తించటానికి వీలవుతుంది. అవి 1. శిష్ట కథా సాహిత్య సంప్రదాయం. 2. జానపద కథా సాహిత్య సంప్రదాయం. అన్ని జానపద సాహిత్య ప్రక్రియలలాగానే ఈ జానపద కథా సాహిత్య ప్రక్రియలో కూడ కాలం, రచయితల గురంచి నిర్దిష్టంగా చెప్పడం కష్టం. దీనికి కారణం వాక్సంప్రదాయం. శిష్ట జానపద కథా సాహిత్యాలు రెండూ జన సామాన్యుల కోసమే రచింపబడి నట్టివనడంలో సందేహం లేదు. అయితే శిష్ట కథా సంప్రదాయం కొన్ని నిర్దిష్టమైన ఉద్దేశాలతో కూడుకొని ఉంటుంది. నిర్దిష్టవ్యక్తికీ, నిర్దిష్టమైన విషయానికీ చెంది ఉంటుంది. శిష్ట జానపద కథా సాహిత్యాలను వేరు చేయడం ఒక్కోమారు కష్టంతో కూడుకొన్న పనే. ఎంచేతనంటే వస్తువు విషయం తీసుకున్నప్పుడు పరస్పరం ఇచ్చిపుచ్చుకోవడాల్ని అలవరచుకొన్నవే. శిష్ట సాహిత్యంలోని అనేక కథలు జానపద కథల్లో చేరిపోవడం, శిష్ట కథలనేకం జానపద కథల్ని తమలోనికి తీసుకొని వృద్ధి చెందడం అనాదిగా జరుగుతూనే ఉంది. ఇది ఒక్క కథా సాహిత్యానికి మాత్రమే పరిమితం కాదు. అన్ని జానపద విజ్ఞాన ప్రక్రియలకు అన్వయిస్తుంది.

వేదకాలం నాటికే వేదాల్లో జానపద కథా బీజాలు మనకు కన్పిస్తాయి.

రామాయణ, మహాభారత, భాగవత కథల్లో సందర్భానుసారంగా జనుల వాడుకలో ఉన్న జానపద కథలు చేర్చబడ్డాయి.

ఈసపు నీతికథలు జానపద కథలను లోగొన్న ఒక ప్రాచీన గ్రంథం. బైబిలు వంటి పవిత్ర గ్రంథాల్లోను కొన్ని జానపద కథలు చోటు చేసికొన్నాయి. గుణాఢ్యుడు పైశాచీభాషలో వ్రాసిన బృహత్కథ గ్రంథం ఒక పెద్ద జానపద కథా సంగ్రహంగా చెప్పొచ్చు. ఆ గ్రంథం సంగ్రహరూపం క్షేమేంద్రుని బృహత్కథా మంజరిలోను, తమిళంలోని 'పెరుంగతై' అనే కథా సంగ్రహంలోను లభిస్తుందట. బృహత్కథలో పశుపక్ష్యాదుల కథలున్నాయి. యక్షిణులు, మూర్ఖులు, వేశ్యలు ఈ కథల్లో చోటు చేసుకొన్నారు. తెలివితేటల్ని పరీక్షించే సమస్యాత్మక కథలు ఇందులో ఉన్నాయి. బృహత్కథని ఒక జానపద కథాకోశంగా పేర్కొనవచ్చునన్న అభిప్రాయం ఉంది.

విష్ణుశర్మ పంచతంత్ర కథల్లో జానపద కథలనేకం కన్పిస్తాయి. ఈ కథలు చాలవరకు జనపదాల్లో ప్రచారంలో ఉండి ఉంటాయి. వాటిని సమయ సందర్భాలను బట్టి వాడుకొన్నట్టుగా ఆ కథల స్వరూపాల వల్ల తెలుస్తుంది. పదమూడో శతాబ్దంలో పంచతంత్ర కథలు లాటిన్, జర్మను భాషల్లో అనువాదం కావడం ఒక విశేషం.

బుద్ధుని జాతక కథల్లో పశుపక్ష్యాదులకు సంబంధించిన కథలున్నాయి.

సింహాసనాద్వాత్రింశికా, భట్టి విక్రమార్కుని కథలు, భేతాళ పంచ వింశతి కథలు ప్రాచీన కథా సంకలనాలు. శుకసప్తతి కథల్లో నీతి ప్రధానమైన అంశాలు ఉన్నా అశ్లీల విషయాలు కూడ లేకపోలేదు.

అరేబియన్‌నైట్సు కథలు ఫ్రెంచి భాషలో అనువదించబడి అనేక దేశాలకు వ్యాపించాయి.

ఐర్లండు దేశపు 'సాగా' కథా ప్రక్రియకు భారతదేశంలో ప్రచారంలో ఉన్న విక్రమాదిత్యుని కథల్ని పోల్చవచ్చునట.

## జానపద కథల లక్షణాలు:

ఆక్సెల్ ఓల్రిక్ జానపద కథలకు అన్వయింపబడే కొన్ని లక్షణాలను నిర్దేశించాడు. ( ద్‌స్టడీ ఆఫ్ ఫోక్‌లోర్ లో ఆక్సెల్ ఓల్రిక్‌గారి వ్యాసం 'ఎపిక్ లాస్ ఆఫ్ ఫోక్ నెరేటివ్' మరియు డా. ఆర్వీయస్ సుందరంగారి జానపద సాహిత్య స్వరూపంలో 'గద్య కథనాలు' అన్న వ్యాసం చూడండి)

"1. ముఖ్యమైన క్రియతో ప్రారంభం కావు. ఉన్నట్టుండి ముగిసిపోవు.

2. పునరావృత్తి సామాన్యంగా అన్నిచోట్లా కన్పిస్తుంది. అది కథకు నిండుదనాన్ని ఇస్తుంది. ఈ పునరావృత్తి ఒక్కొక్కసారి మూడుసార్లు, కొన్ని దేశాలలోని ధార్మిక సంకేతాల కారణంగా నాలుగుసార్లు ఉండవచ్చు.

3. మామూలుగా ఒక్కసారి ఇద్దరు వ్యక్తులు మాత్రం ఒక దృశ్యంలో కనిపిస్తారు. ఇంకా ఎక్కువగా ఉన్నా ఇద్దరు మాత్రం క్రియాశీలురై ఉంటారు.

4. విభిన్న పాత్రల కలయిక కనిపిస్తుంది. ఉదాహరణకు నాయకుడు - ప్రతి నాయకుడు; శిష్టుడు - దుష్టుడు

5. ఒకే రకమైన పాత్రలు రెండు ఉంటే, వాళ్ళు చిన్నవాళ్ళుగా కాని లేక అశక్తులుగా కాని చిత్రింపబడుతారు. ఒక వేళ శక్తిగలవాళ్ళు అయితే విరోధులయ్యే అవకాశం వుంది.

6. దుర్బలులుగా ఉండేవారు మంచివాళ్ళుగా ఉంటారు. సోదరులలో చిన్నవాళ్ళు మామూలుగా జయం సాధిస్తారు.

7. పాత్రచిత్రణ సరళంగా ఉంటుంది. కథకు నేరుగా సంబంధించినవి మాత్రం చిత్రితమవుతాయి. పాత్రలకు, కథకు అతీతమైనవేవీ కనిపించవు.

8. కథావస్తువు సరళంగా ఉంటుంది. ఏక కాలంలో ఒక్క కథనే వివరించాలి. రెండు గాని, అంతకంటె ఎక్కువగాని కథలు ఏకకాలంలో చెప్పవలసి వస్తే అప్పుడు అది సాహిత్య కథను పోలుతుంది.

9. మామూలుగా అన్నీ చాల సరళంగా ఉంటాయి. వైవిధ్యపూర్ణంగా చేయాలనే ప్రయత్నం కన్పించదు.

## జానపద కథల్లో కన్పించే ప్రధానాంశాలు:

జానపద కథల్లో వాస్తవమైన సంఘటనలకు, వ్యక్తులకు చోటులేక పోయినా జానపదుల సంస్కృతి, నమ్మకాలు - విశ్వాసాలు, సామాజిక జీవితం, మత సంప్రదాయాలు చెప్పబడి వుంటాయి. కొన్ని జానపద కథల్లో మతప్రాబల్యం

అధికంగా కన్పిస్తుంది. ప్రజలు దైవభక్తితో మెలగడం, వంశపారంపర్యమైన రాజవంశాల్లో రాజకీయాంశాలు ఎక్కువగా చోటు చేసికొని ఉండడం కన్పిస్తుంది.

భారతదేశపు జానపద కథల్లో యక్షులు, గంధర్వులు, కిన్నరులు, గుహ్యకులు, రాక్షసులు, విద్యాధరులు, సర్పాలు, భూతప్రేతాలు, పిశాచాలు మొదలైన అలౌకిక శక్తులు చోటుచేసికొని ఉండడం గమనించవచ్చు. పెక్కు జానపద కథల్లో మంత్రగాళ్ళ ప్రాముఖ్యం కన్పిస్తుంది. మంత్రతంత్రాలు భయాన్ని కల్గించే అంశాలైనా ఆయాకాలాల్లో జనులు వాస్తవంగానే అనుభవించి ఉంటారేమోనన్న సందేహానికి దారితీస్తుంది.

అతిమానుష శక్తుల సాధారణ లక్షణాలు ఈ క్రింది విధంగా ఉంటాయి. (చూ. దుర్గా భాగవత్‌గారి 'యాన్ ఔట్‌లైన్ ఆఫ్ ఇండియన్ ఫోక్‌లోర్' అనే గ్రంధం)

1. అతిమానుష శక్తులు ఐంద్రజాలిక శక్తులను కలిగి ఉంటారు.
2. వాళ్ళు గాలిలో ఎగురుతారు.
3. వాళ్ళు అదృశ్యులు కాగలరు, రూపాన్ని మార్చుకొనగలరు.
4. చిత్రకళ, సంగీత నృత్యాదులలో ఆరితేరిన వారుగా ఉంటారు.
5. మనుష్యులతో లైంగిక సంబంధాన్ని ఏర్పరచుకొంటారు.
6. వీళ్ళకూ, మనుష్యులకూ జనించిన సంతానం మానవులే అవుతారు.
7. కొన్ని సందర్భాలలో కిన్నరులు మినహా మిగిలిన వాళ్ళెవ్వరికీ రెక్కలు ఉండవు. విద్యాధరులు, గంధర్వులు తాము మెడలో ధరించే మాయాహారాల ప్రభావం వల్ల గాలిలో ఎగురగలరు.
8. వాళ్ళు పగటిపూట కంటే రాత్రి సమయాల్లోనే సంచరించడానికి ఇష్టపడతారు.
9. మానవ నాయికా నాయకుల అదృష్టానికి కానీ, దురదృష్టానికి కానీ వీరు సహాయకులుగా ఉంటారు.

పైన పేర్కొన్నవన్నీ అద్భుత కథలకు సంబంధించిన సామాన్య లక్షణాలు. పై లక్షణాలన్నీ రేచుక్క పగటిచుక్క థలు, విక్రమార్కుని కథలు మొదలైన కథల్లో స్పష్టంగా కన్పిస్తాయి.

జానపద కథల్లో వచ్చే దుష్టపాత్రలనన్నిటిని భయంకరమైన ఆకారాలు కలిగిన రాక్షసులు, భూతాలకు సంకేతాలుగా తీసుకొన్నట్టు ఆయా కథలవల్లనే తెలుస్తుంది. పైకి ఇవి మనకు అసత్యాంశాలుగా కన్పట్టినా ఈ భయంకరాకారాల ద్వారా ఆయా పాత్రల క్రూర స్వభావాలు వెల్లడవుతాయి.

జానపద కథల్లో మానవుల సాహసాలే కాకుండా జంతువుల సాహసాలు కూడ వర్ణింపబడి ఉంటాయి. అడవి జంతువుల ద్వారా కూడా మనకు ఆయా పాత్రల స్వరూప స్వభావాలు తెలుస్తాయి. జంతువులు, పక్షులు మానవులకు ఉపకారానికి ప్రత్యుపకారం చేస్తుంటాయి. ఈ ప్రాణికథలనన్నిటిని నీతి కథలుగా చెప్పొచ్చు.

జానపద కథలు ఏయే కాలాల్లో కట్టబడ్డాయో ఆయాకాలాల సామాజిక పద్ధతులు, ఆచారవ్యవహారాలు వాటిలో ప్రతిబింబిస్తాయి. అందువల్లనే ఇవి వాస్తవికతకు దగ్గరలో ఉన్నాయనిపిస్తుంది.

జానపద కథల్లో మనకు కన్పించే మరొక అంశం హాస్యం. కేవలం వినోదమే ఇలాంటి కథల్లో అధికంగా కన్పిస్తుంది. ఈ కథల్లో హాస్యప్రవృత్తే కాకుండా మూర్ఖత్వం, తెలివితేటలు తొంగి చూస్తాయి. తెనాలి రామలింగని కథలు, మర్యాద రామన్న కథలు హాస్య కథలకు మంచి ఉదాహరణలు.

జానపద కథలు ఐతిహ్యాలలాగా చరిత్రకు సంబంధించినవి కావు. పుక్కిటి పురాణాలలాగా కర్మకాండలకూ సంబంధించినవీ కావు. ఇవి నిరక్షర కుక్షులైన ప్రజల కల్పనలు. శ్రోతలకు పరిచయమైన సంఘటనలనే ఇవి వర్ణిస్తాయి. జానపద కథల ప్రభావం పిల్లల మీద అధిక ప్రభావాన్ని చూపుతాయి. చిన్నతనంలో విన్నవీ, కన్నవీ, నేర్చినవీ వయసు పెరుగుతున్న కొద్దీవాళ్ళలో చెప్పలేనంత పరిణామాన్ని తెస్తాయి. అనేక కథల్లో మంచివాళ్ళు మొదట్లో కష్టాలనన్నిటిని ఎదుర్కోవడం, తర్వాత వాటిని జయించడం సాధారణంగా కన్పిస్తుంది. ధైర్యోపాయాలు ఉంటే ఎవర్నైనా జయించవచ్చునన్న ఆత్మవిశ్వాసాన్ని ఈ కథలు బోధిస్తాయి.

జానపద కథల్లో కన్పించే అనేకాంశాలు ప్రపంచమంతటా ఇంచుమించు ఒకే రీతిలో ఉంటాయి. భిన్నదేశాలకు చెందిన ఈ కథల్లోని సామ్యాన్నిబట్టి ఇవి ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికి వ్యాపించి ఉంటాయని చెప్పడానికి వీలుంది.

## జానపద కథా సిద్ధాంతాలు:

జర్మనీ దేశపు గ్రిమ్ సోదరులు 1812లో జానపద కథల సంకలనాన్ని ప్రచురించడం మొదలు పెట్టిన కారణంగా జానపద కథాధ్యయనం వైజ్ఞానికంగా సాగడానికి నాందీ పలికింది. ఇది తర్వాత ఐరోపా అంతటా జానపద కథా సంగ్రహణం మరియు విశ్లేషణలకి కొత్త పంథాను చూపింది. గ్రిమ్ సోదరుల 'Kinder - und hausmarchen' అన్న గ్రంథమే ప్రప్రథమ శాస్త్రీయ జానపద కథాసంకలనం. ఇందులో ఉన్న కథలు మౌఖిక ప్రచారంలో ఉన్నవేకాక సాహిత్య సంకలనాలనుంచి కూడ తీసుకొని ఉండడం కన్పిస్తుంది. ఈ కథలు అనతికాలంలోనే ప్రపంచమంతటా జానపద కథాధ్యయనానికి వస్తువయ్యాయి. పంతొమ్మిదవ శతాబ్దమంతా సంగ్రహకారులకు ప్రేరక శక్తులుగా నిలిచాయి. గ్రిమ్ సోదరుల ఈ కథా సంకలనాన్ని మాదిరిగా పెట్టుకొని డెన్మార్క్, నార్వే, రష్యా, హంగరీ, ఆల్బేనియా, గ్రీస్, ఫ్రాన్స్, రష్యా మొదలైన దేశాల్లోని పండితులు తమతమ దేశాల్లో మొట్టమొదటి కథా సంకలనాలను తీసుకుని వచ్చారు.

కథల విషయంలో గ్రిమ్ సోదరుల అభిప్రాయాలు 1856లో సిద్ధాంతాలుగా రూపుదిద్దుకొన్నాయి. అన్ని జానపద కథలు ఇండో యూరోపియన్ భాషలను మాట్లాడే ప్రజలనుండి వచ్చి ఉంటాయనీ, పురాణాలే విడగొట్టబడి ముక్కలై కథలకు మూలమయ్యాయనీ వీరి సిద్ధాంతం. తరువాతి కాలంలో గ్రిమ్ సోదరుల ఈ అభిప్రాయాలు 'తులనాత్మక పురాణ శాస్త్ర' విద్వాంసులకు స్ఫూర్తి నిచ్చాయి. వీళ్ళలో మ్యాక్స్ ముల్లర్, జాన్ ఫిస్కే, సర్ జార్జ్ కాక్స్ ముఖ్యులు. "Mythology is pathology of Language' అని మ్యాక్స్‌ముల్లర్ అభిప్రాయపడ్డాడు. 1859లో తన 'పంచతంత్రా' నికి ప్రస్తావన వ్రాస్తూ జానపద కథలకు భారతదేశమే మూలమని, థియోడర్ బెన్ఫె అభిప్రాయపడ్డాడు.

మానవశాస్త్ర దృష్టితో కథలను అధ్యయనం చేసిన వాళ్ళలో ఆండ్రూలాంగ్ ప్రముఖుడు. కథలు పురాతన కాలపు అవశేషాలు అని ఈతని అభిప్రాయం. మానవశాస్త్రంలో పంతొమ్మిదవ శతాబ్దంలో ప్రచలితమైన బహుళోత్పత్తి వాదాన్ని (బహుమూల సిద్ధాంతం) అంగీకరించిన వాళ్ళలో ల్యాంగ్ ఒకడు. కథలు అనేక ప్రదేశాల్లో అస్తిత్వాన్ని పొంది ఉంటాయనీ, వాటిలో సాదృశ్యాలు కన్పిస్తాయనీ ఈయన అంగీకరిస్తాడు. సమాన కథలకు సమాన సంస్కృతులే కారణమని ఈయన అభిప్రాయం.

జానపద కథల మూలాన్ని, తక్కిన జానపద విజ్ఞానాంశాలను అధ్యయనం చేయడంలో గమనించదగ్గ సిద్ధాంతాల్లో చారిత్రక భౌగోళిక విధానం ఒకటి. ఇది జానపద కథల్ని, చరిత్రని పునర్నిర్మించడంలో తోడ్పడింది. కథ యొక్క మూల స్వరూపాన్ని, ప్రదేశాన్ని గుర్తించడమే దీని ఉద్దేశం. ఈ విధానం బహుమూల సిద్ధాంతాన్ని అంగీకరించదు. దీని ప్రకారం వందలకొద్దీ పాఠాలతో వ్యాపించిన కథలు, ఏదైనా ఒక కాలంలో, ఒక ప్రదేశంలో జనించి తర్వాత ఇతరదేశాలకు వ్యాపించి ఉండవచ్చు. దీన్ని ప్రతిపాదించిన వాళ్ళల్లో జ్యూలియస్ క్రోహ్న, కార్లే క్రోహ్న, ఆంటీ ఆర్నే ముఖ్యులు.

జానపద కథలమూలాన్ని కనుక్కోవడంలో ఉపయోగించే సిద్ధాంతాల్లో స్వప్నమూల సిద్ధాంతం ఒకటి. లూడ్విగ్, లెయిస్నర్ మొదలైనవాళ్ళు ఈ సిద్ధాంత ప్రతిపాదకులు. వీరి ప్రకారం కథల్లో కన్పించే అనేకాంశాలకు స్వప్నాలే కారణం. కర్మకాండల సిద్ధాంతం మరొకటి. దీనిప్రకారం ధార్మిక సంబంధమైన ప్రాచీన కర్మకాండలు జానపద కథలకు మూలమట. మనోవిశ్లేషణ సిద్ధాంతం ఇంకొకటి. దీని ప్రతిపాదకుడు సిగ్మండ్ ఫ్రాయిడ్. ఈయన ప్రకారం జానపద కథల్లో కన్పించే సామ్యానికి Psychic unit of man kind కారణమట.

ఏమైనా పై సిద్ధాంతాల్లో ఏదీ సంపూర్ణం కాదు.

## జానపద కథల వర్గీకరణ:

జానపద విజ్ఞానాన్ని వర్గీకరించిన ఆర్.ఎస్. బాగ్స్ జానపద కథలను సాహిత్య వర్గంలో చేర్చాడు. జానపద గేయ కథల్లోనూ గద్యకథల వస్తువుల లక్షణాలు కన్పించడంవల్ల గద్య కథనాలనే (Prose narratives) ప్రత్యేక విభాగంగా గుర్తించాడు.

వస్తువైవిధ్యాన్ని బట్టి జానపద కథా సాహిత్యాన్ని వింగడించాల్సి ఉంటుంది. స్టిత్ థాంసన్ మొదలైన విద్వాంసులంతా వాక్సంప్రదాయంలో ప్రచారంలో ఉన్న అన్ని గద్య కథల్ని, జానపద కథలుగా పేర్కొనడం వల్ల పురాణాలు, ఐతిహ్యాలు కూడ జానపద కథావ్యాప్తికి చేరుతాయి. అయితే నేటి నాగరకతా సంస్కృతిలో ప్రచారంలో ఉన్న గద్యకథల్ని పురాణం, ఐతిహ్యం, జానపద కథ అని వింగడించాల్సి

వుంటుంది. వస్తువులోను, ఆకారంలోను ఉద్దేశంలోనూ అవి ఒకదానికొకటి భిన్నంగా ఉంటాయి.

ఎన్సైక్లోపీడియా బ్రిటానికాలో జనప్రియ కథలు పురాణాలు, ఐతిహ్యాలు, కథలు అని వింగడించబడ్డాయి. (సంపుటం 9, పుట 447)

Standard Dictionary of Folklore అన్న గ్రంథంలో స్టిత్ థాంసన్ జానపద కథలని ఐతిహ్యం, అద్భుత కథలు, జంతువుల కథలు, నీతికథలు, పురాణాలు అని వింగడించాడు.

The Science of fairy tales అన్న గ్రంథంలో ఎడ్విన్ సిడ్నీ హార్ట్ ల్యాండ్ అనే అతను జానపద కథను సాంప్రదాయికంగా వచ్చిన వ్యక్తీకరణగా అభివర్ణించాడు. ఇలాంటి కథలను ఆయన Saga, Marchen అని రెండు విధాలుగా వింగడించాడు. 'సాగా' కు సంబంధించిన కథలు నిర్దిష్ట స్థలానికి సంబంధించి, నిర్దిష్ట మానవాతీత వ్యక్తులకు సంబంధించినవి. కొన్నిమార్లు ఈ కథల్లో చారిత్రక వ్యక్తులు కూడ ప్రవేశించవచ్చు. 'మార్చెన్' కు సంబంధించిన కథలు వినోద కథనాలు; విభిన్న కాలాల్లో, విభిన్న దేశాల్లో సంభవించి ఉండవచ్చని నమ్మిన సంఘటనల మీద ఆధారపడినట్టివి; వీటిలో కల్పన ఉంటుంది. అయితే వీటిని చెప్పేవాళ్ళు కానీ, వినేవాళ్ళు కానీ నమ్మాలని లేదు. ఈయన చెప్పే 'సాగా' ఐతిహ్యానికీ, 'మార్చెన్' జానపద కథకీ సరిపోలుతాయట.

మిల్లర్ ప్రకారం జానపద కథలు మూడు రకాలు. అవి కిన్నెర కథలు, దైనందిన కథలు, జంతువుల కథలు.

వుండ్ట్ అనే జర్మన్ పండితుడు కథలని ఏడువిధాలుగా వింగడించాడు. అవి. 1. పౌరాణిక నీతికథలు, 2. శుద్ధ కిన్నెర కథలు, 3. జైవిక కథలు, నీతి కథలు, 4. శుద్ధ జంతువుల కథలు, 5. వంశ సంబంధ కథలు, 6. తమాషా కథలు, నీతి కథలు 7. నీతికథలు (చూ. Morhology of folk tale, p.6))

ఫోక్‌లోర్ అండ్ ఫోక్ లైఫ్ అన్న గ్రంథంలో (పుటలు 62-72) లిండా డే కథలను సంకీర్ణ కథలు, సరళ కథలు అని వింగడించాడు. సంకీర్ణ కథలు మళ్ళీ మూడు విధాలు 1. మార్చన్ లేదా మ్యాజిక్ టేల్, 2. ధార్మిక కథలు, 3. కాల్పనిక కథలు. సరళ కథలు మళ్ళీ మూడు విధాలు. అవి 1. ప్రాణి కథలు, 2. వినోద కథలు, 3. లాక్షణిక కథలు.

ప్రచారంలో ఉన్న తెలుగు జానపద కథలను దృష్టిలో ఉంచుకొని ఈ క్రింది విధంగా వింగడించవచ్చును. అవి

1. పురాణకథలు (Mythological Tales)
2. ఐతిహాసిక కథలు (Legendery Tales)
3. హాస్య కథలు లేదా మూర్ఖుల కథలు (Drolls and Noodles)
4. మోసగాండ్ర కథలు (Trickster Tales)
5. సుదీర్ఘ కథలు (Tall tales)
6. సమస్యాత్మక కథలు (Dilemma tales or riddle stories)
7. ప్రాణి కథలు (Animal Tales)
8. అద్భుత కథలు (Fairy Tales)
9. నీతి కథలు (Moral tales or fables)
10. సామాజిక కథలు (Sociological tales)

ఇటీవల కాలంలో జానపద కథలను కథలలో కన్పించే కథన ఘటకాల (Motifs) సహాయంతోనూ, మాదిరుల (Types)ను దృష్టిలో పెట్టుకొనీ విభజించడం జరుగుతోంది.

## కథనఘటకం:

స్టిత్ థాంసన్ కథల్లో ఉన్న కథన ఘటకాలను అధ్యయనం చేసి ప్రపంచంలో ఉన్న కథల్లో సమానంగా కన్పించే అంశాలను సంగ్రహించి, Motif Index of Folk Literature అనే ఆరు సంపుటాల గ్రంథాన్ని ప్రచురించాడు. ఆయన ప్రకారం కథన ఘటకం అంటే 'మౌఖిక సంప్రదాయంలో నిలద్రొక్కుకున్న కథలోని కనిష్ఠాంశం' (The Folk Tale, p.415). దీన్నే 'మూలాంశం' అనికూడ అంటారు. కథన ఘటకం అనిపించుకోవాలంటే ఒక అసామాన్య విషయం లేదా ఏదో ఒక విశేషం ఉండి తీరాలి. కథానిరూపణలో 'పాత్రలు, వస్తువులు, సంఘటనలు' అనే అంశాలు ఇలాంటి విశేషాంశాలకు సంబంధించి ఉంటాయి.

తెలుగు జానపద కథల్లో కన్పించే కథన ఘటకాలకు ఒకటి, రెండు ఉదాహరణలు

1. 'తెనాలి రామకృష్ణుని కథలు'లో చిలుక పలుకులు ఒక కథన ఘటకం. ఇది Motif Index of Folk Literature లో ఉన్న B 211.3.4 Speaking Parrot అన్న కథన ఘటకానికి సంబంధించింది.

2. 'భేతాళ కథలు'లో విషపూరిత భక్ష్యాలు మరొక కథన ఘటకం. ఇది పై గ్రంథంలో H 1515 poisoned food test (Attempt to kill hero by feeding him poisoned food) అనే కథనఘటకానికి సంబంధించింది.

## మాదిరి (Type):

ఆంటి ఆర్నె మరియు స్టిత్‌థాంసన్ అనే విద్వాంసులు కథలని అధ్యయనం చేసేవాళ్ళకు కథాసామగ్రిని వర్గీకరించి అందించే యత్నంలో The Types of the Folktale: A classification and Bibliography అనే గ్రంథాన్ని ప్రచురించారు. థాంసన్ అభిప్రాయంలో 'మాదిరి' అంటే స్వతంత్ర అస్తిత్వంలో ఉండదగిన సాంప్రదాయిక కథ. ఇది స్వయం సంపూర్ణంగా ఉంటుంది. తన అర్థం కోసం మరొక కథపై ఆధారపడదు. ఇలాంటి ప్రతిఒక్క మాదిరి ఒకటి లేదా అనేక కథన ఘటకాలతో ఏర్పడుతుంది. కథావర్గసూచిలో కథలు ఐదు ముఖ్య విభాగాలుగా వింగడించబడ్డాయి. అవి 1. జంతువుల కథలు, 2. సాధారణ కథలు, 3. హాస్యం లేదా వినోద కథలు, 4. సూత్రకథలు, 5. అవర్గీకృతకథలు.

ప్రతి విభాగాన్నీ ఉపవిభాగాలుగా వింగడించడం జరిగింది. ప్రతికథా ఒక్కొక్క నిర్దిష్టసంఖ్యతో గుర్తించబడి, దానిక్రింద ఆయా మాదిరుల సంక్షిప్త పరిచయం చేయబడింది. ప్రతి మాదిరి ప్రక్కనే దానికి సంబంధించిన మరొక మాదిరీ ఇవ్వబడింది. ఏ కథ ఏ దేశానికి చెందింది, ఏ గ్రంథానికి చెందింది అనే వివరణ ఇవ్వడం జరిగింది. కథలను అధ్యయనం చేసేవాళ్ళకు ఇలాంటి మాదిరి సూచివల్ల ఒక కథయొక్క నిర్దిష్టపాఠం, దాని విభిన్న రూపాలు, అది ప్రాచుర్యంలో ఉన్న ప్రదేశం ఇత్యాది విషయాలు లభిస్తాయి. కథల తులనాత్మక అధ్యయనానికి ఇలాంటి మాదిరుల సూచి అత్యంత సహాయకారిగా ఉంటుంది.

## జానపద కథల అధ్యయనం:

జానపద కథాధ్యయనంలోనూ ఇతర జానపద విజ్ఞాన ప్రక్రియలలాగానే 1. సేకరణ, 2. పరిష్కరణ, 3. విశ్లేషణ అన్న మూడు దశలు ఉన్నాయి. ఈ మూడు ఒకదానిమీద ఒకటి ఆధారపడి ఉంటాయి.

జానపద కథలను సేకరించడంలో మొదటిదశ క్షేత్రకార్యం. క్షేత్రకార్యమంటే సేకర్త, వ్యవహర్త సమావేశమయ్యే ప్రదేశం. జానపద కథను మౌఖిక రూపంలో సంగ్రహించేటప్పుడు గమనించదగ్గ ముఖ్యవిషయం ఆ కథను యథాతథంగా వ్యవహర్త నుండి సేకరించడం. అంటే వ్యవహర్త ఏ శైలిలో చెప్తున్నాడో అదే శైలిలోనే సేకరించడం. కథలను సేకరించేవాళ్ళు తమ శైలికి అనుగుణంగా కథలను మలచుకోవడం జరుగుతూ ఉంటుంది. ఇక్కడే సేకర్తలు సాధారణంగా తప్పు చేస్తుంటారు. 'Stories really collected can only be valuable if given unaltered'' అని అంటాడు జాన్ ఫ్రాన్సిస్ క్యాంప్ బెల్ (ఫోక్‌లోర్ అండ్ ఫోక్ లైఫ్, పుట 55). కథాకథనంలోనూ, భాషా వైవిధ్యంలోనూ, కథా సంప్రదాయంలోనూ వ్యవహర్తలలో భిన్నత్వం కన్పిస్తుంది కనుకనే వాటిని యథాతథంగా సేకరించాల్సి వుంటుంది.

జానపద కథలను సంగ్రహించేటప్పుడు సేకర్త గమనించదగ్గ ముఖ్యాంశాలు మరికొన్ని ఉన్నాయి. ఈ ముఖ్యాంశాలను అనుసరించడానికి ప్రశ్నావళి ఎంతో అవసరమవుతుంది. ఫోక్‌లోర్ అండ్ ఫోక్‌లైఫ్ (పుట 410) అన్న గ్రంథంలో డొనాల్డ్ ఎ మ్యాక్ డొనాల్డ్ ఒక ఐరిష్ విద్వాంసుని (Sean O' sullivan) ప్రశ్నావళి నొకదానిని తన వ్యాసంలో ఇలా ఉల్లేఖించారు. వాటినిక్కడ ఉట్టంకిస్తాను 'సాధ్యమైతే ప్రతి కథకుని మరియు అతని గృహచిత్రాన్ని తీసుకోవడం మంచిది. ప్రతి కథకుని జీవిత చరిత్రని గురించిన వియాలను అతని నుంచే సంగ్రహించాలి. సాధ్యమైతే కథకుని వంశచరిత్రని తెలియ జేయాలి.

కథను ఏ సన్నివేశంలో చెప్పడం జరుగుతోంది అన్న విషయాన్ని చెప్పాలి. సాధారణంగా కథలను ఎక్కడ చెప్తారు? పొయ్యిగట్టు చెంతనా? జాగరణలోనా? కొలిమి చెంతనా? పొలాల్లో పనులు చేసుకొనేటప్పుడా? గరికమైదానాల్లోనా? చేపలు పట్టే పడవల్లోనా? కథకులు సాధారణంగా కథలు చెప్పడానికి ఎలా ప్రేరితులవుతారు? కథకులు మరియు శ్రోతలకు సంబంధించినట్లుగా ఏ పరిస్థితులు

అవసరమవుతాయి? కొన్ని కథలు కథకునికీ శ్రోతలకూ ఇద్దరికీ ప్రీతిపాత్రంగా ఉంటాయా? కథకులు తాము ఎంచుకొన్న కథలను మాత్రమే చెప్తారా? లేక శ్రోతలు కోరిన నిర్దిష్ట కథలను చెప్పడానికి అంగీకరిస్తారా? వాళ్ళు సంజ్ఞలను ఉపయోగిస్తారా? వివరించాలి. కథ చెప్పే సందర్భంలో వచ్చే ఆటంకాలను లేదా సంతాపాద్యర్థకాలను కథకుడు మరియు శ్రోతలు స్వాగతిస్తారా లేక అసమాధానాన్ని వ్యక్తపరుస్తారా? కథ నడిచే సందర్భంలో శ్రోతలు వ్యక్తపరచే వ్యాఖ్యానం లేదా సంతాపాద్యర్థకం సాధారణంగా ఏ మాదిరిలో ఉంటుంది? ముగింపులో ఏమి చెప్పబడుతుంది (కథకుని పొగడ్త, కథ లేదా దాని పాత్రలను గురించిన వ్యాఖ్యానం ఇత్యాది) శ్రోతలు ఇంతవరకు చెప్పిన కథలను నేర్చుకొని, ఆపై చెప్తారా? కథలను చెప్పే కేంద్రాలనే కొన్ని ఇళ్ళు ఉంటాయా?

సాధారణంగా కథలను ఏ రకం మనుష్యులు చెప్తారు? మగవాళ్ళా? లేదా ఆడావాళ్ళా? కథకుల వయస్సు, వృత్తి లేదా ఉద్యోగం? పురుషులు, స్త్రీలు వృత్తి కథకులులాగా పనిచేస్తారా? రాత్రివేళల్లో సాధారణంగా సంచార స్త్రీ పురుషులు (భిక్షగాళ్ళు ఇత్యాది) వాళ్ళు విడిది చేసిన రాత్రి కథ చెప్పడానికి ఇళ్ళిళ్ళూ తిరుగుతారా? ఇరుగు పొరుగువారు ఈ కథకుల కథలను వినడానికి సాధాణంగా ఒకచోట కలుస్తారా? కథచెప్పడంలో పరిణతులు కానివారు కథలు చెప్తారా? మంచి కథకులు పరిణతులు కాని కథకులతో కథలు చెప్పిస్తే అసమాధానాన్ని వ్యక్త పరుస్తారా? స్థానికంగా, కథ చెప్పే స్పర్థలనేమైనా నిర్వహిస్తారా?'

జానపద కథలని శాస్త్రీయంగా సేకరించడానికి బయల్దేరే ప్రతి సంగ్రహ కారునికి పైన చెప్పబడిన వైజ్ఞానికమూ, వ్యవస్థితమూ అయిన ప్రశ్నావళి అత్యవసరం. సందర్శన సమయంలో ఈ ప్రశ్నలు సందిగ్ధతనీ, సందేహాలను నివృత్తి చేయడంలో తోడ్పడుతాయనడంలో సందేహం లేదు. కథలను సేకరించే సమయంలోనే పై ప్రశ్నలకన్నిటికీ సమాధానం రాబట్టుకోవాల్సి ఉంటుంది.

సేకరించిన జానపద కథలని పరిష్కరించడం రెండవ దశకు సంబంధించింది. సాధారణంగా కథల్లో భిన్నపాఠాలు లభించడం సర్వసామాన్యం. భిన్న కథకులు విభిన్నశైలుల్లో ఒకే కథను చెప్పడం జరుగుతూ ఉంటుంది. భిన్న పాఠాంతరాలకు ఒకే మాతృకను రచించాల్సి ఉంటుంది. లభించిన ఈ భిన్న పాఠాంతరాలలో ఒక దాన్ని (మాతృకను) ప్రధానంగా తీసుకొని తక్కిన వాటిని

అనుబంధంలో ఇవ్వాల్సి ఉంటుంది. భాషతో పాటు కథావస్తువు, కథన ఘటకాల మీద మనదృష్టిని ప్రసరింపజేయాల్సి వుంటుంది.

పరిష్కరణ ఘట్టం పూర్తయిన తర్వాత అధ్యయన విషయంలో ప్రముఖ స్థానాన్ని వహించేది విశ్లేషణ. కథలో రెండు విషయాలలో ఈ విశ్లేషణ ఆరంభమవుతుంది. 1. కథారచనకు సంబంధించింది. 2. కథన రచనకు సంబంధించింది. మొదటిది కథా స్వరూపాన్ని, రెండోది సాంస్కృతిక మహత్తును నిరూపిస్తాయి. కథారచనకు సంబంధించిన జానపద కథని వివరణాత్మక, చారిత్రక మరియు తులనాత్మక అనే మూడు ప్రధాన విధానాలలో పరిశీలించాల్సి ఉంటుంది. ఈ విశ్లేషణలకన్నింటికి సంగ్రహించిన జానపద కథల వర్గీకరణ అత్యవసరం. వివిధ దేశాలకు సంబంధించిన వందలకొద్దీ జానపద కథలను పరిశీలించినప్పుడు ఈ కథల్లో సార్వత్రికత గోచరిస్తుంది.

జానపద కథల వర్గీకరణ విధానంలో ఇంతకు ముందే పేర్కొన్నట్లుగా కథన ఘటకం (Motif) మరియు మాదిరుల (Types) పాత్ర గమనార్హమైంది. స్థూలంగా కథన ఘటకం కథావస్తువుకు సంబంధించింది అయితే మాదిరి దాని శిల్పానికి సంబంధించింది . జానపద కథా మూలాలను పునర్నిర్మించడంలో ఈ రెండింటి పాత్ర ప్రశంసించపదగింది.

## భారతదేశంలో జానపద కథల సేకరణ:

జానపద విజ్ఞాన సంగ్రహకార్యం ఐరోపా ఖండంలో పందొమ్మిదవ శతాబ్దం మొదటి భాగంలో ఆరంభమైంది. 1812లో గ్రిమ్ సోదరులు Kinder und-Hausmarchen అన్న కథా సంకలనాన్ని ప్రచురించి, కథా సంగ్రహ కార్యానికి నాందీ పలికి తక్కినవారికి మార్గదర్శకులైనారు.

భారతదేశంలో జానపద సాహిత్య సేకరణ పాశ్చాత్య పండితుల వల్లనే ఆంగ్లంలోనే మొట్టమొదట జరిగింది. అబ్బే డూబాయిస్‌గారి 'హిందూ మ్యానర్స్ అండ్ కస్టమ్స్' అన్న గ్రంథం 1816లో వెలువడింది. ఇందులో కొన్ని జానపద కథలు ఉన్నాయి. 'ఓల్డ్ డెక్కన్ డేస్' లేదా 'ఇండియన్ ఫేరీ లిజెండ్స్ కరెంట్ ఇన్ సౌత్ ఇండియా' అన్న గ్రంథాన్ని ఎం. ఫ్రేరె 1868లో వెలువరించారు. ఇదే భారత దేశంలోని ప్రప్రథమ సేకరణ గ్రంథమని చెప్పబడుతోంది. 1879లో స్టోక్ అనే

అతను 'ఇండియన్ ఫేరీటేల్స్'ను ప్రచురించారు. 1883లో బెంగాలీ కథల సంకలనాన్ని ఎల్.బి.డే ప్రకటించారు. 1887లో జె.హెచ్.నోవెల్స్ కాశ్మీరు జానపద కథలని ప్రచురించారు. 1892లో జె. జాకొబ్'ఇండియన్ఫేరీటేల్స్' అన్న గ్రంథాన్ని ప్రకటించాడు. 1884-85, 1900లో ఆర్.సి. టెంపల్ 'లిజెండ్స్ ఆఫ్ పంజాబ్' అన్న గ్రంథాన్ని మూడు సంపుటాలలో ప్రచురించాడు. 'ఫోక్టేల్స్ ఆఫ్ సదరన్ ఇండియా' అన్న గ్రంథాన్ని పండిత నటేశ శాస్త్రిగారు 1884-1893లో ప్రచురించారు.

ఈ ఎమ్. గోల్డన్ 1909లో 'ఇండియన్ ఫోక్టేల్స్' అన్న గ్రంథాన్ని, పండిత నటేశశాస్త్రిగారు 1908లో 'ఇండియన్ ఫోక్టేల్స్' అన్న గ్రంథాన్ని ప్రచురించారు. 1916లో ఫోక్టేల్స్ ఆఫ్ అస్సాం' అన్న గ్రంథాన్ని జె. బారువాగారు, 1912లో డబ్ల్యూ. ఎం.సి. కుల్లక్ 'బెంగాలీ హౌస్ హోల్డ్టేల్స్'ను, 1919లో 'డెక్కన్ నర్సరీటేల్స్' లేదా 'ఫేరీటేల్స్ ఫ్రమ్ ది సౌత్' అన్న గ్రంథాన్ని సి.ఏ. కింకేయిడ్ ప్రచురించారు. బ్రాడ్లీ బర్ట్గారి 'బెంగాల్ఫేరీ టేల్స్' 1920లోను, సి.ఏ. కింకేయిడ్ గారి 'టేల్స్ ఆఫ్ ఓల్డ్ సింధ్' 1922లోను, పి.ఓ. బోడ్డింగ్గారి 'సంతాల్ఫోక్టేల్స్' (మూడు సంపుటాలు) 1925-29 ప్రాంతంలోను ప్రచురించబడ్డాయి.

భారతదేశంలో సేకరించబడిన మరికొన్ని జానపద కథాసంకలనాలు.

1. ఛార్లెస్ స్విన్నెర్టన్ - 'రోమాంటిక్ టేల్ ఫ్రమ్ ది పంజాబ్' (1928)
2. జె. బారువా - 'ఫోక్ టేల్స్ ఆఫ్ అస్సామ్' (1915)
3. ఎన్. కాశీంద్రనాథ్ బెనర్జీ - 'పాపులర్ టేల్స్ ఆఫ్ బెంగాల్' (1905)
4. ఎస్. బి. బెనర్జీ - 'టేల్స్ ఆఫ్ బెంగాల్' (1910)
5. విల్ఫ్రెడ్ ఇ. డెక్టర్ - మరాఠీ ఫోక్టేల్స్ (1938)
6. డబ్ల్యూ. హెచ్.డి. రేస్ - 'ది టాకింగ్ ట్రీస్ అండ్ అదర్ టేల్స్' (1938)
7. డా. వరియర్ ఎల్విన్ - 'ఫోక్టేల్స్ ఆఫ్ మహాకోశల్' (1944)
8. ఎం.జి. ఆండర్సన్ - 'ఇండియన్ ఫేబల్స్ అండ్ లిజెండ్స్' (1936)
9. ఏ.యస్. పి.అయ్యర్ - 'ఫేమస్ టేల్స్ ఆఫ్ ఇండియా' (1954)
10. సురేశ్ భాట్నగర్ - 'సచిత్ర్ కురుప్రదేశ్కీ లోక్ కథాయే' (1959)

11. పంచిప్రీతమ్ సింగ్ - 'పంజాబ్ కీ లోక్ కథాయే' (1957)

12. జ్ఞానేంద్రకుమార్ బాట్‌నగర్ - 'సచిత్ర కేరళ్ కీ లోక్‌కథాయే (1958)

13. జ్ఞానేంద్రకుమార్ బాట్‌నగర్ - 'సచిత్ర తమిళ్‌నాడ్ కీ లోక్‌కథాయే (1959)

14. జ్ఞానేంద్రకుమార్ బాట్‌నగర్ - 'సచిత్ర కర్నాటక కీ లోక్‌కథాయే (1959)

15. ఏసియా పబ్లిషింగ్ హౌస్, బాంబే - 'ఫోక్‌టేల్స్ ఆఫ్ రాజస్థాన్' (1964)

ఇలాగే ఎమ్.బి.ఎమెనో దక్షిణభారత జానపద కథలని అధ్యయనం చేసి కొన్ని వ్యాసాలను పత్రికలలో ప్రచురించారు. కర్నాటక రాష్ట్రంలో వందకు పైగా జానపద కథా సంకలన గ్రంథాలు వెలువడ్డాయి. స్టెర్లింగ్ పబ్లిషర్సు, ఢిల్లీవారు భారతదేశంలోని పెక్కు రాష్ట్రాల జానపద కథలను (ప్రత్యేకంగా ఆయారాష్ట్రాల వారీగా) ఆంగ్లంలో ప్రచురించారు. ప్రధానంగా జానపద కథల సేకరణ కృషిని గురించి మాత్రమే ఇక్కడ ప్రస్తావించడం జరిగింది. మరికొన్ని వివరాలకు డా.శ్యామ్‌పర్మార్ మరియు శ్రీ శంకరసేన్ గుప్తాగారల 'ఎ బిబ్లియోగ్రఫీ ఆఫ్ ఇండియన్ ఫోక్‌లోర్ అండ్ రిలేటెడ్ సబ్జెక్ట్స్' అన్న గ్రంథాన్నీ, డా. జవహర్‌లాల్ హండూగారి 'ఎ బిబ్లియోగ్రఫీ ఆఫ్ ఇండియన్ ఫోక్‌లోర్' అన్న గ్రంథాన్నీ, హెచ్.సి. ప్రసాద్ మరియు గీతాసేన్‌గుప్తాగారల 'ఎ' బిబ్లియోగ్రఫీ ఆఫ్ ఫోక్‌లోర్ ఆఫ్ బీహార్' అన్న గ్రంథాన్ని చూడగలరు.

## ఆంధ్రదేశంలో జానపద కథల సేకరణ:

తెలుగులో చెప్పుకోదగినంత సేకరణ కానీ, అధ్యయనం కానీ జరగలేదు.

1900లో శ్రీ పండిత నటేశ శాస్త్రిగారు తెనాలి రామలింగని కథలను సేకరించారు. ఆంగ్లంలో 'హీరమ్మ అండ్ వెంకటస్వామి ఆర్ ఫోక్‌టేల్స్ ఫ్రమ్ ఇండియా' అన్న గ్రంథాన్ని ఎం.ఎన్. వెంకటస్వామిగారు 1913లోను, 'హ్యూమరస్ స్టోరీస్ ఆఫ్ తెనాలి రామలింగం' అన్న గ్రంథాన్ని టేకుమళ్ళ రాజగోపాలరావు గారు 1913లోను, 'టేల్స్ ఆఫ్ ఎ తెలుగు పరియా ట్రైబ్' అన్న గ్రంథాన్ని Hodder & Stoughton 1899లో లండన్‌వారు ప్రచురించారు.

'ఫేమస్ టేల్స్ ఆఫ్ ఇండియా' అన్న గ్రంథంలో కొన్ని తెలుగు కథలు, 'జాలీ ఓల్డ్ టేల్స్ ఆఫ్ ఇండియా' (1945) అన్న గ్రంథంలో మరికొన్ని తెలుగు కథలు ఉన్నాయి.

డా. బి. రామరాజుగారి 'ఫోక్‌టేల్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్' అన్న గ్రంథాన్ని స్టెర్లింగు పబ్లిషర్సు, ఢిల్లీవారు 1974లో ప్రచురించారు. ఇందులో 39 తెలుగు జానపద కథలను ఇంగ్లీషులోనికి అనువాదం చేయడం జరిగింది. ఇవన్నీ కూడ ఆంధ్రదేశంలో బాగా ప్రచారంలో ఉన్నవే. ఈ కథల్లో అధికం నీతిని బోధించేవి. తక్కిన వాటిలో హాస్యం, విశ్వాసం, తుంటరితనం మొదలైన అంశాలు ఉన్నాయి.

డా. కర్ణరాజు శేషగిరిరావుగారు 'తెలుగు ఫోక్‌టేల్స్ రీటోల్డ్ ఇన్ ఇంగ్లీష్' అన్న గ్రంథాన్ని ప్రచురించారు. ఇందులో 12 తెలుగు జానపద కథలు ఆంగ్లంలో చెప్పబడ్డాయి. సింగడు, మాంచాల, కాంభోజరాజు, బ్రహ్మనాయుడు మొదలైన వాళ్ళ కథలు, అనగనగా ఒకరాజు, రామలింగడి పిల్లి ఇత్యాది ప్రసిద్ధమైన జానపద కథలు ఉన్నాయి.

పోతే గుజిలీ పాటల విక్రేతలే తెలుగు జానపద కథల్ని కూడ అచ్చువేయడం జరిగింది. వాటిలో వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండు సన్సు, ఎన్.వి. గోపాల్ అండ్ కో, కాళహస్తి తమ్మారావు అండు సన్సు, సి.వి. కృష్ణాబుక్ డిపో, యస్. అప్పలస్వామి అండు సన్సు, తెనాలి ఆంధ్రరత్న బుక్ డిపో, జనరల్ బుక్‌డిపో, గొల్లపూడి వీరాస్వామి అండ్ సన్, కొండా శంకరయ్య, శ్రీ లక్ష్మీనారాయణ బుక్ డిపో మొదలైన ప్రచురణ సంస్థలు పేర్కొనదగ్గవి. 'తెలుగు జాతీయముల కథలు' అనే పేర్తో ముసునూరి వెంకటశాస్త్రిగారు, 'ఆంధ్రదేశీయ కథావళి' అనే పేర్తో వేకుమళ్ళ రాజగోపాలరావుగారు పుస్తకాలను ప్రచురించారు.

అయితే పైన పేర్కొనబడినవన్నీ జానపదుల భాషలోనే యథాతథంగా సేకరింపబడ్డవి కావు. జానపద కథలోని భాషనీ, మారుమూల పదాలనీ, పలుకుబళ్ళనీ, సాంఘిక పద్ధతుల్నీ అధ్యయనం చెయ్యడానికి ఇవి అంతగా ఉపకరించవు. జానపదుల మాటల్లోనే యథాతథంగా అచ్చమైన జానపద కథలని సేకరించినప్పుడు కూలంకషమైన అధ్యయనం చెయ్యడానికి వీలవుతుంది. తెలుగు భాష మీద తక్కిన భాషల ప్రభావం, ఆంధ్ర సంస్కృతిమీద తక్కిన ప్రాంతాల

సంప్రదాయాలు, ఆచార వ్యవహారాల ప్రభావం క్షుణ్ణంగా తెలుసుకోవడానికి జానపదులనుండే సేకరించిన కథలు దోహదం చేస్తాయి.

## తెలుగు జానపద కథలు-నేటి పరిస్థితి:

తెలుగులో జానపదగేయాలను సేకరించిన ప్రయత్నంలో కనీసం నూటిలో ఒకటవవంతైనా జానపద కథల సేకరణ విషయంలో జరగలేదంటే ఆశ్చర్య పడాల్సిన అవసరం లేదు. కన్నడిగులతో పోల్చి చూచుకుంటే మనం నిజంగా సిగ్గుపడాలి. జానపద గేయాలు, జానపద కథల సేకరణ విషయంలో వాళ్ళు మనకంటే ఎన్నో అడుగులు ముందున్నారు. కన్నడంలో లెక్కలేనని జానపద కథాసంకలన గ్రంథాలు వెలువడ్డాయి. కొంతవరకు కథల విశ్లేషణ కూడ జరిగింది. రెండు, మూడు సిద్ధాంతవ్యాసాలు వచ్చాయి. తెలుగులో జానపద కథాసంకలన గ్రంథాలు నాకు తెలిసినంత వరకు రెండు మాత్రం వచ్చాయి. అవి 'యువభారతి', హైదరాబాదు వారు ప్రచురించిన డా. జి.ఎస్.మోహన్‌గారి 'తెలుగు జానపద కథలు', డా. కె. సుమతిగారి 'జానపద కథాస్రవంతి' (జానపద విజ్ఞాన భారతి, మైసూరువారి ప్రచురణ).

డా. కె. సుమతిగారు 'తెలుగు జానపద కథలు' అన్న విషయం మీద 1980లో ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచీ, డా. బి. బాలస్వామిగారు 'మహబూబ్‌నగర్ జిల్లా జానపద కథలు' అన్న విషయం మీద 1986లో ఉస్మానియా విశ్వవిద్యాలయంనుంచీ (సిద్ధాంతవ్యాసం 1987లో ప్రచురింపబడింది), అనంతపురం జిల్లా జానపద కథలు' మీద మైసూరు విశ్వవిద్యాలయం నుంచి 1988లో డా. సి. పెద్దిరెడ్డి పిహెచ్.డీలు సంపాదించారు.

అసలైన జానపద కథల సేకరణ తెలుగులో జరగక పోవడం వల్ల తెలుగు జానపద కథలు ఎంత విస్తృత పరిధిలో ఉన్నాయో, ఎంతటి వైవిధ్యంతో కూడుకొని ఉన్నాయో అంతుపట్టకుండా ఉంది. తెలుగులో అధికంగా గ్రంథరూపంలో వచ్చిన జానపద కథలన్నీ సంస్కృతం లేదా ఇతర భాషలనుండి అనువదింపబడ్డవే. జాతక కథలు, కథాసరిత్సాగరం, భట్టి విక్రమార్కుని కథలు, పంచతంత్ర కథలు ఇత్యాదులన్నీ ఈ కోవకు చెందినవే.

ఆంధ్రదేశంలో లెక్కలేనన్ని జానపద కథలూ, లెక్కకు మిక్కుటంగా జానపద కథకులూ ఉన్నారు. ఉన్న చిక్కంతా సేకర్తలు లేకపోవడమే, ఉన్నావారికి తగిన ఆదరణ, ప్రోత్సాహం, ఆర్థిక సహాయం లేకపోవడమే. ఒకప్పుడు జానపద సాహిత్యం అనాదృత వాఙ్మయంగా తిరస్కరింపబడ్డా, ఇప్పుడిప్పుడు జానపద విజ్ఞానం ఆదరణీయ సాహిత్యంగా ప్రజల మన్నలను చూరగొంటున్నది. అయితే ఈ ఆదరణ కేవలం మాటల్లోనే వుంది. ఏమైనా అటు ప్రభుత్వం, ఇటు ప్రభుత్వ సంస్థలు జానపద సేకరణ విషయంలో శ్రద్ధ చూపాలి; పరిశోధకులకు నిధులు సమకూర్చాలి. ఈ జానపద కథా సంప్రదాయాన్ని ఇంకా నిలుపుకుంటూ వస్తున్న వ్యవహర్తలకు ఆర్థికంగా సాయం చేయాలి. వృత్తి జానపద కథకులను ప్రోత్సహించాలి. అలా అయినప్పుడే జానపద కథల సేకరణ కొంతవరకైనా జరుగుతుంది. సేకరణతో తృప్తి పడకుండా, సేకరించిన వాటిని మానవశాస్త్ర పరంగానూ, భాషాశాస్త్రపరంగానూ, చారిత్రకంగానూ, సామాజిక శాస్త్ర పరంగాను, తులనాత్మకంగాను విశ్లేషించి అధ్యయనం చెయ్యడానికి పూనుకోవాలి.

చివరగా ఒక విషయం. 'జానపద విజ్ఞాన మూలాన్ని నిర్ధరించడంలోనూ, దాని ప్రసరణ గుణాన్ని పరిశీలించడంలోనూ, దాని చారిత్రక భౌగోళిక రూపాలను పరిశోధించడంలోనూ ఇతర జానపద విజ్ఞాన ప్రక్రియల కంటే కథలదే మైలురాయి' అన్న విషయాన్ని మనందరం గుర్తుంచుకోవాలి. (ది స్టడీ ఆఫ్ ఫోక్ లోర్, పుట 53 అలన్ డండస్).

* * *

# 9. కథన ఘటకాలు
## (Folk Motifs)

ఆంగ్లంలో 'Motif' అనే పదానికి తెలుగులో సమానార్థకంగా 'కథన ఘటకం' అనవచ్చు. కొందరు దీన్నే 'కథన చోదకం' అనీ అంటారు. జానపద కథల్ని, కథల పాటల్ని అభ్యసించటంలో ఇది అమితంగా తోడ్పడుతుంది. కన్నడంలో Motif అనే పదాన్ని 'ఆశయ', 'ప్రేరక', 'కథనఘటక' అనే శబ్దాలతో పిలవడం కద్దు. ఇది కథలోని కనిష్ఠాంశం. దీన్నే మూలాంశం అనీ అనవచ్చు. దీనికి మౌఖిక సంప్రదాయంలో స్థిరంగా నిలిచే శక్తి వుంటుంది. Stith Thompson దృష్టిలో Motif అంటే 'The smallest element in a tale having the power to persist in oral tradition'.[1]

స్థూలంగా Motif కథావస్తువును సూచిస్తుంది. కథలోని ఒక అంశాన్ని విశ్లేషించేటపుడు అందలి ఒక చిన్న భాగం లేదా కనిష్ఠాంశాన్ని కథన ఘటక మనవచ్చు. ఇది సామాన్యంగా అసామన్య విషయాలకు అన్వయిస్తుంది. ఉదాహరణకు 'తల్లి' Motif కాదు. 'సవతి తల్లి' ని Motif గా చెప్పవచ్చును. సవతి తల్లిలో గల క్రూరత్వం సాధరణ తల్లులలో కనబడక పోవటమే దీనికి కారణం. ఇక్కడ క్రూరురాలైన ఒక తల్లి విశేషం. తనయుని హత్యగావించుటకై విషనాగును చంపి వంట చేసి వడ్డించే తల్లి అపూర్వంగా కన్పిస్తుంది. కనుక ఈమెయే కథలోని కథన ఘటకం.

జీవితంలోని సామాన్య విషయాలు కథన ఘటకాలు కానేరవు. ఈ విషయమై Stith Thompson ఉదాహరించిన కథన ఘటకం స్పష్టంగా వుంది. జాన్ వస్త్రాలను ధరించి పట్టణానికి వెళ్ళాడు అనేది కథన ఘటకం కానేరదు. ఇందులో మనసులో ఉంచుకొనే విశేషమేదీ లేదనడం స్పష్టం. ఇది సాధారణ విషయం. కాని నాయకుడు అదృశ్యం కావడానికి సహాయకాలైన టోపీ ధరించి, మంత్రపు జమఖానాను ఎక్కి, సూర్యుని తూర్పుదిక్కునకు, చంద్రుని పశ్చిమ దిక్కునకు గల ప్రదేశానికి వెళ్ళాడు అనే మాటల్లో కనిష్ఠం నాలుగు కథన ఘటకాలున్నాయి. అవి టోపీ, జమఖానా, మంత్రపు ఆకాశ ప్రయాణం మరియు

---

1. *Folktale, P-415.*

అద్భుత భూమి అనేవి. కనుక సాంప్రదాయిక కథలోని ఏదైనా ఘటకాన్ని గ్రహించి దాన్ని కథన ఘటకంగా భావించి స్థూలంగా ఉపయోగించినా అది తరతరాలుగా ప్రజల మనస్సుల్లో హత్తుకొని పోవటానికి దాంట్లో ఏదైనా విశేషముండి తీరాలి. అది అతి సామాన్య విషయంగా వుండరాదు. ఈ విషయాన్నే Stith Thompson 'while the term motif used very loosely to include any of the elements going into a traditional tale, it must be remembered in order to become a real proof of tradition an element must have something about it that will make people remember and repeat it. It must be more than common place'.[2]

జానపద కథల్లోని కథన ఘటకాలు ఒక్కొక్కప్పుడు సాంప్రదాయిక కథల్లో మాటిమాటికి కన్పించే సరళమైన కల్పనల్లా వుంటాయి. ఇవి అసామాన్య విషయాలైన 1. యక్షులు (Fairies), మంత్రగత్తెలు (Witches), క్రూరసర్పాలు (Dragons), క్రూర ప్రవృత్తిగల సవతి తల్లులు (Cruel stepmothers), మాటలాడే జంతువులు (Talking animals) మొదలగునవి. 2. ఇంద్ర జాలిక (magic) వస్తువులు, మాంత్రిక చర్యలు కలిగిన నేలలు, అద్భుతాలైన ఇతర ప్రపంచాలు, అసంభవాలైన భౌతిక సంఘటనలు (unusual physical phenomenon) కథన ఘటకాలుగా వుండవచ్చు. 3. శ్రోతలకు ఆకర్షణీయాలైన, మనోరంజకాలైన సామాన్య సంఘటనలు కథన ఘటకాలుగా ఉండవచ్చును. కథన ఘటకము అతి చిన్న సరళమైన కథను కలిగియుండవచ్చు[3]. ఇలా కథన ఘటకాలు 'పాత్రలు, సంఘటనలు, వస్తువులు' అని మూడు విధాలుగా కనబడుతున్నాయి.

జానపద కథలు వీరగాథలు మొదలైన వాటిలోని కథన ఘటకాల్ని Stith Thompson ఆరు సంపుటాలు కలిగిన తమ Motif Index of Folk Literature లో పొందు పరచియున్నారు. వీరి సంపుటాలు అక్షరాలచే గుర్తింపబడే అధ్యాయాలుగాను (ప్రధాన విభాగాలు), అధ్యాయాలు దశాంశ పద్ధతికి అనుగుణంగాను వర్గీకరింపబడి వున్నాయి. ఉదాహరణకు A to z వరకు వుండే అధ్యాయాలు కథన ఘటకాల పెద్ద పెద్ద విభాగాలను సూచిస్తాయి. అంటే A పౌరాణిక కథన ఘటకాల్ని, B జంతువుల కథన ఘటకాల్ని, C ప్రాచీన నిషేధాల్ని

2. *Funk & Wagnalls Standard Dictionary of Folklore, Mythology and Legend, P-753.*

3. *Ibid.*

(Primitive idea of tabu) D ఇంద్రజాలం మొదలైన వాటిని సూచిస్తాయి. ఇలా A నుంచి Z వరకు గల అధ్యాయాల్లో పలు విషయాలు అమర్చబడి ఉన్నాయి. ఈ అధ్యయాలు మళ్ళీ శతాంశాలుగా వింగడింపబడ్డవి. ఉదాహరణకు B0 నుంచి B199 వరకు గల అంశాలు మాంత్రిక శక్తి కలిగిన జంతువులు (Magic Animals), B200 నుంచి B299 వరకు గల అంశాలు మనుష్య గుణాలు కలిగిన జంతువులు మొదలగునవి. ఈ విభాగం మళ్ళీ దశాంశ పద్ధతిలో విభజింపబడింది. ఈ దశాంశాలు అధ్యాయపు సాధారణోద్దేశాన్ని సూచిస్తాయి. విశేషాంశాలు తరువాతి విభాగం (Succeeding Division) లో చెప్పబడతాయి. ఈ అధ్యాయాల్లోని చివరి దశాంశ విభాగం ప్రకీర్ణక విషయాల్ని (Miscellaneous material)ను సూచిస్తుంది. ఉదాహరణకు B అధ్యాయంలోని B0 నుంచి B99 వరకుగల పురాణ సంబంధమైన జంతువులు (Mythical Animals) ఈ క్రింది విభజనను కలిగి వున్నాయి.

**B0-B9** పురాణ సంబంధమైన జంతువులు - సాధారణం

**B10-B19** పురాణ సంబంధమైన జంతువులు (Mythical beasts)

**B20-B29** జంతువులు - మనుష్యులు (Beasts - Men)

**B30-B39** పురాణ సంబంధమైన పక్షులు (Mythical Birds)

**B40-B49** పక్షులు - జంతువులు (Birds- Beasts)

**B50-B59** పక్షులు - మనుష్యులు (Birds-Men)

**B60-B69** పురాణ సంబంధమైన చేప (Mythical Fish)

**B70-B79** చేపలు - జంతువులు (Fish- Beasts)

**B80-B89** చేపలు - మనుష్యులు (Fish-Men)

**B90-B99** ఇతర పురాణ సంబంధమైన జంతువులు (Other mythical animals)

B0 అనేది పై విభాగంలో సాధారణాంశం. తక్కిన 1,2,3,4 మొదలైన వాటితో కూడిన సంఖ్యలు ప్రత్యేకమైన విషయాలతో సూచింపబడతాయి. చివరి సంఖ్య ప్రకీర్ణాలనో, అనుబంధాలనో చేర్చటానికి వీలుగా ఉంటుంది. కనుక B10-B19 వరకు గల భాగంలో తక్కిన విభాగాల నిలాచూపవచ్చును.

B10 - Mythical Beast
B11 - Dragon
B12 - Basilisk
B13 - Unicorn
B14 - Other hybird animals
B15 - Animals with unusual limbs or members
B19 - Other mythical beasts

సాధారణంగా అన్ని సంఖ్యల్ని దీంట్లో ప్రవేశపెట్టటం జరుగదు. తక్కిన ఇతర సంఖ్యలు అనిశ్చిత వివరణకు ఉపకరిస్తాయి. దీన్ని బట్టి '0' అనేది సాధారణోద్దేశాన్ని, '9' అనేది అనుబంధాల్ని చేర్చటానికి తోడ్పడుతుందని తేల్చవచ్చు. అనుకొన్న దానికంటె అధిక సంఖ్యలు గల విషయాలు లభిస్తే ఆఖరి సంఖ్యకు జతపరుపవలసి వుంటుంది. ఉదాహరణకు 19.1, 19.2, 19.3 మొదలయినవి. తరచుగా ఒక సంఖ్యను మరల చిన్నభాగాలుగా చేయటం సంభవిస్తుంది. ఇది బిందువులతో గుర్తింపబడుతుంది. ఉదాహరణకు

B11 - Dragon
B11.1 - Origin of Dragon
B11.1.1 - Dragon from Cock's egg
B11.1.2 - Dragon from transforming horse
B11.2 - Form of Dragon
B11.2.1 - Dragon as compound animals.

పై విధంగా కథలు, పురాణాలు, కథల పాటలు, సంప్రదాయాల్ని ఒక పట్టీగా తయారు చేస్తే అవి తులనాత్మక అధ్యయనానికి ఉపకరిస్తాయనటంలో సందేహం లేదు. ప్రపంచంలోని వివిధ సంస్కృతులకు సంబంధించిన కథనాల్ని అధ్యయనం చేసే విద్యార్థికి, అంతర్జాతీయ సంబంధాల్ని చూపటంలో ఈ కథన ఘటకాల పరిశోధన మిక్కిలి తోడ్పడుతుంది.

కథన ఘటకాలు కేవలం జానపద కథల్లోనే కాక వీరగాథలు (Heroic Ballads) కథల పాట (Narriative Poems)ల్లోను అధిక సంఖ్యలో కన్పడుతున్నాయి. నేను సేకరించిన స్త్రీల కథల పాటల్లోని కొన్ని కథన ఘటకాల్ని కొన్ని జానపద కథల్లోని కథన ఘటకాల్ని, ఉదాహరించి వాటిని Stith Thompson

గారి Motif Index of Folk Literature (6 volumes) లో ఈయబడ్డ కథన ఘటకాలతో సరిపోల్చి నిర్దిష్టమైన సంఖ్యల్ని పేర్కొంటాను.

'సాకల దుడుమన్న కథ'[4] లో సంతానం కొరకు అక్కమ్మ ఒడుగులు లేని బ్రాహ్మణులకు ఒడుగులు చేయించటం, పెండ్లిండ్లు కాని వారికి పెండ్లిండ్లు చేయించటం, పాలులేని బాలలకు పాలసత్రాల్ని కట్టించటం, చములులేని బాలలకు చములు సత్రాల్ని కట్టించటం అనేవి 'Q 523.8 Penance: performing all services asked for by any one' అనే కథన ఘటకానికి సంబంధించినవి.

అక్కమ్మ తపస్సు చేయగా దేవుడు (సూర్యుడు) ప్రత్యక్షమై వరమివ్వటం, ఒక గజనిమ్మ పండును కోసుకొని తినమని చెప్పగా ఆశతో ఒడినిండా పండ్లు కోయటం, చివరికి ఒకటే మిగలటం, ఏడు అడుగులతో నగరు అందుకోవటం, పండు తినే సమయానికి 'సాకలి ఈరమ్మ' రాగా ఆమెకు పండుపైని 'తోలు'ను ఇచ్చి తాను పండును తినటం, పిమ్మట ఇద్దరూ గర్భిణులవటం మొదలయినవి సంతాన పోషక విషయాలే గాక కథన ఘటకాలు కూడ అవుతాయి.

దేవుడు ప్రత్యక్షమై వరాన్ని కోరుకొమ్మంటే అక్కమ్మ ఆడసంతానాన్ని కోరుకొంటుంది. దైవం అనుగ్రహిస్తాడు. ఇదొక కథన ఘటకం. 'A 115 Reward of any boom that may be asked' అనే కథన ఘటకానికి సంబంధించింది. ఇక్కడ అక్కమ్మ ప్రత్యేకంగా ఆడసంతానాన్నే కోరింది. దీనికి Motif Index of Folk literture లో నిర్దిష్టమైన సంఖ్య ఈయబడలేదు. కనుక దీన్ని 'Q 115.3 Reward: any boom that may be asked - man asks only for son' అనే కథనఘటకం తరువాత చేరిస్తే అప్పుడు దీనికి Q115.4 సంఖ్యను సూచింపవచ్చు.

గజనిమ్మపండును తినటంవల్ల గర్భం ధరించటం - దీనికి రెండు కథన ఘటకాల్ని సూచింపవచ్చు. ఒకటి పండులోపలి భాగాన్ని తినటం, మరొకటి పండుపై భాగామైన 'తోలు'ను తినటం. Motif Index of Folk literature లో కేవలం 'T511.1.2 conception from eating lemon' అని మాత్రమే చెప్పబడింది. ఈ కథన ఘటకానికి సాధారణ సంఖ్య మాత్రమే ఈయబడింది. పండు 'తోలు'ను తినటానికి మరొక సంఖ్య చెప్పబడలేదు. ఇక్కడ పండు లోపలి

4. ఇది నేను అనంతపురమండలంలో సేకరించిన స్త్రీల కథలపాట.

భాగాన్ని, పండు తోలును తిన్నవారు ఇరువురు ఒకరుకారు. కనుక మొదటిదానికి T 511.1.5 అనీ, రెండో దానికి T 511.1.5.2 అనీ కొత్తగా సంఖ్యల్ని సూచింప వచ్చు. ఈ కథన ఘటకాన్నే 'A 1253-1 creation of man from furit' అనే సంఖ్యలోనూ చేర్చవచ్చు.

## ముద్రితాలైన స్త్రీల కథల పాటల్లో కన్పించే కొన్ని కథన ఘటకాలు:

**ధర్మాంగద చరిత్రయను పాము పాట:** అర్మిలీదేవి సర్పాన్ని ప్రసవించటం - T 554.7 woman gives birth to a snake

సర్పాన్ని రాజకన్యకిచ్చి వివాహమొనరించటం – B604.1: Marriage to a snake

సర్పం మనుష్యాకృతిని పొందటం – D 391: serpent (snake) to person

**మార్కండేయ చరిత్ర:** శివుడు మార్కండేయునికి దీర్ఘాయువు నొసగటం

**1. Q145:** miraculously long life as reward

**2. Q 143:** Superior rebirth as reward.

**రుక్మాంగద చరిత్ర:** రుక్మాంగదుడు ఖడ్గాన్ని ధర్మాంగదుని కంఠంపై వేయబోగా అది పుష్పమాలిక కావటం - D 44.9: Transformation weapon to other object

## కొన్ని జానపద కథలు – కథన ఘటకాల సంఖ్యలు:

**తెనాలి రామలింగని కథలు:**

చిలుక పలుకులు: B 211.3.4: speaking parrot

దెబ్బల బహుమానం: J 1189: clever means of avoiding legal punishment, miscellaneous

సాహుకారును వంచించడం: 1. J 1510: The cheater cheated

**2. K 1600:** Deceiver falls into his own trap miscellaneous incidents.

**భేతాళ కథలు:**

**విషపూరిత భక్ష్యాలు:** 4. 1515: poisoned food test (Attempt to kill hero by feeding him poisoned food)

**మంత్ర పఠనం ద్వారా బూడిదను మానవ శరీరంగా మార్చటం:** D 573.1: Transformation by written spell

**ఒకరి ప్రాణత్యాగంవల్ల మరొకరు బ్రతకటం:** 260.1: Human sacrifice

**మర్యాద రామన్న కథలు:**

**కాళికాదేవి వరమివ్వటం:** 1. Q 20.1: Reward for service of God, hero or asectic for a peried.

**2. Q 115:** Any boon that may be asked

**నిక్షేపరాయుడు:** J 1700: Foods

**నవరత్నమాల దొంగతనం:** K 439: Theif loses his goods is detected.

ఇలాగే విక్రమార్కుని కథలు, రేచుక్క పగటి చుక్క కథలు, పరమానందయ్య శిష్యుల కథలు మొదలయిన జానపద కథల్లోను, బాలచంద్రుని యుద్ధం (పల్నాటి వీరచరిత్ర), బొబ్బిలి యుద్ధ కథ మొదలైన వీరగాథల్లోను కథన ఘటకాలు మిక్కుటంగా వున్నాయి. సాధారణంగా కథన ఘటకాలు జననం, ఆత్మ, మాంత్రిక చర్యలు, వీరారాధన, దేవీపూజ, జంతు సహాయం, శకునాలు మొదలయిన వాటికి సంబంధించిన అంశాలుగా వుంటాయి.

Stith Tompson గారి Motif Index of Folk literature లోని కొన్ని కథన ఘటకాల్ని - నిర్దిష్ట సంఖ్యల్ని ఉదాహరిస్తాను.

| | | |
|---|---|---|
| B 211 | : | Animal uses human speech |
| B 143 | : | Prophetic Bird |
| O 192 | : | Child given as reward for prayer |
| T 580 | : | Child Birth |
| Q 195 | : | Blessings |
| B 147 | : | Animals furnish Omens |

| | | |
|---|---|---|
| B 300 | : | Helpful animal |
| A 2536 | : | Animals of good oman |
| D 1925.4 | : | Barrenness removed by saints belssing. |
| P 16.4.1 | : | Suttee wife burned with dead king |
| T 211.2.1 | : | Wife throws herself on husband's funeral pyre |
| A 1487.1.1 | : | Origin of astrology |
| P 481 | : | Astrologer |
| M 301 | : | Prophet |
| D 1812.5.0.1 | : | Omens from sneezing |
| D 1182.5.1 | : | Bad omens |
| B 291.1 | : | Bird as letter carrier |
| D 1812.5.2.1 | : | Throbbing of right eye as favourable omen |
| V 1.8.6 | : | Serpent worship |
| V 1.8.1 | : | Cow worship |
| S 264 | : | Sacrifice to river and seas |

ఇట్లేన్నెని కథన ఘటకాల్ని చూపవచ్చు. పై కథన ఘటకాలన్నీ జానపద కథలు, వీరగాథలు, స్త్రీల కథల పాటల్లో కన్పడుతున్నాయి.

* * *

# 10. సామెతలు
## (Proverbs)

సామెతను నిర్వచించటం అంత తేలికైన విషయం కాదు. అలా చేయటం ఏదో సామెత చెప్పినట్లే అవుతుంది. మనం నిత్యం ప్రతి ప్రసంగ విషయంలోను సందర్భానుసారంగా ఏదో సామెత చెప్పినట్లుగా ఉందే నీ సంగతి, అనే మాటను సామెతలాగే ఉపయోగిస్తాము. దానికి కారణం మనం అనుకొన్న సామెత సమయానికి జ్ఞాపకం రాకపోవటమే కాక ప్రతివిషయం వెనుకా ఏదో ఒక సామెత నిశ్చయంగా ఉంటుందనే భావం వల్లే, ఇలా ఉపయోగించటం పరిపాటి అయింది.

ఆంగ్లంలో సామెతను (proverb) అంటారు. 'A General or common saying' అని దీని అర్థం. హిందీ భాషలో 'కహావత్' అనీ, కన్నడ తుళు భాషల్లో 'గాదె' అనీ అంటారు. తమిళులు 'పళమొళి' అనీ, మలయాళీలు 'పళించొల్' అనీ సామెతను వ్యవహరిస్తారు.

సామెత అనే దానికి సమానమైన పదం కన్నడంలో 'సామతి.' ఈ 'సామతి' 'సామ్యతె'[1] నుంచి ఉద్భవించినట్లే తెలుగులో 'సామ్యము' నుంచి సామెత ఆవిర్భవించి వుండవచ్చు. 'సామ్య' శబ్దానికి 'సామ్యత' అనే అసాధరణ రూపమేర్పడి 'సామెత'గా మారి ప్రచారంలో వుందని డా. చిలుకూరి నారాయణరావుగారి అభిప్రాయం. ఈ పదం 15వ శతాబ్దంలోని వరహపురాణంలో తొలిసారిగా ప్రయోగించబడ్డది.

'నానుడి', 'లోకోక్తి', 'శాస్త్రం', 'జనశ్రుతి' అని సామెతకు పర్యాయ పదాలు. శాస్త్రమనే పదం రాయలసీమ ప్రాంతంలోను, ఉత్తర కర్నాటక ప్రాంతంలోను వ్యవహారంలో వుంది. రాయలసీమ ప్రజలు ముఖ్యంగా అనంతపుర మండలవాసులు 'అదేమో శాస్త్రం చెప్పినట్లు' అని ప్రయోగిస్తారు. కన్నడిగులు 'అదేనో శాస్త్రహేళ్తారల్లా హంగే' అని ప్రయోగిస్తారు. 'అదేమో కథ చెప్పినట్లుగా ఉందే నీ వ్యవహారం' అని కూడ అనంతపుర మండలంలో ప్రయోగిస్తారు. ఈ

---

*1. సామతి Tbh of సామ్యతె - Likeness, A comparison, A simile, చూ. K.E. Dictionary by Dr. F. Kittel.*

కథ కూడ సామెతకు దగ్గరిదేననిపిస్తుంది. సాటువ, సాటవ, చాటువ, చాటవ అని నెల్లూరు సీమవాసుల వ్యవహారంలో ఉంది. సాటి అయినదే సాటువ అని డా. దివాకర్ల వేంకటావధానిగారి అభిప్రాయం.

నిత్య జీవితంలో మానవుడు సుఖదుఃఖాలను రెండింటిని సమానంగా అనుభవిస్తాడు. తాను అనుభవించిన దాన్ని ఇతరులకు ఉపదేశాత్మకంగా, సందేశ రూపంలో చిన్న వాక్యంలో అందిస్తాడు. అల్పాక్షరాలలో అనల్పభావాన్ని, అనుభవాన్ని సూటిగా చెప్పగలుగుతాడు. (Much matter decocted into a few words - Thomas Fuller) సామ్యతను చూపించి సామెతగా రూపొందిస్తాడు. జీవితం అనుభవాల కూడలి. అలాంటి అనుభవాల సంగమంలో జనించిందే సామెత. కేవలం అనుభవాలనుంచే కాక కథలలోని నీతులనుంచి కూడ ఏర్పడిన సామెతలెన్నో ప్రచారంలో ఉన్నాయి. ఉదాహరణానికి 'పోరునష్టి పొందు లాభం', 'ఇద్దరూ పోట్లాడితే మూడోవాడికి లాభం' ఇత్యాదులు.

సామెతలు అనుభవాలనుంచి పుట్టాయని అనుకొన్నప్పుడు, ఆ అనుభవం కేవలం ఒక్కనిదే కాదు, జనసామాన్యులందరిది కూడ. సామెత కూర్పు మాత్రం ఒక్కడిదే కావచ్చు. కాని అది పలువురి అనుభవం మీద ఆధారపడి ఉంటుంది. Earl Russel సామెతలు గురించి చెప్తూ 'the wit of one and the wisdom of many' అని పేర్కొన్నాడు.

ఒక సూక్తిని కట్టినంత మాత్రానికే అది సామెత అనిపించుకోదు. అది ప్రజామోదాన్ని పొంది జనజీవితంలో చలామణి అయితీరాలి. దీన్నే Archer Taylor 'Both the invention and the acceptance are essential to make a proverb' అన్నాడు. ఈ విషయాన్నే Eiselein 'A proverb is a sentence coined with the public stamp, current, and of acknowledged value among the poeple' అన్నాడు.

పాశ్చాత్య విద్వాంసులు సామెతలను గురించి నుడివిన అభిప్రాయాలు యథాతథంగా కొన్ని:

'A proverb may be merely a statement of fact'- ***Archer Taylor***

'A proverb is a racial aphorism which has been or still is in common use conveying advice or counsel invariably camouflaged

figuratively disguised in metaphor or allegory' - ***Dr. Selvin Champion.***

'Fragments of an elder wisdom' - ***Aristotle.***

'Proverbs are short and witty traditional expressions that arise as a part of everyday discourse as well as in the more highly structured situation of education and judicial proceedings. Such proverb is a small statement of an approach to a recurrent problem. Proverbs take a personal circumstance and emboding it in impersonal and witty form. Proverbs are nearly always stated in the form of a single sentence' - ***Roger D. Abrahams.***

'It is a short sentence found on long experience' - ***Cervantes***

'The sayings are short sententious, usually moral in purpose and of a severely practical nature' - ***James L. Haseltine.***

'Proverbs are the condensed wisdom of long experience, in brief epigrammatic form, easily remembered and always ready for use, they are the alphabets of morals, and are commonly prudential waterwords and warnings, and so lean toward selfish view of life' - ***T.T. Munger.***

'తొల్కాప్పియమ్' వ్రాసిన తొల్కాప్పియర్ సామెతను గురించి చెప్తూ "A proverb is a sentence meant for conveying particular idea. It should be based on reason. It must have the characteristics of point, brevity, wisdom and simplicity' అని పేర్కొన్నాడు. ఇది ద్రావిడ భాషలలో సామెతను గురించిన ప్రాచీనమైన అభిప్రాయంగా ఉంది. ('Vidya Bharathi', Bangalore University Journal, Vol.4, No.2, P.62).

శ్రీమతి దుర్గాభాగవత్ 'సంగ్రహంగా ఒక అప్రియమైన సత్యాన్ని చెప్పే సారభూతమైన వాక్యం సామెత'గా పరిగణించారు. 'సత్యాన్ని చెప్పడం మాత్రం అసంపూర్ణం, అది అతిశయోక్తిగా, ఆలంకారికంగా చెప్పబడుతుంది' అని ఆమె అభిప్రాయపడ్డారు.

పైన పేర్కొనబడ్డవారి అభిప్రాయాలను గమనిస్తే సామెతనిలా నిర్వచించవచ్చు. 'అనుభవయుక్తం, నీతిబోధాత్మకం, ఉపదేశాత్మకం, సూత్రబద్ధంగా ఉండి సంక్షిప్త వాక్యరూపంలో ఉండే లోకుల చమత్కారోక్తియే సామెత.' ఒకే సామెతలో ఈ నియమాలన్నీ ఉండి తీరాల్సిన అవసరం లేదు.

సామెతలోని వస్తువు సమాజం, ప్రజాజీవనం మాత్రమే. ప్రతి సామెతమీదా పరిసర ప్రభావం, సన్నివేశాల కాంతి స్ఫుటంగా కన్పిస్తుంది. సత్యప్రాధాన్యం, వాస్తవికత దీని లక్ష్యం. అస్వాభావికత మచ్చుకైనా కన్పించదు. Archer Taylor అన్నట్లు 'Most of the commonly used proverbs are metaphors drawn from daily life or the observation of nature or are terse summaries of experience.'

సామెతకు నాలుగు ప్రధాన లక్షణాలు ఉండాలి. 'Four Qualities are necessary to constitute a proverb: brevity (or, as some prefer to put it, conciseness), sence, piquancy or salt (Trench) and popularity' (Encyclopaedia of Religion and Ethics, Vol. 10, p, 412)

సామెతకు కొన్ని లక్షణాలను చెప్పవచ్చు. అవి 1. సంక్షిప్తత, 2. వాక్యరూపంలో ఉండటం, 3. అనుభవ రూపంలో ఉండటం, 4. తీక్ష్ణత, 5. వివేకవంతమైన అంశాన్ని కలిగి ఉండటం, 6. సార్వజనీనత, 7. ఉపదేశాత్మకత, 8. వాచ్యార్థం కంటె వ్యంగ్యార్థానికే ప్రాధాన్యమివ్వడం.

## వర్గీకరణం:

సామెతలను ప్రధానంగా రెండు విధాలుగా వర్గీకరింపవచ్చు. I. అకారాదిగా వర్గీకరించడం. ఇది రెండు విధాలు. 1. సామెతలోని మొదటి మాటను గ్రహించి అకారాదిని అమర్చడం. 2. సామెతలోని ముఖ్యమైన పదాన్ని తీసుకుని అకారాదిగా కూర్చడం. II. సామతలోని వస్తువును ఆధారంగా తీసుకుని వర్గీకరించడం. ఇది మొదటి పద్ధతికంటె శాస్త్రీయమైంది. మొదట ఒక వస్తువును అకారాదిగా కూర్చి, తర్వాత ఒక్కొక్క వస్తువుకు సంబంధించిన సామెతలను అకారాదిగా కూర్చవచ్చు.

R.S. Boggs సామెతలను ఆరువిధాలుగా వర్గీకరించాడు. 1. Proverbial metaphor, 2. Proverbial Aphothegm, 3. Blason populaire, 4. Wellerism, 5. Proverbial phrase, 6. Proverbial Comparison.

Margaret M. Bryant 'What to collect' అన్న శీర్షిక క్రింద ఎలాంటి సామెతల్ని సేకరించాలో పేర్కొన్నాడు. ఇది ఒక విధంగా భాషాశాస్త్రపరమైన వర్గీకరణకు సంబంధించింది.

1. Folk proverbs appearing as complete sentences (సంపూర్ణ వాక్యాలు)

   Ex: 'Barking dogs never bite'

2. Sententious sayings or proverbs of the learned in complete sentences. (వాక్యరూపంలో ఉన్న విద్యావంతుల సామెతలు)

   Ex: 'Sweet are the uses of adversity'

3. Proverbial rhymes (అనుప్రాసలు)

   Ex: 'Rain before seven, fair before eleven'

4. Proverbial sayings, not complete sentences, involving a verb (అసంపూర్ణ వాక్యాలు, క్రియాత్మకాలు)

   Ex: 'To be in hot water'

5. Proverbial sayings, not involving a verb (క్రియా రహిత సామెతలు)

   Ex: 'A bed of roses'

6. Proverbial Comparisons and similes(ఉపమలు)

   Ex: 'To fight like a tiger'

7. Wellerisms: comparisons like those made by Sam Weller in Dicken's pick wick papers (ఉదాహృత వాక్యాలు)

   Ex: 'All is well that ends well' said the peacock when he looked at his tail

8. Modern facetious proverbs and rimes (ఆధునిక సరసోక్తులు)

   Ex: 'A ring on the finger is worth two on the phone'

Warren Roberts దశమాంక పద్ధతిని ఉపయోగించి సామెతల్ని వర్గీకరించాడు. ఈ వర్గీకరణ విధానంలో మొదటి సంఖ్య ప్రధాన విషయాన్ని,

రెండవసంఖ్య ఆ విషయంలోని ఉపవిభాగాలను తెలియజేస్తుంది. మూడవ సంఖ్య ఈ ఉపవిభాగంలోని ఆ సామెత స్థానాన్ని తెలియజేస్తుంది. ఇంకా విశేషాలను చెప్పదలిస్తే, దాన్ని చివరి సంఖ్య ద్వారా చూపవచ్చు. ఉదాహరణానికి వయస్సుకు సంబంధించిన సంఖ్య 7. అందులో ముసలివాళ్ళను గూర్చిన వాటిని 4 అంకెతో సూచింపదలిస్తే, ఆ సామెత 7.4 అనే అంకెలోనికి చేరుతుంది. దీన్ని ఇంకా విభజించాల్సి వస్తే 7.4. 14.1 లేక 7.4. 14.2 అన్న సంఖ్యల్ని ఇవ్వవచ్చు. ఇలాంటి విభజనవల్ల సామెతల పరస్పర సంబంధాన్ని, వైవిధ్యాలను, ఉద్దేశాన్ని వెంటనే గుర్తించవచ్చు.

సామెతల్ని 'మౌఖిక ప్రచారా'లని, 'గ్రంథస్థా'లని రెండు విధాలుగా వర్గీకరింపవచ్చు. ధూర్జటి, శ్రీనాథుడు, పెద్దన, నానన సోమన, వేమన, పాల్కురికి సోమనాథుడు, మొదలైన కవులు తమతమ గ్రంథాలలో సామెతలను ఉటంకించారు. వీటిని 'గ్రంథస్థ సామెతలు'గా పేర్కొనవచ్చు. గ్రంథస్థం కాని సామెతలు మౌఖికాలు. ఈ విభజన అంతగా సరియైంది కాదు. విషయ ప్రాధాన్యాన్ని బట్టి సామెతలను వింగడించడం సమంజసం.

1. **సూత్రపు సామెతలు:** ఇలాంటి సామెతలలో సామెతలు సూత్రప్రాయంగా ఉండటమే కాకుండా, ఏదైనా ఒక విషయాన్ని స్థాపించడం జరుగుతుంది.

   ఉదా: 'దుష్టుని చూచి దూరంగా ఉండు'. విధి, నిషేధ సామెతలు కూడ ఇందులోనే చేర్తాయి.

   నిషేధం: 'ఏడ్చేదాని ఎడమచేతి క్రింద, కుట్టేవాని కుడి చేతి క్రింద కూర్చోరాదు.'

2. **ఉపమాన రూపక సామెతలు:** ఏదో ఒక పోలికను కలిగి 'అన్నట్లు', 'అట్లు' అనే ప్రయోగాలతో కూడి ఉంటుంది.

   ఉదా: 'ఆడలేక అంగణం వంకర అన్నట్లు'.

3. **నీతిబోధక సామెతలు:** ఇలాంటి సామెతలలో నీతి ప్రధానం. కథలలో నుంచి కూడ ఇలాంటి సామెతలు పుట్టి ప్రచారంలో ఉన్నాయి.

   ఉదా: 'పులిని చూచి నక్క వాతపెట్టుకొన్నదట'.

4. **పౌరాణిక సామెతలు:** రామాయణ, భారత, భాగవతాలకు సంబంధించిన సామెతలు అనేకం ప్రచారంలో ఉన్నాయి.

ఉదా: 'రాత్రంతా రామాయణం విని రామునికి సీత ఏమికావాలని అడిగాడట'.

5. **ప్రశ్నార్థరూపక, ప్రశ్నోత్తర సామెతలు:** ఈ రకమైన సామెతలలో ప్రశ్నతో కూడిన సామెతలే కాకుండా, ఒకరు ప్రశ్న వేసినట్లు, మరొకరు సమాధానం చెప్పినటువంటి సామెతలు ఉన్నాయి. ప్రశ్నోత్తర సామెతల్ని సంవాద రూపక సామెతలనీ, సంభాషణాత్మక సామెతలనీ పిలువవచ్చు.

ఉదా: ప్రశ్నార్థరూపక సామెత: 'ఆవునలుపైతే పాలు నలుపా?'

ప్రశ్నోత్తర సామెత: 'తాతా! పెండ్లాడుతావా? అంటే, నాకెవరిస్తారురా అబ్బాయి! అన్నాడట.'

6. **సాంఘికాచార వ్యవహారాలు, విశ్వాసాలు, నమ్మకాలు:** సంఘంలోని ఆచార వ్యవహారాలను, వారి విశ్వాసాలను, తెలియజేసే సామెతలు అనేకం ఉన్నాయి. పండుగ పబ్బాలకు సంబంధించిన సామెతలు కూడ ఇందులోనే చేర్తాయి.

ఉదా: 1. 'కలికిలే అతకదు'

2. 'అశ్వత్థ ప్రదక్షిణం చేసి, కడుపు పట్టుకుని చూచుకొన్నదట'.

3. 'ఉంటే ఉగాది, లేకపోతే ఏకాసి' ఇత్యాది.

7. **వ్యక్తిగత సామెతలు:** ఒక వ్యక్తికి సంబంధించిన సామెతలన్నీ ఈ కోవకు చెందినవి.

ఉదా: 'అనంతయ్య' చేతి మాత్ర వైకుంఠయాత్ర'.

8. **హాస్యపు సామెతలు:** పరిహాసాలతో, ఆక్షేపణలతో కూడి ఉంటాయి. వృత్తుల వాళ్ళను, జాతులవాళ్ళను ఎగతాళి చేసే సామెతలు కూడ ఇందులో చేర్తాయి.

ఉదా: 1. 'ఆరునెలలు సాముచేసి మూలనున్న ముసలిదాన్ని కొట్టాడట'

2. 'బాపన సేద్యం - బాలవైద్యం'

3. 'తల్లి పుస్తె బంగారమైనా కంసాలివాడు దొంగలించక మానడు'

4. 'దేవుడు వరమిచ్చినా పూజారి వరమీయడు'

9. **వ్యవసాయ సంబంధపు సామెతలు:** మనదేశం వ్యావసాయిక దేశం కాబట్టి ఇలాంటి సామెతలనేకం జానపదులనోళ్ళలో నలిగిపోయాయి. ఏ కార్తె వర్షం ఏయే పంటలకు అనుకూలమో, కాదో అన్న విషయాలు ఇలాంటి సామెతలలో తెలియజేయబడి ఉంటాయి. రైతును గురించి కూడ కొన్ని సామెతలు ప్రచారంలో ఉన్నాయి.

ఉదా: 1. 'స్వాతివాన ముత్తెపువాన'

2. 'అశ్విని కురిస్తే అంతా నష్టం'

3. 'రైతు దున్నితే రాజులకు అన్నం'

10. **శబ్దాలంకార సామెతలు:** ఇలాంటి సామెతలు ప్రాసలు, అనుప్రాసలు, యమకం మొదలైన వాటితో కూడి వినసొంపుగా ఉంటాయి.

ఉదా: 1. 'సామెత లేని మాట ఆమెతలేని ఇల్లు'

2. 'అన్ని దానాలకంటె నిదానమే ప్రధానం'.

ప్రాస, అనుప్రాసల విషయంగా Roger D. Abrahams గారి అభిప్రాయం గమనింపదగ్గది. 'As artful and therefore artificial and witty items of discourse, proverbs use all of the devices we commonly associate with poetry in English: Meter, binary construction and balanced phrasing, rhyme, assonance and alliteration, conciseness, metaphor and occasional inverted word order and unusual construction'. (Folklore and folklife, P. 119) ఈ లక్షణాలన్నీ శబ్దాలంకార సామెతలలో ఇమిడి ఉండటాన్ని గమనింపవచ్చు.

శబ్దాలంకార సామెతలేకాక, ఉత్ప్రేక్ష, అత్యుక్తి, ఉపమానాలతో కూడిన సామెతలు అనేకం ఉన్నాయి.

ఉదా: 1. 'సాయబు గడ్డంకాలి ఏడుస్తుంటే, బీడీ అంటించుకుంటా తాలు అన్నాడట'

2. 'ఏనుగులు తినేవాడికి పీనుగులు పిండాకూడు'

ఉపమానపు సామెతలని పోలిక సామెతలంటారు. ఒక వస్తువును మరొక వస్తువుతో పోల్చిచెప్పడం ఇందులోని విశేషం.

ఉదా: 1. 'గానుగరోలులాంటి నడుము'

2. 'తల ముగ్గుబుట్టలాగుంది'

పై సామెతల్లో నడుమును గానుగ రోలుతోను, తలను ముగ్గుబుట్టతోను పోల్చటం గమనింపవచ్చు. ఈ రెండు సామెతలను శ్రీ వేకుమళ్ళ కామేశ్వర రావుగారు పేర్కొనియున్నారు.[2]

పైన తెల్పిన విధంగా సామెతలు ప్రధానంగా పది విధాలు. ఇవే కాక ఈ క్రింద కనబరచిన సామెతలు కూడ ప్రచారంలో ఉన్నాయి.

**అశ్లీలపు సామెతలు:** ఇవి కేవలం పామరజన వ్యవహారంలో చోటు చేసికొన్నాయి.

ఉదా: మొగుడికి నేస్తగాడు, ఆలికి మిండగాడు ఇలాంటివి.

**న్యాయం సామెతలు:** సాక్షులను, వాదులను, న్యాయాన్యాయాల్ని దృష్టిలో వుంచుకొని బయలుదేరినవి.

ఉదా: సాక్షి కాళ్ళు పట్టుకోవడం కన్నా, వాది కాళ్ళు పట్టుకోవడం మంచిది.

**వైద్యపు సామెతలు:** ఇలాంటి సామెతలు తెలుగు దేశంలో అధిక ప్రచారంలో వున్నట్లు కన్పించవు. కన్నడ దేశంలో ఇవి అధికం.

ఉదా: 1. రోగి కోరింది పాలే, వైద్యుడు చెప్పింది పాలే.

2. ఉల్లి చేసిన మేలు తల్లి అయినా చేయదు.

**స్థలనామాలు:** స్థల విశేషాన్ని బట్టి కూడ సామెతలు బయల్దేరాయి.

ఉదా: 1. హంపికి పోయేదానికన్నా కొంపలో ఉండేది మేలు.

2. రామేశ్వరానికి పోయినా శనేశ్వరం తప్పలేదు.

---

*2. భారతి, ఫిబ్రవరి 1995.*

**గృహజీవన సంబంధి సామెతలు:** గృహజీవనానికి సంబంధించిన సామెతలన్నీ వీట్లో చేరతాయి.

ఉదా: 1. అత్తచచ్చిన ఆరుమాసాలకు కోడలి కంట్లో నీరు వచ్చిందట.

2. అల్లుడు అలిగితే కూతుర్ని తీసుకుపోతాడు.

**మాదిరి సామెతలు:** ఆంగ్లభాషలో ఇట్టి సామెతలు కోకొల్లలు. వీటిని గురించి Archer Taylor వివరిస్తూ 'Proverbs are often made on the models of already existing types' అని చెప్పివున్నాడు[3]. వీటికి ఉదాహరణంగా: 'the nearer the church the farher from God' అనే సామెత 'The nearer the Rome, the worse christian' అనే సామెతకు దారితీసినదట.

పదబంధపు సామెతల్ని శ్రీ వేకుమళ్ళ కామేశ్వరరావు గారు పేర్కొని వున్నారు[4]. ఆంగ్లభాషలో పదబంధపు (phrases) సామెత లనేకం. 'To step into some one's shoes; 'To steal his thunder' ఇత్యాది. శ్రీ వేకుమళ్ళ కామేశ్వరరావుగారు ఇలాంటి సామెతలకు ఉదాహరణంగా, 'పట్టపగలు చుక్కలు పొడవడం', 'కళ్ళల్లో దుమ్ముకొట్టడం' ఇత్యాదుల్ని ఉదాహరించినారు. నిజానికివి జతీయాలే కాని సామెతలు కావు.

ఏ ఒకరో ఒకర్తో 'అన్నాడు' 'అంది' అనే సామెతలకు 'శుకోక్తి సామెత' లని శ్రీ వేకుమళ్ళవారి అభిప్రాయం. వీటికి ఉదాహరణాలు: 'కూడు గుడ్డా అడుగకపోతే బిడ్డను సాకినట్లు సాకుతానన్నాడు;' 'అయ్యో! పోతున్నావా? అని పచ్చాకు పండాకును చూసి అంది' - ఇత్యాది.

జానపదగేయ కథల్లో సామెతలు అధికంగా చోటుచేసికొన్నాయి.

ఉదా: 1. పేదవాని కోపము పెదవులకు చేటు - కాటమరాజు కథ

2. కడవడంత గుమ్మడి కత్తిపీటకు లోకువ - గాంధారి కథ

స్త్రీల నోళ్ళలో సామెతలు అనేకం చోటు చేసుకున్నాయి.

ఉదా: 1. ఇంటగెలిచి రచ్చగెలువు.

2. ఇల్లు అలకగానే పండుగయ్యిందా - ఇలాంటివి.

---

3. *Funk & Wagnalls Standard Dictionary of Folklore, P-902.*

4. *భారతి, ఫిబ్రవరి, 1955*

అన్యభాషా సంపర్కంవల్ల కొన్ని క్రొత్త సామెతలు బయలుదేరుతాయి. వేరు వేరు దేశాలవారి వేషభాషలు వేరయినా, అనుభవాలు మాత్రం అందరివీ సమానమే. సన్నివేశంలో, వస్తువులో, పోలికలో వైవిధ్యం కన్పించినా, వారి స్వభావం, అనుభవం మాత్రం ఒక్కటే. కనుకనే ఇతర దేశాల లేదా ఇతర ప్రాంతాల సామెతలలో కూడా ఒకే అర్థాన్ని సూచించే సామెతలెన్నో వున్నాయి. ఈ సారూప్యం ఒక ప్రాంతం నుంచి మరొక ప్రాంతానికి, ఒక దేశం నుంచి మరొక దేశానికి, వలస పోయిన ప్రజల నుంచి కాని, అన్యభాషా సంపర్కం వల్ల కాని ఏర్పడి వుండవచ్చు.

ఉదా: ఆం: Cut your coat according to the cloth.

హిం: ఉతనే పావ్ పసారియే జితనీ చాదర్ హోయె

క: హాసిగె ఇద్దష్టు కాలుచాచు

తె: పిండికొలది రొట్టె

సామెతల వయస్సును నిర్ణయించడం అంత సులభం కాదు. కేవలం గ్రంథస్థమయిన సామెతల్ని కవి కాలాదులతో నిర్ణయింపవచ్చు కాని మౌఖిక ప్రచారంలో నలగిపోయిన సామెతల కవికాలాల్ని నిర్ణయింపలేము. చారిత్రక గ్రంథాల్లో కన్పించే సామెతలను, పురాణ గాథల్లోని సామెతలను పరిశీలించి కొంత వరకు వాని వయస్సును నిర్ణయింపవచ్చు కాని, అనుభవ పూర్వకాలు, నీతిబోధాత్మకాలయిన సామెతల కాలాన్ని నిర్ణయించటం కష్టసాధ్యం.

సామెతలనెందుకు ఉపయోగిస్తారు? వీటివల్ల కలిగే లాభమేమి? అని ప్రశ్నించుకొంటే సామెతలు సందేశాత్మకాలు, ఉపదేశత్మకాలు కూడా. ఒక విషయాన్ని మరొక విషయంతో పోల్చి మంచి చెడ్డల్ని, సత్యాసత్యాల్ని చెప్పటానికి తయారయినట్టివి. ఎన్నడో జరిగిన విషయాన్ని జ్ఞప్తికుంచుకొని, ప్రస్తుత విషయాల్ని దానితో పోల్చి చెప్పటం వల్ల ఎదుటివానికి తాను చేసేపని సమంజసంగా వుందా? లేదా? అని తర్కించటానికి సామెతలు వీలు కల్పిస్తాయి. తాను చేస్తున్నది తప్పుగా తోస్తే సక్రమ మార్గంలో నడవటానికి సామెతలు తోడ్పడతాయి.

సామెతల పరిశోధనాత్మకాధ్యయనం వల్ల ప్రజల జాతీయ, సాహిత్య, సాంస్కృతిక స్వరూపాల్ని, వారి అనుభవాల్ని క్షుణ్ణంగా తెలుసుకోటానికి వీలవుతుంది. ఇవి చారిత్రక సంఘటనల్ని వెలికి తీయటానికి, స్థల విశేషాల్ని

పరిశీలించటానికి, భాషాశాస్త్రజ్ఞునికి భాషాశాస్త్ర సమాజంలోని సంప్రదాయాల్ని, పద్ధతుల్ని గుర్తించటానికి దోహదమొనరిస్తాయి. కన్నడిగులు సామెతను వేదంతో పోల్చారు. 'గాదె వేదక్కె సమాన' (సామెత వేదానికి సమానం) అనీ, 'వేద సుళ్ళాదరూ గాదె సుళ్ళల్ల' (వేదం అసత్యమయినా సామెత అసత్యంకాదు) అనీ, 'జనవాణి జనార్ధన వాణి' అని కొనియాడారు. ఆంధ్రదేశంలో కూడ 'సామెతలేని మాట ఆమెతలేని ఇల్లు' గాను 'ప్రజలమాటే ప్రభువు కోట' గాను తన ఉనికిని స్థిరపరచుకొంది. 'As the country, so the proverb' అని జర్మనుసామెత, 'As the people, so the proverb' అని స్కాటిషు సామెత పేర్కొన్నవి. అలాగే అరబిక్ సామెత 'Proverb are lamps to words' అనీ, స్పానిషు సామెత 'A Proverb is the voice of God' అనీ, ఆఫ్రికా దేశపు సామెత 'మాటను ఆరగించటానికి సామెతయే విస్తరి' అనీ పేర్కొన్నాయి. వీటిని బట్టి సామెతల విలువలను కొంతకు కొంతైనా అర్థం చేసుకోవచ్చు.

'సామెతల భాండాగరమొక జనాంగపు విశ్వకోశం. ఇవి ప్రజా సంస్కృతి యొక్క శిల్ప శాసనాలు. వానిపై ఐతిహాసిక, సామాజిక, పౌరాణికాంశాలు చెక్కబడ్డాయి'[5] అనే మాటలు గమనింపదగ్గవి. Francis Bacon పేర్కొన్నట్లు "The genius, wit and spirit of a nation are discovered in its proverbs"[6]. 'Proverb are the cream of a nation's thought' అన్న Anon మాటల్లో సత్యం లేకపోలేదు.

వివిధ భాషల్లో సామెతల్ని సేకరించిన వారిని గురించి తెలుసుకోవాలి. సుమారు రెండువేల సంవత్సరాలకు పూర్వమే లోకోక్తుల్ని సంగ్రహించటానికి ఉపక్రమించిన వారిలో అరిస్టాటిల్ ప్రథముడు[7]. మార్టన్ బెంగాలు దేశపు సామెతల సంగ్రహాన్ని 1832లో వెలుగులోనికి తెచ్చాడు[8]. 1881లో పి.ఆర్. గుర్డన్‌గారి 'అస్సామీ సామెతలు' ప్రకటింపబడింది[9]. 1894లో బాసెల్ మిషన్ ప్రెస్ నుంచి ప్రకటింపబడ్డ 'కన్నడ శబ్దకోశము'లో నాలుగు వేలకు పైగా సామెతలున్నాయి[10].

---

5. *కన్నడ గాదెగళకోశ, (శ్రీ) టి.వి. వెంకటరమణయ్య.*
6. ***American Folklore, P.228. Ed by Tristram Coffin.***
7. *లోకోక్తి ముక్తావళి, పుట-2.*
8&10. *కన్నడ గాదెగళ సమీక్షె, తపస్వికుమార్.*
9. *నమ్మ గాదెగళు - రాగే.*

1900లో గణేశ్ నారాయణ దేశపాండే మరాఠీ సామెతలను ప్రకటించారు[11]. 1912లో బాసెల్ మిషను ప్రెస్సువారే కన్నడ సామెతల్ని సంగ్రహించి 'కర్నాటక లోకోక్తినిధాన' అనే పేరుతో ప్రకటించారు. ఇదే కన్నడ సామెతల ప్రథమ సంకలనం[12].

1868లో కెప్టెన్ యం.డబ్ల్యూ. కార్ అనే ఆంగ్లేయుడు తెలుగు సామెతలు కొన్నింటిని 'ఆంధ్రలోకోక్తి చంద్రిక' అనే పేరుతో ప్రకటించారు. అతనికి పూర్వమే కొందరు సామెతల పుస్తకాల్ని ప్రకటించారని, ఆ గ్రంథ పీఠిక నుండే తెలుస్తుంది. కాని అవి నేడు అందుబాటులో లేవు. ఉన్న పుస్తకాల్లో తెలుగులో 'ఆంధ్ర లోకోక్తి చంద్రిక'యే ప్రథమమని శ్రీ వేటూరి కామేశ్వరరావుగారి అభిప్రాయం[13]. ఆ పుస్తకాన్నే శ్రీ నందిరాజు చలపతిరావుగారు 1906లో ప్రకటించారట. కీ.శే. కళాప్రపూర్ణ డా. చిలుకూరి నారాయణరావుగారు లక్షకు పైగా సామెతల్ని సేకరించారట. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి 'తెలుగు సామెతలు' అనే పేరుతో సామెతల్ని ప్రకటించింది. తెలుగు సామెతల మీద పిహెచ్.డి సిద్ధాంతవ్యాసాలు రచింపబడ్డాయి. తెలుగు-కన్నడ, తెలుగు-తమిళ సామెతలమీద కూడ తులనాత్మక అధ్యయనాలు జరిగాయి.

* * *

---

*11&12.* నమ్మ గాదెగళు - రాగే.

*13.* భారతి, ఫిబ్రవరి - *1955*.

# 11. తెలుగు సామెతలు - సాంఘిక జీవితం
## (Telugu Proverbs - Social Life)

భాష సజీవమైంది. సామెతలు, పొడుపుకథలు, జాతీయాలు ఆ భాషా వైశిష్ట్యానికి మచ్చుతునకలు. ఇవి లేని భాషలు లేవంటే అతిశయోక్తి లేదనుకుంటాను. భాష తియ్యందనానికి ఇవన్నీ దోహదం చేస్తున్నాయి.

భాషలో మార్పులు సహజం. అలాగే ఒక సామెతలోని భాషలోకూడ మార్పులు వస్తూనే ఉంటాయి. అయినా తరతరాలుగా ఆ సామెతలోని భావంలో మాత్రం మార్పురావడం లేదు. అది వ్యావహారికంలో ఉన్నా, గ్రంథస్థరూపంలో ఉన్నా ఆ భాషలో దానికకున్న స్థానం ఉండనేఉంది. ఒక అరబిక్ సామెత 'Proverbs are lamps to words' అని పేర్కొన్నది. అలాగే సామెతలను గురించి Bacon ప్రస్తావిస్తూ The edged tools of speech అని అభిప్రాయపడ్డాడు.

'సామెత లేని మాట ఆమెతలేని ఇల్లు' అని మన తెలుగు సామెత చేస్తోంది. అక్షరజ్ఞానం ఉన్నవాడు కానీ, లేనివాడు కానీ తన మాటల్లో ఎప్పుడో ఒకప్పుడు, ఏదో ఒక విధంగా చమత్కారయుతమైన నానుడిని ప్రవేశపెడ్తూ ఉంటాడు. అలాగే ఉన్నవాడు కానీ, లేనివాడు కానీ కనీసం పండుగ పబ్బాల్లో అయినా సరే ఇంట్లో విందు చేసుకొనే తీరుతాడు. అందుకని మన పెద్దలు సామెతకు ఆమెతకు సామ్యత చూపించారు. 'సామ్య' శబ్దానికి 'సామ్యత' అనే అసాధారణరూపం ఏర్పడి 'సామెత'గా రూపొంది ప్రచారంలో ఉందన్న డా. చిలుకూరి నారాయణరావుగారి అభిప్రాయం సమంజసమైనది. కన్నడంలో కూడ సామెతకు సమానమైన పదం 'సామతి'. ఈ సామతి కూడ 'సామ్యతె' నుండి ఆవిర్భవించింది. తెలుగులో కూడ 'సామ్యత' నుండే సామెత ఉద్భవించిందనడంలో సత్యాంశం కన్పిస్తున్నది.

మొల్ల రామయణాన్ని రచించిన మొల్ల కవయిత్రి సామెతను గురించి

*'కందువ మాటలు సామెత*
*లందముగ గూర్చి చెప్పనది తెలుగునకు*
*బొందై రుచియై వీనుల*
*విందై కానిపించు విబుధుల మదికిన్'* అని సామెతల ప్రాశస్త్యాన్ని వెల్లడించింది.

అనుభవం నేర్పిన పాఠమే సామెత. ఎంచేతనంటే మన జీవితంలో సుఖదుఃఖాలు రెండూ సమపాళ్ళలో ఇమిడిఉన్నాయి. సుఖం వచ్చినప్పుడు గంతులు వేయడం, ఆనందించడం, కష్టం వచ్చినప్పుడు కన్నీరు కార్చడం, దుఃఖించడం మన అనుభవంలో ఉన్నవే. ఈ అనుభవాలను వృథా పోనివ్వలేదు మన పూర్వికులు. తమ అనుభవాలకు అక్షరరూపం ఇచ్చి 'అల్పాక్షరాలలో అనల్ప భావాన్ని' అందించారు. Thomas Fuller దీన్నే 'much matter decocted in a few words' అన్నాడు. 'సూక్ష్మంలో మోక్షం' చూపించే ఈ సామెతలు మన ప్రాచీనుల విజ్ఞానసంపదకు తార్కాణం. దీని 'మూర్తి చిన్నదైనా కీర్తి దొడ్డది' మరి.

'The wit of one and the wisdon of many' అని అంటాడు Earl Russel. సామెతలు కూర్చడం ఒకడివంతే అయినా, అనుభవం మాత్రం జనసామాన్యులందరిదీను. ఒక్కొక్కరికి ఒక్కోవిధమైన అనుభవం కలిగే ఉంటుంది. అంతేకాదు ఎందరికో ఒకే అనుభవం తటస్థపడే ఉంటుంది. అందువల్ల సామెతలోఉన్న అనుభవం కేవలం వ్యక్తిగతమైంది కాదు. పలువురు, పలు సమయాలలో, పలు ప్రదేశాలలో గడించిన అనుభవం అది. 'జీవితం నేర్పిన గుణపాఠం అనుభవం. అనుభవం అందించిన సందేశం' సామెత. 'అనుభవమే శాస్త్రం, మాటలే మంత్రాలు' అన్న నానుడి సామెతకు బాగా వర్తిస్తుంది.

ఇలా సామెతల విలువని దృష్టిలో పెట్టుకొని సామెతలలో సాంఘిక జీవితం ఎలా ప్రతిబింబిస్తుందో తెలుసుకోవచ్చును. తెలుగు సామెతలలో సాంఘిక జీవితాన్ని వివరించడానికి ముందు 'సంఘం-సాంఘిక జీవితం,' అన్న విషయాలను కొంత విశదీకరిస్తాను.

'A Social instinct is implanted in all men by nature'. అంటే ప్రతి మనుష్యునిలోనూ సాంఘిక స్వభావం సహజంగా నాటుకొని ఉన్నదని Aristotle అభిప్రాయపడ్డాడు. 'A Man's life is often built on a proverb' అన్న అభిప్రాయమూ ఉంది.

అసలు 'సంఘం' అంటే ఏమిటి? 'సాంఘిక జీవితం' అంటే ఏమిటి? 'Man is a social animal' అన్నాడు Aristotle. సంఘమంటే సంస్కృతిని ఆచరణలో ఉంచే మనుష్య సమాహారం. పరస్పరాపేక్షతో తమకుతాము సాంఘిక ఆర్థిక రంగాలలో కొన్ని కట్టుబాట్లను నిర్ణయించుకొని ఒక ప్రత్యేకమైన వ్యక్తిత్వంతో

నిర్మింపబడ్డ మనుష్య సముదాయం. సంస్కృతి అంటే సంఘంలో ఒక సభ్యుడిగా ఉంటూ ఆ సంఘంలోని అలవాట్లను, ఆచార వ్యవహారాలను, కళా స్వరూపాలను గ్రహించడమని అర్థం.

సంఘాన్నే సమాజం అని కూడ అంటున్నాము. మానవుడు సంఘజీవి. నిజానికి సంఘంలో జీవించడమే అతని ప్రత్యేకత. అతి ప్రాచీనకాలం నుంచీ మనుష్యుడు సంఘంపైనే ఆధారపడ్డాడు. సాంఘిక చైతన్యంతోనే జీవిస్తున్నాడు. సంఘంలేనిదే మానవుడు లేడంటే అతిశయోక్తి లేదనుకుంటాను. మానవుడు తన చుట్టూవున్న వాతావరణానికి అనుగుణంగా వర్తించే వ్యక్తిత్వాన్ని పొంది ఉన్నాడు. అందువల్లనే అతడు సంఘజీవిగా మనగల్గుతున్నాడు.

సామెతలు సాంఘిక చరిత్రనిర్మాణానికీ, సాంఘిక జీవిత నిరూపణకు ఆధారాలు. ప్రాచీన సంస్కృతికి నిలువుటద్దాలు. సామెతలను ఒక విజ్ఞాన ఖనితో పోల్చవచ్చు. ప్రజలను విజ్ఞానవంతులుగా చేసే సామర్థ్యం సామెతలలో దాగి ఉంది. మానవుడు ఒక్కొక్కసారి తన ఖచ్చితమైన అభిప్రాయాన్ని ఎదుటివాడు ఏమనుకొంటాడో అని ఘాటుగా చెప్పలేకపోతాడు. లేదా చెప్పబోయే అంశాన్ని స్పష్టంగా వివరించలేక పోతాడు. అలాంటి సమయాల్లో తన భావానికి సరిపోయే సామెతను ఎన్నుకొని పరోక్షంగా పోల్చి చూపిస్తాడు. ఒకవేళ ఆ సామెతే సమయానికి జ్ఞప్తికి రాని పక్షంలో 'అదేమో సామెత చెప్పినట్లు'గా అని ప్రయోగిస్తాడు. ఇదంతా గమనిస్తే సామెత మన సాంఘిక జీవితంలో విడదీయరాని అంశంగా ఎలా నిలద్రొక్కుకుందో ఇట్టే గ్రహించవచ్చు. సమాజంలో నిలద్రొక్కుకున్న సామెతను బట్టి ఆ సమాజపు అభిరుచుల్ని పసికట్టడానికి వీలవుతుందనడంలో సందేహం లేదు.

తెలుగు సామెతలలో సాంఘిక జీవితం ఈ క్రింది విషయాలలో స్పష్టంగా గోచరిస్తుంది.

1. కౌటుంబిక జీవితం, 2. వ్యావసాయిక జీవితం, 3. వ్యక్తుల మనస్తత్వం, 4. జాతులు/వృత్తులు, 5. ఆచారాలు, వ్యవహారాలు, 6. పండుగలు-పబ్బాలు, 7. ఆహారం, 8. వైద్యం, 9. నీతులు/ఉపదేశాలు, 10. కర్మసంబంధమైన విషయాలు.

ముందుగా కౌటుంబిక జీవితంలో సామెతలెలా చోటుచేసుకున్నాయో తెలియజేస్తాను.

Family అనే మాటని 'కుటుంబం' అని వ్యవహరిస్తున్నాం. ఇది సమాజంలో ఒక ముఖ్యమైన అంగం. ఆలూమగల సంబంధం వివాహవ్యవస్థకు దారితీసింది. ఇదే సామాజిక సంబంధం అనిపించుకుంది. సంఘ వ్యవస్థకు కుటుంబాలే ఆధారం.

కుటుంబ వ్యవస్థకు మూలకారణం లైంగికవాంఛ అనే అభిప్రాయముంది. ఆదిమకాలంలో స్త్రీ పురుషులు తమ శారీరక వాంఛల కోసం ఒక నియమ నిబంధనను పాటించినట్లుగా లేదు. అయితే మానవ మేధస్సు పరిణామం చెందినకొద్దీ సమాజంలో మార్పులు క్రమంగా రావడం మొదలుపెట్టాయి. ఆ పరిణామమే సంఘంలో కొన్ని నియమాలేర్పడి అవి కుటుంబ వ్యవస్థకి దారితీశాయి.

'పడుగు పేకా కలిస్తే బట్ట, ఆలుమగలు కలిస్తే ఇల్లు' అంటారు. సంఘ వ్యవస్థకు కుటుంబాలు ఆధారమయినట్లే, కుటుంబం నిలబడడానికి ఆధారం వివాహమనే చెప్పాలి. వివాహం ఒక పవిత్రమైన బంధం. దీనివల్ల ఆలుమగలు తమ జీవితాలను సంఘం మెచ్చేటట్టుగా రూపొందించుకోవాలి. అలా రూపొందించు కొన్నప్పుడే అది నిజమైన, స్వచ్ఛమైన దాంపత్యం అనిపించుకొంటుంది.

వివాహం ఒక పవిత్రమైన సంబంధం. సాంసారిక జీవితం పెళ్ళితో మొదలవుతుంది. పురుషార్థాలకు మూలం భార్య. ఆలూమగల ప్రేమానురాగాలు సంసార సుస్థిరతకు ఆలవాలమవుతాయి.

'ఇల్లు కట్టి చూడు, పెళ్ళి చేసి చూడు' అన్న సామెత కూతురి పెళ్ళి చేయబోయే తండ్రి అవస్థను తెలుపుతుంది. ఇల్లు కట్టడమూ, పెండ్లి చేయడమూ రెండూ ఒక్కటే. రెండింటికీ ఒకటికి మూడింతలు ఖర్చవుతుంది. ఇల్లు కట్టించడానికి యజమాని పడే ఆరాటాన్ని ఈ సామెత గుర్తు చేస్తోంది. లోకానుభవాన్ని ఈ రెండు మాటల్లో ఎంత సంగ్రహంగా చెప్పగలిగారో! పెద్దమ్మాయికి పెళ్ళి చేసి పంపితే ఆ అనుభవం ఏ తండ్రికైనా రానేవస్తుంది. అందుకనే కాబోలు 'పెళ్ళయినా ఇంటిలో ఆరునెలల కరువు' అన్నారు.

నిజం చెప్పాలంటే 'ఆడదాని బ్రతుకు అరిటాకువంటిది' 'అరిటాకుమీద ముల్లుపడ్డా, ముల్లుమీద అరిటాకుపడ్డా ఆకుకే నష్టం'. కన్నెపిల్ల కాలుజారితే కన్న తల్లిదండ్రులకు అవమానం సంగతి అలాఉండనీ, ఆ ఆడదాని బ్రతుకు అనాథ బ్రతుకవుతుంది. అందుకనే 'ఆడది తిరిగి చెడితే, మగవాడు తిరగక చెడ్డాడు' అన్న సామెత పుట్టింది.

ఆడపిల్ల అదృష్టం పండితే మంచిభర్త, అత్తమామలు, ఆడుబిడ్డలు లభిస్తారు. లేకపోతే ఆమె జీవితం నరకయాతనమవుతుంది. అందుకనే అన్నారు 'పూజకొద్దీ పురుషుడు, దానం కొద్దీ బిడ్డలు' అని. భర్త మంచివాడవుతే అది తన పూర్వజన్మ సుకృతమనుకొంటుంది. లేదా తన ప్రారబ్ధకర్మమని విలపిస్తుంది.

'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అన్నారు. 'అమ్మ' అన్న రెండక్షరాలు అమృతపు గుళికలు. సుఖాల్లో పాలుపంచుకోకపోయినా కష్టాల్లో ఆదుకొంటుంది తల్లి. అమ్మ విలువ తల్లిలేని పిల్లలకే తెలుస్తుంది. 'తల్లిదైవము, తండ్రి ధనము.' 'తల్లిని నమ్మినవాడు, ధరణిని నమ్మినవాడు చెడడు'.

'తల్లిముఖం చూడని బిడ్డ, వానముఖం చూడని పైరు' ఒకటే. వానముఖం చూడని పైరు ఎండిపోతుంది. దమ్మిడీకి కొరగాకుండా పోతుంది. అలాగే తల్లిముఖం చూడని బిడ్డకు ప్రేమాభిమానాలంటే ఏమిటో తెలియకుండా పోతుంది. అందుకనే 'కన్నతల్లి నీడ కానుగనీడ' అన్నారు.

'తల్లిలేని పిల్లదయ్యాలపాలు'. తల్లిలేని పిల్ల అనాథ అవుతుంది. 'తల్లి లేని పిల్ల - ఉల్లిలేని కూర' అన్నారు. కూరలో ఉల్లిపాయలుంటే దాని రుచేవేరు. తల్లి ఉంటే ఆ ఆప్యాయతా, అభిమానం తీరేవేరు.

'తల్లి చస్తే నాలుక చచ్చినట్లు, తండ్రి చస్తే కళ్ళు పోయినట్లు'. తల్లి బ్రతికి వుంటే కోరికలు తీర్చుకోవచ్చు. తన యిష్టాయిష్టాలను నిర్భయంగా తెలుపుకోవచ్చు. దారిదీపమైన తండ్రిపోతే కళ్ళుపోయినట్టే.

పిల్లలు ఇంటి మణిదీపాలు. అలాంటి 'పిల్లలు లేని ఇల్లు కందులుగొట్టిన కళ్ళం'. అందువల్లేగొడ్రాలితనం స్త్రీకి అతి దుస్తరమైంది. ఆమెను ఎగతాళి చేస్తుంది మన సమాజం. నిజానికి మాతృత్వమనేది స్త్రీకి వరంలాంటిది. సంఘంలో ఆమెకు గౌరవస్థానం రావడం సంతానాన్ని పొందినప్పుడే. 'పిల్లలు లేనిది ఇల్లుకాదు,

పిల్లలు లేనిది తోటకాదు'. అందుకనే సంతానం కోసం ఎందరో దేవుళ్ళను పూజిస్తుంది. వ్రతాలు, నోములు చేపడుతుంది. ఉపవాసాలు చేస్తుంది. 'పుట్టి చచ్చినా పుత్రుడే మేల'ని విలపిస్తుంది.

'అశ్వత్థకట్ట ప్రదక్షణం చేసి కడుపుపట్టుకొన్నదట' ఒక ఇల్లాలు. సంతానాపేక్ష అటువంటిది మరి. పిల్లలు లేనివాళ్ళు రోజూ అశ్వత్థవృక్షం చుట్టివస్తే పిల్లలవుతారని మనవాళ్ళ విశ్వాసం. ఇది కేవలం మనకు దేవుడి మీదున్న నమ్మకం. 'ఏ దేవుడు వరమిచ్చినా పెనిమిటి లేందే పిల్లలు పుట్టరు కదా'.

మన సాంఘిక జీవితంలో వ్యవసాయానికి సంబంధించిన సామెతలు అనేకం ఉన్నాయి. 'నాగలి ఉన్న ఊళ్ళో, ఆకలి చేరదు,' 'చదువుకున్నవాడికీ సేద్యగాడే అన్నం పెట్టాలి,' 'రైతుదున్నితే రాజులకు అన్నం'. 'కృషితో నాస్తి దుర్భిక్షం' అన్నమాట కృషికులకు అక్షరాలా అన్వయిస్తుంది. 'కోటివిద్యలు కూటికోసం' అన్నట్లే, ఈ 'కోటివిద్యలు కొంగ్రకు లోకువే'. 'కోటివిద్యలకంటే, కోరుకొని పొలం దున్నడం మంచి' దంటారు. 'దొరలు ఇచ్చిన పాలుకన్నా ధరణి ఇచ్చిన ధాన్యం మేలు'.

'కరువు మానుప పంట, మిడతల మానుప మంట' అయితే 'అన్నీ పండించిన కాపువానికి అన్నం కరువు.'

కాపులేనిదే పంట లేదు. పంటలేనిదే వంటలేదు. వంటలేనిదే తిండిలేదు. తిండిలేనిదే కండలేదు. కండలేనిదే మనుగడ లేదు. ఇందులో సందేహం లేదు. నిజమైన శ్రమజీవి కాపువాడు. 'కాపులకష్టం, భూపతి సంపద,' 'సొమ్మొకడిది, సోకొకడిది' అన్నట్లుంది.

'పెట్టుబడిలేని సేద్యం, చద్దిలేని పయనం' ఒకటే. భూమిఉన్నా బండి, ఎద్దులు, వ్యవసాయ పనిముట్లు, ఎరువులు లేందే వ్యవసాయం చేయలేం.

'జననిని, ధరణిని నమ్మినవాడు చెడడు'. వ్యవసాయానికి సారవంతమైన భూమి కావాలి. రాళ్ళు రప్పలు ఉన్న భూమికానీ, ఇసుక బంకనేలలు కానీ నిరుపయోగం. అందువల్లనే 'ఇసుక నేలను దున్ని బాగుపడ్డవాడు, బంకనేలను దున్ని చెడనివాడు లేడు' అన్నారు.

రైతులు వర్షంమీద ఆధారపడి వ్యవసాయం చేస్తారు కనుక, వాళ్ళనోళ్ళలో వర్షానికి సంబంధించిన సామెతలు అనేకం గూడు కట్టుకొన్నాయి. ఏ వర్షం ఏపంటకు అనుకూలమో, కాదో రైతులకు బాగా తెలుసు. వ్యవసాయమే వీళ్ళ వృత్తి కాబట్టి ఈ అనుభవాలన్నీ నరనరాల్లో జీర్ణించుకుపోయాయి.

'వానరాకడ, ప్రాణం పోకడ తెలియవు'. 'వానవుంటే కరువు, పెనిమిటి ఉంటే బీదతనం రాదు'.

'తొలకరి వానలు మొలకలకు తల్లి'. 'తొలకరిని చెరువునిండినా, తొలిచూలు కొడుకు పుట్టినా లాభం'. ఇలాంటి తొలకరి పంటలకు ఆరుద్రకార్తెని విశేషంగా పరిగణిస్తారు. 'ఆరుద్రలో అడ్డెడు చల్లితే పుట్టెడు పండును'. అలాగే 'ఆరుద్ర కురిస్తే దారిద్ర్యం లేదు'.

'ఉత్తరజూచి ఎత్తరగంప' - ఉత్తర కార్తె దాకా వానలు పడకపోతే అదనుతప్పి, ఆ సంవత్సరం ఏ పంటా పైకిరాదన్న విశ్వాసం మనరైతు సోదరుల్లో నాటుకొని ఉంది. అంతేకాదు 'ఉత్తర ఉరిమి కురిసినా, పాము తరిమి కరిచినా తిరుగులేదు' అంటారు.

'ఆరికకు చిత్తగండం, ఆడదానికి పిల్లగండం' స్త్రీకి ప్రసవవేదన భరింపరానిది. అదే ఆమెకు గండం. అలాగే ఆరిక పంటకు చిత్తకార్తె గండం.

'అనూరాధలో అడిగినంత పంట'. అనూరాధకార్తెలో పంటలు పుష్కలంగా పండుతాయట. 'అనూరాధలో తడిస్తే మనోరోగాలు పోతా'యట.

'నడమంత్రపు సిరికి నెత్తిమీద కళ్ళు'. ఉన్నట్టుండి డబ్బువస్తే కళ్ళు కనబడవు. 'చింతకాయలమ్మేదానికి సిరివారమొస్తే టంకిరి బింకిరి కాయి ఇదేమి కాయి' అన్నదట. గతకాలంలో తానెల బ్రతికిందో గుర్తుతెచ్చుకుంటే నడమంత్రపు సిరి క్షణికమనేది అవగాహన అవుతుంది.

'నడమంత్రపుసిరి, నరం మీది పుండు భరింపరానివి'. దీన్ని అర్థం చేసుకోలేక 'నడమంత్రాన సిరి వస్తే, నడిరేయి గొడుగు పట్టు' మనేవాళ్ళున్నారు.

'ఎంగిలి చేత్తో కాకిని తోలనివాడు భిక్షం పెట్టునా?' - ఇది లోభి మనస్తత్వాన్ని బయటపెట్టే సామెత. 'లోభి తానూ తినడు, మరొకరికీ పెట్టడు'. అందువల్లే 'లోభి బీదకంటె బీడు'గా పరిగణించబడ్డాడు.

'కలిమిగల లోభికన్న పేద మేలు'. పేదవాడు తనకు లేకపోయినా, ఉన్నదాంట్లోనే ఇస్తాడు. 'లోభికి ఖర్చెక్కువ, ఏబ్రాసికి పనెక్కువ'. సాధారణంగా లోభి ఖర్చుపెట్టడు. పైసా పైసా పోగు చేస్తాడు. 'Penny wise and pound foolish' అన్నట్టుగా చివరికి ఒకేసారి పెద్దమొత్తాన్ని ఖర్చుపెడ్తాడు. అలాగే ఏబ్రాసి కూడ. సోమరితనంతో ఏబ్రాసి పనిచేయడానికి బద్ధకిస్తాడు. ఒకవేళచేసినా కొంచెం కొంచెం చేస్తాడు. చివరకి పని పూర్తిచేయడానికి ఎక్కువ శ్రమిస్తాడు. లోభీ, ఏబ్రాసుల స్వభావం ఇందులో వ్యక్తమవుతుంది.

పొదుపుంటే సంసారం అదుపులో ఉంటుంది. 'ఎంత చెట్టుకంతగాలి' ఉండాలి. 'ఎంత వెలుగుకు అంత చీకటి' ఉంటుంది కదా!

ఒక్కొక్క చినుకే వాన అవుతుంది. అలాగే పైసా పైసా కూడబెట్టితే రూపాయలవుతాయి. రూపాయలు రేపటి పాపాయలకెంతో అవసరం. వాళ్ళ భవిష్యత్తు రూపాయల్లోనే ఉంటుంది మరి.

'ఉత్తకుండకు ఊపులెక్కువ'. 'నిండుకుండ తొణకదు'. 'ఏమిలేని ఆకు ఎగెసెగసి పడితే, అన్నీవున్న ఆకు అణగిమణగి వుంటుంది.' ఇవి బడాయిపడే వాళ్ళని గురించి చెప్పే సామెతలు. అందువల్లనే 'బడాయి బచ్చా, కూడులేక సచ్చా' అన్నారు. 'డొలు చూపితే దరిద్రం తీరుతుందా' మరి.

మద్యం పుచ్చుకోవడమనేది, పతనావస్థకు చిహ్నం. 'తాగడానికి ముందు, వ్రాతకు వెనుక చూడవలె' నంటారు. అయితే ఎంతమంది ఈ నియమాన్ని పాటిస్తారు?' 'తాగినవాడూ, తప్పిన వాడూ ఒకటే' అని ఎంతమంది గ్రహిస్తారు?

'తాగుబోతు తోడుకోరుతాడు'. 'తోడులేక వెళ్ళదు రాచపీనుగు' అంటారు. తాగుబోతువాడి వెంట వెళ్ళినవాడి పనీ అంతే.

'గురువులేని విద్య గుడ్డివిద్య' అన్నారు. గుడ్డిగా చదివితే అది చదువని పించుకోదు. బోధించే గురువుండాలి. అలా చదివితేనే 'గురువును మించిన శిష్యుడు' అవడానికి కూడ వీలవుతుంది.

'అల్పవిద్యా మహాగర్వి,' 'Half knowledge is dangerous' అన్నారు. 'అపండితుని కంటే అర్ధపండితుడే అపాయకరం', 'అల్పవిద్యాంసుడు ఆక్షేపణకు పెద్దమాత్రమే'.

'చదువనంతవరకు కాకరకాయ, చదివిన తర్వాత కీకరకాయ.' 'చదివేస్తే ఉన్న మతి పోయిందట' - ఇలాగుంటుంది కొంతమంది వ్యవహారం.

'అందరికి మంచివాడు అనంతయ్య.' ఎవ్వరి పక్షమూ వహించకుండా మధ్యస్థంగా ఉండేవాళ్ళూ, 'ఏ గాలికి ఆచాప ఎత్తినట్లు', 'ఏ ఎండకాగొడుగు పట్టేవాళ్లు', ఈ సమాజం నిండా ఉన్నారు. వీళ్ళు అందరికీ మంచివాళ్ళు. 'ఏరోటి దగ్గర ఆపాట పాడాలి' మరి.

'అందరికీ శకునం చెప్పేబల్లి, తాను పోయి కుడితలో పడ్డట్టు', 'చెప్పేది శ్రీరంగనీతులు, దూరేది దొమ్మరి గుడిసెలు' అన్నట్టుగా తన విస్తర్లో ఈగ వాలిందని తెలిసినా, ఎదుటివాళ్ళ విస్తర్లో దోమపడిందని ఆక్షేపించే ప్రబుద్ధులూ లేకపోలేదు.

మాటమీద నిలకడలేని వాళ్ళు చాలమంది. వీళ్ళు 'రెండు నాలుకల' వాళ్ళు.

'కుక్కతోకగొట్టకుదురునా చక్కగా.' 'కుక్క తోక వంకర'. అలాంటి వంకర బుద్ధి ఉన్నవాళ్ళకు ఎన్నివుంచి మాటలు చెప్పినా, చెప్పినంతసేపూ తల ఊపుతుంటారు. మళ్ళీ షరామామూలే. వీళ్ళని భగవంతుడు కూడా బాగు చేయలేడు.

మన సమాజంలో అమాయకులూ ఉన్నారు. 'నల్లనవన్నీ నీళ్ళు, తెల్లనివన్నీ పాలు' అనుకుంటారు వీళ్ళు. 'ఉలవలు తింటావా బసవన్నా! అంటే ఊ అన్నట్టు'గా ఉంటుంది వీళ్ళ మనస్తత్వం. అందుకనే వీళ్ళను ఏడ్పించుకు తినే ఘరానా మనుష్యులూ బయల్దేరారు.

'ఉంటే అమీరు, లేకుంటే ఫకీరు'. వీళ్ళు డబ్బును దుబారాచేసే మనుష్యులు. వీళ్ళకు 'ఉంటే ఉగాది, లేకపోతే ఏకాసి'. ఉన్నదంతా ఖర్చుపెట్టి ఉపవాసం ఉండడానికైనా వీళ్ళు సిద్ధమే.

'సాక్షి కాళ్ళు పట్టుకోవడం కన్నా వాది కాళ్ళు పట్టుకోవడం మేలు' - ఇది సాక్షులమీద సమాజంలో ఉన్న అవిశ్వాసాన్ని తెలియజేస్తుంది. వ్యాజ్యాలలో సాక్షిని నమ్మడానికి వీల్లేదు. సాక్షి ఏనాటికైనా 'గోడమీద పిల్లివాటం'.

'ఆత్రగాడికి బుద్ధిమట్టు'. 'నిదానమే ప్రధాన'మంటారు. ఏ పని చేసినా ఆలోచించుకుని చేయాలి. 'చూసిరా అంటే కాల్చివచ్చా'డట. చెప్పేలోగానే, వినిపించుకోకుండా కొందరు పనులు చేస్తుంటారు. అవి ఎలాంటి అనర్థాలకు దారి తీస్తాయో వీళ్ళు ఊహించరు.

'అందితే జుట్టు, అందకపోతే కాళ్ళు'. సమాజంలో ఇలాంటివాళ్లే అధికంగా తారసిస్తారు. ఏదో ఒకలాగ తమ పంతం నెరవేర్చుకోవడానికి ప్రయత్నిస్తుంటారు.

'పరిగెత్తేవాణ్ణి చూస్తే తరిమేవాడికి లోకువ'. ఈ ప్రపంచమే అంత. కొంచెం చనువిస్తే నెత్తినెక్కి కూర్చుంటారు కొందరు.

ఇలా చెప్పూపోతే మన సాంఘిక జీవితంలో ఎన్నో సామెతలు నిలద్రొక్కుకున్నాయి. అలాగే జాతులు, వృత్తులు, ఆచారాలు - విశ్వాసాలు, పండుగ పబ్బాలు, ఆహారం, వైద్యం, నీతులు - ఉపదేశాలకు సంబంధించిన సామెతలెన్నో మన సాంఘిక జీవితంతో ముడిపెట్టుకొన్నాయి. సామెతలలో సాంఘిక జీవితం, సాంఘిక జీవితంలో సామెతలు ఒకదానికొకటి పెనవేసుకొన్నాయి. సామెతలు సమాజాన్ని ప్రతిబింబించే నిలువుటద్దాలంటే అతిశయోక్తి ఏ మాత్రం కాదు. అనుభవసారాన్ని తెలిపే సామెతలు సమాజాధ్యయనానికి, అభ్యుదయానికి ఒక సాధనమని మనం అంగీకరించక తప్పదు.

* * *

# 12. పొడుపు కథలు
## (Riddles)

జానపద సాహిత్యం జానపద విజ్ఞానంలో ఒక ప్రధాన విభాగం. పొడుపు కథలు ఈ విభాగానికి సంబంధించిన ఒక వినోదాత్మక ప్రక్రియ.

పాశ్చాత్యుల దృష్టిలో పొడుపు కథ భాషా సంబంధిత వర్గంలో చేరుతుంది. జానపద విజ్ఞానంలో నాలుగు ప్రధాన వర్గాలున్నాయి. అవి[1]:

1. **సాహిత్య సంబంధి (Literary types):** పురాణం (Myth), ఐతిహ్యం (Legend), జానపద కథ (folk tale), కవిత్వం (Poetry).

2. **భాషా సంబంధి (Linguitic types):** భాష (Speech), సంజ్ఞ (gesture), సామెత (Proverb), పొడుపుకథ (Riddle).

3. **వైజ్ఞానిక సంబంధి (Scientific types):** చికిత్సలు (Cures), జ్యోతిష్యం (Prophecies), మంత్రతంత్రాలు (witchcraft) మొదలైనవి.

4. **క్రియా సంబంధి (Action types):** సంగీతం (music), నాట్యం (dance), ఆటలు (Games), పండుగలు (Festivals), ఆచారం (Custom), నాటకం (Drama), కళ (Art), చేతిపనులు (Crafts), వంటావార్పు (Cookery) మొదలైనవి.

సామెతల్ని, పొడుపుకథల్ని భాషా సంబంధి వర్గంలో చేర్చినా వీనిలో సాహిత్యాంశాలు లేకపోలేదు. పొడుపుకథ అనేది సర్కారు ప్రాంతాల వాడుకపదం. రాయలసీమలో, ముఖ్యంగా చిత్తూరు మండలంలో దీన్ని మారుకథ అంటున్నారు. దీన్నే ఇచ్చుకత, విచ్చుకత, విప్పుకత అనీ, అనంతపురం మండలంలోని కొన్ని ప్రాంతాల్లో అడ్డుకథ, అడ్డకత, అడ్డుకత అనీ, కర్ణాటకలోని కోలారు మండలం వారు ఒడ్డుకత అనీ వ్యవహరిస్తున్నారు.

---

*1. ఈ వర్గీకరణం Funk and Wagnaulls Standard Dictionary of Folklore, Legend & Mythology లో చేయబడి వుంది.*

పొడిచేలా ప్రశ్నించు అనే అర్థంలో పొడుచు లేదా పొడుపుకథ అనవచ్చు. కథ అనటంలో ఇక్కడ 'విషయం' అని అన్వయించవచ్చు. ఒకరు ఒక కథను పొడిచినప్పుడు సమాధానం చెప్పలేని వ్యక్తి దానికి మారుగా మరొక విషయాన్ని (కథను) వాడటం పరిపాటి. కనుక దీనికి మారుకథ అనే పేరు వచ్చివుండవచ్చు. ఒకరు ఒడ్డిన కథల్ని ఇంకొకరు విప్పడం జరుగుతుంది కాబట్టి ఇచ్చుకత, విచ్చుకత, విప్పుకత అనే పేర్లు తగివున్నాయి. పైకి కనిపించే సమాధానానికి భిన్నంగా మరో సమాధానం ఉండటంవల్లగాని, సమాధానాన్ని తర్కించుకోవటంలో అడ్డు తగులుతుండటంవల్లగాని ఇది అడ్డుకత అయివుండవచ్చు. ఒడ్డుకత కన్నడంలోని ఒడ్డుకథ - ఒడ్డునట్టి కథ - నుంచి వచ్చి వుంటుంది.

తెలంగాణాలోని వరంగల్లు ప్రాంతంలో పొడుపు కథల్ని 'శాస్త్రము' లందురనీ, శాస్త్రార్థమెంత కఠినమో వీనిని విడదీయటం అంత కష్టమని కాబోలు పొడుపు కథలకు శాస్త్రములనే పేరు వచ్చిందనీ డా. బిరుదురాజు రామరాజుగారు అభిప్రాయ పడ్డారు[2]. అనంతపురం ప్రాంతంలో సామెతను శాస్త్రమనటం కద్దు. 'అదేమో శాస్త్రం చెప్పినట్టు' అని వ్యవహారం.

వివిధ భాషల్లోని పొడుపు కథలకు సమానార్థకమైన పదాలు ఇవి: సంస్కృతం - బ్రహ్మోదయం, ప్రశ్నలేక ప్రత్యుత్తర కూటం, ప్రవహేలిక, వివాద, సమస్యాకూట, హృదయాలికా మొదలైనవి.

| | | |
|---|---|---|
| ప్రాకృతము | - | ప్రహేలీ, హియాలియా |
| హిందీ | - | పహేలీ, బుజోవల్, భుల్‌భులైయా, |
| తమిళము | - | విడికతై, పుదుర్. |
| మలయాళం | - | విడికద, కటకద. |
| కన్నడం | - | ఒగటు లేక వగటు, ఒంటు, ఒడగతె, ఒడ్డకతె, ఒగటు. |
| బెంగాలీ | - | పహేలీ, దాంథా, పెయ్. |
| మరాఠీ | - | ఉఖాణా, ఆహణా, ఉమణా, కోహడా, కులంగాదె, కోడే, బయాణా. |

---

*2. తెలుగు జానపద గేయ సాహిత్యము. పుట 519.*

గుజరాతీ - ఉఖాణో, ఉఖాణూ, కొహ్యాడో, అభియాణు, కోడు.

సింధి - ఉఖాణీ.

పంజాబీ - పహేలీ, భుజాత్.

బీహారీ - బాహా, పహేలీ.

ఆంగ్లంలో సమానార్థకమైన riddle అనే పదం raedan అనే ప్రాచీన రూపంనుంచి ఉద్భవించింది. దీనికి to give advice అని అర్థం. రిడిల్ అనే పదానికి ఈ అర్థాలు నిఘంటువుల్లో ఉన్నాయి.

'an obscure description of something which the hearer is asked to name; a puzzling question; anything puzzling'[3]

'Question, statement or description, designed or serving to test ingenuity of hearers in divining its answer, meaning or reference; conundrums, enigma, puzzling or mysterious fact, thing or person.[4]

ఆంగ్లంలోని riddles రెండు రూపాల్లో కనబడుతున్నాయి. 1) Enigmas, 2). Conundrums. వీటిలో మొదటివి ప్రాచీనాలు. రెండోవి అర్వాచీనాలు. Enigmas సహజాలు, వ్యంగ్య స్ఫోరకాలు, రసగుళికలు కాగా conurdrums కృత్రిమాలు, పదాడంబర సహితాలు (riddles whcih play upon words). A conundrum is a kind of riddle based upon some imagined likeness between things that are quite unlike అని The World Book of Encyclopaedia చెప్తుంది. Enigma జాతిదేశికి, conundrum నిబద్ధదేశి జాతికి చెందిన పొడుపు కథలతో సరిపోలుతుందని డా. తంగిరాల వెంకట సుబ్బారావుగారి అభిప్రాయం[5].

పాశ్చాత్యులు riddles విషయంలో ఇచ్చిన నిర్వచనాల్ని ఉటంకించి పొడుపు కథను నిర్వచించటానికి ప్రయత్నిస్తాను.

---

3. *Chambers Twentieth Century Dictionary, P. 1162.*
4. *The Readers' Digest Great Encyclopaedic Dictionary, second edition Vol. P. 757.*
5. *రాయలసీమ మారుకథలు, భారతి జూన్ 1969, పుట-56.*

పొడుపుకథ ప్రశ్నరూపంలో ప్రత్యక్షంగానో పరోక్షంగానో, సంపూర్తిగానో, అసంపూర్తిగానో, సంప్రదాయబద్ధంగా వుంటుంది. ఇది సాధారణంగా అసంభవంగాను, పరస్పర విరుద్ధంగాను కన్పిస్తుంది కాని, ఒక విశిష్టమైన దృష్టితో చూస్తే అది కేవలం సత్యాన్నే వెల్లడి చేస్తుంది. పొడుపు కథాకారుడు శ్రోతను పొడుపు కథలోని యాథార్థ్యాన్ని, ఐక్యతని, సత్యాన్ని గుర్తించమని సవాలు చేస్తాడు.[6]

పొడుపుకథ ఊహతో పరిష్కరించబడేటటువంటి, తికమక పుట్టించేటటు వంటి సందిగ్ధమైన ఒక ప్రశ్నకు అన్వయించే ఒక సమస్యాత్మక వాక్యము[7]. ఆలంకారికంగా పొడుపుకథ రూపకానికి సన్నిహితంగా వుంటుంది. నిజానికి దానిని రూపకాలంకారంగా కాని, రూపకాలంకారాల సమూహంగా కాని నిర్వచింపవచ్చు. అవి సామాన్య వ్యవహారంలో ఉండవు; అంతేకాక వాని ప్రాధాన్యం స్పష్టం కాదు[8]. పొడుపుకథలు ప్రధానంగా మానసిక విక్రియల కూడికలై వుంటాయి. సాదృశ్య వైదృశ్యాల్ని కలిగివుంటాయి[9]. ఇవి సమాధానం తెలియని వాళ్ళను తికమక పట్టించటానికో లేదా తెలివితేటల్ని పరీక్షించటానికో ఉద్దిష్టాలైన ప్రశ్నలు[10].

పొడుపుకథ బుద్ధిపూర్వకమైన ద్వంద్వార్థం లేక గూఢార్థం వున్న వాక్యం. ఎదుటివ్యక్తి దీని అర్థాన్ని గుర్తించటానికి ఇది ప్రయోగింపబడుతుంది.[11]

కన్నడ జానపద సాహిత్యవేత్త ''రాగౌ'' పొడుపు కథనిలా నిర్వచించారు. ''పొడుపుకథ ప్రయత్నపూర్వకమైన సృష్టి. ప్రజ్ఞాపూర్వకమైన సాహిత్య ప్రక్రియ... వాస్తవమైన అర్థాన్ని దాచిపెట్టే వ్యాఖ్య... అనుమానంతో అర్థాన్వేషణకై బయలు దేరటానికి ప్రేరేపించే సందిగ్ధ ప్రాసబద్ధ రచన, వెనువెంటనే కారణమీయలేని సమస్య''.[12]

---

6. *"Riddles: Do-it-Yourself". William Jansen, American Folklore Ed. Tristram Coffin.*
7. *Encyclopaedia of Religion and Ethics, p. 765*
8. *Ibid*
9. *Funk& Wagnulls standard Dictionary of Folklore, P. 938*
10. *Folklore and Folklife, P. 131.*
11. *Encylopaedia Amarica, Vol 23, P. 510.*
12. *నమ్మ ఒగటుగళు, (కన్నడము), పుట. ix.*

ఉక్తి చమాత్కారం వుండే పొడుపు కథల్లో ప్రస్తుత, అప్రస్తుతాంశాలు రెండూ స్థానమాక్రమిస్తాయి కాని అప్రస్తుతమైన ఆధారంతో ప్రస్తుతాంశాన్ని గుర్తింపవలసి వుంటుంది.[13]

పై నిర్వచనాల్ని[14] మనసులో పెట్టుకొని పొడుపుకథనిలా నిర్వచింపవచ్చు. 'ఊహచే సమాధానాన్ని వెదకి, వినోదం ఆశ్చర్యాలతో పాటు గూఢార్థాన్ని వెలువరించే, సవాలు చేసే ప్రశ్నార్థక రూపకాతిశయోక్తి ప్రక్రియ పొడుపు కథ'. దీనికి ప్రయత్నం, బుద్ధిబలం అవసరం. పొడుపుకథలో ఉపమానోపమేయాలు రెండూ దాగిఉంటాయి. దీంట్లో ఉపమానం వాచ్యం, ఉపమేయం సూచ్యం, వాచ్యమైన ఉపమానంతో సూచ్యమైన ఉపమేయాన్ని గుర్తించటం సమాధాన మనిపించుకొంటుంది. ఇది పొడుపుకథలోని ప్రధానాంశం.

జానపదగేయ ప్రక్రియ లాగే పొడుపుకథ కూడ మానవుల ప్రయత్నపూర్వక మేధాశక్తితో జనించింది. శైశవావస్థలో మానవ జాతినుంచి ఉద్భవించిన ఒకానొక ప్రక్రియ ఈ పొడుపుకథ. '...all people in the first stages of culture are lovers o riddles' అని జె.జి హెర్డర్. శుద్ధమైన పొడుపుకథ జానపదుల హృదయాంతరాళాల నుంచి ఉద్భవించింది. సామెత ఒక విధంగా ఏకకర్తృకమై పిమ్మట సామూహిక ముద్రను వేసుకొన్న ప్రక్రియ కాగా పొడుపుకథ సామూహిక కర్తృత్వం చేతనే ఏర్పడి జానపదగేయాలవలె అప్రధానకర్తృకమైంది. అలాగని సామెత అప్రధానకర్తృకం కాదనికాదు. అది పుట్టుకలో వైయక్తికమై రాను రాను అందరి సొత్తయింది.

వేద సాహిత్యంలోని ప్రహేళికాదులు ప్రాచీనతమమైన పొడుపుకథలకు సంబంధించినవి. వేదాంత రహస్యాలకు ఇవి ఉపయోగింపబడేవట. రామాయణ మహాభారతాల్లోను పొడుపుకథలు చోటు చేసుకొన్నాయి. భారతదేశంలోని పలుప్రాంతాల పొడుపుకథలకు వేదాల్లోని పొడుపుకథలే మాతృకలని పలువురు విద్వాంసుల అభిప్రాయం. ఋగ్వేదంలోని ప్రశ్నోత్తర రూపకాలైన పొడుపు కథలు మహాభారతంలోని యక్ష ప్రశ్నలకు సూచన అని శ్రీ దుర్గాభాగవత్ అభిప్రాయ

---

*13. ఉత్తర కర్నాటక ఒగటుగళు, (కన్నడము), మున్నుడి.*

*14. ఆంగ్లములోని పొడుపుకథ నిర్వచనాలను అనువదించటంలో తోడ్పడిన డా. చెన్నాప్రగడ తిరుపతిరావుగారికి నా కృతజ్ఞతలు.*

పడ్డారు.[15] జానపద పొడుపుకథ బీదరికానికి అసమాధానాన్ని సూచించేదిగాను, శ్రీమంతుల్ని తిరస్కరించేవాహికగాను వుండేదని శ్రీ పాటర్ అభిప్రాయం.[16]

పరస్పర భిన్నాలైన మానవ సంఘటనల్లో కనిపించే పొడుపుకథల్లోని సమానతలను గురించి మూడు ఊహ సిద్ధాంతాలున్నాయి.[17]

1. సామాన్య మూలాన్ని (Common Origin) కలిగి వుండటం.
2. ఒక తరంనుంచి మరో తరానికి సాంప్రదాయికంగా వ్యాపించటం.
3. మానవుని మనస్సుయొక్క సమగ్ర సమతా సాదృశ్యం.

శ్రీ జి. శంకరరావుగారు పొడుపుకథా లక్షణాల్ని ఏడింటిని పేర్కొన్నారు. అవి - 1. సంక్షిప్తత, 2. నిగూఢత్వము, 3.అపార్థకల్పన, 4. వినోదాత్మకమైన క్రీడారూపము, 5. రేఖామాత్రమైన భావస్ఫురణ, 6.రసస్ఫూర్తి, 7. సమస్యగా భాసించి పరిష్కారము కోరుట. ఇందులో కొన్ని లక్షణాలు మాత్రమే ఉంటే వాటిని పూర్తిగా పొడుపు కథలనలేము. వాటిని పొడుపు కథల ఛాయలున్న వాటిగా మాత్రమే చెప్పాలి''.[18] కాని పొడుపుకథలో రెండు ప్రధానాంశాల్ని గుర్తింపవచ్చు. ఒకటి - నిగూఢత్వం, రెండు - వినోదాత్మకమైన క్రీడా రూపం.

పైన పేర్కొన్నవాటికి ఇంకో అయిందింటిని చేరిస్తే పొడుపుకథా లక్షణాలు సమగ్రంగా వుంటాయని నా అభిప్రాయం. అవి:

1. పొడుపుకథ ఒడ్డేడువానిని, విప్పేడువానిని శ్రోతను ఉత్సాహంతో ముంచెత్తాలి. ...the riddle develops or strengthens the ego of the riddler; of his opponent and of the audience present...'[19]
2. కేవలం బుద్ధి కౌశల్యానికీ, హాస్యానికీ మాత్రమే కాక జ్ఞాపకశక్తికి, పొడుపు కథను విప్పే శక్తికి కూడా స్ఫోరకం కావాలి.
3. ఆలోచనల్ని రేకెత్తించి, సందిగ్ధతను పోగొట్టి అన్వేషించేవిగా ఉండాలి.

---

*15. The Riddle in Indian Lifelore and Literature, P. xii.*
*16. Standard Dictionary of Folklore, P. 942.*
*17. Encyclopaedia of Religion and Ethics, p. 768.*
18. పొడుపు కథలు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ (19,5) పుట-8.
*19. American Folklore p. 234.*

4. అస్పష్టత.

5. సవాలు చేసే గుణం.

ఈ క్రిందివి సరియైన రిడిల్స్ కావని American Folklore లో చెప్పబడింది.[20] Numerical puzzles, shrewd questions, questions that cannot be answered without special knowlede, practical jokes. ఈ అభిప్రాయంతో ఏకీభవించవచ్చు.

పొడుపు కథల్లోని అయిదు అంశాల్ని Robert Petsch సూచించినాడు.[21] అవి:

1. సూత్రప్రాయమైన ఆరంభాంశం.
   An opening formula.

2. వర్ణింపవలసిన విషయానికి నామకరణమొనర్చటం.
   Naming of the subject to be described.

3. ఆ విషయాన్ని గూర్చిన వర్ణనాత్మక కథనం.
   A descriptive statement about the subject.

4. అదే విషయాన్ని గురించి తప్పుత్రోవ పట్టించే కథనం.
   A misleading statement about the same subject.

5. సూత్రప్రాయమైన ముగింపు.
   A closing formula.

ఈ అంశాలన్నీ లభించటం సాధ్యం కాదు గనుక ఆయనే ఇలా అన్నాడు. A true riddle is a true riddle whether it does or does not contain all the five elements.

పొడుపుకథల వర్గీకరణంలో పలువురు పలుమార్గాలనవలంబించారు.

గ్రంథస్థాలు, మౌఖికాలు అనే స్థూలవర్గీకరణం దాంట్లో ఒకటి. గ్రంథస్థాలు కృతకాలు, సాహిత్య వాసన గలవి కాగా, మౌఖికాలు ప్రాచీనాలు, ఒకతరం నుంచి

20. *American Folklore pp. 235, 236.*
21. *Ibid p. 232*

మరో తరానికి సంక్రమించినటువంటివి. ఈ రెండూ పరస్పరావలంబనాలే కనుక ఈ విభజన సరియైనది కాదు. అలాగే గేయరూపాలు, వచనరూపాలు, పద్యరూపాలని మరొకరీతి వర్గీకరణం. కొందరు మత సంబంధాలు, వినోదాత్మకాలు అని విభజించారు.

Folklore and Folklife లో అయిదు విధాలైన పొడుపుకథలు సూచింపబడ్డాయి. అవి:

1. వివరణాత్మకాలు (**descriptive riddles**): గేయత్వం రూపకంతో కూడి ఆకర్షకంగా వుంటాయి.[22]

2. పరిహాసపు ప్రశ్నలు (**Joking questions**): వీటినే reverse riddles అనికూడ అంటారు. వీటికి వివరణాత్మకమైన సమాధానం అవసరం.

   కొన్నిట్లో కారణమీయబడి ఫలితం ప్రశ్నింపబడుతుంది.[23] మరికొన్నిట్లో ఫలితం చెప్పబడి కారణం ప్రశ్నించబడుతుంది.[24]

3. వివేకపు ప్రశ్నలు (**wisdom questions**): వీటిని విప్పటానికి పొడుపుకథకు సమాధానం ముందే తెలిసివుండాలి. హాస్యానికిగాని, కపటానికిగాని యిందులో తావులేదు.[25]

---

22. ఉదాహరణ:
*White bird featherless flew from paradise,*
*perched upon the castle wall;*
*up came Lord John landless*
*Took it up handless*
*And rode away horseless*
*To the king's white hall*
సమాధానం: *Snow*

23. *What happens to little girls who swallow bullets?*
సమాధానం: *Their hair gorws out in bangs.*

24. *Why does a freight can need no locomotive?*
సమాధానం: *Because the freight makes the car-go*

25. *What is whiter than the milk?*
సమాధానం: *Snow.*

4. **విడికథలు (Puzzles)**: ఇవి దిగ్భ్రమ కలిగించేవిగా ఉంటాయి. సాధారణంగా ప్రారంభంలోనే తికమక పట్టించేవిగా వుండి సమాధానం చెప్పటానికి అధికకాలం అపేక్షిస్తాయి.[26]

5. **అనుకరణ కథలు (Parody riddles)**: తక్కిన మౌఖిక సాహిత్యంలాగే ఇవీ స్వాభావికంగా సాంకేతికాలు.[27]

Archer Taylor పొడుపు కథల్ని ఐదు వర్గాల్లో సూచించాడు.[28]

1. మనుష్యులు జంతువులు అని గుర్తింపరాని జీవాలతో పోలిక.
2. జంతువులతో పోలిక.
3. మనుష్యులతో పోలిక.
4. వృక్షాలతో పోలిక.
5. వస్తువులతో పోలిక.

దశమాంక పద్ధతిలో చేసిన ఈ విభజన పలువురు విద్వాంసుల మన్ననలను పొందింది. పోలికలు లేని పొడుపుకథలకు ఇది అన్వయింపదు. అయినా ఈ పద్ధతి పరిశీలన పాత్రమైంది.

భాషాశాస్త్రాధ్యయనానుగుణంగా కొందరు వీటిని వర్గీకరించారు.[29] దాని ప్రకారం:

1. **రూప ప్రధానాలు (form based):** ఒక సరళ వాక్యంలో కాని, ఎక్కువ సరళ వాక్యాలలో కాని, గొలుసురూపంలో ఒకదానిలో ఒకటి ఇమిడిపోయిన శబ్దాలతోకాని ఉండవచ్చు. వర్ణనాత్మకమైన నామవాచకమిందులో ప్రధానం.

---

26. *Brothers and sisters I have none, but that man's father is my father's son. Who is he?*
సమాధానం: *His son.*

27. *What is big, gray, lives in trees and is dangerous?*
సమాధానం: *Elephant*

28. *Introducing Folklore, Kenneth W. Clark, Mary Clark. P. 120*

29. కన్నడ సావిరద ఒగటుగళు పుట *xxxii*

ఉదా : పెద్దయిల్లు
పెద్ద ఇంటిలో చిన్నయిల్లు
చిన్న యింటిలో గుంట
గుంటలో స్తంభంమీద రాజు కూర్చొని తపస్సు చేస్తాడు

సమా : గ్లోబ్ [30]

2. **క్రియా ప్రధానాలు (action based):** వీటిలో క్రియాత్మక వర్ణన ప్రధానం. వీటిలో సంక్లిష్టవాక్యాలే అధికంగా వుంటాయి. సరళమైన, సమానమైన, నిషేధాత్మకమైన క్రియాపదాలతో కూడి ఉంటాయి. కొన్నింట నిషేధాలు లేకపోవచ్చు.

ఉదా : దేహమెల్ల కండ్లు దేవేంద్రుడు కాడు,
నరవాహనమెక్కి నడచిపోతాడు,
నిండు ప్రాణము లేదు తాన జీవులజంపు
దీనిభావమేమి తిరుమలేశ?

సమా : వల

3. **అర్థ ప్రధానాలు (Semantically controlled):** వీటిలో మొదట చెప్పిన విషయంలోని చివరిశబ్దం రెండోసారి చెప్పిన విషయానికి ముందు చేర్చబడి పొడుపుకథ సాగుతుంది. ఇది ముక్తపదగ్రస్తంలా వుంటుంది. కాని ప్రతిశబ్దమూ అర్థవంతంగా వుంటుంది.

ఉదా : అంభాలు, అంభాలు మీద కుంభాలు - (కాళ్ళు, పిరుదులు)
కుంభాలు మీద కుడితిబాన - (కడుపు)
కుడితిబాన మీద ఊరపలక (రొమ్ము)
ఊరపలక మీద ఇనుపగుండు (తల)
ఇనుపగుండు మీద ఇద్దరుజవానులు (కండ్లు)

---

*30. చమత్కార పొడుపు కథలు అను తెలుగు సామెతలు, ఎన్.వి. గోపాల్ అండ్ కో, 1968.*

ఇద్దరు జవాన్లమీద సీక్ పొద (వెంద్రుకలు)
సీక్ పొదలో పది రేసకుక్కలు (పేన్లు)[31]

పొడుపు కథల్ని 1. అకారాదిక్రమంగా, 2. ముఖ్య పదాల్ని బట్టి, 3. కథల్లోని విషయాన్ని బట్టి వర్గీకరింపవచ్చు. తెలుగులో మూడవ పద్ధతే అనుకూలమైన దనిపిస్తుంది.

విషయ ప్రాధాన్యాన్ని బట్టి తెలుగులోని పొడుపు కథల్ని ఇలా వర్గీకరింపవచ్చు.

1. **ప్రశ్నార్థకాలు:** ప్రశ్నల్లాగుండి సమాధానాన్ని అపేక్షిస్తాయి.

ఉదా : ఒక్కొక్క అడుగు పోయినకొద్దీ కొంచెం తగ్గుతుంది. దాని పేరేమి?

సమా : సూది, దారం

2. **వినోదాత్మకాలు:** దీంట్లో వినోదం లేక హాస్యం ప్రధానం. సామెతల్లాగే అల్పాక్షరాలలో అనల్పార్థాన్ని ఇముడ్చుకొని మనస్సును రంజింపచేస్తాయి. ఇలాంటివే ప్రాచీనాలైవుంటాయనే అభిప్రాయం ఉంది.

ఉదా : చాపను చుట్టలేము, చక్క బెట్టలేము.

సమా : ఆకాశం.

ఉదా : రూకలెంచలేము, చాప చుట్టలేము

సమా : నక్షత్రాలు, ఆకాశం.

3. **కథాత్మకాలు:** ఇవి కథను ఇముడ్చుకొన్నటువంటివి. ఈతచాపల వ్యాపారం చేసే ఒక సాహెబు పల్లెలు తిరిగి తిరిగి అలసిపోయాడు. భోజన సమయం అతిక్రమించినా తిండి లభింపలేదు. అతని స్థితి చూసి జాలిచెందిన ఒక ఇల్లాలు త్వరత్వరగా అన్నం వండి కూర లేనందున చింతగొజ్జు (పులుసు) చేసి, విస్తరాకు లేనందున ఏడి ఆకులో గొజ్జు, అన్నం వడ్డించి నెయ్యి కూడ వేసింది. అప్పుడు అతడన్న మాటలు -

---

*31.* శ్రీ పి. వేణుగోపాల్ గుప్త, తీర్థం గ్రామంలో సేకరించింది.

పంగలా పంగలా ఆకులు, సీమలా సీమలా అన్నము, చుక్కల చుక్కల చారు, పైగా గొర్రె సీమిడేసి తిను తిను అంటే ఎలాగమ్మా తినేది![32]

4. **గొలుసుకట్టు కథలు:** ముక్తపదగ్రస్తల్లాగుండి గొలుసుకట్టులా అల్లుకొని పోయినవి. ఇవి విప్పటానికి కష్టతరంగాను, దిగ్భ్రమ చెందించేవిగాను, సవాలు చేసేవిలాగాను ఉంటాయి.

ఉదా : విసనగిరీ పట్నాన వీధెంత సక్కన (చాప)
వీధిలో వుండే పాడుచెంత సక్కన (ఆముదపు మొక్క)
పాడుసు తొడిగిన రైకెంత సక్కన (కాయ)
రైకలో వుండే గుబ్బెంత సక్కన (గింజ)
గుబ్బధార తాగినోడింగెంత సక్కన (చిన్నబిడ్డ)[33]

ఇలాంటి వాటిలో ఒక్కొక్క భాగాన్ని విప్పిచెప్పుతూ పోవలసివున్నందున ఆంగ్లంలోని Cracking riddles లో వీటిని చేర్చవచ్చును. వీటిని Descriptive riddles లేదా form based riddles లో కూడా చేర్చవచ్చు.

5. **వృత్తి సంబంధాలు:** వ్యవసాయం:

ఉదా : ఒంటి గొల్లవాడు ఇద్దరిని పొడుచు
సమా : ముల్లుగర్ర

ఉదా : ఏడు బారలమాను వంగి నీళ్ళు తాగు
సమా : కపిలిమోకు

కుమ్మరము :

ఉదా : ఒక మొదులు నాలుగు కొమ్మలు, కాసే కాతకు లెక్కేలేదు.
సమా : కుమ్మరి సారె

6. **సంఘ జీవన సంబంధాలు:** శరీరావయవాలు, నగానట్రా, మొదలైనవి రూపకాలంకారంతో కూడి వుంటాయి.

*32. మిత్రులు శ్రీ రామలింగారెడ్డి (మద్దెమ్మ గూడుపల్లె) ద్వారా సేకరించినది.*
*33. సేకరణ శ్రీ వేణుగోపాల్ గుప్త.*

ఉదా రెండు మిద్దెలకు ఒకటే దూలము.
సమా ముక్కు.

ఉదా మిద్దెమీద మిరపచెట్టు నీళ్ళులేక ఎండిపోయె
సమా దీపము.

7. **చిత్ర శబ్దాత్మకాలు:** ఒక పదం లేక అక్షరాల్లో వస్తువును గుప్తంగా చిత్రించటం.

ఉదా : వంకర టింకర 'శొ'
వాని తమ్ముడు 'అ'
నల్లని పిల్లా 'మి'
నాకేమిస్తావు 'తే'

సమా : శొంఠి, అల్లము, మిరియాలు, తేనె.

8. **అశ్లీలార్థకాలు:** పైకి అశ్లీలాలుగా తోస్తూ, కథ విప్పినప్పుడు చమత్కారంగా వుండి అశ్లీలత కనుమర్గై పోవటం ఇందులోని ప్రత్యేకత. పైకి కనబడే ఈ అశ్లీలతకు జానపదుల హాస్య ప్రవృత్తి, వినోదాపేక్ష కారణం. ఇలాంటివి అన్ని భాషల్లోనూ ఉన్నాయి.

ఉదా : ఆలుమొగుడూ వాటేసుకుంటే, అల్లీసాయబొచ్చి యిడిపిచ్చె.

సమా : బీగం.

పొడుపు కథలకు సామెతలుకు ఉండే సాదృశ్యాలనిలా పేర్కొనవచ్చు:

| పొడుపు కథ | సామెత |
|---|---|
| పాండిత్యముండాలి | ప్రతిభ వుండాలి |
| బుద్ధిచాతుర్యం ప్రధానం | భావం ప్రధానం |
| వినోదాన్నిస్తాయి | అనుభవాల కూడలి |
| రూపకముండాలి | అలాంటి నియమం లేదు |
| సమాధానమపేక్షిస్తుంది | వ్యాఖ్యానాన్ని అపేక్షిస్తుంది |

| పొడుపు కథ | సామెత |
|---|---|
| సామెత దీంట్లో అంతర్లీనమై వుంటుంది. | పొడుపుకథ దీంట్లో ఇమిడి వుండదు. |
| ఒక్కొక్కసారి సామెత కావచ్చు, కాని ఆ రూపం ధరించదు. | సామాన్యంగా అలా జరగటం అసాధ్యం. |

పొడుపుకథ, సామెతలు రెండింటికీ సృజనాత్మక శక్తి, శైక్షణిక మౌలికాంశం, హృదయాహ్లాదన శక్తి ఉంటాయి. సంక్షిప్తత, వ్యంగ్యోక్తి, ప్రాసానుప్రాసలు, అర్థాంతరన్యాసం రెండింటికీ అన్వయించే గుణం.

సామెతనుండి పొడుపుకథను వేరుచేసే ప్రధానగుణం రూపకం. ఇది పొడుపు కథకు ప్రాణం. సామెత చెప్పవలసిన విషయాన్ని నేరుగా స్పష్టంగా చెప్తుంది. పొడుపుకథలో అస్పష్టతే ప్రధానం. పొడుపుకథ సామెతతోనే కాకగేయం, కథలతో కూడా సంపర్కం కలిగిన జానపద ప్రక్రియ.

పొడుపుకథలు కాలక్షేపం కోసం సృజింపబడ్డ ప్రక్రియే అయినా ఇది పెద్దలు, పిన్నల మధ్య ఒక విధమైన సామాజిక విషయ సామాగ్రిగా వున్నది. వినోదం, విజ్ఞానాల ప్రసాదించే లక్షణం పొడుపుకథల్లో వుండటం చేత దుర్గాభాగవత్‌గారు అభిప్రాయపడినట్లు -

"... the riddle is the only form of folklore which has preserved the essential ancient element and is still growing vigorously".

ఇలాంటి పొడుపుకథల్ని సేకరించి ప్రకటించవలసిన అవసరమెంతైనా వుంది.

* * *

# 13. జానపదుల భాష
## (Folk Speech)

'మన్' ధాతువునుంచి 'మానవ' శబ్దం ఉత్పన్నమయినట్లే 'భాష్' అనే ధాతువునుంచి 'భాష' అనే శబ్దం నిష్పన్నమయింది. 'మానవుడు- భాష' - వీటికి ఉన్న అవినాభావ సంబంధమే 'భాషా చరిత్ర'. మానవుడు తన భావాలను ఇతరులకు వ్యక్తీకరింపచేసే ధ్వనుల ఉచ్చారణే 'భాష'.

విట్‌మాన్ భాషను గురించి చెప్తూ 'Language is not the abstract construction of the learned, or of dictionary makers, but is something arising out of the work, needs, ties, joys, affections, tastes of long genrations of humanity, and has its bases broad and low, close to the ground' అని వివరించాడు. జీవితంలోని కష్ట నిష్ఠూరాలను, సుఖదుఃఖాలను ప్రతిబింబింప చేసే శక్తి భాషకు ఉంది.

ఆంగ్లంలోని 'Language' అనే పదానికి తెలుగులో సమానార్థక శబ్దం 'భాష'. 'Language' అన్నపదాన్నే 'Speech' అని కూడ వ్యవహరించడం ఉంది. ఈ రెండూ ఒక విధమైన అర్థాన్నిస్తున్నా రెండింటికీ భేదం లేకపోలేదు. 'Sentence is the unit of speech, and the word is the unit of language'[1] అని Alan-H. Gardiner అభిప్రాయం. ఈయనే 'Language is the mother of all speeches' అని కూడా అభిప్రాయపడ్డాడు.

అమెరికన్ ఇంగ్లీషులో మూడువిధాలైన భాషా వైవిధ్యాలను గమనించవచ్చు. అవి Cultivated speech, Common speech and Folk speech.[2] వీటిలో చివరిది ప్రాచీనమైందీ, నిరక్షరాస్యులకు సంబంధించిందీ.

జానపద కవిత్వానికి జానపదభాషే మూలాధారం. టి. ఎస్. ఇలియట్ అన్నట్లు 'The poetry of a people takes its life from the people's speech and in turn gives life to it; and respresents its highest point of consciousness, its greatest power and its most delicate sensibility.

---

1. *Speech and Language (1932), P-87.*
2. *American folklore, P-261, Ed. by Tristram Coffin, III.*

భాషామూలాన్ని కాని, స్వరూపాన్ని కాని, విశ్లేషించి చెప్పటం సులభం కాదు. అయితే భాషను గురించి భాషావిజ్ఞానులిచ్చే అర్థవివరణకి కవుల కల్పన భాషకు నూతనత్వాన్ని, తేజాన్ని తెచ్చిపెడ్తుందనడంలో సందేహం లేదు. భాషని 'కవి-కావ్యం' దృష్టితో చూసినప్పుడు భాషే కావ్యంగా గోచరించడాన్ని గమనించవచ్చు. అదే పండితుల విశ్లేషణలో 'కావ్యం' భాషగానే నిలిచిపోతుంది.

ఛందోలయ (Rhythm), ధ్వన్యనుకరణపదం (onomatopoeia), ప్రాస, అనుప్రాసలు, అనురణనం (assonance) - ఇవన్నీ భాషకి సౌందర్యాన్ని చేకూర్చే అంగాలు. కాబట్టే K. Vossler 'Its phonetic body is equivalent to its poetic capacity' అని పేర్కొన్నాడు. ఈ మాట జానపద భాషకు కూడ పూర్తిగా అన్వయిస్తుంది.

భాషామూలాన్ని పరిశీలించి, అది కావ్యాత్మకంగా ఉండిందని చాలమంది విమర్శకులు అభిప్రాయపడ్డారు. 'As we go back in history, language becomes more picturesque, until its infancy, when it is all poetry; or all spiritual facts are represented by natural symbols'- Emerson. జానపదుల భాషే ప్రాచీనమైందీ, మొదటిదీ అని Emerson అభిప్రాయపడ్డాడు. 'As this (folk language) is the first language, so it is the last'

గ్రంథగతమైన భాష 'గ్రాంథిక భాష' గాను, వ్యవహారంలో ఉన్న భాష 'వ్యావహారిక భాష' గాను పిలువబడుతోంది. గ్రాంథిక భాష 'కావ్యభాష'గాను పిలువబడి ఒక ప్రామాణికతని పొందివుంది. అందువల్లే దీన్ని 'ప్రామాణిక భాష' అంటున్నాం. వాగ్వ్యవహారంలో ఉన్న భాష 'జీవద్భాష'. ఇదే వాడుకభాష; వ్యావహారిక భాష. ఇందులో వ్యాకరణ విరుద్ధాలైన పదాలు అధికం. మార్పులు, చేర్పులు నిరంతరం జరుగుతూనే ఉంటాయి. అందువల్లే జీవద్భాషను ప్రవాహంతో పోలుస్తున్నాము. ప్రవాహం ఎలా తాను మెట్టిన క్షేత్రాన్ని బట్టి దాని లక్షణాలను స్వీకరించి భిన్నరూపాలను పొందుతుందో, జీవద్భాష కూడా అలాగే. అంటే ఒక మండలానికీ మరో మండలానికీ ఉన్న భాషవైవిధ్యంతో కూడుకొని సాహిత్యానికే ఒక నూత్న శోభను చేకూరుస్తుంది.

కావ్యభాష మార్గసాహిత్య సంప్రదాయాన్ని కలిగింది కాగా వాడుకభాష దేశి సాహిత్య సంప్రదాయాన్ని పొందిఉంది. ఈ దేశి సంప్రదాయాన్ని కలిగిన

వాడుక భాషే జానపదుల భాష. కాబట్టి ఈ ద్వివిధాలైన భాషా భేదాలు ఒకే భాషకు ఉన్న భిన్న రూపాలు.

నేటి కాలంలో 'మాండలిక భాష' మీద పరిశోధనలు అధికంగా జరుగుతున్నాయి. ఒక మండలంలో వాడుకలో ఉన్న భాషా భేదాన్ని 'మాండలికం' అంటారు. ఇది ఆయా ప్రాంతాలలో ఉన్న జనుల వ్యవహారభాష. ఈ భాష ఒక మండలానికీ మరో మండలానికీ వ్యత్యాసంతో కూడుకొని ఉంటుంది. మాండలిక భేదం శబ్దకోశం (vocabulary), ఉచ్చారణ (pronounciation) యాస (Slang) లను లోగొని ఉంటుంది. ఇది భౌగోళిక, సామాజిక పరిస్థితుల మీద ఆధారపడి ఉంటుంది.

జానపదుల భాషను నిశితంగా పరిశీలిస్తే భాషా శాస్త్రజ్ఞులకు ఈ క్రింది పరిశోధనాంశాలు బయల్పడుతాయి:

1. ద్రావిడభాషా కుటుంబంలో భాషా పరిణామ క్రమంలో తెలుగు భాషకు ఇతర భాషలతో ఉన్న సంబంధం.
2. తెలుగులోని మాండలిక భేదాలు - మారుమూల పదాల స్వరూప నిర్ణయాలు.
3. ధ్వనుల మార్పు
4. అన్యదేశ్యాలు
5. జానపదనిరుక్తి
6. శిష్టోచ్చారణాభాసం లేదా నాగరీకరణం.

పైన పేర్కొనబడ్డ అంశాలను పరిశీలించడానికి సాంకేతిక శిక్షణ అవసరం. భాషాశాస్త్ర ప్రవేశం కూడ అత్యావశ్యకం. అలాగే ప్రామాణిక భాషా (standard speech) జ్ఞానం కూడా చాల అవసరం. వీటకితోడు శ్రవణేంద్రియాల వినికిడిశక్తి కూడా అంతే అవసరం.

శిష్టసాహిత్యంలోని పదాలను నిఘంటువుల సాయంతో తెలుసుకోవడానికి వీలుంది. అయితే మౌఖిక ప్రచారంలో నలిగిపోయిన నిసర్గ మనోహరమైన జానపదుల భాషలోని పదాలను అలా తెలుసుకోలేం. వ్యాకరణ విరుద్ధాలైన భాషా

విషయాలు, వ్యావహారికపదాలు, మాండలికశబ్దాలు, దుష్టసంధులు, ఇత్యాదులు వైయాకరణులకు సమ్మతం కాకపోయినా భాష పుట్టుపూర్వోత్తరాలను అధ్యయనం చేసే భాషాశాస్త్రజ్ఞులకి మాత్రం కావలసినంత సామగ్రిని ఒదగిస్తాయి.

ప్రవాహశీలమైన జానపదుల భాషలో ధ్వనుల మార్పును, పదబంధనిర్మాణ వైఖరిని, అన్యదేశ్యాలను, మాండలిక పదాలను, జానపద నిరుక్తిని, శిష్టోచ్చారణాభాసాన్ని గుర్తించవచ్చు.

1. **ధ్వనుల మార్పు:** ధ్వనులమార్పు సజీవమయింది. నిజానికి ధ్వనులే భాషా నిర్మాణానికి పునాదిరాళ్ళు. ప్రాచీనభాషకు, ఆధునిక భాషకు ఉన్న సంబంధాన్ని నిర్ణయించే అనేకాంశాలు ఈ ధ్వనుల మార్పువల్లే సిద్ధిస్తున్నాయి. ఈ ధ్వనుల మార్పుల్ని గుర్తించి, ఆ మార్పులు జరిగిన దేశకాలాలను బట్టి భాషాచరిత్రని, మాండలిక చరిత్రని నిర్మించడానికి వీలుంది.

భాషలో ధ్వనులమార్పు ప్రధానమైంది. ఇది సామ్యంవల్లా, పరిచితివల్లా, ఉచ్చారణాంశాలవల్లా, పదాలను తప్పుగా విరచడం వల్లా సిద్ధిస్తోంది. దీన్నే జె.యి.హెచ్. బ్రెడ్‌డార్ఫ్ పదాలలోని మార్పులకు కారణాలను ఇలా పేర్కొన్నాడు. '(1) తప్పుగా వినుట, తప్పుగానర్థము చేసికొనుట, (2) ఒక మాట యథాస్వరూపమున స్మృతికి రాకుండుట, (3) వాగింద్రియములందలి దోషము (4) అలసత - భాషయందలి మార్పులకు పదికి తొమ్మిది వంతుననిదియే కారణమని యాతనియభిప్రాయము. (5) స్వరసామ్యమునుబట్టి క్రొత్తపదముల నేర్పరచుట (6) స్పష్టోచ్చారణమునకై ప్రయత్నము (7) నూతన భావ ప్రకటనావశ్యకత'[3]

## I. ధ్వనుల మార్పులలో కొన్ని:

1. **వర్ణ సమీకరణం (Assimilation):**

ఉదా: భక్తి > బత్తి, లగ్నం > లగ్గం

---

3. *సారస్వత వ్యాసములు, రెండవ సంపుటము, పుట 138; పరిష్కర్త: పురిపండా అప్పలస్వామి, ఆం.ప్ర.సా.అ. ప్రచురణ; వ్యాసం - 'భాషాశాస్త్ర నిర్మాణము', చిలుకూరి నారాయణరావు.*

2. స్వరవిశ్లేషం (Anaptyxis):

ఉదా: రక్తం > రకతం, హర్షం > హరుషం

3. వర్ణవ్యత్యయం(Metathesis):

ఉదా: తగులు > తలుగు, నవ్వులాట > నవ్వుటాల.

4. అచ్లోపం (synecope):

ఉదా: ఉంగరము > ఉంగ్రం, వేడుక > వేడ్క.

5. వర్ణనాశం (Elision):

ఉదా: ఆమీదట > ఆమీట, ఏకాదశి > ఏకాశి, యాకాసి.

6. వర్ణాగమం (Prothesis or Epinthesis):

ఉదా: పరిహాసం > పర్ిహాసకం, వేషం > వేషకం.

7. వర్ణచ్యుతి (Haplology):

ఉదా: నాగవల్లి > నాగవలి, నాగవేలి, నాగోలి.

8. లోపదీర్ఘత (Compensatory lengthening):

ఉదా: అక్కడ > ఆడ, నెయ్యి > నేయి.

9. సంప్రసారణం:

ఉదా: ఓమనగుంటలు > వామనగుంటలు, ఒడిబియ్యం > వడిబియ్యం

10. ప్రథమావిభక్తిలోపం

ఉదా: అనంతుడు > అనంతు, కృష్ణుడు > కృష్ణు.

11. దీర్ఘం మీద సాధ్యపూర్ణం

ఉదా: కాచు > కాంచు, ఏటికి > ఏంటికి.

12. క్షకారం చకారం కావడం

ఉదా: అక్షింతలు > అచ్చింతలు, భిక్షం > బిచ్చం.

13. పరుషాలు సరళాలు కావడం, సరళాలు పరుషాలు కావడం:

ఉదా: నాగుపాము > నాగుబాము, కడప > గడప.

**14. మహాప్రాణత్వం లోపించడం:**

ఉదా: ఘనమైన > గనమైన, ఆధిక్యం > ఆదిక్యం

15. అల్పప్రాణత్వానికి బదులు మహాప్రాణత్వాన్ని ఉపయోగించడం

ఉదా: రాయబారం > రాయభారం, సాంబశివుడు > సాంభశివుడు

**16. చకారాన్ని సకారంగా ప్రయోగించడం**

ఉదా: చాకలి > సాకల, విచారణ > విసారణ, విసార్న.

17. **సాగదీతలు:** సమాసంలోని పూర్వపదాన్ని సాగదీయడం

ఉదా: మల్లీయపూలు (మల్లెపూలు), పచ్చీయ పోకలు (పచ్చిపోకలు)

18. 'పలికెను, పెరిగెను, అడిగెను' ఇత్యాది క్రియాపదాలలోని అంత్యాక్షరం పూర్తిగా తొలగిపోయి, రెండో అక్షరంలోని 'ఎకారం' 'అ' కారమై తర్వాత దానికి 'య' వత్తు చేర్చబడి పలుకబడుతుంది.

ఉదా: పలికెను - పలికె - పలికా - పలిక్యా

పెరిగెను - పెరిగె - పెరిగా - పెరిగ్యా.

అలాగే 'వచ్చెను, చెప్పెను, పెట్టెను' ఇత్యాది పదాల్లో ద్వితీయ ద్విత్వాక్షరంలోని ద్విత్వం తొలగి పై మార్పునే పొందుతుంది.

వచ్చెను - వచ్చె - వచ్చా - వచ్యా.

చెప్పెను - చెప్పె - చెప్పా - చెప్యా.

19. అయ్యెను (ఆయెను, అయినది) అనే పదానికి 'ఆయ', పోయెను అనే పదానికి 'పాయ' అనే వింతరూపాలు ఉన్నాయి. తేండి (తెండు) అనేపదం 'త్యాండి' అనేరూపాన్ని పొందింది.

**20. ఇత్తుకు అచ్చు పరమైతే సంధి నిత్యంగా వస్తోంది.**

ఉద: అరటి + ఆకు > అరటాకు, పాడి + ఆవు > పాడావు.

**21.** **ఇత్తుకు హల్లుపరమైతే సంధి ఏర్పడుతోంది.**

ఉదా: కాశి + యాత్ర > కాశాత్ర, చెప్పి + పంపితి > చెప్పంపితి

**22.** **వ్యాకరణ విరుద్ధాలైన పదాలు, సమాసాలు:**

ఉదా: వస్తారు, చేస్తారు, పోతిరి (పదాలు), రత్నమేడలు, వజ్రమొలకులు (సమాసాలు)

**23.** **వచనవైరుధ్యం:** బహువచనానికి మారుగా ఏకవచనాన్నే ప్రయోగించడం.

ఉదా: వనచరులు యెక్కె, ముత్తయిదువలు వచ్చె, వేశ్యస్త్రీలు వచ్చె ఇత్యాది.

**24.** **ద్వంద్వపదాలు:** ఒకే పదాన్ని జంటగా పలకడం కన్పిస్తుంది.

ఉదా: అబల ఆడుది, తలశిరుసు, భస్మం - బూడిద

**25.** వెండి-భమిడి మొదలైన పదాలకు 'అయ్య' శబ్దాన్ని చేర్చి 'వెండయ్య' 'భమిడయ్య' అని ఏర్పడ్డ పదప్రయోగాలు కన్పిస్తాయి.

## II. అన్యదేశ్యాలు:

రాజకీయంగాను, సాంస్కృతికంగాను, వాణిజ్య సంబంధంగాను అన్యభాషీయుల ప్రభావం తెలుగువాళ్ళమీద పడింది. అందువల్లే ఆంధ్రభాష సుసంపన్నమైన భాషగా అలరారుతోంది. మహమ్మదీయుల సంపర్కంవల్ల అరబ్బీ, పారశీక, ఉర్దూపదాలు, ఆంగ్లేయుల పరిపాలనవల్ల ఆంగ్లభాషా పదాలు, కన్నడం, తమిళం సరిహద్దు ప్రాంతాల్లో ఉండడంవల్ల కన్నడ, తమిళభాషా పదాలు తెలుగు జానపద భాషకు నిండుతనం చేకూర్చాయి.

ఉర్దూ: కచేరీ, తారీఖు, ముస్తాబు, షోకు ఇత్యాది.

ఆంగ్లం: ఇరుంగు (**Hearing**), ఎండిసెయనాలు (వెండిచైనులు) కరెంటుదీపాలు, సమన్లు (**Summons**) ఇత్యాది.

కన్నడం: ఉత్తుత్తిపండ్లు (కర్జూరపు పండ్లు), ఊదుకడ్లు (అగరవత్తులు), గోళాడు (వ్యథచెందు), బాలెపండు (అరటిపండు)

### III. జానపద నిరుక్తి (**Folk Etymology**):

folk etimology నే popular etimology అని కూడా అంటారు. జానపదులు తమకు అర్థంకాని పదాలనుకూడ పరిచయం ఉన్న పదాలుగా మార్చుకొంటారు. 'Folk etymology or popular etymology plausible but usually incorrect analysis by untrained folk of a word whose meaning, or spelling or sound is not clear, resulting in the formation of the word into one or more intelligible'[4]

లోకనిరుక్తి అర్థవిపరిణామానికి చెందింది. వక్త తనకు బాగా పరిచయమైన పదాంశాన్ని తనకు పరిచయంలేని పదాంశస్థానంలో చేర్చి వ్యవహరించడం జరుగుతూ ఉంటుంది. క్రమంగా అదే ప్రాచుర్యం పొందుతుంది. కొత్తపదం ఏర్పడుతుంది.

ఒక పదాన్ని కాని, పదభాగాన్ని కాని జానపదులు గుర్తులో ఉంచుకొని దాని మాదిరిలో కొత్తపదాలను సృష్టించుకోవడం జానపదనిరుక్తి లక్షణం.

'వ్యుత్పత్తి స్పష్టంగా నిరూపించలేని పదానికి సామాన్యులు ఒక అర్థాన్ని ఊహించడం, తదనుగుణంగా ఆ పదంలోని ఒకటిరెండు వర్ణాలను మార్చడం లోకనిరుక్తి లేదా జననిరుక్తి అవుతుంది'[5]. దీనికి ఉదాహరణం 'ఆకాశరామన్న'.

'ఎరువు తెచ్చుకొన్న పదాన్ని నిసర్గమైన పదంలాగా మార్చటమే లోకనిరుక్తి'[6]. దీనికి ఉదాహరణం 'నమ్మక్ హరామ్'

జానపద నిరుక్తికి మరికొన్ని ఉదాహరణలు

అనిరుద్రుడు (అనిరుద్ధుడు)
ఆరుంజోతి (అరుంధతి)
కాలుచిచ్చు (కార్చిచ్చు)
ఋషీకేశవా (హృషికేశా)
శ్రీమంతం (సీమంతం) ఇత్యాది.

---

4. *Standard Dictionary of folklore, Legend and Mythology, P. 753*
5. *తెలుగు భాషా చరిత్ర, పుట. 441 సం. భద్రిరాజు కృష్ణమూర్తి*
6. *Ibid p. 329.*

## IV. శిష్టోచ్చారణాభాసం (Hyper standardization)

జానపదులు కొన్ని పదాలను ఉచ్చరించడంలో శిష్టుల్ని అనుకరింపబోయి తప్పులు చేయడం పరిపాటి. దీన్నే 'నాగరీకరణం' అని కూడా అంటారు.

ఉదా: కోయిల > కోవెల.

నాగసరం > నాగస్వరం

బనసరము > భన్నస్వరం

సృష్టి > శ్రిష్టి

అంగడి > వంగడి

ఆకు > వాకు

ఎగతాళి > వెగతాళి ఇత్యాది.

ఇలా పరికిస్తూపోతే జానపద భాషావిశేషాలను ఎన్నింటినైనా వెలికి తీయవచ్చు. కొన్ని పదాలకు అర్థాలను నిర్ణయించడం కష్టతరమే అయినా, వాటికి నిఘంటవుల సాయంతో అర్థం రాబట్టుకోవడం సమంజసం కాదు.

జానపదులభాషలో జాతీయాలు, నానుడులు, సామెతలు, శబ్దాలంకారాలు చోటుచేసుకొన్నాయి. ఇవన్నీ భాషకి నిండుదనాన్నిస్తాయి. ఏమయినా జానపద భాష శిష్టులభాషకు పునాది వంటిదని చెప్పక తప్పదు.

* * *

# 14. జాతీయాలు
## (Idioms)

భాషా వికాసానికి సహకరించే ముఖ్యాంశాల్లో జాతీయాలు ప్రాధాన్యం వహిస్తాయి. జాతీయాలనే మనం నుడికారాలని కూడ అంటుంటాం. ఆంగ్లంలో వీటిని 'Idioms' అంటారు. హిందీలో 'ముహావరే' అనీ, కన్నడంలో 'పడెనుడి', 'నుడిగట్టు', 'వాగ్రూఢి' అనీ వ్యవహరిస్తారు. సంస్కృతంలో న్యాయం అన్నమాట వ్యవహారంలో ఉంది.

ఒక భాషకు వైశిష్ట్యాన్ని లేదా ప్రత్యేకతని జాతీయాలు చక్కగా రూపొందిస్తాయి. వ్యావహారిక భాషాసౌందర్యం వీటిలో తొణికిసలాడుతుంది.

జానపద విజ్ఞానంలో జానపద భాషకూడ ఒక ప్రధానాంగం. జానపద భాషలో వ్యక్తుల పేర్లు, గ్రామాల పేర్లు, మాండలిక భాషలు, జానపద రూప నిష్పత్తి, తిట్లు, ఒట్లే కాకుండా జాతీయాలూ లేదా నుడికారాలు చేరతాయి. R.S. Boggs వర్గీకరణ (Funk & wagnalls Standard Dictionary of folklore, Legend and Mythology, p. 1139) లో భాష 'L' విభాగంలో చేర్చబడింది.

జాతీయాలలో భాషకు సంబంధించిన అంశాలే కాకుండా సాహిత్యాంశాలు కూడా లేకపోలేదు. అందువల్ల వీటిని భాషా సాహిత్యాలు రెండింటిలోనూ అధ్యయనం చేయాల్సిన అవసరం వుంది.

Webster's International Dictionary లో ఈ క్రింది అర్థాలు కన్పిస్తున్నాయి. '1. The syntactical or structural form peculiar to any language; the genius or cast of a language అనీ, 2. An expression confirming or appropriate to the peculiar structural form of a language; in extended use, an expression sanctioned by usage, having a sense peculiar to itself and not agreeing with the logical

---

*ఉస్మానియా విశ్వవిద్యాలయం, తెలుగు విభాగం మరియు ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్తు, హైదరాబాదు వారు 14-3-1981 నుండి 17-3-1981 దాకా నిర్వహించిన జానపద విజ్ఞాన గోష్ఠి కార్యక్రమంలో చదివిన వ్యాసం.*

sense of its structural form; also, the phrase forms peculiar to a author' అనే అర్థాలున్నాయి.

ఇలాగే Webster's New Twentieth Centrury Dictionary లో '1. The language or dialect of a people, region, class etc. 2. the usual way in which the words of a language are joined together to express thought. 3. an accepted phrase, construction or expression contrary to the usual patterns of the language or having a meaning different from the literal. 4. the style or expression characteristic of an individual, as, the idiom of carlyle...' మొదలైన అర్థాలు కన్పిస్తాయి.

జాతీయాలు సామెతలలాగా వాక్యరూపంలో ఉండవు. పద బంధాలుగా ఉండి భాషా సౌందర్యంతోపాటు భావసౌందర్యాన్నీ, సాహిత్య వాసననీ కలిగి ఉంటాయి. మనం మాట్లాడుకునే మాటల్లో ఎప్పుడో ఒకప్పుడు మనకు తెలియకుండానే నుడికారాల సొంపు ఉండనే ఉంటుంది.

'Idiom I H Deeuhm is a form of expression peculiar to one language. Its understood meaning differ from its literal meaning' అని World Book లో చెప్పబడింది

ఇలాగే folklore and folk life అన్న గ్రంథంలో 'On the border line between grammar and vocabulary are those set expressions found in every language that are frequently called idioms'[1] అని చెప్పబడింది.

G.P. Marsh Idiom గురించి వివరిస్తూ 'Idiom may be employed loosely and figuratively as a synonym of language or dialect, but in its proper sense it signifies the totality of the general rules of construction which characterize the syntax of a particular language and distinguish it from other longues'[2] అన్నాడు.

'ఒక ప్రత్యేక జాతికి సంబంధించిన ప్రత్యేక విషయాలను వ్యక్తీకరించేవే జాతీయాలు. అవి భాషలో బలమైన స్థానాన్ని ఆక్రమించుకొంటాయి. జాతీయాలు లేని భాష పేలవంగా ఉండడమేగాక, జాతీయాలు లేని జాతి పూర్వ

---

1. *P-86.*
2. *Webster's International Dictionary, P-726*

చరిత్ర కూడా చాలా పేలవంగా ఉంటుందనుకోవాలి'[3] అంటారు నేదునూరి గంగాధరంగారు.

'పదాలకున్న సహజార్థాన్ని మరుగుపరచి విలక్షణమైన అర్థంలో ప్రయోగించబడే పదాలు లేదా పదబంధాలు జాతీయాలు ఉదా: శిలాక్షరాలు, అందె వేసిన చేయి, .... మొదలైనవి'.[4]

'ఒంటరిగా నున్న యొక పదమున కనబడని సొగసు అది పదాంతరముతో చేరి జతకట్టినప్పుడు ఇట్టె తళుక్కుమని తోచును. దాని వలన ఆసందర్భమునకే ఒక వింత సోగసు చేకూర్చును. ఇవియే పదబంధములు. జాతీయములు, నుడికారములు అవి వీనికే మారుపేరు. అడవి గాచిన వెన్నెల, అగ్నిపరీక్ష, ఉగ్గుతో బెట్టిన విద్య, కత్తిమీద సాము, కొమ్ములు దిరిగిన పండితుడు, గుండెలు తీసిన బంటు, తేనె పూసిన కత్తి, ప్రక్కలో బల్లెము, మీసాలపై తేనియలు - మొదలైనవి. కాలుద్రవ్వు, గుడికొను, చిటికెన వట్టు, నీళ్ళు నములు, నోరు చేసికొను, పడకవేయు, మూగనోము పట్టు వంటి శబ్దపల్లవములును ఈ తెగకు చెందినవే'.[5]

పొడుపు కథల్లో లాగానే చెప్పవలసిన విషయాన్ని నేరుగా చెప్పక వ్యంగ్యార్థంలో ప్రతిపాదించే శక్తి జాతీయంలో ఇమిడి ఉంది. 'గుటుక్కుమన్నాడు', 'టికెట్ తీసుకున్నాడు' లేదా 'కళ్ళు మూసాడు' అనడంలో వాచ్యార్థం 'చచ్చిపోయా'డని. అయితే ఈ గూఢార్థాన్ని కప్పిపుచ్చి మరో పదబంధం ప్రయోగించబడింది. ఇలాగే మోసం చేశాడనడానికి 'టోపీవేశా'డనే జాతీయం ఉపయోగిస్తాం.

కనుక జాతీయాన్ని ఇలా నిర్వచించడానికి వీలవుతుంది. 'ఒకటి రెండు పదాలు చేరి, వాటికున్న అర్థాన్ని వదలి, మరో విశిష్టమైన అర్థాన్ని ప్రతిపాదించే ఒక సమస్త పదాన్ని జాతీయం అనవచ్చు. ఇవి ఆయా శబ్దాలనుండి ఉత్పన్నం అయిన పదబంధాలు.

---

*3. పసిడి పలుకులు, పుట - 122.*

*4. తెలుగు భాషా చరిత్ర, పుట - 421.*

*5. ఆంధ్ర శబ్ద రత్నాకరము, ద్వితీయ భాగము, పుట - 12.*

అన్ని జానపద సాహిత్య ప్రక్రియలలాగానే జాతీయాల పుట్టుక కూడా నిగూఢమైందే. జానపద గేయం, కథాగేయం, సామెత, పొడుపుకథ - ఇలాంటి ప్రక్రియలన్నీ మొదట్లో వైయక్తికాలై తర్వాత సమిష్టి సంపదలై సార్వజనీనాలైనట్లే, జాతీయాలు కూడ వ్యక్తినిష్ఠాలై సామూహిక సంపదలయ్యాయి.

'మానవుని యవసరములు పెరిగినప్పుడు, సాంఘిక విషయములందు మార్పులు సంభవించినప్పుడు, ఇతరులతో వ్యవహరించు సంబంధము లధికమైనపుడు, క్రొత్త విషయములు దిగుమతియైనప్పుడు ఇదివరకున్న భాషచాలదు. ప్రగతిశీలమగు జాతి తన భాషను క్రొంగ్రొత్త శబ్దకల్పనముచే పరిపుష్టము గావించుకొని భాషావికాసమునకు దోహదము చేయును. క్రొత్త శబ్దములతో పాటు భాషయొక్క జాతీయ సంపద యనబడు మారుమూల పదములు, నానుడులు, జాతీయములు, మాండలికములు, భాషా వికాసమునకు తోడ్పడును'[6] అన్న డా. బిరుదురాజు రామరాజుగారి మాటలనిట స్మరింపవచ్చు.

భాషను సుసంపన్నం చేసే సందర్భాలలో, భావాలను సునిశితంగా చెప్పే సమయాలలో కొత్త పదాల లేదా పదబంధాల పుట్టుక ఏర్పడుతుంది. అలా జనించినవే ఈ జాతీయాలు. ఇవి ఎక్కడ, ఎప్పుడు జనించాయో చెప్పడం కష్టం. అయితే ఇవి సామెతలలాగానే సందర్భాలకు అనుగుణంగా, సమయస్ఫూర్తి వల్ల ఆవిర్భవించాయనే చెప్పొచ్చు. జాతీయాలు కూడ సామెతలలాగానే అనుభవాల లోంచే పుట్టాయంటే అతిశయోక్తి లేదనుకుంటాను. మానవుడు తన భావాలను, అనుభవాలను భాషమూలంగా ఇతరులకు అందించిన సమయం నుంచీ కూడ జాతీయాలు భాషలో చోటుచేసికొన్నాయి.

చమత్కారంగా మాట్లాడాలనుకొన్నప్పుడు, మాటల్ని అందంగా తీర్చి దిద్దాలనుకొన్నప్పుడు, జాతీయాలు వాటికంతకవే వెలువడుతాయి. ఆయా పరిసర ప్రభావాలు, ఆయా పరిసరాలలో ఉండే వస్తువులు, దైనందిన జీవన వ్యవహారం, స్థల పురాణాలు, చారిత్రక వృత్తాంతాలు, పౌరాణిక సంఘటనలు, ప్రకృతి సంబంధమైన వస్తువులు, శరీరావయవాలు, పశుపక్ష్యాదులు, ఆహారపదార్థాలు - ఒకటేమిటి జాతీయాలు స్పృశింపని అంశాలు ఉండవనే చెప్పాలి.

---

*6 తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట - 682.*

## జాతీయాల వర్గీకరణ:

జాతీయాలను వర్గీకరించడం అంత సులభం కాదు. ఎలా విభజించడానికి ప్రయత్నించినా వాటిలో లోపదోషాలు రాకపోవు.

జాతీయాలను 1. గ్రంథస్థ నుడికారాలు, 2. జానపద నుడికారాలు అని విభజింపవచ్చు. కవులు, పండితులు, తమ తమ కావ్యాలలో ప్రయోగించిన జాతీయాలు గ్రంథస్థ నుడికారాల్లో చేర్తాయి.

ఉదా: **నేత్రోత్సవం:** (శృంగార నైషధం, 2-62, శ్రీనాథుడు)

**పుంఖానుపుంఖమేయ:** (ప్రభావతీ ప్రద్యుమ్నం, 4-155, పింగళి సూరన)

**ఉవ్విళ్ళూరు:** (శృంగార శాకుంతలము 3-51, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు)

**చెండాడు చందమున:** (ఆముక్త మాల్యద, 1-57, శ్రీకృష్ణదేవరాయలు)

**తేనె పూసిన కత్తి:** (పాండురంగ మాహాత్మ్యం, 3-46, తెనాలి రామలింగడు)

**వెలవెలబారు:** (మనుచరిత్ర, 5-158, అల్లసాని పెద్దన) ఇత్యాది.

జానపదులు ప్రయోగించిన జాతీయాలు జానపద నుడికారాల్లో చేర్తాయి.

ఉదా: కాకి ముక్కుకు దొండపండు - గంగావివాహం

పాలవంటి కాపురం - మార్కండేయ జననం

తలలో నాలుక<br>పూసలలో దారం } వీరరాజమ్మ కథ

మూణ్ణాళ్ళ ముచ్చట<br>కాకులు దూరని కారడవి<br>గంగపాలు చేసెను } జానపద గేయాలు

ఈ విభజన సరియైంది కాదు. ఎంచేతనంటే గ్రంథస్థ నుడికారాలు జానపద నుడికారాల్లోను, జానపద నుడికారాలు గ్రంథస్థ నుడికారాల్లోను లేకపోలేదు.

కన్నడంలో జాతీయాలను శ్రీ చక్కెరె శివశంకర్‌గారు ఇలా విభజించారు. 1. వస్తు నిష్ఠాలు, 2. సామూహిక అప్రజ్ఞావస్థ సందర్భంలో ఏర్పడ్డ నుడికారాలు. వస్తు నిష్ఠ నుడికారాలలో లోకంలోని అనేక వస్తువులు చేర్తాయి. పంచభూతాలు, శరీర అవయవాలు, పశుపక్ష్యాదులు, ఆహార పదార్థాలు ఇత్యాదులూ, రెండు నాలుకలు, అరచేతిలో వైకుంఠం, కరతలామలకం, తలమాసినోడు ఇత్యాదులూ వస్తునిష్ఠాలకు ఉదాహరణలు. సామూహిక అప్రజ్ఞావస్థ సందర్భంలో నుడికారాలు బయల్దేరుతాయని మానవ శాస్త్రజ్ఞుడు యూంగ్ అభిప్రాయపడ్డాడు. మానవుని నానావిధ మానసికావస్థలకు ఇవి కారణాలవుతాయి. మానసిక భావాలకు సంబంధించిన నుడికారాలన్నీ ఇందులో చేర్తాయి.

జాతీయాలనన్నింటిని దృష్టిలో ఉంచుకొని ఈ క్రింది విధంగా వర్గీకరించవచ్చు.

1. భాషాసంబంధాలు, 2. వస్తునిష్ఠాలు, 3. పురాణ సంబంధాలు, 4. చారిత్రక సంబంధాలు, 5. కులసూచకాలు, 6. స్థలసూచకాలు, 7. సంకీర్ణాలు.

## 1. భాషాసంబంధం:

భాషావికాసానికి తోడ్పడే జాతీయాలను భాషాశాస్త్రపరంగా వింగడించడానికి వీలవుతుంది. వీటిలో పదిరకాలైన జాతీయాలను గుర్తించవచ్చు. అవి:

(i) **ఒకే పదంతో కూడుకొన్న నుడికారాలు:** ఇందులో ఒకే పదం నుడికారంగా ప్రచారంలో ఉంటుంది. పదబంధాలు ఉండవు.

ఉదా: కీచకుడు, మారీచుడు, బృహస్పతి, శకుని, గొర్రె ఇత్యాది.

(ii) **ఒకే పదం పునరావృతం కావడం:** కొన్ని ధ్వన్యనుకరణ పదాల్లోను, మరి కొన్నింటిలోను పదాలు పునరావృతమై జాతీయాలుగా ప్రయోగింపబడు తున్నాయి.

ఉదా: చెండు చెండాడు, నకనకబడు, కకబిక, కవకవ, గుజగుజలు పోవు ఇత్యాది.

(iii) **ఒకే అర్థమున్న రెండు విభిన్న పదాలు పునరావృతం కావడం:**

ఉదా: అందచందాలు, పండుగపబ్బాలు, అదరు బెదరు ఇత్యాది.

(iv) **రెండు వికల్ప పదాలలో వైదృశ్యం (Contrast of two alternatives):**

ఉదా: హెచ్చుతగ్గులు, పుట్టుటో గిట్టుటో ఇత్యాది. ఆంగ్లంలో కూడ వీటికి ఉదాహరణలు కన్పిస్తాయి. More or less, to kill or cure, Hit or Miss, to stand or fall ఇత్యాది.

(v) **విభక్తి ప్రత్యయాలతో కూడుకొన్నవి:** రెండు నామ వాచక పదబంధాల మధ్య విభక్తి ప్రత్యాయం చేరిన నుడికారాలు తెలుగులో అధికంగా కన్పిస్తాయి.

ఉదా: తలలో నాలుక, పానకంలో పుడక, అడుగులకు మడుగులు, గుడ్డిలో మెల్ల, నల్లేరుపై బండి ఇత్యాది.

(vi) **అసమాపక క్రియలతో అంతమయ్యే నుడికారాలు:** ఇవి కూడా తెలుగులో ఎక్కువగా ఉన్నాయి.

ఉదా: అంగలార్చు, శఠగోపం పెట్టు, ధ్వజమెత్తు, నేల ఈనినట్లు, నేల విడిచి సాముచేయు, నోట దుమ్ముకొట్టు, కంకణం కట్టుకొను, ఉగ్గుపాలతో బెట్టు ఇత్యాది.

(vii) **ప్రాస, అనుప్రాసలతో కూడినవి:**

ఉదా: తోడునీడ, ఈడుజోడు, అవాకులు చవాకులు, హద్దుపద్దు, ఆర్పు తీర్పు ఇత్యాది.

(viii) **పోలిక నుడికారాలు:**

ఉదా: మేకవన్నెపులి, పాలవంటి కాపురం, పాలవంటి కులం.

(ix) **కొన్ని సామెతలు జాతీయాలుగా కలగలసి పోవడం:**

ఉదా: లోగుట్టు పెరుమాళ్ళకెరుక, అరణ్యరోదన, పిచ్చుకమీద బ్రహ్మాస్త్రం, శ్రీరంగ నీతులు, ఉత్తర కుమారుని ప్రజ్ఞలు ఇత్యాది.

(x) **అన్యభాషా సంపర్కం వల్ల ఏర్పడ్డ నుడికారాలు:**

ఆంగ్లం: మందబుద్ధి అనడానికి 'Tube light', వీడ్కోలుకు 'Ta Ta' మోసగాడిని 'Four Twnenty' (420) ఎటువంటి ముందుగా అనుమతి లేకుండా గైరుహాజరవుతే 'French Leave', ఒక మాటే జరిగి తీరాలని పట్టుబడితే 'One way traffic' ఇత్యాది.

సంస్కృతం: కాకతాళీయం, ఆకాశపంచాంగం, నిరక్షర కుక్షి, శిలాక్షరం, అగస్త్యభ్రాత, స్వస్తిచెప్పు, ఘంటాపథం, పయోముఖ విషకుంభం, యంత్రబ్రహ్మ ఇత్యాది.

ఉర్దూ: నమక్ హరామ్, సైతాన్ ఇత్యాది.

## 2. వస్తునిష్ఠం:

ఇందులో (I) ప్రకృతి సంబంధమైన వస్తువులు (II) శరీరావయవాలు (III) పశుపక్ష్యాదులు (IV) ఆహార పదార్థాలు మొదలైనవి చేర్తాయి.

(I) **ప్రకృతి సంబంధమైన వస్తువులు:** ప్రకృతి సంబంధమైన వస్తువుల్లో గాలి, నీరు, ఆకాశం, భూమి, అగ్ని, చెట్టు చేమ మొదలైనవి ప్రాధాన్యం వహిస్తాయి.

ఉదా: గాలిమేడలు, గాలిగోపురం, ఆకాశరామన్న, ఆకాశపురాణం, వాయువేగం, అగ్నిలో ఆజ్యం, భూమికి భారం, నీళ్ళు నమలడం, అగ్గిలాంటివాడు, నట్టేట్లో ముంచడం ఇత్యాది.

(II) **శరీరావయవాలు:** దేహానికి సంబంధించిన అవయవాలు ఇందులో ప్రాధాన్యం వహిస్తాయి.

ఉదా: గుండె చెరువు చేసుకోవడం, ఎత్తిన చెయ్యి, శిరసావహించడం, పెదవి కరచు, రెండు నాలుకలు, వెన్నుతట్టు, కుడిభుజం, ముఖస్తుతి, కడుపుతీపి, కడుపుచిచ్చు, కడుపు కక్కుర్తి, నడుము కట్టడం, గుండెలు తీసిన బంటు, నేత్రపర్వం, కంటికి రెప్పలా, వీనులవిందు, కాలుజారు, కాలికి బుద్ధి చెప్పు ఇత్యాది.

(III) **పశుపక్ష్యాదులు:** పశుపక్ష్యాదులతో మానవనైజాన్ని పోల్చి చెప్పే జాతీయాలు అనేకం ఉన్నాయి.

ఉదా: నిష్ప్రయోజకుణ్ణి 'గుడ్లగూబ' అనీ; కుటిలత్వానికి 'కొంగజపం' అనీ; దురాలోచనకై కన్నీరు కార్చడాన్ని 'మొసలి కన్నీరు' అనీ; కపటవ్యక్తిని 'మేకవన్నెపులి' అనీ; అధికంగా శ్రమించే వ్యక్తిని 'గానుగెద్దు' అనీ; త్రాగి స్వాధీనం తప్పినవాణ్ణి 'గుర్రమెక్కా'డనీ; ఎప్పటికీ బాగుపరచ లేనివాణ్ణిగూర్చి 'కుక్కతోక' అనీ; అర్థంలేని చదువుకు 'చిలుక చదువు' అనీ జాతీయాలను ఉపయోగిస్తుంటాం. 'నక్క వినయం', 'నత్త నడక', 'సింహగర్జన', 'సింహబలుడు' ఇవన్నీ ఈ కోవకే చెందుతాయి.

(IV) **ఆహారపదార్థాలు:**

ఉదా: పప్పన్నం, పానకంలో పుడక, జిలకర బెల్లం, తిలోదకాలు వదలడం, పాలుతేనె కలిసినట్లు, పప్పులో కాలువేయడం, తేనె పూసిన కత్తి ఇత్యాది.

## 3. పురాణ సంబంధాలు:

భారత, రామాయణ, భాగవతాది పురాణాలకు సంబంధించిన నుడికారాలు అనేకం తెలుగులో చోటు చేసికొన్నాయి.

ఉదా: రామబాణం, త్రిశంకుస్వర్గం, గొంతెమ్మ కోరికలు, విఘ్నేశ్వరుని పెళ్ళి, రామాయణం, భగీరథ ప్రయత్నం, వానరసేన, కోతిమూక, సుగ్రీవాజ్ఞ, అక్షయపాత్ర, కృష్ణజన్మస్థానం, కృష్ణార్పణం, కృష్ణలీల, నలపాకం, భీమపాకం, భీష్మ ప్రతిజ్ఞ, మాయాబజార్, యక్షప్రశ్నలు ఇత్యాది.

## 4. చారిత్రక సంబంధాలు:

ఉదా: అక్కన్న మాదన్నలు, చాణక్యనీతి, ఘజనీ మహ్మద్ దండయాత్ర, ఢిల్లీకిఢిల్లీ పల్లికి పల్లి, పిచ్చి తుగ్లక్ ఇత్యాది.

**5. కులసూచకాలు:**

ఉదా: కోమటి సాక్ష్యం, కోమటి లెక్క, బ్రాహ్మణార్థం, రెడ్డొచ్చా మొదలెత్తుకో ఇత్యాది.

**6. స్థలనామ సూచకాలు:**

ఉదా: పుంగనూరు, తిరుపతి క్షవరం, కుంభకోణం, చిదంబర రహస్యం, బొబ్బిలి చిల్లిపెంకులు, నాగులేటి నీళ్ళు ఇత్యాది.

**7. సంకీర్ణాలు:** ఈ క్రింద పేర్కొనబడేవి పై విభజనలో చేరనివి.

ఉదా: అంకితం కావడం, మూడుపువ్వులు ఆరుకాయలు, మేలుబంతి, నడమంత్రపుసిరి, వెయ్యిళ్ళ పుజారి, కోటలో పాగా, ముద్రా రాక్షసం, పలుకు బంగారం, పిలువని పేరంటం, నిలువుజీతం ఇత్యాది.

ఈ పై విభజన సమగ్రం అని చెప్పలేం. ఇకపోతే తెలుగు జానపద సాహిత్యంలో లెక్కలేనన్ని జాతీయాలు ప్రవేశించాయి. ఇక్కడ కొన్ని ఉదాహరణలను మాత్రమే పేర్కొంటాను.

**నేను సేకరించిన స్త్రీల కథల పాటలలో కొన్ని:**

1. గుండె నీరయిపోయి - అన్నలక్ష్మమ్మ కథ లేదా గరుడపంచమి నోము కథ
2. చేటంత మొగము - అన్నలక్ష్మమ్మ కథ లేదా గరుడపంచమి నోము కథ
3. కన్నుల కరువుదీరు - శ్రీకృష్ణ సంధి
4. కత్తికొక కండ - యామక్కపదం
5. కాకులుదూరని కారడవి - సాకలదుడుమన్న కథ ఇత్యాది

**కథారహితములైన స్త్రీలపాటలలో కొన్ని:**

కడుపు చల్లగా - అప్పగింతల పాట

చిలుకుల కొలికి - అప్పగింతల పాట

తలలో నాలుక - అప్పగింతల పాట ఇత్యాది.

'తెలుగు జానపదగేయ సాహిత్యము'లో డా. బి.రామరాజుగారు పేర్కొన్న జాతీయాలు:

| | | |
|---|---|---|
| నువ్వులు చల్లుట | - | బొబ్బిలియుద్ధం |
| పంచదార ములుకులు | - | కుశలవ యుద్ధం |
| ఉడుకు మనసు | - | విరాటపర్వం |
| ఆకు చాటున కాయ<br>కాకి ముక్కుకు దొండపండు | } | గంగా వివాహం |
| వన్నెల విసనకర్ర | - | వీరరాజమ్మ కథ |
| కొంగు వేయు | - | కాంభోజరాజు కథ |
| ఆగడాల అంగడికాయ | - | గాంధారి కథ |
| దుమ్ము దులుపు | - | గాంధారి కథ |
| ముంజేతి మీసం | - | బొబ్బిలి పదం. |

ఇలాగే 'పల్లెపదాలు', 'త్రివేణి' ఇత్యాది జానపద గేయ సంకలనాలలోను లెక్కకు మిక్కుటంగా జాతీయాలు చోటు చేసికొన్నాయి. వాటిలో కొన్ని:

కయ్యంబునకు కాలుదువ్వుచును

గంగపాలు చేసేను

ముణ్ణాళ్ళ ముచ్చటకు మురిసేవు

కాకులు దూరని కారడవి

కళ్ళు కాసేనై కాయలు ఇత్యాది.

ఇలా చెప్పుకొంటూ పోతే జాతీయాలను ఎన్నింటినైనా వెలికితీయొచ్చు.

భాషలో ఇలాంటి వైశిష్ట్యపూర్ణమైన పదబంధాలు భాషకు ఇంపును సొంపును అందించి, తియ్యని భాషగా రూపొందిస్తాయి. కవులే కాదు సామాన్య జనులు కూడ తమ భావాలను మనోజ్ఞంగా వ్యక్తీకరింప చేసేందుకు నుడికారాలను ఒక సాధనంగా తీసుకొన్నారు. భావానికి తగినట్లుగా పదబంధాలను గూర్చి

ప్రయోగించారు; ప్రయోగిస్తున్నారు కూడ. Landor అన్నట్టుగా 'It is the life and spirit of language'.[7]

నాకు తెలిసినంతవరకు నేదునూరి గంగాధరంగారు తమ 'పసిడి పలుకులు' గ్రంథంలో 2077 జాతీయాలను సంకలనం చేశారు. 'విద్యార్థి కల్పతరువు' లో శ్రీ ముసునూరి వేంకట శాస్త్రిగారు కొన్నింటిని సేకరించారు. రెంటాల గోపాల కృష్ణగారు తమ 'జాతీయాలు - పుట్టుపూర్వోత్తరాలు మరియు సంస్కృత న్యాయాలు' లో ఆయా జాతీయాల వెనుక ఉన్న కథ లేదా సంఘటనలని తెలియ చెప్పడానికి దాదాపు 105 జాతీయాలను తీసుకొని చక్కగా వివరించారు. 'తాళ్ళపల్లి వారి పలుకుబళ్ళు'[8] గ్రంథంలో సామెతలు - జాతీయాలు పేర్కొనబడ్డాయి.

శ్రీనాళం కృష్ణారావుగారు 'తెలుగు జాతీయము'లను కోశాన్ని కూర్చారట. ఇందులో తెలుగు జాతీయాలు అకారాదిగా కూర్చబడ్డాయి, వానికి ప్రయోగాలు చూపబడ్డాయి. ఇది రెండు సంపుటాలలో వెలువడింది. 'తెలుగు నుడికారములను ప్రత్యేకముగా సిద్ధము చేయబడిన నిఘంటువులలో ఇదియే మొట్టమొదటి' దని ఆంధ్ర శబ్ద రత్నాకరములో చెప్పబడింది.[9]

ఇంకా జాతీయాలను సేకరించి, ప్రకటించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. కేవలం సేకరణకే పరిమితం కాకుండా, వాటిని విశ్లేషించి, అధ్యయనం చేయాల్సిన అగత్యం ఉంది.

* * *

---

7. *Words And Idioms, P-264.*

8. *ఆం.ప్ర.సా. అకాడెమీ ప్రచురణ, సం. రామలక్ష్మి ఆరుద్ర.*

9. *ప్రథమ భాగము, పుట - 34.*

# 15. జానపదుల తిట్లు
## (Folk Abuses)

### 1

జానపద విజ్ఞానాన్ని అధ్యయనం చేయాలంటే దాన్ని విశ్లేషించి వర్గీకరించాలి. జానపద విజ్ఞానంలో ప్రధానంగా శాబ్దిక జానపద విజ్ఞానం (Verbal folklore), శాబ్దికేతర జానపద విజ్ఞానం (Non-verbal folklore) అనే రెండు విభాగాలు ఉన్నాయి. మౌఖికంగా శబ్దరూపంలో వెలువడేది శాబ్దిక జానపద విజ్ఞానం అవుతే తక్కినవన్నీ శాబ్దికేతర జానపద విజ్ఞానం అవుతాయి. ఈ దృష్టితో రిచర్డ్ ఎం. డార్సన్ జానపద విజ్ఞానాన్ని స్థూలంగా నాలుగు శీర్షికల క్రింద విభజించారు. అవి మౌఖిక జానపద విజ్ఞానం, సాంఘిక జానపదాచారాలు, వస్తుసంస్కృతి, జానపద కళలు. డార్సన్ జానపద గేయాలు, కథాగేయాలు, గద్య కథనాలు, సామెతలు, పొడుపు కథలు, మాండలికాలు, నుడికారాలు, తిట్లు, ఒట్లు మొదలైన వాటిని మౌఖిక జానపద విజ్ఞానంలో చేర్చారు.

మాండలికాలు, నుడికారాలు, తిట్లు, ఒట్లు, దీవెనలు, ప్రమాణాలు మొదలైనవన్నీ జానపదుల భాషకు సంబంధించినవి కనుక వాటిని ప్రత్యేకంగా అధ్యయనం చేయాల్సిన అవసరం ఉంది.

### 2

'నోరు మంచిదవుతే ఊరు మంచిదవుతుం'దని ఒక సామెత చెప్తుంది. తిట్లను గురించి తెలియనివాళ్ళు కానీ, తిట్లురాని వాళ్ళు కానీ లేదా ఇతరుల్ని తిట్టని వాళ్ళు కానీ లేరంటే అతిశయోక్తి లేదు. ఎప్పుడో ఒకప్పుడు, ఏదో ఒక విధంగా 'తిట్టు'ను అస్త్రంగా ప్రయోగించే వాళ్ళు అధికం. కొందరు సభ్యంగానూ, మరికొందరు అసభ్యంగానూ, ఇంకా కొందరు ఎదుటివాళ్ళు చెవులు మూసుకొనేట్లు అశ్లీలంగానూ తిడ్తుంటారు. అశ్లీలంగా ఉన్న తిట్లనే మనం 'బూతు మాటలు' అంటాము. బూతుమాట తిట్టుకు అంగం అనవచ్చు. తిట్టును ప్రేరేపించే అంశం కోపం. 'తన కోపమే తన శత్రువు' అని తెలిసినా కోపాన్ని అదుపులో పెట్టడం అంత సులభం కాదు.

ఇద్దరి మధ్య పోట్లాట మొదలయినప్పుడు 'దైహికంగా దుర్బలుడు ప్రతిక్రియ చూపడానికి అసమర్థుడవుతే, అప్పుడు తన దౌర్బల్యాన్ని తిట్ల మూలకంగా కప్పిపుచ్చడానికి ప్రయత్నించవచ్చు. ఒక్కొక్క మారు తిట్లు స్వరక్షణకు తంత్రంగా పరిణమించవచ్చు'నని అంటారు కన్నడ విద్వాంసులు డా.ఎం. చిదానందమూర్తిగారు.[1]

ఇద్దరు స్త్రీలు పోట్లాడుకుంటున్న సమయంలో సాధారణంగా మనం తిట్ల వర్షాన్ని చూస్తూనే ఉంటాము. ఈ స్త్రీలు సామాన్యంగా నీళ్ళకోసం నూతుల దగ్గర , కొళాయిల దగ్గర జుట్లు-జుట్లు పీక్కుంటూ బూతు సాహిత్యం వల్లిస్తూ ఉండడం మనం గమనించిన విషయమే. ఈ ఆడవాళ్ళ తిట్లను గమనించే కాబోలు ఎవరో 'ఆడదాన్ని నోరు పెట్టుకొని బ్రతకమన్నారు' అన్న సామెతను కట్టారు.

సాధారణంగా బలహీనులే తిట్లను ఎక్కువగా ఉపయోగిస్తారు. నాలుగు తన్నులు తిన్నా నోటిదురదను మాత్రం తీర్చుకోకుండా ఉండలేరు. బలహీనులు ఇంతకంటే మరేం చెయ్యగలరు. దబాయించుకు తినేవాళ్ళు కూడ తిట్ల నధికంగా ప్రయోగిస్తారు. తగాదాలకు కాలుదువ్వే వాళ్ళెప్పుడూ ఐసా, పైసా తేల్చుకునే వాళ్ళుగా ఉంటారు. నోరుపారేసుకోవడం అలవాటైన వాళ్ళను గురించి చెప్పాల్సిన అవసరం లేదనుకొంటాను. నోరు పారేసుకొనేవాళ్ళను చూస్తే ఎదుటి వ్యక్తికి భయం వేస్తుంది. వాళ్ళ మాటలకు హద్దులుండవు. నాలుగు తిట్లకంటే ఒక తన్ను తింటేనే మంచిదనిపిస్తుంది.

తిట్లని ముఖ్యంగా బూతు మాటల్ని ఉచ్చరించడానికి కొంత ధైర్యం కావాలి. ఆ బూతు మాటలు ఇంకొక విధంగా పరిణమిస్తే, వాటిని నిగ్రహించుకొనే దైహిక, మానసిక స్థితిగతులు ఉండాలి. ఏదో ఒక సామెత చెప్పినట్టుగా 'జగడమెట్లా వస్తది లింగమయ్యా అంటే బిచ్చం పెట్టవే బొచ్చుముండ' అన్నాడట వెనుకటికి ఒకతను. ఎదుటివ్యక్తిని అవమానపరచే లేదా అలక్ష్యం చేసే ఏనోటిమాటైనా తిట్టుగా పరిణమిస్తుందనడానికి పై సామెత మంచి ఉదాహరణ.

తిట్టు మీదనే సామెతలనేకం ప్రచారంలో ఉన్నాయి. 'తిట్టకురా తొత్తుకొడకా', 'తిట్టుగాదురా తొత్తుకొడకా', 'తిట్టేనోరు కొట్టినా ఊరకుండదు',

1. గ్రామీణ (కన్నడ గ్రంథం), పుట - 92

'తిట్టుకొక శృంగారమా?', 'తిట్టితే కోపం, కొట్టితే నొప్పి', 'తిట్టితే చచ్చినవాడు లేడు, దీవిస్తే బ్రతికినవాడు లేడు' ఇత్యాది.

## 3

తిట్లు సామాజిక అంతస్తును సూచించే ఒక అంశం అంటారు డా. చిదానంద మూర్తిగారు.[2] 'మనకు అప్పులైనవారు పెడదారిని పట్టినప్పుడు గానీ, లేక యెందులోనైనా కల్తీ, వెలితీ కనిపించినపుడు గానీ, సహజంగా మనకు కోపం వస్తుంది. అందువల్ల వాగ్రూపమైన కోపాన్ని తిట్టు అని చెప్పవచ్చు' అని అంటారు డా. తూమాటి దొణప్పగారు.[3]

ఒక వ్యక్తిని మానసికంగా బాధపడేటట్టు మాటలతో కఠినంగా నిందించడం లేదా ఆక్షేపించడం 'తిట్టు' అనబడుతుంది. ప్రతి తిట్టుకూ తనదే అయిన నుడికారం ఉంటుంది. 'తిట్టు'ని తిట్టడమనీ, ఒట్టు వేయడమనీ, శాపం పెట్టడమనీ కూడా అనొచ్చు.

తిట్టును ఆంగ్లంలో 'ABUSE' అంటారు. Abuse అంటే to make a wrong use of, to ill treat, to violate, to revile అన్న క్రియా పద రూపాలు; ill usage, improper treatment, a corrupt practice, insulting అన్న నామవాచక రూపాలు ఉన్నాయి. ఆంగ్లంలో 'శాపాన్ని CURSE అంటారు. Standard Dictionary of folklore, Legend and mythology అన్న గ్రంథంలో Curse కు ఈ క్రింది వివరణ కన్పిస్తుంది.'A malediction; the wishing of evil upon a person; also, the effect of such wishing, and loosely, any persistent evil...... The curse may be a formula with symbol or image accompanying it, and be part of a ritual to secure the death or illness of some one or some group. Curses are thus a kind of spoken magic, spells of evil wished upon others'[4]

హిందీ భాషలో తిట్టుని 'గాలియా' అంటారు. తిట్టడాన్ని 'గాలీదేనా', 'కోసనా' అంటారు. ఉర్దూభాషలో తిట్లను 'గాలీగలీచ్' అంటారు. కన్నడంలో

---

*2. Ibid, P-95.*

*3. తెలుగులో క్రొత్త వెలుగులు, పుట - 31*

*4. P-271.*

'బయ్గుళ', 'బైగుళ', 'బైగళు' అనేవి తిట్లకు సమానపదాలు. తమిళంలో తిట్టును 'వైదల్' అని అంటారు. మలయాళంలో 'నిందిక్కుగ', 'అవహేళిక్కుగ' అనేవి తిట్టుకు ప్రయోగాలు. తుళుభాషలో తిట్టుకు 'నెరడ్డ' అన్న పదప్రయోగం ఉంది.

తెలుగులో తిట్టుకు దూరు, నిందించు, శపించు అనే అర్థాలు క్రియా రూపంలోను; నింద, దూషణం,శాపం అనే అర్థాలు నామవాచక రూపాల్లోను ఉన్నాయి. తిట్టు+ లు = తిట్లు. 'తిట్టు' అన్న పదప్రయోగాలు తమిళు, కన్నడ భాషల్లోనూ ఉన్నాయి. తిటు - ప్రకృతి ( కలహకర్మణి - వాక్కలహః వివక్షితః) అని శ్రీమాన్ చలమచర్ల రంగాచార్యులు గారు తమ ఆంధ్ర శబ్ద రత్నాకరము ( ద్వితీయ సంపుటము, పుట 110) లో పేర్కొన్నారు.

తెలుగు భాషలో తిట్లు ఎక్కువగా కన్పించినా, తెలుగు భాషపై ప్రభావం చూపిన ఉర్దూ, హిందీ, ఆంగ్లభాషలలోని తిట్లు కూడ అధికంగా కన్పిస్తాయి. ఉదాహరణానికి 'సువ్వర్' అనే తిట్టు మనకు హిందీ భాషనుంచి సంక్రమించింది. అలాగే 'బాంచోద్', 'మాదర్‌చోద్' అనేవి ఉర్దూ భాషనుంచి వచ్చాయి. ఫూల్, రాస్కెల్, ఇడియట్, మఫ్, డాంకీ, మంకీ, ఫోర్‌ట్వెంటీ ఇత్యాది ఆంగ్ల భాషనుంచి వచ్చి తెలుగులో చేరాయి. తమిళం నుంచి కిరుక్కు నా కొడుకు, తేవిడియా, వాయాడి కమ్ నేటి మొదలైన తిట్లు తెలుగులో చేరాయి. అలాగే కన్నడం నుంచి లేవిడి, గండు బీరి మొదలైనవి తెలుగులోనికి సంక్రమించాయి.

సంస్కృతం తిట్లు కూడ తెలుగులో చోటు చేసికొన్నాయి. 'ఘాతుకా', 'కులపాతకుడు' మొదలైనవి సంస్కృతం నుండి వచ్చినవే. మనలో సంస్కృతం తిట్టంటే అశ్లీలార్థకంగా ఉపయోగించే పదం. 'ఏరా అన్నీ సంస్కృతం మాటలే మాట్లాడుతున్నావ్ ఈ రోజు' అని మనం అసభ్యంగా మాట్లాడుతున్న వాళ్ళ నుద్దేశించి అంటుంటాము.

అన్యభాషా సంపర్కంవల్ల ఏర్పడ్డ తిట్లే కాకుండా అన్య భాషలతో చేర్చిన తెలుగు తిట్లు కూడా ఉన్నాయి. ఉదాహరణానికి నమక్ హరాం నాయాలు ఇత్యాది.

## 4

సాధారణంగా తిట్లలో కన్పించే అంశాలను కొన్నింటిని గుర్తించడానికి వీలుంది; ఇవే తిట్లకు కారణాలు కూడ. వాటినిక్కడ పేర్కొంటాను.

1. తిరస్కారభావం తిట్లలో కన్పించే ప్రధానాంశం. ఈ తిరస్కార భావం ఏహ్యా భావానికి కారణం కావడం మరో ముఖ్యమైన అంశం. శీలం మంచిది కాని స్త్రీని సమాజం తిరస్కరించడం, ఆ తిరస్కార భావం ఆమెను ఏవగించు కోవడానికి కారణం కావడం మనకు తెలిసిన విషయమే. పురుషుడు చెడుదారులు తొక్కినా ఇదే జరుగుతుంది కానీ స్త్రీతో పోల్చినపుడు ఇది తక్కువనిపిస్తుంది. సమాజం ఆదరించని వాళ్ళని హీనంగా చూడడం, తన్మూలంగా తిట్లు బహిర్గతం కావడం జరుగుతుంది.

2. దుర్బలుడైన వ్యక్తిని బలవంతుడు హింసించినప్పుడు, ఆ దుర్బలుడు చేత గానివాడై తిట్లను సాధనంగా ఉపయోగించి తప్పించుకోవడానికి ప్రయత్నిస్తాడు.

3. ఎవడిమీదనైనా ఉన్న అక్కసును కక్కడానికి తిట్లను ఉపయోగించడం జరుగుతుంది.

4. సహనం కోల్పోయినపుడు తిట్లను ప్రయోగించడం సర్వసాధారణం.

5. మోసం, ద్రోహం, కపటం మొదలైన వాటిచేత వంచించబడినపుడు తిట్లే శరణ్యం.

6. అవహేళనలు కూడా తిట్లరూపంలో వస్తాయి. ఉదాహరణానికి బుద్ధూనాయాలు, ఫోర్ట్వంటీ, పాయింట్ సెవెన్ ఇత్యాది.

7. ఓర్వలేనితనం ఏదో ఒక విధంగా తిట్లకే దారితీస్తుంది.

8. సమాజం సోమరుల్ని, తాగుబోతు వెధవల్ని ఈసడించుకొన్నప్పుడు అవి తిట్లుగా పరిణమిస్తాయి.

9. ఇద్దరిమధ్య పోట్లాట మొదలైనప్పుడు తిట్లువాటికవే ఉత్పన్నమవుతాయి.

10. వ్యక్తుల అలవాట్లు, అభిరుచులు, స్వభావాలు మొదలైన వాటిని ఎత్తి చూపేటప్పుడు, వాళ్ళను పశుపక్ష్యాదులకు అన్వయించి తిట్టడం సాధారణంగా మనం గమనించే అంశాల్లో ఒకటి; పనిపాటలు లేకుండా తిరిగేవాడిని 'అడ్డగాడిదా' అనీ, ఎప్పుడూ తింటూ ఉండేవాడిని 'దున్నపోతు నాయాలు' అని తిట్టడం మనకు తెలిసిందే. ఇలాగే మరికొన్ని - గూబనాయాలు, పిచ్చికుక్క, పందికొక్కు ఇత్యాది.

11. ముసలివాళ్ళకు ఈ కాలం పిల్లలు చేసే పనులు గిట్టవు. అంతేకాకుండా వంశ పారంపర్యంగా వచ్చిన తమ అధికారాన్ని వాళ్ళమీద రుద్దడానికి ప్రయత్నించడం వల్ల వాటిలో తిట్లు కూడ చోటు చేసికొంటాయి.

12. కోపం వచ్చినప్పుడు ఎదుటివాళ్ళను బాగా తిట్టడం జరుగుతుంది.

13. తంటాలు పెట్టి తగాదాలు చూసే వాళ్ళు సమాజంలో అధికం. అగ్నిలో ఆజ్యం పోసి చల్లగా జారుకుంటారు వీళ్ళు.

14. అత్తాకోడళ్ళ పోట్లాటలు సాంసారిక రంగంలో సర్వసాధారణం. అత్త సాధింపు అత్తపెత్తనానికి కారణమైతే, కోడలు నేనేం తక్కువా అన్నట్టు అత్తను మించిన అత్తగా, అహం దెబ్బతిన్న దానిలాగా అత్తమీద విరుచుకు పడుతుంది.

15. మానాభిమానాలు, ఆత్మగౌరవం దెబ్బతిన్నప్పుడు మానవుడు పశువులా ప్రవర్తిస్తాడు. అవి మొదట్లో తిట్లరూపంగా బహిర్గతమవుతాయి.

16. అన్యాయాన్ని సహించలేని వ్యక్తి కూడ తిట్లనే ఆసరాగా తీసుకుంటాడు. తిట్లవల్ల ప్రయోజనం లేనప్పుడే కొట్లుకోవడం జరుగుతుంది.

17. స్త్రీ శీలానికి భగ్నం కలిగినప్పుడు అనరాని మాట్లన్నీ తిట్ల రూపంగా ప్రవహిస్తాయి. ఆ యింటితనాన్ని రక్షించేది ఆ యింటి ఆడపడచు శీలమే కనుక, ఆమె కానీ, ఆ యింటి పెద్ద కానీ ఇలాంటి నీచాన్ని సహించరు. కూతురే కాలుజారినా లేదా ఆమెపై అఘాయిత్యం జరిగినా ఇంటి పెద్ద త్రాచుత్రొక్కిన పాములా మండి పడతాడు.

18. పల్లెల్లో పొలాల తగాదాలు కొన్నవుతే, పశువుల్ని దొంగతనంగా తరలించుకొని పోవడమో లేక వాటిని చంపి తినడమో లేదా పిల్లలు ఆట్లాడు కొనేటప్పుడు వచ్చే తగాదాల వల్లనో లేదా ఆస్తి పంపకాల విషయంలోనో తిట్లు సర్వసామాన్యంగా చోటు చేసికొంటాయి.

ఇలా తిట్లు అనేక విధాలుగా వ్యవహారంలోకి వస్తాయి. ఇవి నిత్య వ్యవహారంలో ఉపయోగించే పదాల కంటే భిన్నంగా ఉంటాయి. ద్వేషం, రోషం, బాధ మొదలైనవన్నీ వీటిలో అణగి ఉంటాయి. తిట్టు యొక్క పరమార్థం ఇతరులకు హాని కలగాలని ఆశించడం. తిట్టేవాడు మానవమర్యాదలను

లెక్కచేయడు. సమాజంలో ఆ తిట్లు అసభ్యమని తెలిసినా లేదా సమాజంలో అవి నిషిద్ధమైనవని తెలిసినా వాటిని ఉల్లఘించి ఉచ్చరించడం అతని కలవాటు.

మాటల మానసిక గాయాలు ఈటె పోటుల భౌతిక గాయాల కంటే తీక్షమైనవి. అన్ని కళలలాగే తిట్టడం కూడా ఒక కళే అనిపిస్తుంది. అది అందరికీ అబ్బే విద్యకాదు. తిట్టడం మొదలెడితే తాత, ముత్తాతలందరూ దిగిరావలసిందే.

## 5

జానపద మతాచరణల్లో తిట్లకు ప్రాధాన్యం కన్పిస్తుంది. మన జాతరలలో, ఉత్సవాలలో అనేకంగా తిట్లు విన్పిస్తాయి. ముఖ్యంగా గ్రామదేవతల ఉత్సవాలలో ఇవి అధికం. ఉదాహరణానికి 'జగన్నాథంలో చూడండి. వస్తూ వస్తూ రథం ఆగిపోతుంది. ఇకను చెలరేగుతాయి తిట్లు. ఆసమయంలో తిట్టనివాడు పాపాత్ముడే అని అనుకునేవారు కొన్నాళ్ళు. ఆ సమయంలో తిట్టని బండ తిట్టు ఉండదు. ఆ మహాపుణ్యకాలంలో నోటితో రంకు పోవని మనుషులుండరు. స్త్రీలుకాని పురుషులు కాని.......'[5] అని అంటారు శ్రీ తాపీ ధర్మారావుగారు.

శిష్ట దేవతలను ప్రార్థించడం, పూజించడం వల్ల ప్రసన్నులుగా చేసుకుంటే, గ్రామదేవతలను 'తిట్ల' ద్వారా రెచ్చగొట్టి, తమ కోరికలను తీర్చుకొంటారు. గ్రామ దేవతల ఉత్సవాల్లో వ్యక్తుల వేషాలు, మాటలన్నీ బూతుమాటలతో కూడుకొని ఉంటాయి. 'బూతుతిట్లు కూడ ఒక రకం పూజలనిపించు కొనేవి' అంటారు శ్రీ తాపీ ధర్మారావుగారు.

చిత్తూరు జిల్లాలో గంగమ్మ 'జల్దీ' కి పోయినపుడు జానపదులు తిట్లవర్షం కురిపిస్తారట. కొచ్చిన్ ప్రాంతం (కేరళ) లో కూడ ఇలాంటి పూజలే కన్పిస్తాయి. 'At cranganore, in the native state of cochin, there is a shrine of the goddess Bhagavati, which is much frequented by piligrims in the month of Minam (March-April) from all parts of Cochin, Malabar and Travancore crowds flock to attend the festival and the high roads ring 'with their shouts of nada nada "March! March!". They desecrate the shrine of the goddess in every conceivable way, discharge volleys of stones and filth, and level the most opprobrious language at the goddess herself. These proceedings are supposed

5. దేవాలయాలమీద బూతుబొమ్మలెందుకు, పుట - 73.

to be acceptable to her. The intention of the pilgrimage is to secure immunity from disease during the succeding year'[6]

ఇలాగే అదృష్టం కలగాలనీ, మంచి జరగాలనీ తిట్లవర్షాన్ని కురిపిస్తారు. ఈ విషయం గురించి The Golden Bough గ్రంథంలో ఇలా చెప్పబడింది. "....the means adopted for bringing about the desired result appear to be not so much imitative magic as the beneficient effect which, curiously enough, is often attributed to curses and malediction. Thus in the Indian district of Behar much virtue is ascribed to abuse, which is supposed in some cases to bring good luck. people, for example, who accompany a marriage procession to the bride's house are often foully abused by the women of the bride's family in the belief that this contributes to the good fortune of the newly married pair. So in Behar on jamadwitiya day, which falls on the second day of the bright period of the moon next to that during which the dussera festival takes place, brothers are reviled by sisters to their heart's content because it is thought that this will prolong the lives of the brothers and bring them good luck"[7]

మరణించినప్పుడు విలపించే గీతాల్లో విధిని నిందిస్తూ తిట్టడం కన్పిస్తుంది. ఉదా: 'ముండ దేవుడు' ఇత్యాది.

## 6

అన్ని తిట్లు చెడ్డవే అని చెప్పలేం. కొన్ని తిట్లు ప్రీతిపాత్రంగా, విశ్వాసపాత్రంగా కూడ ఉంటాయి. 'ఏరా వెధవా ఇంత ఆలస్యం' అన్నప్పుడు దానికి ఎదుటివాడి సమాధానం 'పోరా నా కొడకా' అని. ఇది సంభాషణలో ఒక భాగం మాత్రమే కానీ నిజంగా తిట్టు కాదు.

---

6. *The Golden Bough. The Study in Magic And Religion (Third Edition) Part I. The Magic Art and the Evolution of Kings, Vol I, Sir James George Frazer నుండి గ్రహించబడింది. అందులో E. Thurston గారి Caste and Tribes of Southern India VII, 287 మరియు K. Anantha Krishna Iyer గారి The Cochin Tribes and Castes, 1. Madras 1909, P-238 నుండి గ్రహించినట్లు చెప్పబడింది.*

7. *P-279. "On vestiges of moon worship in Behar and Bengal" - Saratchandra Mitra. Journal of Anthropological Society of Bombay, ii, నుండి గ్రహించబడినట్లు ఇందులో పేర్కొనబడింది.*

ఇద్దరు పోట్లాడుకొంటున్నప్పుడు ఒక పెద్ద మనిషి కలుగ జేసికొని 'దొంగ నా కొడుకుల్లారా! తిని ఎక్కువైందిరా మీకు, పనిపాట్లు లేవురా మీకు, పోండ్రా' అని అనడం సాధారణం. ఇక్కడ ఇవి తిట్లుగా మనకు కన్పించవు. కేవలం బుద్ధి చెప్పే మాటలుగా మనకు అన్పిస్తాయి. ఒకవేళ కొట్లాడుకొంటున్న వాళ్ళిద్దరూ ఆ పెద్దమనిషి మీద విరుచుకు పడితే, అక్కడ చేరిన నలుగురూ వాళ్ళిద్దరికీ తగిన బుద్ధి చెప్పి పంపిస్తారు.

అలాగే ఇంట్లో పిల్లలు కొట్టుకొంటున్నప్పుడు తల్లి కానీ, తండ్రి కానీ 'నీకేమొచ్చిందిరా రోగం?' అని కానీ ' ఈ బద్దు ఈడికి గాచారం (గ్రహచారం) ఇడిపిస్తా'నని కానీ అంటుంటారు. ఇలా అనటంలో పిల్లల్ని అదుపులో పెట్టడం కన్పిస్తుందే కానీ తిట్టడం కన్పించదు.

రెండు చేతులు కలిపితేనే చప్పుడవుతుంది. అలాగే తగాదాకు ఇద్దరుండి తీరాలి. సాధారణంగా ఆడవాళ్ళే తిట్లను ఎక్కువగా ప్రయోగిస్తారు. సామాన్యంగా పల్లెసీమల్లో తెల్లవారగానే మనం గమనించే అంశం ఇది. తమతమ ఇంటి పశువుల పేడ ఇత్యాదులను ఊరికి కొంచెం దూరంలో కుప్పలుగా పోయడం, పెద్ద పెద్ద కుప్పలయిన తర్వాత వాటిని పొలాలకు ఎరువుగా వాడడం మనందరికీ తెలిసిన విషయమే. ఆడవాళ్ళంతా ఒకేలాగా ఉండరు కదా! చేతికున్న ఐదువ్రేళ్ళే సమంగా లేనప్పుడు విభిన్న మనస్తత్వాలున్న వ్యక్తులు ఒకేలాగ ఉంటారనడం కల్ల. ఒకరికి తెలియకుండా ఒకరు మరొకరి కుప్పలోని ఎరువును తమ కుప్పలో కలుపుకోవడం జరుగుతూ ఉంటుంది. ఇది గమనించినవాళ్ళు ఇద్దరికీ తంటాలు పెట్టడం జరుగుతుంది. మాటలతో ఆరంభమైన ఈ జగడం చేతులదాకా రావడం సంభవిస్తుంది. ఈ ఆడవాళ్ళ వంతు కాగానే వాళ్ళ భర్తలు రంగంలోకి దిగడం జరుగుతుంది. 'నువ్వెంతంటే నువ్వెంత' అన్నంతవరకు వెళ్తాయి మాటలు. ఈ మాటల పోటీలు ఇలాగే పెరిగి, మూడోవాడు వినలేనంత కర్ణకఠోరంగా, అసహ్యంగా, అసభ్యంగా నోటిదురద తీరేదాకా తిట్లరూపంగా వెలువడతాయి. నలుగురూ చేరి వాళ్ళను విడదీసినా ఆ సమయానికి ఆ తగాదా తాత్కాలికంగా నిలిచిపోవచ్చు కానీ, మరోసారి తగాదా జరిగినప్పుడు మాత్రం వాళ్ళను విడదీయడం మహా కష్టం. ఇవి ముఠా తగాదాలకు కూడా దారి తీస్తాయి. ఒక కొంపను కూల్చడానికి ఒక తిట్టు చాలు. అందుకనే తిట్టును అతి భయంకరమైనదిగా చెప్పొచ్చు.

తిట్టుకు కూడా తనదే అయిన నుడికారం ఉంటుంది. తిట్టు తిట్టేవాడి సంస్కారాన్ని బట్టి కూడా ఉంటుంది. అంతే కాకుండా అది ఉపయోగించబడే సమయ సందర్భాలను బట్టి కూడా ఉంటుంది. విద్యావంతుడు కానీ, అనక్షరస్తుడు కానీ ఏదో ఒక సందర్భంలో తిట్టు అనే బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగిస్తూ ఉంటాడు. అయితే విద్యావంతుడి తిట్లు అవిద్యావంతుడి తిట్లలాగ అసభ్యకరంగానూ, అశ్లీలంగానూ ఉండవు. ఇదే ఇద్దరి మధ్య ఉన్న తిట్లలోని వ్యత్యాసం. ఇంతకు ముందే చెప్పినట్టుగా కోపమే అన్ని అనర్థాలకు కారణం. ఆ అనర్థాల్లో 'తిట్టు' కూడ ఒకటి.

## 7

తిట్లకు పట్టుగొమ్మలు మన పల్లెసీమలు. తమ హృదయాలను గాయపరచినప్పుడు ఎటువంటి తిట్టును తిట్టడానికైనా జానపదులు వెనుకాడరు. అందులో కొంతమంది తిట్టే తిట్లు మరీ ఘోరంగా ఉంటాయి. ఇవి చాల అసభ్యంగా ఉంటాయి. వరుస కలవాళ్ళు తిట్టుకొనే తిట్లు ఒకవిధంగాను, వరసలేని వాళ్ళు తిట్టుకొనేవి ఒక విధంగానూ ఉంటాయి. ఒకడు మరొకణ్ణి 'దొంగనాయాల' అని అంటే, అతడు ఇతనికి మామ వరస అయి ఉంటాడు. అలాగే 'నీయక్క' అని అంటే, అన్నవాడు అనిపించుకొన్నవాడి కంటే పెద్దవాడై ఉంటాడు. మామ వరస కలవాడిని ఎవ్వరూ 'నీయాలి' అనరు. ఎందుకంటే అతని 'ఆలి' ఇతనికి చెల్లెలుగానో, అక్కగానో ఉంటుంది. 'నాయాల' అన్నవాడిని 'నా కొడక' అని అనరు. ఎంచేతనంటే అతడు ఇతని అక్క కొడుకో లేక చెల్లెలు కొడుకో అయి ఉంటాడు కాబట్టి. ఒక స్త్రీ ఒకతనిని 'నా బట్ట' అని అన్నదంటే ఆమె అతనికి అత్తగా ఉంటుంది. అత్తవరస ఉంటే మాత్రం నాబట్ట అని అంటారు. ఇవి తిట్లు తిట్టుకోవడానికి జానపదులు ఉపయోగించే 'రూల్సు' అయితే కొన్ని కొన్ని సమయాల్లో కొంతమంది పై రూల్సును అధిగమించి తమకిష్టం వచ్చినట్టుగా తిట్టుకొంటారు. ఇవి హెచ్చు స్థాయి పోట్లాటల్లో మాత్రమే వినిపిస్తాయి.[8]

తెలుగులో తిట్లన్నీ అధికంగా 'నాయాలు', 'కొడుకు', 'ముండ', 'వెధవ' అన్న అనుబంధాలతో కూడుకొని ఉంటాయి. ఉదా: లంజముండ,

8. ఈ విషయాలను వివరించింది శ్రీ టి. నారాయణ (గొబ్బిళ్ళ కోటూరు, చిత్తూరు జిల్లా).

గాండూనాయాలు ఇత్యాది. ఒక్కోమారు మొదటి పదానికీ, ఈ అనుబంధానికీ మధ్య 'నా' అనే శబ్దం ప్రయోగించబడుతూ ఉంటుంది. ఉదా: దొంగ నా కొడుకు, గాడిద నా కొడుకు, ఎర్ర నా కొడుకు, వడ్డి నా కొడుకు ఇత్యాది. కన్నడంలో కూడ 'నన్న' అనే శబ్దం మొదటి పదానికీ, అనుబంధానికీ మధ్య ప్రయోగించబడుతుంది. ఉదా: బడ్డీ నన్న మగ, కళ్ళ నన్న మగళు ఇత్యాది.

ఎవరినైనా ప్రత్యక్షంగా (వాడి ఎదుటనే వాణ్ణి) తిట్టేటప్పుడు అది సంబోధన రూపంలో ఉంటుంది.

ఉదా: దొంగ నా కొడకా!
సువ్వర్ నాయాలా! ఇత్యాది.

అదే వాడిని ఇతరుల ఎదుట పరోక్షంగా తిట్టేటప్పుడు 'దొంగ నా కొడుకు', 'సువ్వర్ నాయాలు' అని సంబోధనా రహితంగా తిడతారు.

ప్రాచీన కవులు కూడ తమతమ కావ్యాల్లో తిట్టు కవిత్వాన్ని ప్రవేశపెట్టారు. తిట్టు కావ్యాలకు అధిక్షేపకావ్యాలు, నిందా హేళన కావ్యాలు అని నామాంతరాలున్నాయి. చాటు పద్యాలు, శతకాల్లో తిట్టు కవిత్వం చోటు చేసికొంది. బండ బూతు కవిత్వం వ్రాసి పేరుగాంచిన కవి చౌడప్ప అందరికీ తెలిసిన వాడే. ఒక రకంగా బూతుమాటలు తప్పుత్రోవలో నడుస్తున్న వాణ్ణి క్రమబద్ధం చేస్తాయి. అయితే నలుగురిలో బూతుమాటలద్వారా అవమానం పొందినవాడు అహం దెబ్బతిని ఎదురుదెబ్బ తీయడానికి ప్రయత్నిస్తాడు.

తిట్టు కవితకు అసూయ, ద్వేషం, క్రోధం, లోభం, మాత్సర్యం, వైషమ్యం, వైమనస్యం, వైరుధ్యం మొదలైనవి కారణాలుగాను, వంచన, ద్రోహం, మదం, తిరస్కారం, దురాగతం, దుర్విదగ్ధత అనేవి వీటికి అంగాలుగాను శ్రీ రావూరి దొరసామి శర్మగారు పేర్కొన్నారు.[9]

తిట్లలో చాల అశ్లీలంగా ఉన్నవి కూడ కన్పిస్తాయి. ఇవి 'విషయించడాన్ని' ప్రధానంగా కలిగి ఉంటాయి. 'Obscene phrases or epithets frequently refer to the acts of excretion or to sexual relations of a prohibited

---

*9. తెలుగులో తిట్టు కవిత్వము, పుట - 214.*

nature' అని Standard Dictionary of folklore, Leend and Mythology లో చెప్పబడింది.[10]

## 8

ఇక తిట్లరకాలను చూద్దాము. కన్నడ విద్వాంసులు డా. చిదానంద మూర్తిగారు తిట్లను కుల, జాతి, వర్గం, వృత్తికి సంబంధించిన తిట్లనీ, వ్యక్తి దైహిక దోషాలకు సంబంధించిన తిట్లనీ, కామానికి సంబంధించిన తిట్లనీ పలువిధాలుగా వింగడించారు.

అలాగే కన్నడ విద్వాంసులు శ్రీ హరికృష్ణ భట్ భరణ్యాగారు కన్నడంలోని తిట్లను నాలుగు విధాలుగా విభజింపవచ్చునన్నారు.[11] 1. తీక్ష్ణ (కఠోర)మైన తిట్లు (Harsh or severe), 2. సరళమైన తిట్లు (Light abuses), 3. ప్రీతిపాత్రమైన తిట్లు (Affectionate abuses), 4. ఇతరాలు. వీటిని ఇలా వివరించారు. తీక్ష్ణమైన తిట్లు వ్యక్తిమీద చూపే ప్రభావం తీవ్రంగా ఉంటుంది. ఈ తిట్లు ఒక్కోమారు ఆ వ్యక్తిని మాత్రమేకాక, జన్మనిచ్చిన వారిని కూడ చేర్చుకొని ప్రయోగించబడతాయి. ఈ తిట్లలో రెండు ఉపవిభాగాలున్నాయి. పురుషులకు సంబంధించినవి - చండాలుడు, లంజాకొడుకు ఇత్యాది. స్త్రీలకు సంబంధించినవి - బేవర్సి, దర్బేసి ఇత్యాది. సరళమైన తిట్లు హానికరాలు కావు. ఇవి ఆ వ్యక్తిమీద అంతగా తీవ్ర పరిణామాన్ని కలుగజేయవు. ఇందులో ప్రయోగించే శబ్దాలు ఆడా-మగా తారతమ్యం లేక ప్రయోగించబడతాయి. ఉదా: దరిద్రం, శని ఇత్యాది.

ప్రీతిపాత్రమైన తిట్లు సాధారణంగా పిల్లల్ని తిట్టేవి. పిల్లల్ని కఠోరంగా తిట్టడం చాల తక్కువగా కన్పిస్తుంది. మగపిల్లలకు సంబంధించినవి: దడెయ, దొణెయ ఇత్యాది. తెలుగులో ఇలాంటి తిట్లకు ఉదాహరణలుగా 'ఉత్తపిత్తలోడు' అనే తిట్టును గుడ్డలు వేసుకోకుండా సదా తిరిగేవాడికీ, 'తిండిపోతు నాయాలు' అనే తిట్టు ఎప్పుడూ తినేవాడికీ వర్తిస్తాయి. ఆడపిల్లలకు సంబంధించినవి: సోంబేరి,

10. *P-809.*

11. *సాధనె (కన్నడ త్రైమాసిక పత్రిక - బెంగుళూరు విశ్వవిద్యాలయం) 'దక్షిణ కన్నడ హవ్యకర బైగుళగళు; ఒందు విశ్లేషణె (వ్యాసం), పుటలు - 79-83.*

కోడెంగి ఇత్యాది. తెలుగులో వీటికి ఉదాహరణాలుగా ఎవరితోనూ మాట్లాడ కుండా ఉండే ఆడపిల్లను 'ముంగి' అనీ, పనిపాటలు చేయకుండా ఉండే ఆడపిల్లను 'సోమారి' అని తిడతారు. ఇతరాలలో జాతి, వృత్తి, ప్రాణి, గుణం, భౌతిక లక్షణాలను సూచించే తిట్లను శ్రీ హరికృష్ణభట్ భరణ్యగారు పేర్కొన్నారు.

శ్రీ మృత్యుంజయ హొరకేరిగారు తిట్లను 'నాగరిక', 'గ్రామ్య' అనీ, 'గ్రామ్య'ను 'అశ్లీల', 'శ్లీల' అనీ, 'శ్లీల'ను పురుషలవి, స్త్రీలవి, ఉభయ తరాలవి అని వింగడించారు.[12]

శ్రీ రావూరి దొరసామి శర్మగారు తిట్ల భేదాలను ఇలా వివరించారు. 'ఈ తిట్లు పలురకములు. కోపముచే శాపరూపమైన తిట్టు, అసహ్యము నసభ్యమునగు బండబూతులతో నిండిన తిట్టు, అన్యాపదేశపు తిట్టు, వాద రూపము, అపహాస రూపము, వ్యంగ్యరూపమునగు తిట్టు, శ్లేషరూపమైన తిట్టు, వ్యాజస్తుతి, నిందాత్మకమగు తిట్టు - ఇంకను గొన్ని భేదాలు చెప్పవచ్చును'[13] అని తెలిపియున్నారు.

పై విభజనలన్నిటిని మనసునందుంచుకొని తెలుగులోని తిట్లను విషయ ప్రాధాన్యంగా ఈ క్రింది విధంగా వింగడించవచ్చును.

**1. అంగవైకల్య సూచనాలు:**

ఉదా: గూనోడు, కుంటోడు - ఇలాంటివి అంగవైకల్యం పొందిన వాడిని తిట్టేవి. అంగవైకల్యం కలగాలని కోరుకొని తిట్టేవి - నీ సిగతరగా, నీ మొహం తగలెయ్యా.

**2. జాతి కులసూచకాలు:**

ఉదా: బొమ్మన్, కోమటి నాయాలు, ఎర్లనాయాలు, తురకోడు, డొక్కలలంజ ఇత్యాది.

**3. వృత్తి సూచకాలు:**

ఉదా: హజామ్ నాయాలు, పాకీముండ ఇత్యాది.

---

*12. ఉత్తర కర్నాటకద బైగుళగళు, పుట - viii*

*13. తెలుగులో తిట్టు కవిత్వము, పుట -214.*

4. **జంతుసూచకాలు:**

ఉదా: అడ్డగాడిద, దున్నపోతు నాయాలు.

5. **లైంగిక సంబంధాలు:** ఇవి కామానికి సంబంధించినవి. ఈ తిట్లలో స్త్రీ పురుష మర్మావయవాలకే ప్రాధాన్యం కన్పిస్తుంది. వీటినే అశ్లీలపు తిట్లనీ, బూతు మాటలనీ అనొచ్చు.

ఉదా: నీ అమ్మని....
నీ యక్కని......
నియ్యాలిని......

7. **రోగ సూచకాలు:**

ఉదా: నీకు పెద్దరోగం రాను, నీ నోరడ

8. **శాపనార్థాలు:**

ఉదా: నీ యిల్లు తగలడ, నీ కొంపకూల, నువ్వు చావను, నీకు శ్రాద్ధం పెట్ట, నీ బూడిదెత్తా.

9. **శీల సంబంధాలు:**

ఉదా: రంకుముండ, బోగం లంజ

10. **మానవ స్వభావ సూచకాలు:**

ఉదా: జిడ్డునాయాలు, బడాయి నాయాలు.

11. **స్త్రీకి ఐదవతనం పోవాలని తిట్టడం:**

ఉదా: నీ నల్లలురాల, నీ తాడుతెగ, నీ ముండమొయ్య ఇత్యాది.

12. **స్త్రీని చెడ్డగా చిత్రించి తద్వారా తిట్టడం:**

ఉదా: లంజాకొడకా, దొంగముండా కొడకా.

13. **అమ్మవారి ఆగ్రహం కలగాలని తిట్టడం:**

ఉదా: నిన్నమ్మోరెత్తుకెల్ల, నిన్ను గంగానమ్మ ఎత్తుకెల్ల ఇత్యాది.

**14. అశుద్ధ వస్తువులనుపయోగించి తిట్టడం:**

ఉదా: నీ నోట్లో నాసొడొయ్య, నీ నోట్లో ఉచ్చొయ్య ఇత్యాది.

**15. సాధారణ తిట్లు:**

ఉదా: నీ నోట్లో దుమ్ముకొట్ట, దొంగసన్నాసి ఇత్యాది.

ఇలా విషయ ప్రాధాన్యాన్ని బట్టి తిట్లను విభజించవచ్చు.

## 9

నాగరకత, సంస్కృతీ పెరుగుతున్న కొద్దీ తిట్లు కూడ కనుమరుగయ్యే ప్రమాదం వుంది. వీటిని సేకరించి, భద్రపరచాల్సిన అవసరం ఎంతైనా వుంది. తిట్లను గురించిన సంగ్రహ కార్యం ఇంతవరకు పూర్తిగా జరగలేదు. నాకు తెలిసినంతవరకు శ్రీ నేదునూరి గంగాధరంగారు తమ 'పసిడి పలుకులు' గ్రంథంలో తిట్లు, ఒట్లు దీవనలు అన్న శీర్షిక క్రింద 26 తిట్లను, 16 ఒట్లను, 6 దీవెనలను పేర్కొన్నారు.

శ్రీ రావూరి దొరసామి శర్మగారు 'తెలుగులో తిట్టు కవిత్వము' అన్న గ్రంథాన్ని ప్రచురించారు. ఇందులో వీరు ఆయా తెలుగు కవుల తిట్టు కవిత్వాన్ని వివరించారు. డా. తూమాటి దొణప్పగారు తమ తెలుగులో కొత్త వెలుగులు అనే పుస్తకంలో 'తెలుగులో తిట్టు కవిత్వం' అన్న వ్యాసాన్ని చేర్చారు. ఇది కూడా తిట్టు కవిత్వానికి చెందిందే.

తిట్లను సంగ్రహించడంవల్ల ఆ తిట్లు లభించిన ఆయా ప్రాంతాల ప్రజల మనోభావాలను తెలుసుకోవడానికి సాధ్యమవుతుంది. వాళ్ళ సంస్కృతీ, సంస్కారం కొంతకు కొంతైనా తెలుసుకోవడానికి వీలవుతుంది.

తిట్లను సంగ్రహించేటప్పుడు వాళ్ళ యాసను, దీర్ఘాలను కూడ రికార్డు చేయాలి. కొన్ని తిట్లు ఆయా మండలాలకే పరిమితంగా ఉంటాయి. ప్రీతిపూర్వకంగా ఉన్న తిట్లు కూడ కన్పిస్తాయి. తిట్లను గూర్చిన సంగ్రహ కార్యం, విశ్లేషణ తెలుగుదేశంలో ఇంకా జరగాల్సి వుంది. ఆంధ్రదేశంతో పోల్చుకొన్నప్పుడు కర్నాటక రాష్ట్రం జానపద విజ్ఞాన రంగంలో ఎప్పుడూ ఒక అడుగు ముందే

ఉంటుంది. కన్నడంలో జానపదుల తిట్లకు సంబంధించిన ఒకటి రెండు సంకలన గ్రంథాలు, కొన్ని వ్యాసాలు ప్రచురింపబడ్డాయి.

తెలుగులో కూడ డా. జి. ఎస్. మోహన్ ప్రప్రథమంగా 1984లో 'జానపదుల తిట్లు' అన్న గ్రంథాన్ని 'జానపద విజ్ఞాన భారతి', మైసూరు ద్వారా ప్రచురించారు. ఈ గ్రంథంలో ఆయాప్రాంతాల వారీగా కరీంనగర మండలం (తెలంగాణా), అనంతపురం, చిత్తూరు, కడప (రాయలసీమ), తణుకు - పశ్చిమ గోదావరి జిల్లా (సర్కారు) ప్రాంతాలకు సంబంధించినవే కాక ధర్మపురి మండలం (తమిళునాడు), కోలారు మండలం (కర్నాటక)లకు సంబంధించిన తిట్లు దాదాపు 884 చేర్చబడ్డాయి.

* * *

# 16. సాంఘిక జానపద ఆచారం
## (Social Folk Custom)

ప్రాచీన మానవ సంస్కృతిని పరిశీలించడానికి జానపద విజ్ఞానాధ్యయనం చాల అవసరం. మానవుడు బుద్ధిజీవి. సంఘజీవి. సంఘమంటే సంస్కృతిని ఆచరణలో ఉంచే మనుష్య సమాహారం. అంతేకాక, పరస్పరాపేక్షతో తమకు తాము సాంఘిక, ఆర్థిక రంగాలలో కొన్ని కట్టుబాట్లను నిర్ణయించుకొని ఒక ప్రత్యేకమైన వ్యక్తిత్వంతో నిర్మింపబడ్డ మనుష్య సముదాయం. సంస్కృతి అంటే సంఘంలో ఒక సభ్యుడిగా మానవుడు ఆ సంఘంలోని అలవాట్లను, ఆచార వ్యవహారాలను, కళా స్వరూపాలను గ్రహించడమని అర్థం. అలాంటి మానవ సంఘ సంస్కృతిని అధ్యయనం చెయ్యడమే జానపద విజ్ఞానం. ఒక్కమాటలో చెప్పాలంటే మానవ సంఘ జీవన విధానాన్నీ, ప్రాచీన సంస్కృతినీ ప్రతిబింబించే దర్పణం లాంటిది జానపద విజ్ఞానం.

ఎవరు జానపదులు అనే విషయంలో తర్జన భర్జనలున్నా, ప్రాచీన మానవుల లేదా నేటి గ్రామీణుల ఆచార వ్యవహారాలు, పండుగ పబ్బాలు, పద్ధతులు, అలవాట్లు, ఉత్సవాలు, వేడుకలు, కళలు నేటి మన నవనాగరిక సమాజాల్లోను వేరుతన్ని నిలిచి ఉండడాన్ని గమనిస్తే నాగరికులు కూడా జానపదుల సంప్రదాయాన్ని అనుసరిస్తూ ఉండడం విదితమవుతుంది. అందువల్ల 'జానపదం' అనే పదాన్ని కేవలం ఒక నిర్దిష్టమయిన సమాజానికి ముడిపెట్టడం కంటె, ప్రజల మానసిక స్థితిగతుల్ని సూచించే ఒక సంఘంగా పేర్కొనడం ఉత్తమం. ఇక్కడ 'జానపదు'ని కంటె 'జానపదత్వా'నికే ప్రాధాన్యం ఇవ్వడం సముచితం.

రిచర్డ్ ఎమ్. డార్సన్ జానపద విజ్ఞానాన్ని నాలుగు విభాగాలుగా వింగడించాడు. అందులో మొదటిది మౌఖిక సాహిత్యం. రెండోది సాంఘిక జానపద ఆచారం. మూడోది వస్తుసంస్కృతి లేదా భౌతిక సంస్కృతి. నాలుగోది జానపద కళలు.

ప్రస్తుత అధ్యయనానికి సంబంధించి సాంఘిక జానపద ఆచారం (Social Folk custom) గురించి వివరిస్తాను.

మౌఖిక సాహిత్యం, వస్తు సంస్కృతుల మధ్య, ఈ రెండింటి ప్రభావాన్నీ ఇముడ్చుకున్న ప్రధాన విభాగం సాంఘిక జానపద ఆచారం. ఇందులో ఒక వ్యక్తి వైయక్తిక ఆసక్తి కంటే అధికంగా ఒక సమూహంలోని అంతరిక చర్యలకి (Group interaction) మహత్వం ఉంది. జనన మరణాలు, యౌవనం, వివాహం ఇత్యాదుల ఆచరణలలో కన్పించే జానపద విశ్వాసాలూ, పండుగ పబ్బాలనాటి ఆచారాలు, సంప్రదాయాలు, ఉత్సవాలు, జాతరలు ఈ విభాగం క్రిందే వస్తాయి. మత సంబంధం (Religion), మతాతీత (Secular) విషయాల మీద నిలబడ్డ ఈ సాంఘిక జానపద ఆచారాల సమయాల్లో లేదా పండుగల్లో నాటకాలు, నృత్య, సంగీత వేషభూషణాల ప్రదర్శనలు జరుపబడతాయి. అలాగే ఈ సాంస్కృతిక క్రియలతో పాటు దైహిక క్రియలయిన క్రీడలు సైతం చేర్తాయి. అందువల్లే అనేక జానపద జీవన ప్రక్రియల సంగమంగా సాంఘిక జానపద ఆచారాన్ని పరిగణించవచ్చు.



## ఆచారం:

'ఆచారం' అనే మాటకు అలవాటు, అభ్యాసం, వాడుక, మర్యాద, సంప్రదాయం, ధర్మం అనే అర్థాలు బ్రౌను నిఘంటువులో కన్పిస్తాయి. ఆంగ్లంలో ఆచారం అనే మాటను 'Custom' అని వ్యవహరిస్తారు. కొంతమంది 'Usage' అని కూడా వ్యవహరిస్తారు. 'Custom' అనే పదానికి సమానార్థక పదం 'Usage' అనీ, 'any of the distinctive Practices and Conventions of a people or locality, esp. those of a primitive tribe' అనీ, Chambers Twentieth century Dictionary లో చెప్పబడింది. 'Custom is the practice of preserving ideas and actions from generations to generations. The term also refers to specific act that follows the traditions of past generations' అని మరోచోట పేర్కొనబడింది.

'Custom' మరియు 'Usage' అను పదాలు సమానార్థకాలుగానే వాడబడుతున్నా రెండింటిలోను కొంత వ్యత్యాసం లేకపోలేదు. ఈ విషయమై ఒక ఆంగ్ల గ్రంథంలో 'The terms 'custom' and 'usage' are often used inter changeably. Strictly speaking, there is a clear technical distinction between the two. Usage represents the twilight stage of custom. Custom begins where usage ends. Usage is an internation habit of action that has not yet received full legal allestation. Usages may be conflicting, custom may be unified and self consistent' అని వివరించబడింది.

Custom(ఆచారం) అనిపించుకోవడానికి నాలుగు ప్రధాన అంశాలు ఉండితీరాలి. 'First it must be immemorial, secondly it must be reasonable, thirdly it must have continued without interruption since its immemorial origin; and furtherly, it must be certain in respect of its nature generally as well as in respect of the locality where it is alleged to obtain and the persons whom it is alleged to affect'[1] అందువల్ల ఏదేని ఆచారానికి తరతరాలూగా నిలువ గలిగిన శక్తి ఉండి తీరాలని స్పష్టమవుతోంది.

---

1. *Words and phrases Legally defined, Vol. I ed. by John B. Saunders, Butler worths, London.*

## సాంఘికాచారాలు: పుట్టుకనుంచీ చావుదాకా:

పుట్టుకతో ప్రారంభమైన స్త్రీ జీవతం సమర్త, పెండ్లి, సీమంతాలతో సాగిపోతుంది. ఇదొక జీవిత చక్రం. ఈ జీవిత చక్రంలో భక్తి స్త్రీల పాలిటి పెన్నిధి. అందువల్లే వేలుకొలుపులతో ఆరంభమై, పూజా పురస్కారాలు, మంగళహారతులతో స్త్రీ దైనందిన జీవితం సాఫీగా జరిగిపోతుంది. పిల్లలను లాలించడం, జోకొట్టడం ఆమె నిత్యకృత్యాలలో ఒకటయ్యాయి.

పసిపిల్లలకి స్నానం చేయించడాన్ని 'లాలపోయడం' అంటారు. లాలపోసిన పిమ్మట ఏడుస్తున్న పిల్లల్ని ఊయెలలో వేసి ఊపుతూ పాటలు పాడుతారు. ఈ 'లాల' శబ్దం నుంచి 'లాలి' ఏర్పడి వుంటుంది.

పసిపిల్లల్ని 'జోలె'లో వేసి ఊపుతూ పాడే పాటలు 'జోల పాట' లయ్యాయనిపిస్తుంది. పూర్వం శిశువుల్ని జోలెలో వేసి, జోలెను ఇంటి పై కప్పుకు వ్రేలాడదీసి ఊపేవారు. పిల్లల్ని నిదర పుచ్చడం కోసం పాటలు పాడేవారు. అదే క్రమంగా జోలపాటలయ్యాయి. నేటికీ పల్లెల్లో పిల్లల్ని జోలెలో వేసి ఊపుతూ పాటలు పాడడాన్ని మనం గమనించవచ్చు. కొన్ని ప్రాంతాలలో ఈ పాటల్ని కన్నడంలోనే పాడడం జరుగుతోంది. వీటిని 'తొట్ల పాట'లనీ, 'ఊయెల పాట'లనీ కూడా పిలుస్తారు. లాలి జోలపాటల్లో భావం కంటే లయకీ, రాగానికీ అధిక ప్రాధాన్యం ఉండడం వల్ల శిశువులకి శ్రుతి శ్రావ్యంగా ఉండి, సంగీత మాధుర్యానుభవాన్ని కల్గించడానికి వీలు కలుగుతోంది. ఈ పాటల్లో ముఖ్యోద్దేశం ప్రబోధం. ఇలాంటి ప్రబోధకరాలైన విషయాలను నిత్యం పాటల రూపంలో పాడి చిన్ననాటి నుంచే పిల్లలకు ఆధ్యాత్మికతని తల్లులు బోధిస్తున్నారు.

### సమర్త:

సమర్త-పెండ్లి-సీమంతం మొదలైనవి వేడుకలకు సంబంధించినవే అయినా, వాటి వెనుక ఆచార వ్యవహారాలు, సంప్రదాయాలు, కట్టుబాట్లు చోటు చేసుకున్నాయి. స్త్రీ పథమ ఋతువును 'సమర్త' అంటారు. 'సమఋతుః - సమరత-సమర్త' అంటే తొలిముట్టు. ఋతుమతి అయిన బాలికను 'రజస్వల' అనీ 'పుష్పవతీ' అనీ అంటారు. అనంతపురం మండలంలో సమర్త అయిన బాలికని

'పెద్ద మనిషి అయింది', 'పిల్ల ఎదిగింది' అనీ వ్యవహరిస్తారు. సమర్త అసలు రూపం 'సమర్థ'. అంటే నేటి నుంచీ ఈ బాలిక అన్ని విషయాల్లోను (ముఖ్యంగా వివాహానికి) సమర్థురాలని చెప్పడం. పెద్దమనిషి అయింది. పిల్ల ఎదిగింది అనే మాటలు దీన్ని సమర్థిస్తున్నాయి. ఈ సమర్థే క్రమేణా మహా ప్రాణత్వాన్ని కోల్పోయి 'సమర్త' అయివుంటుంది.

హిందూ సంప్రదాయంలో ఋతుమతి అయిన స్త్రీ అశుచిగా పరిగణింపబడుతుంది; మూడు రోజులు ప్రత్యేకమైన గదిలో ఉంచబడుతుంది. ఆమె ఎవరినీ తాకకూడదు, పూజా పురస్కారాలను నిర్వహించకూడదు; యథేచ్ఛగా ఇంట్లో సంచరించ కూడదు. నాలుగోనాడు తలస్నానం చేసిన తర్వాతనే స్వేచ్ఛగా ఇంట్లో తిరగవచ్చు. పూర్వకాలంలో పుష్పవతి అయిన బాలికని అపశకునంగా భావించడమే దీనికి కారణం. ఋతుమతి అయిన కాలంలో ప్రకృతిలో ఉన్న దుష్టశక్తులు, మలినమైన బాలిక శరీరాన్ని ప్రవేశించి, ఆమె తల్లి కావడానికి అనర్హురాలిగా చేస్తాయని భయపడి బాలికని ఏకాంత ప్రదేశంలో వుంచి వాటి నుంచి రక్షించడం కోసం అనేక సంస్కారాలను చేసేవారు.

అనంతపురం మండలంలో సాంప్రదాయక స్త్రీలలోను, శ్రామిక స్త్రీలలోను ఉన్న సమర్త వేడుకల్ని- ఆచారాలను కొన్నింటిని తెలియజేస్తాను.

బ్రాహ్మణ వర్ణాల్లో బాలిక రజస్వల అయిన తర్వాత ఆమెను ఒక ప్రత్యేకమైన గదిలో మూడురోజులు కూర్చోబెడతారు. ఈ మూడు రోజులూ దుష్టగ్రహాల పీడలు లేకుండా 'ఎర్రనీళ్ళ'తో దిగతీస్తారు. మొదటిరోజు చాకలి స్త్రీ 'దడెం'[2] తెస్తుంది. బాలికని దానిమధ్య కూర్చో బెడతారు. మూడురోజులు ముత్తయిదువల్ని పిలచి పేరంటం చేస్తారు. పులగం, నెయ్యి, చలిబిండిని మూడు రోజులు మాత్రమే ఆ బాలికకు ఇస్తారు. స్నానం చేయించిన తర్వాత ఇవ్వరు. నువ్వులు ఉష్ణాన్నిచ్చే శక్తి కలిగి ఉండడంవల్ల రక్తస్రావం అధికమవుతుంది. నాలుగోనాడు తలంటు పోస్తారు. అప్పటినుంచీ బాలిక ఇంట్లో యథేచ్ఛగా తిరగొచ్చు. వాళ్ళ వాళ్ళ శక్త్యానుసారం ఐదు, తొమ్మిది లేక పదహారు రోజులు బాలికను కూర్చోపెట్టి పేరంటం చేస్తారు. 'పిల్లను కూర్చోబెడ్తాం' అనో, 'పిల్లకు హారతి ఇస్తాం' అనో ముత్తయిదువలకి చెప్పి పేరంటానికి ఆహ్వానిస్తారు. వేషాలు

2. తెల్లని వస్త్రం. దీన్నే వైశ్యులు *'దడగం'* అంటారు.

వేయిస్తారు. ఒక బాలికకు మగవేషం ధరియింపచేసి ప్రక్కన కూర్చోబెడతారు. రాధాకృష్ణుల లాగ, సుభద్రార్జునులలాగ చూసేవాళ్ళకి వేడుక కలుగుతుంది. దాంపత్య జీవితాన్ని చూపించడానికనేటట్టుగా వేషాలు వేయించడం ఒక ఆచారం అయింది. కొందరి ఇళ్ళల్లో ఈ పద్ధతి లేదు.

ఈ మండలంలో క్షత్రియుల్లో వేడుకలు ఆచారాలు కొంత మార్పుతో కన్పిస్తాయి. రజస్వల అయిన తర్వాత బాలికని ప్రత్యేకమైన గదిలో వుంచుతారు. ఇంటికి సున్నం వేయిస్తారు. 'పుణ్యాజనం' చేయిస్తారు. నాలుగు నిద్రలయిన తర్వాత అయిదోరోజు తెల్లని వస్త్రం మీద కూర్చోబెడతారు. నువ్వుల చలిబిండిని, పెసల మొలకల్ని తినడానికి ఇస్తారు. ఈ రెండూ బాలికకి శక్తినిస్తాయి. పదకొండు రోజులు పదకొండు కోడిగ్రుడ్లని, నువ్వులనూనెని త్రాగిస్తారు. ముందుగా గ్రుడ్డును పగులగొట్టి త్రాగించిన తర్వాత, అందులో నిండుగా నువ్వులనూనెని వేసి త్రాగిస్తారు. వేడుకకోసం సాయంకాలం సమయాల్లో వేషాలు వేయిస్తారు. వేడుక ఖర్చునంతట్నీ మేనమామే భరిస్తాడు.

వైశ్యుల్లో ఈ వేడుకలు, ఆచారాలు మరికొంత ఉత్సాహపూరితంగా ఉంటాయి. రజస్వల అయిన మొదటిరోజు సాయంకాలం కొబ్బరికాయ కొడతారు. తర్వాత రోలును పూజచేసి, ఐదుమంది ముత్తయిదువలు రెండు రోకళ్ళతో 'నల్ల నూగులు', బెల్లం వేసి దంచుతారు. ఈ చిమ్మిలిని రజస్వల అయిన బాలికకి, సమర్తకాని బాలికలకి ఇస్తారు. సమర్త కాని బాలికలకి ఇలా ఇవ్వడంలో అంతరార్థం ఉంది. వాళ్ళు అల్పకాలంలోనే ఋతుమతులు అవుతారని ఒక విశ్వాసం. చాకలి వాళ్ళు 'దడగం' తెస్తారు. ఒక తెల్లనిచీరని నాలుగు మడతలతో క్రింద పరచి, ఐదుమంది ముత్తయిదువలు పసుపుసున్నం కలిపిన వసంతంతో 'చెయ్యితట్లు'[3] తడతారు. తర్వాత దడగానికి పసుపు కుంకుమలతో పూజ చేస్తారు. ఈ దడగం నాలుగు మూలల్లో దీపాలనుంచుతారు. దీపస్తంభాలకి ఐదు బొట్లుపెట్టి 'పచ్చదారం' (పసుపుదారం) చుడతారు. ఐదు తాంబూలాలను వస్త్రం మీద ఉంచుతారు. బాలిక వస్త్రం మధ్య కూర్చొన్న తర్వాత వెండిచెంబు, అద్దం, ఆమె ముందుంచుతారు. అరటిపండు తప్ప తక్కిన ఐదుఫలాలను వడి నింపుతారు. వడి నింపేటప్పుడు బాలికని తాకకుండా ఐదుమంది ముత్తయిదువలు పైనుంచి

---

*3. చేతుల గుర్తులనుంచడం.*

చీరకొంగు లోనికి వాటిని జారవిడుస్తారు. తర్వాత హారతి ఇస్తారు. ఇలా నాలుగు రోజులు చేస్తారు. ఐదోరోజు నీళ్ళు పోస్తారు. చాకలింటి నుంచి ఐదు చీరలు తెస్తారు. ఐదుసార్లు ఐదుమంది ముత్తయిదువలు నీళ్ళు పోస్తారు. ఐదుసార్లు బాలికతో ఆమె ఇంతకుముందు కూర్చున్న స్థలాన్ని పేడతో అలికిస్తారు. ఆమె శరీరానికి పసుపు పూయిస్తారు. పెరుగన్నం తినిపిస్తారు. చింతపండుతో ఆమె సమర్త కాలంలో ఉపయోగించిన కంచం, గ్లాసు, చెంబు మొదలైన వాటిని కడిగిస్తారు. మధ్యాహ్నం విందుభోజనం, సాయంకాలం అలంకరణ. సరస్వతి, సీత లేక రాముని వేషాలు వేయిస్తారు. హారతి ఎత్తుతారు. ఇలా అయిదు రోజులు తప్పక చేయిస్తారు. కొంతమంది పదహారు రోజులు, మరికొంతమంది తొమ్మిది రోజులు వారి వారి శక్త్యానుసారం బాలికను కూర్చోబెట్టి పేరంటం చేస్తారు. కొంతమంది పూలు, పండ్లు, తినుబండారాలను ఇంటింటికీ (వైశ్యుల ఇళ్ళకి) పంచుకొని వస్తారు.

శ్రామిక స్త్రీలలో సమర్త వేడుకలు, ఆచారాలు మరో తీరులో కన్పిస్తాయి. బాలిక సమర్త అయిన తర్వాత మొదటిరోజు ఒక ముత్తయిదువ నీళ్ళు పోసి పసుపు కుంకుమలు ఉంచుతుంది. చాకలి స్త్రీ 'దడెం' పరుస్తుంది. నాలుగు మూలల్లో రెండు ఆకులు, రెండు వక్కలు, 'బెల్ల పుంటలు' పెడుతుంది. మధ్య ఒక కొబ్బరి గిన్నెను పెడతారు. వసంతాన్ని కలిపి చేత్తో నాలుగుప్రక్కలూ, మధ్యభాగంలో హస్తాలను తడతారు. వసంతాన్నే రాయదుర్గం ప్రాంతంలో 'ఓకలి' నీళ్ళు అంటారు. హస్తాలను తట్టడం కట్టుబాటును తెలుపుతుంది. దుష్టగ్రహాలు చేరకుండ వుండడం కోసం ఇలా చేస్తారు. బాలికను దడెంమీద కూర్చోపెట్టి కొబ్బరికాయను కొడతారు. ఈ మూడు రోజులూ, ఐదు, ఏడు, తొమ్మిది రోజుల్లోనూ తెల్లవారురుఝామున తలంటు స్నానం చేయిస్తారు. ప్రతిరోజూ 'పసుపు కుంకుమ' (పేరంటం) చేస్తారు. నాలుగు రోజులూ ఇంట్లో ఏ వస్తువునూ బాలిక తాకకూడదు. ఐదోరోజునుంచీ ఇంట్లో యథేచ్ఛగా తిరగవచ్చు కానీ బయటికి వెళ్ళకూడదు. ఇలా తొమ్మిది రోజులు ఇంట్లోంచి కదలకూడదు. మొదటి ఐదురోజులు భోజనంతో పాటు చలిబిండి, నెయ్యిపులగం తినాలి. తొమ్మిది రోజులూ ముత్తయిదువల్ని పేరంటానికి పిలిచి తాంబూలం ఇస్తారు. కొన్ని వర్ణాల్లో వేషాలు వేయించడం వుంది. కర్నాటక ప్రాంతంలోను శ్రామిక స్త్రీలలో ఇలాంటి వేడుకలు, ఆచారాలు ఉన్నాయి.

రాయదుర్గం తాలుకాలో 'నాయకులు', హరిజన వర్ణాల్లో విశిష్టమైన ఆచార వ్యవహారాలు కన్పిస్తాయి. సమర్త అయిన బాలికని తొమ్మిది రోజులు ఇంట్లోనికి

రానీయక ఇంటిముందర గుడిసెను వేసి అందులో వుంచుతారు. 'కానిగ' అకుల్ని, వేపాకుల్ని జతపరచి గుడిసెను వేస్తారు. బాలికను గుడిసెలోనికి పంపించడానికి ముందు కొబ్బరికాయను లోనికి త్రోస్తారు. కొబ్బరిగిన్నె, ఐదు 'ఉత్తుత్తి పండ్లు'(కర్జూరం), ఐదు ఆకులు, ఐదు వక్కలతో బాలిక, ఒడి నింపుతారు. ప్రత్యేకంగా 'తట్ట' (కంచం) కానీ, 'లోట' (గ్లాసు) కానీ ఆమెకు ఇవ్వకుండా బండమీదనే అన్నం పెట్టి కొబ్బరి చిప్పలో నీళ్ళు పోసి ఇస్తారు. ఈ తొమ్మిదిరోజులు ఏ తిండినయినా పెట్టవచ్చు. తొమ్మిదోనాటి తెల్లవారు ఝామున ఎవ్వరూ చూడకుండేట్లు జాగ్రత్తపడి ఒక్క ఆకును కూడ వదలివెయ్యకుండ గుడిసెను ఊరవతల ఉన్న తంగేడు చెట్టు దగ్గర కాల్చివేస్తారు. ఆ రోజు సాయంకాలం బాలికకు కొత్త చీరను, రవికెను తొడిగించి, కంబడిని కప్పి మేళంతో ఊరి వెలుపల ఉన్న తంగేడు చెట్టు దగ్గరికి పిల్చుకొని పోతారు. త్రోవలో పాటల్ని పాడతారు. ఈ పాటల్ని కన్నడంలోనే పాడడం విశేషం. కొబ్బరికాయ, కొబ్బరిగిన్నె, ఉత్తుత్తి పండ్లని తంగేడు చెట్టు ముందుంచి బాలికను తూర్పు దిక్కుకు దాటిస్తారు. తర్వాత ఇంటికి పిల్చుకొని వస్తారు. గడప బయటనే బాలికను వుంచుతారు. ఆమె 'మేనత్త' బాలిక నాలుక కొనను వేపఈనెతో ఐదుసార్లు కాలుస్తుంది. 'గొరి పిచ్చుకలు'(గొర్రె పెంటికలు), గోమూత్రాన్ని కలిపి, అందు వేప ఈనెనుంచి, దాన్ని బాలికకు 'ముట్టించి'(తాకించి) ఆమెమీద ప్రోక్షణం చేస్తుంది. గోర్లు తీస్తుంది. తర్వాత బాలికను లోనికి పిల్చుకుని వచ్చి కూర్చోబెడతారు. పూలహారాన్ని మెడలో వేస్తారు. ముత్తయిదువులకు తాంబూలం ఇస్తారు. పదోరోజు గంగమ్మను చేస్తారు. 'చేదోబావి' (చేదుబావి లేదా నూయి) దగ్గరికి బాలికను పిల్చుకొనిపోయి పాలు, నెయ్యి, బియ్యం, చలిబిండి, నూగుల చలిబిండి, 'నానుబాలు'[4] ను బావిలో కొంచెం వేయించి, మిగిలిన దాన్ని అక్కడ చేరిన బాలికలకు ఇప్పిస్తారు. ఇదయిన తర్వాత బాలిక యథాప్రకారంగా ఉండవచ్చు. వారివారి శక్త్యానుసారం ఐదురోజులు కానీ, తొమ్మిది రోజులు కానీ సాయం సమయాల్లో కూర్చోబెట్టి పేరంటానికి పిలుస్తారు. ఈ సమయంలో పాటలు పాడతారు. ఈ సమయంలో పాడేపాటలే 'పేరంటం పాటలు'గా పిలవబడతాయి. తమిళనాడులోని శ్రామిక స్త్రీలలోను ఇలాంటి సమర్త వేడుకలే ఉన్నాయి.[5]

---

*4. బియ్యం, నువ్వులు, సెనగబేడలు నానబెట్టినవి.*

*5. S.M.L. Lakshmanan Chettiar Folklore of Tamil Nadu, P.p. 77-78.*

**వివాహం:**

వివాహం షోడశ సంస్కారాల్లో ఒకటి. ఇది వధూవరుల్ని యావజ్జీవం ఒక్కటిగా చేసే అనుబంధం. వరుని గృహానికి వధువును 'మోసికొని పోవు' లేదా 'వెంటనిడుకొని పోవు' ఆచారానికే వివాహం అనవచ్చు. (వి+వాహ) ఇది దంపతుల మధ్య శాశ్వతమైన, వీడని సంయోగం. వివాహ సంస్కారం మీద హిందువులకు అమిత విశ్వాసం, పవిత్ర భావం వుంది.

వివాహ సందర్భంలో జరిగే ఆచార సంప్రదాయాల్లో లోపం రాకుండేట్లు చూచుకోవాలని ఆకాంక్ష, విశ్వాసం ప్రాచీన కాలం నుంచీ హిందువులలో వుంది. ఏదేని లోపం జరిగితే వధూవరుల సుఖశాంతులకి ప్రాపంచికంగాను, పారమార్థికం గాను ఎలాంటి విపత్తు వాటిల్లుతుందో అని భయపడి ఆచార సంప్రదాయాల నన్నింటినీ సువాసినులకే వదలిపెట్టేవాళ్ళు. నేడు కూడా వివాహ కార్యక్రమాల్లో ఆడవాళ్ళే ప్రముఖ పాత్రని వహించడం జరుగుతోంది.

అనంతపురం మండలంలో అగ్రేతర వర్ణాల్లోని వైవాహికాచార, సంప్రదాయాలను కొన్నింటిని వివరిస్తాను.

ముందుగా పురోహితుని సంప్రదించి 'తలంబ్రాలు' నిర్ణయిస్తారు. ఇక్కడ 'ముహూర్తాని'కీ, తలంబ్రాలకు వ్యత్యాసం కన్పిస్తుంది. ముహూర్తం అంటే పెండ్లికొడుకు లేదా పెండ్లి కూతుర్ని చెయ్యడమని అర్థం. ఇది తలంబ్రాలకు ముందు రోజు జరిగే కార్యం. అగ్రవర్ణాల్లో 'జిలకర్ర, బెల్లం' పెట్టే సమయానికే 'ముహూర్తము' అంటారు. నిశ్చితార్థానికి శ్రామికులు 'వక్కాకు శాస్త్రం' అనీ, 'మంచిమాట' అనీ, 'నిచ్చితం' అనీ అంటారు.

ముహూర్తం నాడు పందిరికి అధిక ప్రాధాన్యమిస్తారు. పందిరిని 'చప్ర' మంటారు. ముందుగా నాలుగు 'గుంజ'లను పాతి, నాలుగు గుంజలకూ నాలుగు జువ్వి కొమ్మల్నీ, నాలుగు 'టెంకాయపట్ట'ల్నీ కడతారు. పందిరి పైభాగంలో 'తడకలు' కానీ, పచ్చని ఆకులుకానీ కప్పుతారు. గుంజలకు సున్నం, ఎర్రమన్ను కలిపిన 'పట్టెలు' వేస్తారు. పసుపు, కుంకుమ బొట్లు పెడతారు. ఒకమూల కుడిప్రక్క 'పాలకొమ్మ' (వాజపి చెట్టుకొమ్మ)ను కడతారు.

నల్లకుండల్ని కుమ్మరి ఇంటి నుంచి తెచ్చి ఊరి బయట ఉంచుతారు. లేదా కుమ్మరి ఇంట్లోనే వుంచి ముహూర్తంనాడు పురోహితుడు రాగానే ఇంటికి

తెస్తారు. పురోహితుడు వచ్చి కుండల్ని మంత్రించి, కుండల చుట్టూ తమలపాకుతో కూడిన పసుపుదారాన్ని కట్టి అక్షతలు వేస్తాడు. కొబ్బరికాయ కొడతాడు. కొత్త 'తెడ్డుకట్టె'కు (అన్నం కలయత్రిప్పే కట్టె - జువ్విచెట్టుది) తమలపాకుతో కూడిన పసుపుదారాన్ని కట్టి అక్షతలు వేస్తారు. ఇది ఉదయం చేసే ఆచారం. సాయంకాలం పెళ్ళికొడుకుని చేస్తారు. ముందుగా పెళ్ళికొడుకు స్నానం చేసి వస్తాడు. ఈ 'తొలిస్నానం' తర్వాత మంగలి వరుని కాలిగోళ్ళని తీస్తాడు. తలమీద 'చమురు' (ఆముదం) పెడతాడు. ఈ సమయంలో 'దక్షిణ'తో వరుడికి దృష్టితీస్తారు. ఈ ధక్షిణ మంగలివాడికి చెందుతుంది. వరుడు మరోసారి స్నానం చేసి వస్తాడు. స్నానానికి ముందుకట్టుకొన్న గుడ్డలు మంగలివాడికే చెందుతాయి. స్నానం తర్వాత కొబ్బరి గిన్నెలతో వేసిన బియ్యంమీద పీట వేస్తారు. పీటమీద వరుడు కూర్చొని లేస్తాడు. ఈ కొబ్బరి గిన్నెలు బియ్యం చాకలివాడికి చెందుతాయి. ఇదే రీతిగా వధువు ఇంట్లోను జరుగుతుంది. పెండ్లి కుమారునింట్లోనే పచ్చని పసుపుగుడ్డ లేదా 'షష్ఠిపంచ'లో బియ్యం, కొబ్బరిగిన్నె కడతారు. బాకు (చాకు)కు పసుపు గుడ్డని చుడతారు. కొందరు బాకు మీద నిమ్మకాయను గుచ్చుతారు. పెండ్లి కొడుకు 'ఒక్కపొద్దు' ఉంటాడు, రాత్రి భోంచేస్తాడు.

పెండ్లి కొడుకును చేసిన తర్వాత మంగళ వాద్యాలతో 'బాసింగా'[6]న్ని 'దాసయ్య' (దాసరి కులంవాడు) దగ్గరినుంచి తెస్తారు. బాసింగాన్ని ఇంట్లో 'దేవుని మూల' (ఈశాన్య దిశ)లో పెట్టి, 'కాలిమెట్లు' తీసుకురావడం కోసం మంగళ వాద్యాలతో కంసాలి వాడింటికి వెళ్ళి, కాలిమెట్లను తెచ్చి దేవుడి ముందుంచుతారు. 'ఆచారి' (కంసాలివాడు)కి బియ్యం, బేడలు, బెల్లం మొదలైన వాటిని ఇస్తారు. తర్వాత కొబ్బరికాయను కొడతారు.

వంటచేయడానికి ముందు పొయ్యిదగ్గర ఒక కొబ్బరికాయను, వంట పూర్తయిన తర్వాత అన్నపురాశి దగ్గర ఒక కొబ్బరికాయను కొట్టే సంప్రదాయం ఉంది. పంక్తి భోజనానికి అందర్నీ కూర్చోబెట్టిన తర్వాత దాసయ్యను పిలిపించి 'తిరువమంత్రాన్ని చెప్పిస్తారు. దాసయ్యకు బియ్యం, బేడలు (కందిపప్పు,

---

6. *బెండు (చొప్పదంటుకు ఈనెల్ని తీసిన తర్వాత బెండులాగా ఉన్న భాగం) ను తగరంతో చుట్టి ముక్కపోని పెద్దబియ్యపుగింజల్ని దానిమీద పెట్టిదారంతో అల్లుతారు. ఇదే బాసింగం. కొంతమంది తమలపాకును బాగా చుట్టి 'రుమాలు' (పేటా) మీద కడతారు.*

సెనగపప్పు), ఉప్పు, మిరపకాయలు, ఎర్రగడ్డలు (ఉల్లిపాయలు), చింతపండు, ఇత్యాదుల్ని ఇస్తారు. దాసయ్య తిరుమంత్రం చెప్పి 'గోవింద' అన్న తర్వాత ముందుగా పెండ్లికొడుకు భోజనానికి ఉపక్రమిస్తాడు. తర్వాత అందరూ భోంచేస్తారు. పెండ్లికొడుకు భోజనం అయిన తర్వాత మరోసారి 'గోవింద' అని అంటారు. వరుడు ముందుగా లేచిన తర్వాతనే తక్కినవారు లేస్తారు. ఇలాగే వధువు ఇంట్లోను జరుగుతుంది.

తర్వాత వరుని పక్షంవాళ్ళు వధువు ఉన్న స్థలానికి బయల్దేరి వెళ్తారు. వధువు పక్షం వారికి వరుని పక్షంవాళ్ళే తాళిబొట్టును, బాసింగాన్ని తీసుకుని వస్తారు. వధువు ఉన్న గ్రామంచేరి అక్కడికి సమీపంలో ఉన్న గుడికి వెళ్తారు. వధువు పక్షంవాళ్ళు మంగళవాద్యాలతో అక్కడికి వచ్చి మంచినీళ్ళు, పానకం వియ్యాల వారికి అందించి, వాళ్ళని విడిదింటికి పిలుచుకొని వెళ్తారు. ఒకరకంగా ఇదే 'ఎదురుకోళ్ళు'. ఈ తతంగమంతా తలంబ్రాలకు ముందురోజు జరుగుతుంది.

ఇక తలంబ్రాల నాడు జరిగే వివాహ తతంగం. ఆ రోజు ఉదయం 'ఫలారములు' ముగించిన తర్వాత వరుడు తెల్లని 'జత పంచలు' కట్టుకుని 'జుబ్బా' (లాల్చీ) వేసుకుంటాడు. (బనియను వేసుకోరాదనే నియమం ఉందట). పైన 'సెల్లా' (శాలువ) వేసుకుని, ముహూర్తం రోజు ఇచ్చిన 'చిన్న కత్తి' (బాకు) చేతిలో పట్టుకొంటాడు. వధువు పక్షం వాళ్ళు మంగళవాద్యాలతో పెండ్లి కొడుకుని కల్యాణవేదిక దగ్గరికి పిల్చుకొని పోతారు. విడిదింటి నుంచి కల్యాణవేదిక వరకూ పెళ్ళికుమారుని తోబుట్టువు 'ఉల్లిడి'[7] క్రింద కలశాన్ని పట్టుకొంటుంది. మరొక తోబుట్టువు తలంబ్రాల బియ్యాన్ని ఒక చేత్తో పట్టుకొని మరొక చేతిని వరుని భుజంమీద వేస్తుంది తలంబ్రాల బియ్యాన్ని వరునిపక్షం వాళ్ళే పెళ్ళికి తీసుకురావాలన్న నియమం ఉంది. పెళ్ళికుమార్తెను సైతం ఇలాగే వివాహవేదిక దగ్గరికి పిలుచుకొని వస్తారు. ముందుగా వరుడే వివాహ వేదికని సమీపిస్తాడు. 'అయ్యవారు' (పురోహితుడు) నాలుగు చెంబుల్ని నాలుగు మూలల్లో (చతురస్రాకారంగా) ఉంచి, ఆ నాలుగింటికి దారం చుడతాడు. చెంబులో బంగారంతో పాటు పాలును పోస్తారు. దారం చుట్టిన మధ్యప్రదేశంలో రెండు పీటల్ని

7. పంచ నాలుగు కొనలని నలుగురు పైకి ఎత్తి పట్టుకొంటారు. మధ్యన ఒకరు కట్టెతో పైకి ఎత్తి పట్టుకొంటారు. ఇది వరుడికి గొడుగు పట్టినట్లుంటుంది. ఇదే 'ఉల్లిడి'.

వేస్తారు. పెళ్ళికొడుకు కుడికాలు పెట్టి కూర్చొన్న తర్వాత వధువు అతనికెదురుగా వచ్చి కూర్చొంటుంది. వీళ్ళిద్దరికీ మధ్య తెర పడతారు. వధువు కాలిని వరుడు తొక్కి కంకణం కడతాడు. వధువు కూడ వరుని చేతికి కంకణం కడుతుంది. ఇది 'కాల్దొక్కి కంకణం కట్టడం'. తర్వాత వరుడు వధువు మెడలో 'తాళి' కడతాడు. తాళి కట్టడానికి ముందు పెద్దల ఆశీర్వాదం కోసం మంగళసూత్రాన్ని పళ్ళెంలో ఉంచి వచ్చిన పెద్దలకు చూపిస్తారు. వధూవరులు ఒకళ్ళ మీద ఒకళ్ళు తలంబ్రాలను పోసుకొంటారు. తాంబూలం (తమలపాకులు, వక్కలు), బెల్లం, కొబ్బరిగిన్నె 'తెల్లబాయిలు'(వెల్లుల్లి), పసుపుకొమ్ము, కర్జూరం, తలంబ్రాల బియ్యంలో కలుపుతారు. ముందుగా వరుడే తలంబ్రాల బియ్యాన్ని వధువు శిరస్సుమీద పోస్తాడు. తర్వాత వధువు వరుని శిరస్సుమీద పోస్తుంది. ఇలా వధూవరులు మూడుసార్లు తలంబ్రాలను ఒకరి తలమీద మరొకరు పోసుకొంటారు.

తర్వాత పురోహితుడు వరుని హస్తాన్ని వధువు హస్తంలో ఉంచి 'పాలు, జిలకర్ర' పోస్తాడు. దాన్ని వరుడు వధువు చేతిలోనికి వదులుతాడు. అలాగే వధువు హస్తాన్ని వరుని హస్తంలో ఉంచి పాలు, జీలకర్ర పోస్తాడు. దాన్ని వధువు వరుని చేతిలోనికి వదుల్తుంది. దీని ముఖ్యోద్దేశం వధూవరులు పరస్పరం విడనాడుకోమని ప్రమాణం చేయడమే. తర్వాత 'బ్రహ్మముళ్ళు' (వధువు పైటకొంగును వరుని శాలువా కొంగుకు ముడివెయ్యడం) వేస్తారు. పురోహితుడు 'ఆరుంజోతి' (అరుంధతి) ని వధూవరులకు చూపించడం కోసం వెలుపలికి పిలుచుకొని వచ్చి చూపిస్తాడు. అరుంధతీ దర్శనం తర్వాత వధూవరుల్ని మళ్ళీ పీటలమీద కూర్చోబెట్టి 'నలుగులు' పోస్తారు. (బియ్యాన్ని రెండు పిడికెళ్ళలో పట్టుకొని నడుము, భుజాల మీదుగా శిరస్సుమీద జారవిడుస్తారు. ఇలా మూడుసార్లు చేస్తారు. ఇది 'నలుగులు పోసుకోవడం' అనబడుతుంది.) దీన్నే 'సాసపెట్టడం'[8] అంటారు. తర్వాత 'చదివింపులు'. ఆ తర్వాత 'అంపకం'. తప్పెటలు, మంగళ వాద్యాలతో వధూవరుల్ని ఊరేగిస్తారు. దీన్నే 'మెరవణి' అంటారు. ఇది సూక్ష్మంగా అగ్రేతర వర్ణాల్లో జరిగే వివాహ కార్యక్రమం. ఈ వర్ణాల్లో హోమానికి ప్రాధాన్యం లేదు. జీలకర, బెల్లం పెట్టే సంప్రదాయం కూడ కొన్ని వర్ణాల్లో కన్పడదు.

---

8. *రాయదుర్గం ప్రాంత వ్యవహారంలో ఉంది. ఇది కన్నడం నుంచి వచ్చి ఉంటుంది. కన్నడంలో 'సేసె ఇక్కువుదు' అని బ్రాహ్మణేతరులలో వాడుక.*

## సీమంతం:

షోడశసంస్కారాల్లో సీమంతం కూడ ఒకటి. శిశువు తల్లి గర్భంలో ఉండగా ఐదు, ఏడు మాసాల్లో గర్భిణీ స్త్రీకి చేసే వేడుక విశేషమే 'సీమంతం'.

ఇదే 'శ్రీమంతం'గా వ్యవహారంలో ఉంది. ఇదే కొన్ని ప్రాంతాల్లో 'పూలముడుపు'గా కూడ వ్యవహారంలో ఉంది. స్త్రీ గర్భిణిగా ఉన్నప్పుడు దుష్టశక్తులు ఆమెను ఆవేశిస్తాయనీ, వాటి నుంచి రక్షణ కోసం సీమంత సంస్కారం ప్రవేశపెట్టబడినట్లు కనబడుతుంది.

తల్లిశ్రేయస్సు, పుట్టబోవు శిశువుకు దీర్ఘాయుస్సు, గర్భిణీ స్త్రీ ఉల్లాసంగా ఉండడం సీమంత సంస్కార ఉద్దేశాలుగా కన్పిస్తాయి. ఇవి వాళ్ళు చేసే ఆచారాలు, వేడుకలను బట్టి వ్యక్తమవుతాయి.

సాంప్రదాయిక స్త్రీలలోలాగ గ్రామిక స్త్రీలలో సీమంతానికి అంత ప్రాధాన్యం కన్పించదు. కాపు కులస్థులలోనూ, తక్కిన కొన్ని వర్ణాలలోను మాత్రమే ఇది కన్పిస్తుంది. ఐదోనెలలో సాధారణంగా సీమంతం చేస్తారు. గర్భిణీ స్త్రీకి తలంటు పోస్తారు. ఆరోజు 'తీపు' చేసుకొంటారు. పీటలమీద ఆమెను కూర్చోబెట్టి పేరంటానికి పిలుస్తారు. పసుపు కుంకుమ పెడతారు. 'కర్జికాయలు', 'చీనాపండ్లు' (బత్తాయిపండ్లు), జామపండ్లు, చీర, రవికెలు, రెండు కొబ్బరి గిన్నెలతో ఒడి నింపుతారు. ముత్తయిదువులకు తాంబూలమిస్తారు. కంచంలో 'ఎర్రీళ్ళు' (వసంతం) పోసి అందులో 'కంచారతి' (చిన్న కప్పులో చమురువత్తి దీపాన్ని వెలిగించి హారతినివ్వడం) మంగళహారతి ఇస్తారు. ఆ తర్వాత గర్భిణీ స్త్రీ పీటలమీదనుంచి లేస్తుంది. ఇది క్లుప్తంగా గ్రామిక స్త్రీలలో జరిగే సీమంత సంప్రదాయం. సీమంత సమయంలో పాటలు పాడతారు.

## వ్రతాలు, నోములు:

మానవుడు అజ్ఞానాంధకారం వల్ల చేసిన పాపాలని తొలగించుకొని విముక్తి పొందడానికి కల్పింపబడ్డ వాటిలో ప్రధానమైనవి వ్రతాలు, నోములు. ఆస్తిక్యభావాన్ని పెంపొందించడమే వ్రతాల్లో నిగూఢమైన ప్రధానాంశం.

వ్రతాలు, నోములు నీతి నియమాలని, ప్రాచీన ఆచార వ్యవహారాలని, పురాతన సంప్రదాయాలని, సంస్కృతిని, భక్తివిశ్వాసాలని ప్రదర్శించే సాంప్రదాయిక

విజ్ఞానం. 'వ్రతం' అనే పదానికి నియమం, నోము, పుణ్యకం అనే అర్థాలూ; 'నోము' అనే పదానికి నోచడం, వ్రతం అనే అర్థాలు వ్యవహారంలో ఉండడంవల్ల ఈ రెండింటికీ వ్యత్యాసం అంతగా కన్పట్టంలేదు.

పక్షం, మాసం, ఋతువు, ఆయనం, సాంవత్సరికాలని కాలాన్ని ఆధారంగా చేసుకొని వ్రతాలు నిర్ణయింపబడ్డాయి. వారవ్రతాలు, నక్షత్రవ్రతాలు కూడా ఉన్నాయి. చాలవరకు వ్రతాలన్నీ తిథుల్ని అధారంగా చేసుకుని ఆచరింపబడు తున్నాయి. వ్రతాలని ఆచరించడానికి శుభసమయాలని చూడడం కన్పిస్తోంది. వ్రతాలని ఆచరించేవారు ఎలాంటి ఆటంకాలని రానీయక తప్పక ముగించాలనే నియమం, పుట్టుక చావుల చేత కలిగిన అశౌచ సమయాల్లో వ్రతాలని ఆచరించ కూడదనే నిషేధం కన్పడుతుంది.

స్త్రీలకి గొడ్రాలితనం, వైధవ్యం, కడుపుశోకం, దారిద్ర్యం మొదలైనవి తీరని దుఃఖాలు. అందువల్లే వాటిని నివారించుకోవడానికి వ్రతాలనొక సాధనంగా గ్రహించారని చెప్పొచ్చు. అంతేకాకుండా పాపులు మోక్షం పొందడం, దరిద్రులు ధనికులు కావడం, దీర్ఘరోగాలు నయంకావడం అనేవి వ్రతఫలాలుగానే మనవాళ్ళు పరిగణించారనడంలో సందేహం లేదు.

కన్య జీవితంలో మలుపుతిరిగే ఘట్టం వివాహం. ప్రతికన్యా సత్పురుషుడైన వాణ్ణే వివాహం చేసుకోవాలనీ, సంతనవతియై ఆదర్శవంతమైన గృహిణీ జీవితాన్ని గడపాలని, సిరిసంపదలతోను, ఐదువతనంతోను వర్థిల్లాలని తాపత్రయ పడుతుంది. అలాంటి కోరికలు నెరవేరడం కోసం నోముల్ని, వ్రతాల్ని చేపడుతుంది.

నోములు, వ్రతాలని ఆచరించే సమయంలో ఉపవాసం చెయ్యడం ఒక ఆచారంగా పరిణమించింది. వ్రత సంబంధమైన కార్యక్రమాన్ని నిర్వహించిన తర్వాత వ్రతకథల్ని చదవాలన్న నియమం కన్పిస్తుంది.

సాధారణంగా వ్రతాలు, నోములు సాంప్రదాయిక స్త్రీలలోనే చోటుచేసు కొన్నాయి. జానపద స్త్రీలలో ఇవి కానరాకపోయినా వ్రతాల్ని ఆచరిస్తున్న వాళ్ళ గృహాల్లో వ్రత కథల్ని వినడం గమనించదగ్గ విషయం. వ్రతాలు, నోములు జానపదే తరులైన బ్రాహ్మణ, వైశ్య కులాల్లో అధికంగా ఉన్నప్పటికీ, ఇవి సాంఘికాచారాలు

గాను, మౌఖిక సంప్రదాయంలో నిలద్రొక్కుకొని ఉండడం వల్లనూ వీటిని సాంఘిక జానపద ఆచారాలుగానే పరిగణించాల్సిన అవసరం ఉంది.

వ్రతాలకు, నోములకు ఆచార వ్యవహారాలు పాటింపబడుతున్నాయి. నియమ నిష్ఠలతో వాంఛార్థ సిద్ధి కోసం నిర్వహింపబడుతున్న నోములు, వ్రతాలు మన సంస్కృతిలో ఒక భాగంగా నేటికీ నిలద్రొక్కుకున్నాయి.

వ్రతాలను, నోములను ఆచరించే సందర్భంలో వ్రత కథల పాటల్ని పాడుకొంటారు. ఈ పాటలన్నిటిలోను ఫలశ్రుతి కన్పిస్తుంది.

## మేలుకొలుపులు:

దేవాలయాల్లో ప్రభాత వేళల్లో స్వామివారిని మేలు కొలుపుతూ పాడబడే వైతాళిక గీతాలు 'మేలు కొలుపులు'. అర్చకుల ప్రబోధ గీతాలచే స్వామి మేల్కొన్న తర్వాతనే భక్తాదులకు స్వామి దర్శన భాగ్యం లభిస్తుంది. అలాంటి సుప్రభాత సుస్వరాలే మేలుకొలుపులు. ఇవి భక్తి మార్గానికి సంబంధించిన స్త్రీ పురుషోభయ సంబంధాలు. ఆలయాల్లో పాడే మేల్కొలుపులే స్త్రీల నోళ్ళలోను ఇళ్ళు కట్టుకొన్నాయి. ప్రాతఃకాలాన్నే లేచిన గృహిణులు పెరుగు చిలుకేటప్పుడో, ఇల్లలికేటప్పుడో, ఇతర గృహకృత్యాలను ఒనరించేటప్పుడో తమ ఒంటరితనాన్ని పోగొట్టుకోవడం కోసం ఇష్టదేవతా సంబంధమైన మేలుకొలుపుల్ని ఆసరాగా తీసుకొన్నారు.

సాంప్రదాయిక స్త్రీలలో సూర్యనారాయణుడు, కేశవుడు, రాముడు, రంగనాథుడు, శివుడు, తులసి, అలవేలుమంగ, భ్రమరాంబ మొదలైన దేవతలకి సంబంధించిన మేలుకొలుపులు చోటుచేసుకొన్నాయి. అలాగే శ్రామిక స్త్రీలలో ఆయా స్థానిక దేవతలైన రంగనాయకుడు, గోపాలుడు, పెన్నోబళేసుడు, మొదలయినవారు ప్రాధాన్యం వహించారు.

## పూజా పురస్కారాలు:

దైవమహిమని తెలుసుకొని దృఢమైన నమ్మకం ఉంచడమే భక్తి అనిపించుకొంటుంది. పత్ర, పుష్ప, ఫలాదుల్ని భక్తితో ఆ భగవంతునికి అర్పించి

అనుగ్రహం పొందుతున్నాం. భగవన్నిర్మాతాలైన ఫలపుష్పాదుల్ని భగవంతుడికే అర్పించడాన్ని పూజగా పరిగణిస్తున్నాం.

చిత్తశుద్ధి ఆత్మసాక్షాత్కారానికి అత్యావశ్యకం. పూజా పురస్కారాది ఆచార పద్ధతులకు అదే ఆలంబనం. భగవంతుని ఆరాధించే వాళ్ళెవరైనా సరే ప్రాతఃకాలంలో మేల్కొని విధిపూర్వకంగా పవిత్ర జలాల్లో స్నానం చేసి దేహాన్ని శుచిగా ఉంచుకోవాలని నియమం. ఆ తర్వాత మడివస్త్రాలని ధరించాలి. పూజా స్థలాన్ని పవిత్రంగా ఉంచాలి. ఆ ప్రదేశాన్ని శుభ్రంగా అలికి ముగ్గులు వేయాలి. ఆ పిమ్మటే పరమత్ముని పూజించాలి.

భగవంతుని పూజించడం వల్ల కార్యాలు సిద్ధిస్తాయనీ, రోగ నాశనమవుతుందనీ, దుఃఖాలు తొలగిపోతాయనీ, విపత్తులు రావనీ, సంతానప్రాప్తి, వైభవప్రాప్తి, యోగప్రాప్తి కలుగుతుందనీ మన విశ్వాసం. అందువల్లే పరమాత్ముని అనుగ్రహం కోసం ధ్యానించడం జరుగుతోంది. ఈ ధ్యానించడంలో జరిపే క్రియాకలాపమే పూజ.

వైదిక సంప్రదాయంలో స్త్రీలకీ, అగ్రవర్ణేతరులకి మంత్ర పూజాధికారం మృగ్యం. క్రమక్రమంగా వీరశైవమత విజృంభణతో అన్ని వర్గాలవారికి పూజాధికారం లభించింది. నాటినుంచే స్త్రీలలో పూజలు, పురస్కారాలు, వ్రతాలు, నోములు బయల్దేరాయి.[9]

ప్రాతఃకాలాన్నే లేచి స్నానాదికాలని ముగించి, పసుపు కుంకుమలు, ఫల పుష్పాదులతో దేవుణ్ణి పూజించిన తర్వాతే తక్కిన తమ ఇతర కార్యక్రమాలని చేసుకొనే స్త్రీలని గమనిస్తే పురుషుల్లో కంటే స్త్రీలలోనే అధిక భక్తి ప్రవత్తులున్నట్లు గోచరిస్తుంది.

స్త్రీ పురుషులు సూర్యభగవానుడు, శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, శంకరుడు, ఏడుకొండలవాడు, రామభక్త హనుమంతుడు మొదలైన పురుష దేవతల్నీ; అంబ, మహాలక్ష్మి, త్రిపురసుందని మొదలైన స్త్రీ దేవతల్నీ; దైవ ప్రతీకలుగా నాగులనీ, గోవులనీ పూజిస్తారు. అలాగే తులసి, రావి మొదలైన వృక్షాలను కూడ దైవ ప్రతీకలుగా పూజిస్తారు. వీటిలో కొన్నింటిని వివరిస్తాను.

---

*9. ''దేశీ సారస్వత విభూతి'', పుట - 553, ''కిన్నెర'', డిసెంబరు 1953.*

**తులసి:**

తులసి పూజా వృక్షం. అతి పవిత్రమైంది. దీన్ని మహాలక్ష్మి అంశంగా భావిస్తారు. శ్రీకృష్ణుని ఆవాసస్థానం 'తులసికట్ట'. ఇది ప్రతి గృహప్రాంగణంలోను ఉంటుంది. శ్రీకృష్ణుని భక్తురాలైన 'బృంద' తులసి వృక్షానికి చిహ్నం. ప్రభాత కాలంలో మేల్కొన్న స్త్రీలు 'తులసికట్ట'ని గోమయంతో అలికి ముగ్గులు పెట్టి, జ్యోతుల్ని వెలిగించి హారతులనిస్తారు. కన్నెపిల్లలు, వివాహమైన స్త్రీలే కాకుండా వితంతువులు కూడా తులసిని విశేషంగ పూజిస్తారు.

స్త్రీలు తులసీ దళాలను విడిపించకూడదనే నిషేధం వుంది. తులసికట్టకు నిత్యం ప్రదిక్షిణం గావిస్తే పాపనాశనమవుతుందన్న దృఢ విశ్వాసం వుంది. వివాహార్థం కన్నెలు 'కన్నెతులసమ్మ నోము' నోస్తారు.

'చిలుకు ద్వాదశి' నాడు తులసికట్ట చెంత పూజలు సల్పుతారు. తులసికట్ట దగ్గర చెరుకు గడని నిలిపి, ఉసిరికాయలు, చింతకాయలను తులసి దగ్గర వుంచి, వివిధ పూలమాలల చేత అలంకరించి 'తులసి పెండ్లి'ని వైభవంగా చేస్తారు. దానికి సంబంధించిన పాటల్ని సైతం పాడుతారు.

**అశ్వత్థ వృక్షం:**

రావిచెట్టుని అశ్వత్థమనీ, శ్రీవృక్షమనీ అంటారు. తులసిచెట్టు లాగానే ఇది కూడా పవిత్రమైంది. అశ్వత్థ వృక్షాన్ని, నింబ వృక్షాన్ని ఒకే కుదురులో పెంచి వివాహం జరిపిస్తారు. ఇదే ఆర్యనాగ సమ్మేళనం.[10] అశ్వత్థ ప్రదిక్షిణం చేస్తే సంతాన ప్రాప్తి కలుగుతుందనీ, పాపనాశనమవుతుందనీ విశ్వాసం ఉంది. రావిచెంత నారాయణ దేవుని ప్రతిష్ఠించి అశ్వత్థ నారయణుని పేరుతో పూజలు సల్పుతారు.

రావి 'మహావిష్ణువు' అంశం అనే భావన వుంది. అశ్వత్థ వృక్షాన్ని పూజిస్తూ అనంతపురం జిల్లాలోని స్త్రీలు 'రావిచెట్టు పాట'ని పాడుకొంటారు.

**నాగుమయ్య (నాగపూజ):**

శ్రావణశుద్ధ పంచమినాడు నాగ పంచమిని, కార్తీకశుద్ధ చవితినాడు నాగుల చవితిని ఆచరిస్తారు. నాగ పంచమి నోము ప్రసిద్ధమైంది.

---

*10. నేదునూరి గంగాధరం, మిన్నేరు, పుట - 211.*

దేవతలకు ప్రియమైనవి పాములు. ప్రజలు పాముల్ని భక్తితో పూజిస్తే సర్పాల బాధ తొలగుతుందన్న నమ్మకం వుంది. నాగపంచమి రోజు ప్రజలు ప్రాతఃకాలాన్నే లేచి తలస్నానం చేసి నాగుల ప్రతిమలకి పాలు, కొబ్బెర, పేలాలు, పరమాన్నం, అన్నం నైవేద్యంగా పెడతారు. తర్వాత పుట్టల దగ్గరికి వెళ్ళి యజ్ఞోపవీతాలను పుట్టలమీద శృంగారించి, పుట్టల్లో పాలుపోసి ప్రదిక్షిణ నమస్కారాలు చేస్తారు. ప్రతి పల్లెలోను వేప లేక రావి చెట్ల మొదల్లో రాతితో చేయబడ్డ పాముల ప్రతిమలకి పూజలు చేస్తారు.

సంతానం కోసం నాగప్రతిష్ఠ చేస్తే పిల్లలు కలుగుతారన్న విశ్వాసం వుంది. నాగుల చవితినాడు స్త్రీలు పాటల్ని పాడుకొంటారు.

సర్పాలను నాగుమయ్యలని, నాగప్పలని ఈ జిల్లాలో వ్యవహారం. వీటిని సుబ్రహ్మణ్యస్వామి ప్రతీకగా భావించి పూజలు చెయ్యడం జరుగుతుంది.

పాములు పంటల్ని అభివృద్ధి పరుస్తాయన్న నమ్మకం వుంది.

## గోవు పూజ:

గోవు భూదేవికి ప్రతినిధి. ఆవు ఈనే సమయంలో గోప్రదక్షిణం చేస్తే భూ ప్రదక్షిణ చేసినంత ఫలమని భావించడం వుంది. ఆవులో పద్నాలుగు లోకాలు, 33కోట్ల దేవతలున్నారట.

పంచగవ్యాలైన గోమూత్రం, గోమయం, క్షీరం, ఘృతం, దధి అతి పవిత్రాలైనవి. గర్భాదాన సంస్కారం నుండి శవ సంస్కారం దాకా గోదానం, పంచామృతం, పంచగవ్యాలు లేందే కార్యం జరగదు. గోమాతని పూజిస్తూ 'గోవును పూజించే పాట'ను ఈ జిల్లాలోని స్త్రీలు పాడుకొంటారు.

## మంగళహారతులు:

'మంగళహారతులు' అని ప్రచారంలో ఉన్న 'మంగళ హారతులు' భక్తి సంబంధాలు. శుభవేళల్లోను, పూజాంత సమయాల్లోను వీటికి ప్రాచుర్యం ఎక్కువ. మంగళహారతియే 'హారతి', 'ఆరతి', 'ఆర్తి' అని జనపదాల్లో వినబడుతుంది.

దేవతలందరి మీదా మంగళహారతులు ప్రచారంలో వున్నాయి. అలాగే గ్రామదేవతలైన ఏడుగురు అమ్మవార్లు, ఎల్లమ్మ, మారమ్మ, పెద్దమ్మ మొదలైన వాళ్ళమీద కూడా ఆరతి పాటలు వున్నాయి.

ఇలా భక్తి సంబంధమైన పూజా పురస్కారాలు, వ్రతాలు, నోములు మన సంస్కృతిలో విడదీయరాని భాగంగా వున్నాయి. వీటన్నిటిలో ఆచార వ్యవహారాలు సంప్రదాయాలు, నియమాలు, నిషేధాలు, కట్టుబాట్లు చోటు చేసుకొన్నాయి. ప్రజలు భయభక్తులతో మెలగడానికి, విశ్వాసాన్ని పెంపొందించుకోవడానికి, క్రమ శిక్షణను అలవరచుకోవడానికి ఇలాంటి ఆచరణలు ప్రవేశపెట్టబడ్డాయి.

ఇలాగే సంతానంలేని స్త్రీలు 'గంగమ్మను చేయ'డాన్ని ఒక ఆచారంగా పరిగణిస్తారు. ఈ ఆచారాన్ని కొంత వివరిస్తాను.

## గంగమ్మ ఆరాధన – ఒక ఆచారం:

సంతానం కోసం తీర్థయాత్రలు చేయడం, కనపడిన రాయీ రప్పను పూజించడం మనలో అనాదిగా కన్పిస్తోంది. అలా సంతానం కోసం చేసే ఆరాధన 'గంగమ్మను చేయడం'. ఇదొక ఆచారంగా కొన్ని ప్రాంతాల్లో కనిపిస్తోంది. జానపద స్త్రీలే కాక నాగరకులమనిపించుకొనే వారుకూడ గంగమ్మను చేయడం జరుగుతోంది. అనంతపురం జిల్లాలో, మడకసిర తాలూకాలోని తంబడేపల్లి గ్రామంలో జరిగే 'గంగమ్మను చేయడం' ఆచారం గురించి వివరిస్తాను.

తంబడేపల్లి గ్రామం పొలిమేరల్లో, దాదాపు ఒక ఫర్లాంగు దూరంలో పంట పొలాల మధ్య మొగిలి పొదల్లో ఒక చిన్న బావి వుంది. ఈ బావిని 'కన్నేరమ్మ బావి' అంటారు. (క. కన్యయరు+అమ్మ = కన్నేరు+అమ్మ=కన్నేరమ్మ అయివుంటుంది. కన్నడంలో కన్యయరు అంటే కన్యలు). ఈ బావి ఈనాటిది కాదు. సుమారు 10 అడుగుల పొడవు, 10 అడుగుల వెడల్పుతో చతురస్రాకారంలో ఉంటుంది. ఈ బావి నీళ్ళను 'గంగమ్మ' అంటారు. ఈ నీళ్ళు ఎల్లప్పుడూ స్వచ్ఛంగా, నిర్మలంగా వుండడం ఒక విశేషం. సంతానం కోసం, తమ అభీష్టం నెరవేరడం కోసం స్త్రీలు గంగమ్మను పూజించడాన్ని 'గంగమ్మను చేయడం' అంటారు. సాధారణంగా స్త్రీలు ఏరునుగానీ, నదిని కానీ దాటేటప్పుడు గంగమ్మకు పసుపు, కుంకుమ, తాంబూలాన్ని సమర్పిస్తారు.

'గంగమ్మను చేయడం' - గంగమ్మ గట్టుమీద మట్టితో చిన్న అరుగు వేస్తారు. అరుగు మధ్య మూడు చిన్నరాళ్ళు (కొంతమంది ఐదురాళ్ళు) ఒకదాని ప్రక్కన ఒకటి నిలబెడతారు. బహుశా ఈ రాళ్ళు గంగమ్మకు సంకేతం కావచ్చు. అగ్రేతర వర్ణాలవారు ఐదుపోగుల పసుపుదారం చేస్తారు. దీన్ని 'అంగదారం' అంటారు. ఇందులో ఒక పోగు దారాన్ని మూడు చిన్నరాళ్ళలో ఒకదానికి చుడతారు. ఇంకో దారాన్ని గంగమ్మను చేస్తున్న వాళ్ళు తమ మెడలో వేసుకుంటారు. లేదా కుడిచేతికి కట్టుకుంటారు. తక్కిన మూడింటిని అక్కడ వున్న ముత్తయిదువులకు ఇస్తారు. అగ్రవర్ణాలవారు అంగదారానికి బదులు 'గజ్జెవస్త్రాలు' (పత్తితో చేసిన వస్త్రాలు) మూడు రాళ్ళకు చూడతారు. బియ్యం పిండి, బెల్లంతో చలిబిండి చేస్తారు. అలాగే నువ్వులు బెల్లంతో చిలిమిడి (కన్నడంలో 'చిగళి' అంటారు. తంబడేపల్లి కన్నడ భాషా సంప్రదాయాలకు లోనైన చిన్న గ్రామం. ఇక్కడి చుట్టుప్రక్కల వాళ్ళు చిగళి అనే అంటారు.) కొంతమంది చలిబిండిని, చిలిమిడిని అక్కడి కక్కడే చేస్తారు. మరికొంతమంది ఇంట్లోనే చేసి అక్కడికి తీసుకుని వస్తారు. రెండు తమలపాకులు, రెండు వక్కలు, ఒక ఉండ చలిబిండి, ఒక ఉండ చిలిమిడి, నానుబాలు (నానబియ్యం) నైవేద్యంగా గంగమ్మకు పెడతారు. ఐదు రవికెలు (కొంతమంది మూడు రవికెలు) గంగమ్మకు పెడతారు. 'నిండుపూజ' చేస్తామని మొక్కుకున్న వాళ్ళు గంగమ్మను చేసి నైవేద్యం, రవికెలతో పాటు నిండు పూజను అక్కడే వదలి వెళ్ళిపోవాలి. మామూలుగా గంగమ్మను చేస్తామనుకున్న వాళ్ళు టెంకాయ నీరు, పాలు, నెయ్యి బావిలో వదలాలి. దక్షిణతో పాటు గంగమ్మకు పెట్టిన ప్రసాదం, తాంబూలాలను గంగమ్మతో వదలాలి. ఇది చెయ్యడంతోనే గంగమ్మను చెయ్యడం పూర్తికాదు.

బావికి ప్రక్కనే చెరువుకట్ట వుంది. కట్టమీద గంగమ్మతోపాటు ఆరుగురు చెల్లెళ్ళు (వీళ్ళు వరసగా మారమ్మ, ఎల్లమ్మ, సల్లాపురమ్మ, ముత్యాలమ్మ, పోలేరమ్మ, అంకాళమ్మలు) ఏడుగురు పిల్లలు ఉన్నారు. ఇవన్నీ విగ్రహాలు కావు. 7,8 అంగుళాల రాళ్ళు. అక్కడే 'నాగప్ప' (రాతిమీద చెక్కిన నాగుపాము), 'బసవణ్ణ' (నంది విగ్రహం) ఉన్నాయి. గంగమ్మను చేసేవాళ్ళు తప్పకుండ వీళ్ళను పూజించాలి. వీటికి గుడి ఏదీ లేకపోయినా 'ఏడుగురు అక్కమ్మల గుడి' అంటారు. కొంచెం ఎత్తయిన ప్రదేశం మీద ఇవన్నీ ప్రతిష్ఠించబడి ఉన్నాయి. ఇక్కడ వున్న బసవణ్ణకు ప్రత్యేకత ఉందట. ఈ అక్కమ్మల గుడి దగ్గరా, గంగమ్మ బావి దగ్గరా పూజ చేసినవాళ్ళు

వెనక్కి తిరగకుండా వెళ్ళిపోవాలట. నిండుపూజ చేసినవాళ్ళు అలా వెనుదిరిగి చూస్తే మళ్ళీ నెలలోపల అక్కడికి వచ్చి గంగమ్మను చేయాల్సి ఉంటుందట. వెనుదిరిగి చూసిన మహిళలు 15రోజులకే ఋతుమతులు కావడం, ఒళ్ళంతా నొప్పులు పుట్టడం జరుగుతుందట. అప్పుడు మళ్ళీ గంగమ్మను చేస్తామని మొక్కుకోవాలట.

రజస్వల అయిన వాళ్ళు పదహారు రోజులలోగా గంగమ్మను చేస్తారు. వివాహం కాని కన్నెపిల్లలు, దీర్ఘరోగాలతో బాధపడుతున్న పీడితులు గంగమ్మను చేయడం జరుగుతోంది. ముఖ్యంగా సంతానం కోసమే 'గంగమ్మను చేయడం' అనే ఆచారం ప్రబలంగా కన్పిస్తోంది. తమ కోరికలు నెరవేరిన తర్వాత కానుకలు సమర్పించుకొంటారు. సంతానం కల్గిన తర్వాత సాధారణంగా వెండి ఊయెలను బావిలో వదిలేస్తారు.

ఇకపోతే మరణాన్ని గురించి

**మరణం:**

జీవితంలో బాల్యం, యౌవనం, కౌమారం, వార్థక్యం మొదలైన ఘట్టాలనన్నింటినీ దాటిన తర్వాత చివరిగా అందరూ ఎదుర్కొనే ఘట్టం మరణం. షోడశ సంస్కారాల్లో ఇది చివరిది కావడంవల్ల దీన్ని అంత్య సంస్కారం అని కూడ అంటారు. మానవ మేధస్సుకు అంతుపట్టని రహస్యం మరణం. ఒక వ్యక్తి చావు అతని బంధుమిత్రాదులకు దుఃఖం కల్గించినా, దాన్నొక సర్వసాధారణమైన క్రియగా, ప్రకృతి మాయగా భావించడం జరుగుతోంది. చచ్చిపోయాడనడానికి తనువు చాలించాడు, కీర్తిశేషుడయ్యాడు, దైవాధీనుడయ్యాడు, కళ్ళుమూసాడు, దివంగతుడయ్యాడు మొదలైన పేర్లతో పిలవడం జరుగుతోంది. కొన్ని ప్రాంతాల్లో మరణించాడనడానికి 'తీరిపోయాడు' అని వ్యవహరిస్తారు. మరణాన్ని అశుభంగా పరిగణించడం వల్ల ఈ మాటకు ఇన్ని పదాలు వ్యవహారంలో ఉన్నాయి.

జీవితం ఒక నాటకరంగం. నాటకంలో పాత్రలు వస్తుంటాయి. పోతుంటాయి. అలాగే మానవ జీవితంలో కూడ పాత్రలు మంచినో, చెడ్డనో కలగి తమ వంతు పాత్రను ముగించి వెళ్ళిపోవడం జరుగుతుంది. మరణం శోకాన్ని తెచ్చి పెడుతుంది. తమిళనాడులో శవం ముందు కూర్చుని బావురుమంటూ

ఏడుస్తారు; డబ్బిచ్చి ఏడిపించే సంప్రదాయం వుంది. పాటలు పాడుతారు; పాడిస్తారు. అలాగే కేరళ ప్రాంతంలో కూడ ఏడ్వడానికే ప్రత్యేకంగా వ్యక్తులు ఉన్నారట. అలా ఏడిస్తే మరణించిన వాళ్ళ ఆత్మ శాంతిస్తుందని ఒక విశ్వాసం.

కులాన్ని బట్టి, తెగనిబట్టి, వయస్సుని బట్టి మరణించిన వాళ్ళని పూడ్చి పెట్టడమో లేక దహనం చెయ్యడమో జరుగుతంది. శవాన్ని పాడెమీద పడుకోబెట్టి తీసుకుపోయే ఆచారం కన్పిస్తుంది. తప్పెట్లు తాళాలతో ఊరేగించడం ఉంది. శవం మీద బొరుగులు, పైసలు చల్లుకుంటూ శ్మశానానికి తీసుకువెళ్తారు.

ద్విజుల్లో ప్రతియేటా చనిపోయిన వాళ్ళకి తద్దినం (తిథి) పెడతారు. ద్విజేతరుల్లో ఆశ్వయుజ అమావాస్యను పితృఅమవాస్య (మహాలయ అమావాస్య) గా ఆచరిస్తారు.

సమీప బంధువులు చనిపోయారన్న వార్త వినాగానే కొన్ని కులాల్లో తలస్నానం చేస్తారు. శవాన్ని తాకినవాళ్ళు, శవం మోసిన వాళ్ళు, శవసంస్కారం జరుగుతుండగా చూసిన వాళ్ళు ఇంటికి వచ్చి తలకు స్నానం చెయ్యాలన్న ఆచారం కన్పిస్తుంది.

ఇలా పుట్టిన నాటినుంచీ గిట్టేదాకా అనేక ఆచార వ్యవహారాలు, సంప్రదాయాలు చోటుచేసికొన్నాయి.

* * *

# 17. జానపద మతం - గ్రామదేవతలు
## (Folk Relegion - Village Goddesses)

Richard M. Dorson జానపద మతాన్ని (Folk Religion) సాంఘిక జానపద ఆచారంలో (Social Folk Custom) చేర్చాడు. ఈ సాంఘిక జానపద ఆచారంలోని మతసంబంధాలు, దేవతలు లేక కులసమూహాలు దేవతారాధనలతో కూడి వుంటాయి. కనుక గ్రామదేవతారాధనను జానపద మతానికి సంబంధించిన ఒక సాంఘిక జానపదాచారంగా పరిగణింపవచ్చును.

మతాన్ని నిర్వచించడం కష్టమే అయినా E.B. Tylor చెప్పినట్లు (Religion is) 'The belief in spriritual thing's[1] అనవచ్చును. Wallace దృష్టిలో 'The religion of a society as a conglemeration of rituals and beliefs whose components are integrated at the level of cult institutions'[2] స్థూలంగా జానపద మతాన్నిలా నిర్వచింపవచ్చును. సంఘంలోని వ్యక్తులు తమచుట్టూ ఏవో కొన్ని అదృశ్యశక్తులున్నాయని విశ్వసించి చేసేడి ఆచార విశేషమే జానపద మతం. జానపద మతంలో ఒక అంశమైన గ్రామదేవతారాధన ఈ విషయాన్ని స్పష్టపరుస్తుంది. ఏవో తమకు తెలియని కొన్ని శక్తులు మంచి చెడులతో నిమిత్తం లేక తమను ఆవరించుకొని యున్నాయనీ, ఆ శక్తులు వ్యాధుల్ని, ఉపద్రవాల్ని కలిగిస్తున్నాయనీ ఆదిమానవులు విశ్వసించారు. 'The object of their religion was to propitiate these innumareble spirits'[3] అని Henry whitehead అని అభిప్రాయ పడ్డాడు. కనుకనే అతి ప్రాచీన కాలంనుంచీ కూడ గ్రామదేవతారాధన జానపద మతంలో విశిష్టస్థానం ఆక్రమించి నేటికీ నిలద్రొక్కుకొని వుంది.

జానపదులు తమ గ్రామం ఒక శక్తి రక్షణలో వున్నట్లు అదే తమ గ్రామ రక్షణ దైవమని నమ్మి ఆరాధిస్తున్నారు. గ్రామదేవతల పుట్టుకను గురించి Henry whitehead ప్రస్తావిస్తూ 'Probably these village deities come into being

---

1. *Quoted in Encyclopaedia of Religion &Ethics Vol.10 by Janes Ed. Hastings.*
2. *Quoted in Folklore and Folklife, P-219.*
3. *Village Gods of South India, P-11.*

at the period when the people began to settle down agricultural communities'[4] అని అభిప్రాయపడ్డాడు.

గ్రామదేవతలు ప్రధాన హిందూ దేవతలైన విష్ణు ఈశ్వరులకు పూర్తిగా భిన్నులని చెప్పవచ్చు. వీరి ఆరాధనా క్రమం కూడా భిన్నంగా వుంటుంది. విష్ణు ఈశ్వరులు ప్రకృతికి ప్రతినిధులు. గ్రామదేవతలు గ్రామ పరిరక్షణ ప్రతీకలే కాని విశ్వానిలాంటి ప్రతినిధులు కారు. ఈ విషయాన్నే Henry white head '......But the village deities, on the other hand have no relation to the univese. They symbolize only the facts of the village life[5] అని పేర్కొన్నాడు. గ్రామ దేవతలు గ్రామాల్లో సంభవించే కలరా, అమ్మవారు (పెద్దమ్మ), పశువ్యాధుల నివారణకు మాత్రమే పరిమితమైనట్లు కన్పిస్తుంది. కాని విష్ణు, ఈశ్వరుల్ని కొలవటంలో ఆధ్యాత్మిక ధోరణి ప్రస్ఫుటమవుతుంది.

William crooke అన్నట్లు అతి పురాతనదశ(most primitive from) లో గ్రామదేవతలందరూ అనామధేయులట[6], గ్రామ దైవాల్లో చాలావరకు స్త్రీ దేవతలే ప్రాధాన్యం వహించటాన్ని గమనింపవచ్చు. దీనికి కారణాన్ని Henry whitehead ఇలా వివరించాడు. ఆర్యుల దైవాలు ప్రధానంగా వీరయోధులకు సంబంధించినవి కాగా, ద్రావిడ దైవాలు వ్యవసాయదారులకు సంబంధించిన స్త్రీ దేవతలు. ప్రపంచం అంతటా యుద్ధ దేవతలు అధికంగా పురుషులకు సంబంధించిన వారు కాగా, వ్యవసాయ సంబంధమైన దైవాలు చాల వరకు స్త్రీ దేవతలు. ఇది సాధారణంగా యుద్ధము వీరుల కర్తవ్యమనీ; ఆదిమ మానవుల్లో వ్యవసాయం స్త్రీలకే వదలి వేయబడిందినీ, 'the idea of fertility' కూడా స్త్రీలకే సంబంధించినదనీ, Whitehead అభిప్రాయపడ్డాడు.[7]

ప్రాచీన మానవుడు పూజించిన శక్తిదేవతే గ్రామదేవత. శక్తి పూజా పద్ధతి (Sakti cult) హిందువుల్లో అనాదినుంచి కన్పిస్తుంది. 'Sakti attained the highest position in the puranas where she was enlisted in the trinity along with vishnu and siva'[8]. ఈ శక్తి పూజాపద్ధతి యొక్క ప్రాచీనత వేదాల్లోనే కాక సింధూనది నాగరికత (Indus valley civilization)లో కూడా

4. *Ibid, P-16.*
5. *Ibid, P-17.*
6. *Religion and Folklore of Northem India, P-87, William Crooke.*
7. *The Village Gods of South India, P-14.*
8. *Sakti-cult in Ancient India P-XV. Dr. Pushpendra Kumar.*

గమనింపవచ్చునని డా. పుష్పేంద్ర కుమార్‌గారి అభిప్రాయం. పురాణాల్లోనూ, ఉపపురాణాల్లోనూ శక్తిదేవత ప్రాధాన్యం వహించింది. ఆమె ఒక విశ్వమాత (World mother)గా ఆరాధింపబడింది. దేవీ భాగవత పురాణం, దేవీ పురాణం, కాళికా పురాణం, మహాభాగవత పురాణంల్లో శక్తిదేవతకు అధిక ప్రాధాన్యమీయబడింది. శక్త్యుపనిషత్తులో ఈమె సర్వోత్కృష్టమైన నిజస్థితి (Supreme reality)గా అంగీకరింపబడింది. శక్తి స్త్రీ మూర్తి. 'The term sakti represents female divinity in general and stands for the energising power of some divinity in particular'[9]. డా. పుష్పేంద్రకుమార్ భారత రామాయణాల్లోను పురాణాల్లోను శక్తిని గుర్తించిన విషయాల్ని ఉదాహరణ పూర్వకంగా క్షుణ్ణంగా తమ గ్రంథంలో చర్చించి వున్నారు.

డా. నాయని కృష్ణకుమారిగారు 'తల్లిదేవత' (Mother goddess)ను గురించి ప్రస్తావిస్తూ, ''మనుష్యులను పీడించు ప్రేతాత్మలనుండి రక్షణకై ఆ మనుష్యుడే భగవద్రూపమును కల్పించుకొని, తనకు సంరక్షకునిగా నిలబెట్టుకొనెను. ఇట్టి భగవద్రూప కల్పనమునందు మొదటి కల్పన తల్లిదేవత''[10] అని పేర్కొన్నారు. వీరే జానపదుల గ్రామదేవత 'ప్రాచీన సంస్కృత సాహిత్యమున స్థిరతగన్న దేవియొక్క ఉమా, అంబికానామములు ద్రావిడ శబ్దమునకు మాఱురూపములు' అని వక్కాణించి 'హిందూదేశ శక్తియెల్లెడల గ్రామ గ్రామమునను నెలకొనిన జానపదుల మాతృదేవతా (Mother Goddess) లక్షణముల'ను వివరించియున్నారు. వీటినిక్కడ ఉల్లేఖిస్తాను.

'1. ఈయమ భయంకర స్వరూపిణి. చతుర్భుజిగా చిత్రింపబడిన ఈయమ శూల, కపాల, గదా, ఖడ్గహస్త. లంబ జిహ్వికయగు నీమె వికట దంతయు, విస్ఫారితనేత్రయు, కరాళవదనయునై, భయమును కలిగించు చుండును.

2. ఈమెకు బలి జంతు మాంస ఖాదనమున, రక్తపానమున, ఆసవ సేవనమున ప్రీతిమెండు.

3. మానవుడీమెను భక్త్యావేశముకన్న భయవివశత తోడనే కొలువబూనును.

4. తమ్ము మఱచిన జనులను కష్టముల పాల్జేయుటయు, రోగముల బారిబడవేయుటయు నీమెకు ప్రీతి.

---

9. *Ibid, P-1.*

10. *తెలుగు జానపద గేయగాథలు, పుట - 184.*

5. పాలిత జనముపై నీమెకు సంతానబుద్ధి యుండుటచే నీమె జగద్ధాత్రి.

6. భక్తుల కోరికపై నీమె గ్రామములను పరిరక్షించును. చెలరేగిన యంటువ్యాధుల నదుపున బెట్టును. పశువులను, జనులను, పీడనుండి, గ్రహబాధ నుండి, శత్రువులనుండి కాపాడును. ఊరి పొలిమేరల రక్షించును. పంట పొలములను, చెఱువు కట్టలను రక్షించును.

7. ఊరియందు వేపచెట్ల క్రిందను, త్రాచుపుట్టలయందును నెలకొని యుండును. కేవలము నాగరూపమున నీమె జానపదులచే నర్చింపబడుటయు కలదు'.[11]

డా. నాయని కృష్ణకుమారిగారు పేర్కొన్న లక్షణాల్లో మొదటి లక్షణం కొన్ని గ్రామదేవతలకు అన్వయించదు. గ్రామదేవత ఆకారం విగ్రహరూపంలో వుండాలనే నియమం సర్వత్ర కన్పడదు. ఆమె ఒక చిన్నరాయి లేదా బొడ్డురాయి రూపంలోనైనా వుండవచ్చు. ఆ రాతికి నూనెను అంటించి, పసుపు కుంకుమల బొట్లు పెడతారు. తక్కిన తల్లిదేవతా లక్షణాలన్నీ సంపూర్ణంగా గ్రామదేవతలకు అన్వయిస్తానటంలో సందేహం లేదు. అట్లని గ్రామదేవతలు విగ్రహరూపాల్లోనూ లేక పోలేదు. విగ్రహరూపంలో ఉండే గ్రామదేవతలకు మొదటి లక్షణం వర్తిస్తుంది.

కనుక ప్రాచీన ఆదిమ మానవుడు ఆరాధించిన శక్తిదేవత లేక తల్లిదేవతే నేటి గ్రామదేవత. ఆ దేవతపేరనే తమ సంతానానికి పేర్లు పెట్టడం కూడా అనూచానంగా వర్తిస్తున్నది. ఉదా: ఎల్లమ్మ, మల్లమ్మ, మారమ్మ మొదలయినవారు. ప్రతి గ్రామంలోను ఆ గ్రామానికి చెందిన దేవతను ఆరాధించడం పరిపాటి. అంతేకాక ఆ దేవత పేరుతో ఉత్సవాలు, జాత్రలు (పరుష) చేయటం నేటికీ ఉంది. ఇలా చేయటం వల్ల ఆ గ్రామంలో అంటురోగాలు ప్రవేశింపవని జానపదుల నమ్మకం. దేవత భక్తునిలో ఆవహించి (పూనకం) జరుగబోయే మంచి చెడులను చెప్పటం కూడా కద్దు. దీన్నే దేవుడు ఒంటిమీద కొచ్చినాడు అని అంటారు. 'దయ్యం పట్టినవాళ్ళు' కూడా గ్రామదేవతను ఆరాధిస్తారు.

గ్రామాన్ని అధిష్ఠించిన దేవత గ్రామదేవత. సాధారణంగా గ్రామదేవతలకు ఆలయాలు ఊరి పొలిమేరల్లోనే ఉంటాయి. గ్రామదేవత ప్రభావం నుంచి ఎవ్వరూ తప్పించుకోలేరన్న దృఢవిశ్వాసం జానపదుల్లో నిలద్రొక్కుకొని వుంది. కనుకనే

---

11. *Ibid, P-191.*

గ్రామంలో మంచి జరుగవలెనన్నా, అపాయం నుంచి తప్పించుకోవలెనన్నా మ్రొక్కుబళ్ళను చెల్లించుకోవటం ఒక సంప్రదాయమైంది జంతుబలుల నివ్వటం సర్వసాధారణమైంది

సాధారణంగా ఈ పశుబలిని నవరాత్రుల్లో చండికాదేవికి అర్పించెడి వారట దేవీభాగవతం ఈ పశుబలిని సమర్థించినట్లుగా డా పుష్పేంద్రకుమార్ నుడివి యున్నారు "The Devi Bhagavata says that this is not Himsa and it Justifies the killing of the animal if they are offered to the goddess by saying that they will go to heaven and no sin will be incurred to the killer' ఈ పశుబలి మాంసభక్షకులకు మాత్రమే పరిమితమైనట్లు ఈ పురాణం పేర్కొన్నట్లుగా వీరే పేర్కొన్నారు [12] కాళికాపురాణం ఏ ఏ జంతువుల్ని బలులుగా ఈయవచ్చునో కూడా పేర్కొన్నది అవి పక్షులు, తాబేళ్ళు, మొసళ్ళు, చేపలు, ఎనుబోతులు, ఎద్దులు, మేకపోతులు, అడవి పందులు, ఖడ్గమృగాలు, జింకలు, ఉడుములు, సింహాలు, పులులు మొదలయినవి అంతేకాక మనిషి రక్తాన్ని దేవతకు సమర్పించవచ్చునట సాధారణంగా ఆడజాతికి చెందిన జంతువుల్ని బలిగావించడం మినహాయింపబడింది కానీ లెక్కలేనన్ని జంతువుల్ని ఒకే సమయంలో బలియిచ్చే సందర్భంలో ఆడ, మగ తారతమ్యం చెప్పబడలేదని కాళికా పురాణం పేర్కొందట [13]

సాధారణంగా గ్రామదేవతల్ని పూజించేవారు అబ్రాహ్మణులుగా వుంటారు కాని తంజావూరుకు మూడుమైళ్ళ దూరంలో ఉన్న మరియమ్మ దేవాలయంలో బ్రాహ్మణ పూజారులున్నారనీ, జంతుబలి Central shrine లో నిషేధింపబడిందనీ Henry whitehead వివరించి యున్నాడు [14]

---

12 *Sakti cult in Ancent India, P-202*

13 *Ibid, P-202*

14 *'About three miles from Tanjore, too, there is a temple of Mariamma served by Brahman priests But no animal sacrifices are offered at central shrine where Brahmans minister In one corner of the temple area there is a separate shrine with an image of Mariamma where animals are regularly sacrificed, but at this shrine no Brahmans officiate I believe that it is the only temple shrine of Mariamma in south India where there are Brahman Priests' - The village gods of South India, P-19*

ఇక ఆంధ్రదేశంలోని గ్రామదేవతల్లో కొందరు: మారమ్మ, మల్లమ్మ, ఎల్లమ్మ, సుంకులమ్మ, పోలేరమ్మ, కొల్హాపురమ్మ, దుర్గమ్మ, చౌడమ్మ, పెద్దమ్మ, చిన్నమ్మ, పోచమ్మ, అక్కమ్మ, అంకమ్మ, అంకాలమ్మ, డొక్కలమ్మ, ముత్యాలమ్మ, చిన్నింటమ్మ, చల్లాలమ్మ, ఘంటాలమ్మ, గంగమ్మ, పోలమ్మ, నూకాలమ్మ, యాపారమ్మ, మామిళ్ళమ్మ, మైసమ్మ, ఈదెమ్మ మొదలైనవారు.

కర్నాటక రాష్ట్రంలోని బెంగుళూరులో ప్లేగమ్మ దేవాలయం త్యాగరాజనగర్, (2వ బ్లాకు)లో ఉంది. ఇట్టి దేవాలయాలు బహుశః దేశంలో ప్లేగువ్యాధి వ్యాపించినప్పుడు బయలుదేరి ఉండవచ్చు. గ్రామదేవతల పేర్లతో వీధులు కూడ నెలకొని వున్నాయి. ఉదాహరణకు బెంగుళూరులోనే ఒక వీధికి (లాల్‌బాగ్ సమీపాన) 'గ్రామదేవతారస్తె' (గ్రామదేవత మార్గం) అనే పేరుంది. దీన్ని బట్టి గమనిస్తే గ్రామదేవత ప్రాధాన్యం విదితమవుతుంది.

ఎల్లమ్మే రేణుక. రేణుక తలలేని విగ్రహమనే అభిప్రాయం కూడ వుంది. ఈమె మారెమ్మ, మాహురమ్మగాను పిలవబడుతోంది. ఈమెను 'అక్కిలిదేవి' అనికూడ పిలుస్తారట. పొలిమేరను రక్షించే దేవత 'పోలేరమ్మ'గా పిలవబడుతోంది. మశూచి దేవత 'పెద్దమ్మ'గాను, కలరా మొదలైన అంటురోగాల దేవత 'అంకమ్మ'గాను ప్రసిద్ధులు.

ఈ గ్రామదేవతల పూజా విధానాల్లోను, ఆచార వ్యవహారాల్లోను ప్రాంతీయ భేదాలు కన్పడుతున్నాయి. ఇందులో ఏకసూత్రత (Uniformity) అత్యల్పం. కాని మొత్తం మీద దక్షిణ భారతదేశంలో గ్రామదేవతారాధనల్లో కొన్ని పద్ధతులు, ఆచారాలు, ఉత్సవాలు ఇంచుమించు ఒకే రీతిలో కన్పిస్తున్నాయనీ కనుక ఇవన్నీ ఒకే 'common system' మరియు 'common origin' కలిగినట్లుగా Henry Whitehead అభిప్రాయపడ్డాడు.[15]

గ్రామదేవతలను జానపదులు ఒక మూఢవిశ్వాసంతోనే ఆరాధిస్తారు. తమకు కలుగబోయే వ్యాధులేకాక, పశువులకు వచ్చే రోగాలు కూడా నయమవుతాయనే విశ్వాసం నేటికీ జానపదుల్లో నాటుకొని వుంది. గ్రామదేవతల్ని ఆరాధించటంవల్ల వర్షాలు సకాలంలో పడతాయనీ, పంటలు బాగా పండుతాయనీ అంటారు. గ్రామసంరక్షణ భారం గ్రామదేవతదే అనే విశ్వాసం పాదుకొని వుంది.

*15. Ibid, P-140.*

బహుశః ప్రాచీనకాలంలో వైద్య సౌకర్యాలు లేకపోవడంచేత జానపదులు సంపూర్ణంగా గ్రామదేవతల్ని నమ్ముకొని వుండినారని నిర్ధరింపవచ్చు.

ఇంతకుముందే పేర్కొన్నట్లు సాధారణంగా జానపదులు విగ్రహానికి బదులుగా ఏదైనా ఒక రాయిని దేవతగా భావించి, ఆ రాతిని తూర్పుముఖంగా వుంచి, మూడు ప్రక్కల పెద్ద పెద్ద బండల్ని పాతి, బండలతోనే పై కప్పు వేస్తారు. ఈ గుళ్ళను సాధారణంగా వేపచెట్టు క్రింద నిర్మిస్తారు. కొన్ని గ్రామాల్లో పెద్ద పెద్ద గుళ్ళుంటాయి. ధ్వజస్తంభాలు సైతం ఉంటాయి. ఈ గుళ్ళలోని దేవతలు విగ్రహ రూపంలో వుంటారు. సాధారణ దేవతలకులాగే వీరిని కూడ వేష భూషణములతో అలంకరిస్తారు. ఎరుపు, పసుపు, ఆకుపచ్చరంగు చీరల్ని ధరింపచేస్తారు.

కొని గ్రామదేవతల నిక్కడ ప్రస్తావిస్తాను[16]. అనంతపురం జిల్లాలోని కదిరికి ఎనిమిది మైళ్ళ దూరంలో 'ఎర్రదొడ్డి' అనే గ్రామం వుంది. ఇచ్చట నెలకొన్న దేవత గంగమ్మ. ఈమెను 'ఎర్రదొడ్డి గంగమ్మ' అని పిలుస్తారు. వీరి భావనలో ఈమె ఒక శక్తిదేవత. ఈమెకు ఏటేటా తిరునాళ్ళు (పరష) జరుగుతుంది. ఆది, గురువారాల్లో ఈ దేవతను పూజించి పశువును బలి యిస్తారు. (కోడిపుంజు, పొట్టేలు, ఎనుబోతు, మేకపోతు). ఇక్కడ బలినివ్వడంలో ప్రధానమైన కారణం ఒకటి వుంది. మనుష్యులకు వచ్చునట్లే పశువులకు కూడా 'అమ్మవారు' వస్తుంది. దీన్నే 'గంగమ్మయ్యింది' లేక 'అమ్మయ్యింది' అని అంటారు. ఇలా జరిగితే పశువులు మేతను ముట్టుకోక 'జొల్లు' కార్చటం మొదలుపెడతాయి. ఇట్లే కొంతకాలం నిర్లక్ష్యం చేస్తే కాలిగిట్టలు ఊడిపోయి పూర్తిగా నడవలేని స్థితికి వస్తాయి. గిట్టలు మధ్యభాగంలో పురుగులు పడతాయి. దీన్నే 'చెత్తలు' పడ్డాయంటారు. ఈ చెత్తలు పడకుండటానికి ఆ దేవతకు పశుబలి నిస్తామని మ్రొక్కుకుంటారు. దూరప్రాంతంనుంచి ఎర్రదొడ్డి గ్రామానికి వచ్చే ప్రజలు 'పానకం హండాల' (గంగాళం)ను ఉంచుకొని, దాంట్లో వేపాకు వేసుకొని పోతారు. బండివెంట బలిపశువును తీసుకొని పోతారు. గంగమ్మ గుడిని సమీపించిన పిమ్మట తాము తెచ్చిన పానకాన్ని అందరికీ యిస్తారు. పిదప వెంట తీసుకొని పోయిన పశువును గంగమ్మకు బలియిస్తారు.

---

16. ఈ విషయ సేకరణలో తోడ్పడిన ప్రియమిత్రులు శ్రీ ఎన్. రామలింగారెడ్డి, ముద్దమ్మగూడు పల్లి, కదిరి తాలూకా, అనంతపురం జిల్లా.

ఆమడగూరు (కదిరి తాలూకా)లో చౌడమ్మకు ఏటేటా (మార్చి మాసంలో) ఉత్సవం జరుగుతుంది. ఈ ఉత్సవాన్ని 'జ్యోతి' అని పిలుస్తారు. ఇది 12 రోజులు జరుగుతుంది. పరిసర గ్రామప్రజలు ఈ పండ్రెండు రోజులూ వంతులువారీగా ఈ ఉత్సవాన్ని జరుపుతారు. 'జొన్న బువ్వ'ను ధ్వజస్తంభం దగ్గరకు తీసికొనిపోయి అక్కడ ఉంచుతారు. పిమ్మట గుడి వెలుపల దున్నపోతును బలి యిస్తారు. ఆ రక్తాన్ని, వేపాకును, జొన్నబువ్వతో కలిపి, తమతమ ఇండ్లకు తీసుకొని పోయి, ఇంటి నాలుగు మూలల్లోను, పశువులమీదను, పంటపొలాల మీదను చల్లుతారు. ఇలా చల్లటం వల్ల రాబోయే సంవత్సం వరకు ఆ గ్రామంలో ఎలాంటి అరిష్టాలు కలగవట.

కదిరికి 25 మైళ్ళ దూరంలో మద్దెమ్మ గూడు పల్లె వుంది. ఇక్కడ ఒక చిన్న గుడి వుంది. చుట్టూ మూడు బండలు, పైకప్పు, లోపల ఒక చిన్న కోల ముఖంలాంటి రాయి - ఇది గుడికి, గుడిలోని దేవతకు సంబంధించిన ఆకారాలు. ఈ దేవతపేరు మారమ్మ. ఈ గుడి ఊరి వెలుపల ఒక బావి దగ్గర వేపచెట్టు క్రింద నిర్మించబడి ఉంది. ఉగాది పండుగనాడు ఈమెకు సేవలు చేస్తారు. దీన్నివారు 'జోతులు, బాణాలు పట్టడ' మని అంటారు. ఊరి పెద్దలంతా సభ చేసి మారెమ్మకు 'జోతులు బాణాలు' పడతామని నిర్ణయించుకొని హరిజనులకు తెలియజేస్తారు. ఆ హరిజనులు ఊరి ముందు మామిడాకులు, వేపాకులు కలిపి తోరణం కడతారు. ఇలా కట్టడంవల్ల ఆ ఊర్లో 'జోతులు బాణాలు' పడతారనే విషయం గ్రామప్రజలందరికి తెలుస్తుంది. అంతేకాక 'దండోర' కూడా వేయిస్తారు. ఈ తతంగమంతా జోతులు బాణాలు పట్టేరోజు ఉదయమే జరుగుతుంది. పిమ్మట సాయంకాలం నాలుగు గంటల ప్రాంతంలో తక్కిన తతంగం ఆరంభమవుతుంది. ఆ గ్రామంలో ఏ కులం వారైనా సరే, 'Seniority' ఉన్నవాని యింటికి హరిజనులు తప్పెట్లు, మేళాలతో పోతారు. చాకలివారు 'పాంజు' (దివిటీ) పట్టుకొంటారు. చీరలు పరుస్తారు.

ఇంటింటా బెల్లం, బియ్యం కలిపి కుండలో చేసిన బువ్వను 'బాణంబువ్వ' అంటారు. ఒక పెద్ద గిన్నెలో బాణం బువ్వ కుండ నుంచి దాంట్లో కొబ్బరికాయ, అగరువత్తి, ఒక చిన్న గిన్నెలో ఆముదం, వత్తి, పసుపు కుంకుమ బరిణెల నుంచుకొని స్త్రీలు బయలు దేరటానికి సిద్ధంగా వుంటారు. కొందరు తమవెంట క్రొత్త బట్టల్ని తీసుకొని వెళతారు. ఇక ఊరేగింపు Seniority గల పెద్ద మనిషి

యింటినుంచి బయలు దేరుతుంది. మార్గమధ్యంలో 'బాణంబువ్వ' గిన్నెను పట్టుకొని సిద్ధంగా ఉన్నవారు వారిని అనుసరిస్తారు. అందరూ కలసి గుడి చెంతకు వెళ్ళి తమతో పాటు తీసుకొని పోయిన వాటిని గుడి ముందుంచుతారు. ఆవు పేడతో గుడి ముందు భాగాన్ని అలుకుతారు. తాము తెచ్చిన గిన్నెల్ని అలికిన ప్రదేశంలో ఉంచుతారు. ఆముదపు వత్తుల్ని దీపస్తంభంలో వేసి వెలిగిస్తారు. అలాగే అగరువత్తుల్ని వెలిగించి, పసుపు కుంకుమతో మారెమ్మను పూజిస్తారు. పసుపు అంటించిన నూలు దారాన్ని (పోగుదారం) దేవతకు వేస్తారు. గ్రామ ప్రజలు తాము తీసుకొని పోయిన ఒక్కొక్క బాణంబువ్వ కుండలోనుంచి కొంచెం బువ్వను తీసి దేవతముందుంచుతారు. కొబ్బరికాయల్ని కొడతారు. దీంతో ఈ తతంగం సమాప్తమవుతుంది. ఇంటికి తిరిగి పోయే సయమంలో బాణంబువ్వను భిక్షుకులకు ప్రసాదంగా ఇస్తారు. స్త్రీలు వెళ్ళిన తరువాత దేవతలకు మొక్కుబడి ఉన్న పురుషులు, తాము తెచ్చిన బలి పశువులను బలి యిస్తారు. ఇంతకు ముందే చెప్పినట్లు గ్రామానికి జరగబోయే అరిష్టాన్ని తొలగించుకోటానికి ఇలాంటి బలులునిస్తారు. ఇది తరతరాలుగా వస్తున్న సంప్రదాయం.

ఉగాది పండుగ శనివారంనాడు వస్తే ఆ రోజు జ్యోతులు బాణాలు పట్టక మరుసటినాడు (ఆదివారం) జరుపుతారు. దీనికి కారణం శనివారంనాడు గ్రామ ప్రజలు మాంసం తినరట. ప్రతియేటా ఉగాదినాడే కాక, వర్షాలు రాని సందర్భాల్లోను, ఏదైనా ఉపద్రవం సంభవిస్తుందనే సమయాల్లోను, కలరా, అమ్మవారు మొదలైన అంటురోగాల నివారణ కొరకూ ఇలాంటి ఉత్సవాన్ని జరుపుతారు. ఆమధ్య 'స్కైలాబ్' గండం నుంచి తప్పించుకోటానికై ఈ గ్రామవాసులు జోతులు బాణెలు పట్టారట. మొక్కుబడి వుండేవారు ఎప్పుడు కావలసివస్తే అప్పుడు ఈ గ్రామదేవతకు బలులనిస్తారు.

సాధారణంగా ప్రతిగ్రామంలోను వెలసిన దేవత 'పెద్దమ్మ'. ఆది, గురువారాలు తప్ప తక్కిన రోజుల్లో ఈమెకు ఉత్సవాలు జరుగుతుంటాయి. ఈమెకు 'దేవరపోతు' (ఎనుబోతు)ను బలి యిస్తారు. బలి యివ్వటానికి ముందు దాని శరీరానికి పసుపుపూసి వేపాకుల హారం వేస్తారు. కొమ్ములకు కూడా వేపాకు కడతారు. తప్పెట్లతో దేవరపోతును ఊరేగిస్తారు. సామాన్యంగా ఊరేగింపులోను, దాని మెడను కత్తిరించటంలోను హరిజనులే ప్రాధాన్యం వహిస్తారు. నిమ్మకాయలను కోసి పైకి విసిరివేస్తారు. ఇది బలికి సంకేతం కావచ్చును. నిమ్మకాయలను కోసి పైకి

విసరివేయటంలో వుండే ఉద్దేశాన్ని 'The idea is that the greedy demons will clutch at the golden limes and carry them off, and so be diverted from any attack on the man (who carries the image).'[17] పెద్దమ్మవారు (అంటురోగం) కలుగటానికి కారణాన్ని వారే ఇలా తెలిపారు. 'The epidemic is a sign that she is angry and requirs to be propitiated'[18]

సాధారణంగా గ్రామాల్లో పొలంగట్లపైనా, చెరువుగట్లపైనా అధికంగా చిన్న చిన్న గంగమ్మగుళ్ళు కన్పిస్తాయి. ఇలా గంగమ్మ ( చిన్న చిన్న బోడ్డురాళ్ళ వంటివి) నుంచటంవల్ల పంటలు బాగా పండుతాయనీ, ఆమె పంటల్ని రక్షిస్తుందనీ జానపదుల ప్రగాఢ విశ్వాసం.

ఏమైనా గ్రామదేవత పేరు చెప్పగానే జానపదుల్లో భయభక్తులు తొణికిస లాడుతుండటం నేటికీ గమనింపవచ్చు. ఇట్టి గ్రామదేవతల్ని గురించిన సమగ్ర పరిశోధన ఎంతైనా అవసరం.

* * *

---

*17. The Village Gods of South India, P-49.*
*18. Ibid, P-49.*

# 18. జానపదుల పండుగలు, జాతరలు, ఉత్సవాలు
## (Folk Fairs and Festivals)

Festival and celebrations గురించి folklore folklife లో ఇలా చెప్పబడింది. 'Most, if not all of the socieites of the world periodically set aside portions of time for celebration. There are moments of special significance to the group or community. They may be moments of transition, from one season to another or from one stage of life to another.... These recurring moments of special significance, with the celebrations that fill them, are called festivals....'[1]

మన సంస్కృతిలో పండుగలు, జాతరలు, ఉత్సవాలు, ఆచారాలు ప్రముఖ పాత్రని వహిస్తాయి. నాగరికత పెరుగుతున్న కొద్దీ పండుగల పరమార్థం మారిపోతోంది. ఆకాశాన్నంటుతున్న ధరలు, మన ఆలోచనా ధోరణి, వీటికి తోడు సన్నగిల్లుతున్న భక్తి శ్రద్ధలు పండుగ అంటే ఏమిటో, పండగలని చేయాల్సిన అవసరమేమిటో తెలియని స్థితికి తెచ్చిపెట్టాయి.

హిందూ సంస్కృతిలో లెక్కలేనన్ని పండుగలు - పబ్బాలు ఉన్నాయి. చైత్రం మొదలుకొని ఫాల్గుణం దాకా తెలుగు నెలలలో చేసే పండుగలకు తోడు ఉత్సవాలు, జాతరలు, పరసలు ముస్లింలకు చెందిన ఉరుసులు అనేకం ఉన్నాయి. జాతరలు, ఉత్సవాల సందర్భంగా ప్రదర్శించే జానపద కళారూపాలు పండగల్ని ఇంకా చైతన్య వంతంగా వుంచుతున్నాయి. ఉరకలు వేసే ఉత్సాహాన్ని, ఆవేశాన్ని కల్గిస్తుండడం వల్లనే ఇప్పటికీ ఇవి నిలద్రొక్కుకో గలిగాయి. ఇవన్నీ ధార్మిక ఆచరణలకు సంబంధించినవి. సాంఘిక జానపద ఆచారాల్లో వీటికి విశిష్టమైన స్థానం వుంది.

ఆంధ్రదేశంలో అనేక ప్రాంతాల్లో జాతరలు, పండుగలు, ఉత్సవాలు, తిరునాళ్ళు, పరసలు, తీర్థాలు, కొలుపులు జరుగుతున్నాయి. చిత్తూరు జిల్లాలో గంగ జాతరలు, 'ద్రవపుదీదేవీ' ఉత్సవాలు (పుత్తూరు ప్రాంతంలో), ధర్మరాజు

---

1. *Folklore and Folklife by Richard M. Donson, P-159.*

ఉత్సవం (శ్రీ కాళహస్తి పాపానాయుడుపేట, పుత్తూరు ప్రాంతాల్లో) ఆదిలాబాద్‌లో నాగోబా జాతర, వరంగల్ జిల్లాలోని మేడారం సమ్మక్క, సారమ్మల జాతర, అనంతపురం జిల్లాలో ఎల్లమ్మ, చౌడమ్మ ఇత్యాది జాతరలు ప్రజలని ఆకర్షించే జాతరలలో కొన్ని.

అనంతపురం జిల్లాలో ప్రధానమైన జాతరలు, పండుగలు, ఉత్సావాలను గురించి వివరించడానికి ముందు పండుగ, జాతర, ఉత్సవం, పరస, కొలుపు, తీర్థం, తిరునాళ్ళు మొదలైన పదాల అర్థ వివరణ గావించడం సమంజసమని పిస్తుంది.

## పండుగ:

ఆర్.ఎస్. బాగ్స్ పండుగని నిర్వచిస్తూ ''సాంఘిక సంక్షేమం కోసం విశేష సందర్భాల్లో జానపద విశేషాలు, సంప్రదాయాల కలబోతగా ఆచరించే సంక్లిష్టమైన అంశమే పండగ''[2] అన్నాడు.

'పర్వం శబ్దం నుంచి 'పబ్బం' 'పండగ' అనే రూపాలు సిద్ధించాయి. పండుగలు ఒక నిర్దిష్ట కాలానికి సంబంధించిన ఆచరణలుగా చెప్పవచ్చు. పర్వం అంటే కాలవిభజన, పర్వకాలంలోని ఆచరణే పండుగ. ప్రతి సంవత్సరం విశేష సందర్భాల్లో జనసంక్షేమం కోసం ఏర్పడ్డ ఆచరణ, సంప్రదాయమే పండగ. పర్వం తద్భవరూపం పబ్బం అనీ, పబ్బానికీ పండుగకీ వ్యత్యాసం కన్పిస్తుందన్న అభిప్రాయం వుంది.

పండుగని సమాజంలో వున్నవాళ్ళందరూ ఆచరించినప్పటికీ అది ముఖ్యంగా ఇంట్లోవాళ్ళందరూ ఆచరించేది. జాతరకూ, పండుగకూ అవినాభావ సంబంధం ఉంది. ఒక్కోమారు రెండింటికి వ్యత్యాసాన్ని గుర్తించడం సాధ్యం కాదు. అనేకుల దృష్టిలో జాతర కూడా ఒక పండుగే. అయితే జాతర సమయంలో పండుగ వుంటుంది కానీ అన్ని పండుగ సందర్భాల్లోను జాతర జరగదు. జాతర ప్రయాణాన్ని సూచిస్తే, పండుగ ఇంట్లో వుండి ఆచరించేది. జాతర సామూహికంగా నిర్వహించేది. పండుగలో నూతన వస్త్రాలు, పిండివంటలు

2. *Folklore and Folklife.*

ముఖ్యమైతే జాతరలో వేడుకలు, వినోదాలు ఆచారాలకి ప్రాధాన్యం వుండి కంటికి పండుగలాగ వుంటుంది.

భక్తుడు భగవంతుడితో పెంచుకున్న అనుబంధం, ఆత్మీయత వైయక్తికంగానూ, సార్వత్రికంగానూ ప్రకటించే సాంస్కృతిక సాధనం పండుగ. అందువల్లే దేవుడికీ, పండుగకీ అన్యోన్య సంబంధం కన్పిస్తుంది. పండుగల్ని ఆచరించడం వల్ల దేవుడిమీద భక్తిశ్రద్ధలు జీవంతమై వుంటాయి. పండుగ లేకుండా దేవుడు వుండొచ్చు కానీ, దేవుడు లేందే పండుగ లేనేలేదని చెప్పొచ్చు.

## జాతర:

పుణ్యక్షేత్రాలకి యాత్ర చెయ్యడం క్రమంగా జాతరగా వ్యాప్తిలోకి వచ్చి ఉంటుంది. 'యానేన త్రాయత ఇతియాత్రా' - పుణ్యక్షేత్రానికి వెళ్ళడం మూలంగా రక్షిస్తుంది లేదా పుణ్యక్షేత్రానికి వెళ్ళేవాళ్ళ రక్షయే యాత్ర. యాత్రాశబ్ద తద్భవ రూపం జాత్ర. జాత్ర క్రమంగా జాతరగా రూపం ధరించింది.

ప్రతి సంవత్సరం ఒక నిర్దిష్టకాలంలో, ఒక ప్రత్యేక స్థలంలో వేడుక నిమిత్తంగాను, వ్యాపార సంబంధంగానూ జరిగే ఒక సాంఘికాచరణ జాతర. జాతరలో జనసందడి అధికంగా, ప్రజలు క్రిక్కిరిసి వుంటారు. అందువల్లే ఏదైనా ఒక పెద్దగుంపు లేదా జనసందోహం క్రిక్కిరిసినట్టుంటే 'అదేదో జాతరలా వుంది' అని అంటాం.

మానవుడు తన వికాస దశలో అవలంబించిన ఆచార వ్యవహారాలు, పద్ధతులు, కట్టుబాట్లు మతానికి దారితీశాయి. తనకు తెలియని అదృశ్యశక్తులు తన్ను ఆడిస్తున్నాయన్న భావన అతడిలో కలిగింది. రాయిరప్పల్లో దైవత్వాన్ని చూడడం మొదలుపెట్టాడు.

సంవత్సరమంతా పొలంపనుల్లో సతమతమవుతూ విసిగి వేసారిన కష్టజీవులకి ఆ బ్రతుకునుంచి కాస్త విశ్రాంతి అవసరమైంది. అందువల్లే పండుగలు, పబ్బాలు, ఉత్సవాలు, జాతరలు, ఆటలు, వినోదాలు మొదలైనవి వాళ్ళ పాలిటికి ఆనందాన్నిచ్చే సామూహిక ఆచరణలయ్యాయి.

ఆంగ్లభాషలో 'జాతర' కు సమానార్థక పదం ఫేర్ (FAIR). ఇది లాటిన్ భాషలోని 'Feriae' అనే పదం నుంచి వచ్చిందంటారు. 'Feriae' అంటే పండుగ

భోజనదినం లేదా సెలవురోజు. అలాగే జాతరను సూచించే జర్మన్ భాషాపదం 'Messe' దైవప్రార్థనా సమావేశాన్ని ఇది సూచిస్తుంది.

సంస్కృతంలోని 'యాత్రా' శబ్దానికీ, దీని అపభ్రంశ రూపమైన 'జాతర' శబ్దానికీ అర్థంలో కొంత వ్యత్యాసం కన్పిస్తుంది. ఈ రెండూ భిన్నార్థాల్లో ప్రయోగించబడ్డాయనిపిస్తుంది. ఒక ప్రాంతం నుంచి దూరంగా వున్న పురాణ ప్రసిద్ధమైన పుణ్యక్షేత్రానికి ఇష్టదేవతా సందర్శనార్థం భక్తులు వెళ్ళడం యాత్ర అవుతే దేవాలయాన్ని కేంద్రంగా పెట్టుకొని ఏదేని ఒక నిర్దిష్టకాలంలో ప్రజలు గుమికూడడాన్ని 'జాతర' అనవచ్చు. సంవత్సరం పొడుగునా 'యాత్ర'కు ప్రజలు బయల్దేరి వెళ్తారు. అయితే 'జాతర' సంవత్సరానికోసారి మాత్రమే జరుగుతుంది.

జానపదులు నిర్దిష్టకాలంలో తమ బంధుమిత్రాదులతో కాలక్షేపం చేస్తూ, వినోద కార్యక్రమాలని వీక్షిస్తూ, పూజాపురస్కారాల్లో పాల్గొంటూ, ఉత్సాహ ఉల్లాసాలను ఇనుమడింప చేసుకోవడానికి తమకుతాము అవకాశం కల్పించుకునే ప్రత్యేక పరిసరమే జాతరగా రూఢిలోకి వచ్చింది.

జనులకి కావలసిన వస్తువులు, తినుబండారాలను ఒదిగించే అంగళ్ళు, వినోదం కోసం ఏర్పాటు చేయబడ్డ సర్కసులు, రంగులరాట్నాలు, సంచార చలన చిత్రమందిరాలు, జానపద కళల్ని ప్రదర్శించే కళారూపాలు, బయలాటలు, వీధి నాటకాలు, కుస్తీ పోటీలు ఈ సమయంలో ప్రత్యక్షమవుతాయి.

జాతరలు సాధారణంగా ఆయా ప్రాంతాల్లో జరిగే స్థలం పేర్తోనో, లేదా ఆ ప్రాంతంలో దైవం పేరుతోనో జరుగుతాయి. పశువుల జాతరలు కూడ జానపదాల్లో ప్రసిద్ధి చెందాయి. తమకు కావలసిన పశువుల్ని కొనడం, అమ్మడం ఈ జాతరల వైశిష్ట్యం.

సాధారణంగా జాతరలు వేసవి కాలంలోను, పంటకోతల తర్వాత జరగడం వల్ల ధాన్యం, పప్పుదినుసులు, వేరుశెనగ మొదలైన వ్యవసాయోత్పత్తుల అమ్మకాలను ఒక సదవకాశంగా ఈ సమయంలో వినియోగించుకొంటారు. అందువల్ల ఈ జాతరలు జానపదుల ముఖ్య వ్యాపార కేంద్రాలుగాను కన్పిస్తాయి.

సాధారణంగా జనవరి, మే నెలల మధ్యకాలంలో జాతరలు, ఉత్సవాలు జరుగుతాయి. దానికి కారణాలను డా॥ టి. నారాయణ ఈ విధంగా పేర్కొన్నారు.

'1. గ్రామీణుల పంట మార్పిడి కార్యక్రమం జనవరి నెలకు ముగుస్తుంది. పంటలు బాగా పండినందుకు కృతజ్ఞతాపూర్వకంగా ఈ కాలంలో జాతరలు, ఉత్సవాలు చేస్తారు. 2. ఫిబ్రవరి నెలనుండి వేసవి ప్రారంభం కావడంతో, నీటి కాలుష్యం వల్ల అంటు వ్యాధులు ఎక్కువగా ప్రబలుతాయి. అంటువ్యాధులనుండి తమను, తమ పశుసంపదను రక్షించవుని కోరుతూ మొక్కుబళ్ళు చేసుకుంటారు. మొక్కుబళ్ళు తీర్చేందుకు వేసవి తగిన సమయమని భావించి జాతరలు చేస్తారు. 3. వేసవిలో గ్రామీణులకు సామాన్యంగా పొలం పనులు ఎక్కువగా వుండవు. అందువల్ల తీరికవేళల్లో ఆధ్యాత్మిక చింతనవైపు, వేడుకలవైపు ఆసక్తి కనబరుస్తారు. 4. అంతేగాక జూన్ నుండి పొలం పనులు తిరిగి ప్రారంభం కావడంవల్ల, పంటల నుంచి దిగుబడి నియ్యాలని కోరుతూ సృజనాత్మకత దేవత అయిన శక్తి దేవతను ప్రార్థిస్తూ జాతరలు, ఉత్సవాలు చేస్తారు[3]. అనంతపురం జిల్లాలో కూడ సామాన్యంగా జనవరి - మే నెలల మధ్యకాలంలోనే జాతరలు, ఉత్సవాలు జరుగుతుండడాన్ని గమనించవచ్చు.

జాతర పలుసంప్రదాయాలను, ఆచరణలను, నిషేధాలను లోగొన్న ఒక సంకీర్ణ వ్యవస్థ. జాతరల సమయంలో ఆ ప్రాంత గ్రామదేవతారాధన, ఊరేగింపు, ఉత్సవం జరుగుతుంది. దేవుడి ఊరేగింపు జాతరలోని ప్రత్యేకత. ఉత్సవ మూర్తిని పల్లకీలో కానీ తేరు లేదా రథం మీదకానీ ఉంచి ఊరేగిస్తారు. తేరునులాగే పగ్గాలను పురుషులు పట్టి ఈడ్చడం ఆనవాయితి. తేరుమీద అరటిపళ్ళను విసరడం సంప్రదాయం. తేరును శరీరానికి ప్రతీకగా భావిస్తారు.

జాతరలు మతదృష్టితో ఏర్పడ్డవే అయినా వీటిలో సామాజిక, సాంస్కృతిక దృక్పథం కన్పిస్తుంది. జాతర మూలకంగా జనులందరూ ఒకచోట గుమికూడతారు. ఆప్తుల, బంధుమిత్రుల సమాగమం ఏర్పడుతుంది. వార్తా ప్రసారాలు లేని నాటి కాలంలో జాతరలు వార్తాప్రసార మాధ్యమాలుగా ఉండేవనడంలో సందేహం లేదు. ఒక ప్రదేశంలోని పలురకాల భాషలు, జాతులు, కులాలు, సామాజిక అంతస్తు కలిగిన ప్రజా సముదాయాన్ని ఒక చోట చేర్చి వాళ్ళలో ఆస్తిక్య భావాన్ని పెంపొందించే సాంస్కృతిక, సామాజిక క్రియగా జాతర రూపొందింది. ఐకమత్యం, సమైక్యతా భావం జాతరలవల్ల వృద్ధి చెందుతాయి.

---

*3. చిత్తూరుజిల్లా గ్రామదేవతలు- ఒక అధ్యయనం (అముద్రిత సిద్ధాంత వ్యాసం) పుట- 232.*

Functions of Festival గురించి చర్చిస్తూ Robert Jerome Smith ఇలా వివరించాడు. 'The Central function of the festival seems to be to give occasion for men to rejoice together-to intereact in an ambience of acceptance and conciviality in the case of general participation festival, the festival is often the only occasion in which the members of a community come together. On this occasion, they interact, the interaction is satisfying, therefore likely to be repeated. The satisfaction creates a bond between the participants; they have had the pleasure in each other's company. They identify with each other; in a general participation festival the individual relater to, and identifies himself with the community. Thus the festival is a prime devile for promoting social cohesion, for integrating individuals into a society or gorup -'[4]

పరస్పర అవగాహనకీ, సమాజ పురోభివృద్ధికీ, సాంస్కృతికమైన స్ఫూర్తికీ పండుగలు, ఉత్సవాలు, జాతరలు ప్రధానమైన పాత్రని వహిస్తాయనడంలో సందేహం లేదు. ఇవి అంతరించకుండా కాపాడుకొనే భారం మనది.

సంఘంలో ఒక సభ్యుడిగా ఉంటూ ఆ సంఘ సభ్యుల క్షేమం కోసం, తాను పెంచుకొంటున్న పశు సంక్షేమం కోసం, రోగాలు రొచ్చులబారి నుండి తప్పించుకోవడం కోసం, సకాలంలో వర్షాలు పడి పంటలు బాగా పండాలనే ఉద్దేశంతోను ఈ జాతరలను మనవాళ్ళు ప్రాచీన కాలంనుంచీ ఆచరణ రూపంలో పెట్టుకొన్నట్లు భావించవచ్చు. జానపద విశిష్ట దేవతలకు సంబంధించిన జాతరలు ఆయా ప్రాంతాలకు సంబంధించిన వైశిష్ట్యంతో జరుగుతుండడాన్ని మనం గమనించవచ్చు.

ఇలాంటి ఉద్దేశాలతో జరుగుతున్న జాతర సమయాల్లో మోసాలు, దొంగతనాలకు తక్కువ లేదు. ఇస్పేటు, జూదం మొదలైన వ్యసనాలకు జాతర ఒక కేంద్రంగా ఉంటుంది. అలాగే వేశ్యావృత్తి కూడా విచ్చలవిడిగా విహరిస్తుంటుంది. చిలకజోస్యం చెప్పేవాళ్ళు అమాయకుల నుంచి డబ్బు లాగడానికి ప్రయత్నిస్తుంటారు. పండుగల్లో కన్పించే శుచి, శుభ్రత జాతర సమయాల్లో కనిపించవు. ఈ సమయాల్లో కలరా మొదలైన అంటువ్యాధులు సంక్రమించే ప్రమాదం వుంది. వీటన్నిటినీ తట్టుకుంటూ జాతరలు నేటికీ

---

4. *Folklore and Folklife, P-167.*

జనపదాల్లో జరుగుతూ ఉండడం చూస్తే మన సాంఘికాచారాలనూ, సంస్కృతినీ నిలుపుకోవాలనే తపన జానపదుల్లో ఉన్నట్లు స్పష్టమవుతుంది.

## ఉత్సవం:

డా॥ టి నారాయణ జాతరలు - ఉత్సవాలను గురించి చర్చిస్తూ ''ఒక గ్రామానికి సంబంధించిన ప్రజలుగానీ, కొన్ని గ్రామాలకు సంబంధించిన ప్రజలు గానీ నిర్ణీత సమయంలో, నిర్ణీత ప్రదేశంలో గ్రామదేవతను ఆరాధించడాన్ని 'జాతర' అని అంటారు. ఈ సందర్భంగా వేడుకలు, ఆరాధనకు సంబంధించిన అంశాలు (ప్రార్థన, ఆత్మహింస, పవిత్రీకరణ, బలి) ఇందులో కూడుకొని ఉంటాయి. జాతర పూర్తిగా శక్తిదేవతారాధనాంశాలతో కూడుకొని ఉంటుంది. గ్రామదేవతల జాతరలో శిష్టదేవతారాధన పద్ధతులు ఏ విధంగానూ కనిపించవు. అయితే పురాణాలనుండి, శిష్టసాహిత్యం నుండి గ్రహింపబడిన గ్రామదేవత ఆరాధనా సమయంలో గ్రామదేవతల పూజా పద్ధతులు, శిష్ట దేవతల పూజా పద్ధతులు కలగలసి కన్పిస్తాయి. దీనిని ఉత్సవం అని అంటారు. ఉదాహరణకు గ్రామ దేవతలైన గంగమ్మ, పోలేరమ్మ జాతరలలో 'గరగ'ను నిలపబడం, ప్రార్థన, బలి మొదలైన అంశాలు చోటు చేసుకొని ఉంటాయి. అయితే పూరాణాల నుండి గ్రహింపబడిన గ్రామదేవతల ఉత్సవ సందర్భంగా గరగ, ధ్వజస్థంభ ఆరోహణ, అవరోహణ, గజవాహనం, గరుడ వాహనం, శేష వాహనం, ఏకాంతసేవ, రథోత్సవం, బలి, అగ్నిగుండం మొదలై అంశాలు కూడుకొని ఉంటాయి. ఇందులో అశ్వవాహనం, శేష వాహనం మొదలైనవి శిష్ట దేవతల ఆరాధన పద్ధతులు. అంతేకాక పురాణాల నుండి గ్రహింపబడిన గ్రామ దేవతల ఉత్సవ సమయంలో ఉత్సవ విగ్రహం ఊరేగింపబడుతుంది''[5] జాతరలను, ఉత్సవాలను సూక్ష్మదృష్టితో పరిశీలిస్తే పై అభిప్రాయాలతో పూర్తిగా ఏకీభవింపవచ్చును. ఉత్సవ సందర్భంగా వాహనాలమీద జరిగే గ్రామదేవతారాధన విషయంలో జంతుబలులకు ప్రాధాన్యం లేదు. వీటిలో శిష్ట దేవతల ఆరాధనా పద్ధతులు కన్పిస్తాయి.

## తిరునాళ్ళు:

గ్రామ దేవతారాధన లేదా క్షుద్ర దేవతారాధన సమయంలో జరిగే ఉత్సవ సంబంధమైన క్రియ జాతరగాను, శిష్ట దేవతలకి సంబంధించిన ఉత్సవాలను

5. చిత్తూరుజిల్లా గ్రామదేవతలు - 2 T అధ్యయనం, పుట- 233.

తిరునాళ్ళుగాను వ్యవహరించవచ్చు. తిరునాళ్ళే 'తిర్నాలు' గా కూడ వ్యవహారంలో ఉంది. అయితే రాయలసీమ ప్రాంతంలో జాతర్లనే తిరునాళ్ళని కూడ అంటారు. ఉదాహరణానికి గంగ తిరునాళ్ళు, కోటప్పకొండ తిరునాళ్ళు ఇత్యాది.

## తీర్థాలు:

యాత్రలు చేస్తూ పుణ్యం కోసం స్నానం చేసే నది తీర్థం అనబడుతుంది. నిర్దిష్టమైన రోజుల్లో ఆ స్థలాల్లో చేసే ఉత్సవాల్ని తీర్థాలు అంటారు. ఉదాహరణానికి అంతర్వేది తీర్థం, కుక్కుటేశ్వర స్వామి తీర్థం ఇత్యాది.

## పరస:

అమ్మవారి జాతరకి 'పరస' అని పలు ప్రాంతాల్లో వాడుకలో ఉంది. పరస ఒక విధంగా సంతలాంటిది. సంతలో అన్ని రకాలైన వస్తువులమ్మినట్టుగానే పరసలో జానపదులకు కావలసిన అన్ని వస్తువులు, తినుబండారాలు అమ్మబడతాయి.

పశువులకు సంబంధించిన పరస కూడ జరుగుతుంది. ఇక్కడ పశువుల అమ్మకానికి ప్రాధాన్యం ఉంటుంది. ఉదా: ఎద్దుల పరస.

అనంతపురం జిల్లాలో పరష, పరుష అనే మాటలు వాడుకలో ఉన్నాయి. బహుశా కన్నడ ప్రభావానికి ఈ పదం లోనైందని చెప్పవచ్చు. కన్నడంలో 'పరిషె', 'పర్షె' అన్న పదాలు వాడుకలో ఉన్నాయి. 'పరిషత్' అన్న సంస్కృత పదం నుంచి 'పరిషె', 'పర్షె' అన్న రూపాలు ఏర్పడినట్టు అభిప్రాయం వుంది. అనంతపురం జిల్లాలో జాతరని పరసగా వ్యవహరించడం ఉంది. ఉదాహరణానికి గుడబండప్ప పరస. ఈ జిల్లాలోని కుందుర్పి మండలంలో మలయనూరు గ్రామానికి సమీపంలో వడ్డెపాళ్యం అన్న గ్రామం ఉంది. అక్కడనెలకొన్న గుడిబండ ఆంజనేయ స్వామి పేరు మీదుగా ఈ పరస జరుగుతుంది. ప్రతి సంవత్సరం ఫాల్గుణ మాసంలో మూడు రోజులపాటు ఈ పరస జరుగుతుంది. బీదలకు అన్నదానం జరుగుతుంది.

## కొలుపులు:

జనపదాల్లో 'కొలుపులు' అన్న పదం వినవస్తుంది. ''ఒక గ్రామంలోని ప్రధాన గ్రామ దేవతను ఆ గ్రామంలోని ప్రజలే ఆరాధించడాన్ని 'కొలుపులు' అని

అంటారు. కొన్నిసార్లు ఇతర గ్రామస్థులు కూడ ఆ దేవతను పూజించవచ్చు. అయితే కొలుపుల సందర్భంగా జరిగే వేడుకలలో ఇతర గ్రామస్థులు పాల్గొనరు. కొలుపులలో గ్రామ దేవతల జాతర, ఉత్సవ పద్ధతులు కలగలసి కన్పిస్తాయి''[6]

## రథోత్సవాలు ఇత్యాది:

శిష్టదేవతలకు సంబంధించినట్లుగా రథోత్సవాలు, తెప్పోత్సవాలు, తెప్ప తిరునాళ్ళు, తేరు లాగడం మొదలైనవి నిర్ణీత కాలాల్లో జరుగుతున్నాయి. వీటికి తిథి, వార, నక్షత్రాలు ప్రాధాన్యం వహిస్తాయి. ఈ ఆరాధనోత్సవాల్లో కూడ జానపదులు పాల్గొంటారు.

## ఉరుసు:

హిందువులకు సంబంధించిన పండగలకు, జాతరలకు తోడు ముస్లింలకు సంబంధించిన ఆరాధనోత్సవం 'ఉరుసు'[7] కూడ ఈ జిల్లాలలో జరుపబడు తుంది. ఇందులో హిందువులు కూడ విశేషంగా పాల్గొంటారు. ఉదాహరణ: అనంతపురం జిల్లా పెనుకొండలో జరిగే బాబయ్య ఉరుసు, రాయదుర్గం మండలంలోని హొన్నూరులో జరిగే హొన్నూరుస్వామి ఉరుసు ఇత్యాది.

పండుగలు, జాతరలు, ఉత్సవాలు మొదలైన ఆచరణల్లో వేడుకలు, వినోదాలకు అధిక ప్రాధాన్యం ఉంది. ఈ సందర్భాల్లో జానపద కళారూపాలు ప్రదర్శింపబడతాయి. తోలుబొమ్మలాటలు, బయలాటలు, వీధి నాటకాలకు ప్రాధాన్యం కనిపిస్తుంది.

అనంతపురం జిల్లాలో అనేక జానపద కళారూపాలు ప్రచారంలో ఉన్నాయి. వీటిని వివరించడానికి ముందు ఈ జిల్లాలో బాగా ప్రసిద్ధంగా ఉన్న పండుగలని, జాతరలని, ఉరుసులని కొన్నింటిని మాత్రం విశదీకరిస్తాను.

అనంతపురం జిల్లాలో ఆచరించే కొన్ని పండుగల్ని పరిచయం చేస్తాను.

---

6 చిత్తూరుజిల్లా గ్రామదేవతలు - ఒక అధ్యయనం, పుట- 234.

7. ముస్లింల మతస్థావరాలు మసీదులు, దర్గాలు. ముస్లింల ఆరాధనా మందిరాలు మసీదులవుతే, ఆయా ప్రాంతాలకు చెందిన ముస్లిం భక్తుల సమాధులు దర్గాలనబడతాయి. దర్గాల వద్ద ఏడాదికోసారి ఉత్సవం చేస్తారు. దీన్నే ఉరుసు అంటారు.

## ఉగాది:

ఇది సంవత్సరాది పండుగ. హిందూ సంవత్సరంలోని మొదటిరోజును ఉగాది పండుగగా ఆచరిస్తాము. పండుగల్లో ఇది మొదటిది. చైత్రశుద్ధ పాడ్యమినాడు ఉగాది పండగని ఆచరిస్తారు. ఇది యుగాది.

కుటుంబ సభ్యులంతా తలంటు పోసుకొని, కొత్త బట్టల్ని ధరించి, దేవుడికి నమస్కరించి, ఉగాది పచ్చడి (వేపపూత, లేత మామిడికాయల ముక్కలు, బెల్లం ఇత్యాదిని కలిపి తయారుచేస్తారు) తిని బాధల్ని మరచి ఉత్సాహంతో, ఉల్లాసంతో ఆచరించే పండుగ ఉగాది. 'బేవు బెల్ల తిందు ఒళ్ళే మాతాడు' అని కన్నడంలో వ్యవహారం. అంటే వేపపూత, బెల్లం తిని మంచిమాట మాట్లాడు అని అర్థం. ముఖ్యంగా ఈ పండుగరోజు ప్రజలు ఒకరికొకరు శుభాశయాలు చెప్పుకొంటారు.

పంచాంగ శ్రవణం ఉగాది నాటి ప్రధాన కార్యక్రమం అని చెప్పవచ్చు. ఊళ్ళో దేవాలయాల్లోనో, 'రచ్చకట్ట' లేదా 'రచ్చబండల' మీదనో పంచాంగ శ్రవణం జరుగుతుంది. కొత్త పంచాంగాన్ని పూజించి చదువుతారు. ఉగాది పండుగనాడు జరిగే శుభాశుభాలు ఆ సంత్సరమంతా ఉంటాయన్న విశ్వాసం ఉంది. అందువల్లే ఆ రోజు అందరూ హాయిగా, సంతోషంగా ఉండడానికే ప్రయత్నిస్తారు.

ఉగాది పండుగ మరుసటిరోజు 'పారువేట'ని ఆచరించే సంప్రదాయం ఉంది.

## మొలక పున్నమ/మలకల పున్నమ:

ఏడిదికోసారి వైశాఖమాసంలో రైతులు 'మొలక పున్నమ' లేదా 'మలకల పున్నమ' పండగని ఆచరిస్తారు. ఇదే 'ఏరువాక పున్నమ' అని కొన్ని ప్రాంతాల్లో వ్యవహారంలో ఉంది.

మలకల పున్నమ అనంతపురం జిల్లాలోని కదిరి ప్రాంతాల్లో ఎక్కువ ఆచరణలో వుంది. ఈ ఏరువాక పౌర్ణమినుంచే రైతులు పొలం పనులమీద ఎక్కువ శ్రద్ధను చూపిస్తారు. ఈ పున్నమ నుంచీ విత్తనాలు వేసేదాకా ఉన్న కాలాన్ని 'ముంగారు' అంటారు.

ఈ పౌర్ణిమను కదిరి ప్రాంతంలో బాలికలు అతి వేడుకగా జరుపుకొంటారు. పౌర్ణిమి ఐదురోజుల ముందే మొలక (నారు) పోస్తారు. వడ్లు, గోధుమలు, రాగులు, ఉలవలు మొదలైన ధాన్యాలతో మొలకలు పోస్తారు. పున్నమ నాటికి ఈ మొలకలు బాగా పెరగడం ఆరంభిస్తాయి. పున్నమిరోజు సాయంత్రం సుమారు ఏడు గంటల ప్రాంతంలో ఆ ఊళ్ళో ఉన్న ఆడపిల్లలు (సుమారు పదహారేళ్ళ లోపువాళ్ళు) ఏపుగా పెరిగిన మొలకల్ని తీసుకుని ఆ ఊళ్ళోని దేవాలయానికీ, బొడ్డెమ్మ దగ్గరకీ, మంచినీళ్ళ బావుల దగ్గరికీ వెళ్ళి పాటలు పాడుతూ పూజలు సల్పుతారు. ఊరి బయట వున్న అక్కమ్మ, మారమ్మ మొదలైన దేవతల దగ్గరికి మొలక పోసిన కుండల నుంచుతారు. మరుసటి రోజు ఈ బాలికలు సమీపంలో ఉన్న పల్లెలకు పోయి 'మొలక నేములు' (మొలక నోములు) అనే నెపంతో ఇంటింటికీ వెళ్ళి పాటలు పాడి ధన ధాన్యాలని సంపాదిస్తారు అలా సంపాదించిన వాటితో ఊరి వెలుపల వున్న బావి దగ్గర చేరి వంటలు ప్రారంభించి 'సంతర్పణ' చేస్తారు. ఇదొక వేడుక.

గ్రామాలని తిరిగే బాలికలు తమ వెంట 'మొలక చెంబులు' తీసుకొని వెళ్తారు. ఇందులో మొలకల్ని వేస్తారు. ఈ చెంబులు సాధారణంగా రాగివి కానీ, ఇత్తడివి కానీ అయివుండి ఆకారంలో చిన్నవిగాను, చూడడానికి అందంగాను వుండి అందర్నీ ఆకర్షిస్తాయి.

ఆడపిల్లలు పల్లెలు తిరుగుతూ నాల్గైదు రోజులు పాటలు పాడతారు. వీటిని మొలక పాటలంటారు. ఈ పాటలు రెండే రెండు చరణాలను కలిగిన ముక్తకాలు లాంటివి. ప్రతి పాటకూ 'కోలు కోలన్న సిలవరాయి మేలు మేలన్న' అనేది ఊతపదం. మచ్చుకో పాటలోని రెండు చరణాలు.

**'మిద్దెమీద మిరపచెట్టు వానలేక వాడిపోయె**
**మామగారి ఆడబిడ్డలు మొగుడులేక పారిపోయిరి'**

## మహాలయ అమావాస్య (పెద్దల పండుగ):

మహాలయ పక్షమంటే భాద్రపద బహుళ పక్షం. దీని చివరి అమావాస్య మహాలయ అమావాస్య. ఈ పక్షంలో పితృదేవతలకి తర్పణ శ్రాద్ధాలు వదలుతారు. అందుకే దీన్ని పితృపక్షమని అంటారు. ఈ పక్షంలో అన్ని కులాలవాళ్ళు తమ పెద్దలు మరణించిన తిథుల్ని బట్టి తర్పణ, శ్రాద్ధకర్మలు నిర్వహిస్తారు.

బ్రాహ్మణులు మంత్ర పూర్వకంగా తర్పణలు వదులుతారు. బ్రాహ్మణేతరుల్లో మంత్రాలకు ప్రాధాన్యం లేదు.

మహాలయ అమావాస్యకే 'పితాళ్ళ అమాస', 'పెతర్ల అమాస' అనే మాటలు వాడుకలో ఉన్నాయి. అంటే 'పితరుల అమాస'. ఇదే 'పెద్దల అమాస' గాను, 'పెద్దల పండగ'గాను అనంతపురం మండలంలో వ్యవహారంలో వుంది. ఈ రోజు కొంతమంది మాంసంతోను, మరి కొంతమంది భక్ష్యాలతోను పండుగ చేసుకొంటారు.

## కామన్న పండగ:

కామ దహనాన్నే కామన్న పండగ అంటారు. ఇది మూడు రోజులపాటు ఫాల్గుణ శుద్ధ త్రయోదశి నుండి పౌర్ణమి దాకా (ఫిబ్రవరి - మార్చి) జరుగుతుంది. ఈ పండుగని కాముని పండగ అనీ, హోళీ పండుగ అనీ, వసంతోత్సవమనీ అంటారు.

'కామన్న పున్నమ' అనీ కొన్ని ప్రాంతల్లో వాడుక. అయితే అనంతపురం జిల్లాలో 'కామన్న పండగ' అనే వ్యవహారం. ఈ జిల్లాలో దాదాపు అన్ని ప్రాంతాల్లోను ఈ పండగని ఆచరిస్తారు.

ఫాల్గుణ పౌర్ణమినాటి రాత్రి వీధుల్లో కాముని బొమ్మని తయారుచేసి, నాలుగు రోడ్లు కలిసిన కూడలి ప్రదేశాల్లో ఆ బొమ్మని వుంచి, దానిమీద పిడుకలు, కట్టెలు మొదలైన వాటిని వేసి కాల్చడం జరుగుతుంది. అది కాలుతుంటే గుమిగూడిన జనులు హాహాకారాలు చేస్తూ నోరు కొట్టుకోవడం కన్పిస్తుంది. కాలిన బూడిదని ఇళ్ళ కప్పులమీదా, పొలాల్లో చల్లుతారు. దీనివల్ల పురుగూ పుట్రా చచ్చి పంటలు బాగా పండుతాయన్న విశ్వాసం వుంది.

కన్నడ దేశంలోను ఈ పండుగని 'కామన హుణ్ణిమె' (కాముని పున్నమ), 'కామన హబ్బ' (కామన్న పండుగ) అని వ్యవహరిస్తారు.

ఈ పండుగ సందర్భంగా వసంతాలు చల్లుకోవడం, రంగులు పూసుకోవడం ఒక సరదా.

పైన పేర్కొన్న పండుగలే కాకుండా శ్రీరామ నవమి (చైత్రశుద్ధ నవమి, మార్చి-ఏప్రిల్), నాగుల చవితి (శ్రావణశుద్ధ చవితి, జూలై-ఆగస్టు), శ్రీకృష్ణ జన్మాష్టమి/ శ్రీకృష్ణ జయంతి (శ్రావణ బహుళ అష్టమి, జూలై-ఆగస్టు), వినాయక చవితి (భాద్రపద మాసం, ఆగస్టు-సెప్టెంబరు), (ఈ పండుగనే 'బెణకప్ప పండుగ' అని కూడా అంటారు). గౌరమ్మ పండుగ (భాద్రపద మాసం, ఆగస్టు-సెప్టెంబరు), దసరా (ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి నుండి దశమి వరకు, సెప్టెంబరు - అక్టోబరు), దీపావళి/నరక చతుర్దశి (ఆశ్వయుజ బహుళ చతుర్దశి, నవంబరు), సుబ్రహ్మణ్య షష్ఠి (మార్గశిర మాసం, నవంబరు-డిసెంబరు), సంక్రాంతి - మొదటిరోజు భోగి, రెండోరోజు సంక్రాంతి, మూడోరోజు కనుమ పండుగ (కనుమ పండుగనే కొన్ని ప్రాంతాల్లో పశువుల పండుగ అంటారు), మహాశివరాత్రి (మాఘమాసం, జనవరి-ఫిబ్రవరి) ఇత్యాది పండుగల్ని వైభవంగా జరుపుకొంటారు. స్థలాభావంవల్ల వీటిని వివరించటం జరుగలేదు.

అనంతపురం జిల్లాలోని ఒకటి, రెండు ప్రసిద్ధ జాతరలని వివరిస్తాను. జానపద మతం - గ్రామదేవతలు ప్రకరణంలో గ్రామదేవత ఆరాధనా విధానాన్ని, ఉత్సవ (జాతర) విశేషాలను వివరించడం జరిగింది.

## ఎల్లమ్మ జాతర:

ఎల్లమ్మ జానపదుల ఆరాధ్య దేవత. ఎల్లమ్మ గుళ్ళు సాధారణంగా అన్ని గ్రామాల్లోను కనిపిస్తాయి. ఈమెని 'పొలిమేర దేవత' అంటారు. మలయనూరుకు సమీపంలో ఉన్న నాగప్పల్లి గ్రామంలో వున్న ఎల్లమ్మ ఉద్భవమూర్తి. ఊరి పొలిమేరలో పుట్టచెంత వెలసి ఉంది. చెట్టు పుట్టలచెంత ఎల్లమ్మ గుడులుంటాయన డానికి ఇది ఉదాహరణ.

ఎల్లమ్మ పొలిమేరల్లోనే కాకుండా గ్రామ మధ్యంలోను నెలకొని వుంది. మలయనూరుకు సమీపంలో వున్న శీగలపల్లి గ్రామంలో ఈమె ఆలయం ఊరి మధ్య వుంది. ఈమె విగ్రహం బంగారు, వెండి, రాగి, కంచు మిశ్రమంతో చేయబడి వుంది. ఈమెను 'రేణుకెల్లమ్మ' అని పిలుస్తారు. ఎల్లమ్మయే రేణుక. జానపదులు రెండింటిని చేర్చి రేణుకెల్లమ్మ అని ద్వంద్వ సమాసం చేశారు. రేణుకకు మరో పేరు ఏకవీర.

రేణుకెల్లమ్మ కథ లేదా రేణుకా పరశురాముల గేయకథను 'జమిళిక' వాయిస్తూ బవనీండ్లు పాడుతారు. ఎల్లమ్మ పూజలను ఈ కులపు స్త్రీలు నిర్వహిస్తారు. వీళ్ళలో కొందరు 'ఊరబసవు'లు కూడా వుంటారు.

ఏడాదికోమారు జానపదులు ఎల్లమ్మ జాతర చేసికొంటారు. ఊరికి మారి తగిలినప్పుడు, ఎల్లమ్మ పూజలు చేస్తారు. ఈమె ఆరాధనకు ముఖ్యంగా తంగెడు పూలు, వేపమండలు, నిమ్మ ఆకులు, నిమ్మపండ్లు శ్రేష్ఠం.

ఎల్లమ్మకు సంబంధించిన ఆలయాలు అనంతపురం జిల్లాలో అనేకం ఉన్నాయి.

ఎల్లమ జాతరని అనంతపురానికి 10 కి.మీ. దూరంలో చిలుముకూరు గ్రామంలో చైత్రశుద్ధ విదియ (మార్చి-ఏప్రిల్)నాడు నిర్వహిస్తారు. జంతుబలి వుంది. దగ్గరలో వున్న నదిలో స్నానం చేసి, ఉపవాసం చేసి రాత్రంతా 'జాగారం' (జాగరణ) చేసారు.

## జుంజప్ప జాతర:

కళ్యాణదుర్గం గ్రామానికి మూడు కిలోమీటర్ల దూరంలో కొత్తూరు గ్రామం వుంది. ఇక్కడ 'జుంజప్ప' నెలకొని వున్నాడు. జుంజప్ప కళ్యాణదుర్గం, మడకసిర ప్రాంతాల్లో స్థానిక దేవత.

జుంజప్ప జాతర అక్టోబర్-నవంబర్ మాసాల్లో (కార్తీకమాసం) మూడు రోజులపాటు జరుగుతుంది. బహుశా కర్నాటక సరిహద్దు ప్రాంతాల్లో జరగబడే జుంజప్ప జాతర ప్రభావం ఇక్కడ వున్నట్టు తెలుస్తుంది. ఇక్కడి బోయలు, కురవ కులాల వాళ్ళు తమ పిల్లలకి జుంజప్ప, జుంజమ్మ అనే పేర్లు పెడతారు. గొరవయ్యలు ఈ దేవతని ప్రతినిధిస్తారు. ఈ ఉత్సవంలో పెద్ద సంఖ్యలో పాల్గొని భక్తుల చేత గౌరవింపబడతారు. వీళ్ళు పిల్లంగ్రోవిని ఊదుతూ జనసమూహాన్ని అలరింప చేస్తారు.

జాతర సందర్భంగా అంగళ్ళను ఏర్పాటు చేస్తారు.

• అనంతపురం జిల్లాలో గ్రామదేవతలని, ఆయా గ్రామదేవతల జాతరలని, ఏయే ప్రాంతాల్లో ఏయే మాసాల్లో నిర్వహిస్తారో పేర్కొంటాను.

## ప్రధానమైన గ్రామదేవతలు, జాతరలు:

| గ్రామదేవత పేరు | | జాతర పేరు | స్థలం | కాలం |
|---|---|---|---|---|
| 1. | అక్కమ్మగార్లు | అక్కమ్మగార్ల జాతర | మావిమర్దనహళ్ళి (అనంతపురానికి 30 కి.మీ.) | ఫాల్గుణమాసం (ఫిబ్రవరి - మార్చి) |
| 2. | మారమ్మ | మారమ్మ జాతర | గంగవరం | పుష్యశుద్ధ చతుర్దశి (డిసెంబరు - జనవరి) |
| 3. | మారమ్మ | మారమ్మ జాతర | సెట్టూరు | శ్రావణమాసం (జూలై- ఆగస్టు) |
| 4. | కుందుర్పమ్మ | కుందుర్పమ్మ జాతర | కుందుర్పి | చైత్రశుద్ధ పాడ్యమి (మార్చి- ఏప్రిల్) |
| 5. | కొల్లాపురమ్మ | కొల్లాపురమ్మ జాతర | మరిమాకులపల్లి | ఆశ్వీయుజమాసం (సెప్టెంబరు- అక్టోబరు) |
| 6. | జుంజప్ప | జుంజప్ప | కొత్తూరు జాతర | కార్తీకమాసం (అక్టోబరు-నవంబరు) |
| 7. | పట్టనాడ ఎల్లమ్మ | పట్టనాడ ఎల్లమ్మ జాతర | రాయదుర్గం | భాద్రపదమాసం (ఆగస్టు- సెప్టెంబరు) |
| 8. | ఎల్లమ్మ | ఎల్లమ్మ జాతర | చిలుముకూరు | చైత్రశుద్ధ విదియ, తదియ (మార్చి- ఏప్రిల్) |
| 9. | సుంకులమ్మ | సుంకులమ్మ జాతర | పుట్లూరు | చైత్రశుద్ధ విదియ, తదియ (మార్చి- ఏప్రిల్) |

| గ్రామదేవత పేరు | | జాతర పేరు | స్థలం | కాలం |
|---|---|---|---|---|
| 10. | సుంకులమ్మ | సుంకులమ్మ జాతర | తాడిపత్రి | చైత్రశుద్ధ పాడ్యమి (మార్చి-ఏప్రిల్) |
| 11. | దుర్గమ్మ | దుర్గమ్మ జాతర | ధర్మవరం | వైశాఖశుద్ధ చతుర్దశి (ఏప్రిల్-మే) |
| 12. | గంగమ్మ | గంగమ్మ జాతర | సుబ్బారావు పేట | ఆషాడశుద్ధ ఏకాదశి (జూన్-జూలై) |
| 13. | చౌడేశ్వరీ దేవీ | చౌడేశ్వరీ దేవీ | పెద్దకొట్ల జాతర | కార్తీకమాసం (నవంబరు-డిసెంబరు) |
| 14. | గంగమ్మ | గంగమ్మ జాతర | తలుపుల | వైశాఖమాసం (ఏప్రిల్ - మే) |
| 15. | తిమ్మమ్మ | తిమ్మమ్మ జాతర | గూటిబయలు | మాఘబహుళ చతుర్దశి (ఫిబ్రవరి-మార్చి) |
| 16. | రొద్దక్కమ్మ | రొద్దక్కమ్మ | రొద్దం పండగ | కార్తీకమాసం (అక్టోబరు-నవంబరు) |
| 17. | నిడిమామిడమ్మ | నిడిమామిడమ్మ జాతర | నిడిమామిడి | పన్నెండేళ్ళకోసారి |
| 18. | కొల్లాపురమ్మ | కొల్లాపురమ్మ జాతర | రత్నగిరి | చైత్రపూర్ణిమ నుంచి బహుళ సప్తమి (ఏప్రిల్ - మే) |

పరుసలకు సంబంధించిన వాటిలో 'ఉట్లపరష' విశిష్టంగా కన్పిస్తుంది. ఇందులో 'ఉట్లమానెక్కడం', ఒక జానపద కళారూపం.

## ఉట్లపరష:

అనంతపురం జిల్లాలో 'ఉట్లపరష' చాల ప్రాంతాల్లో నిర్వహించబడుతోంది. ఇది స్థానిక ఉత్సవం లేదా జాతర. ధార్మిక ఆచరణకి సంబంధించింది.

నునుపుగా చెయ్యబడ్డ కొయ్యస్తంభానికి నూనె పదార్థాలను పూస్తారు. దీన్ని 'ఉట్లమాను' అని పిలుస్తారు. దాన్ని ఎక్కడం, క్రిందపడడం చూసేవాళ్ళకి సరదాగా, వేడుకగా వుంటుంది. ఇదొక కళారూపం. అనంతపురం జిల్లాలో అనేక ప్రాంతాల్లో ఈ ప్రదర్శన జాతరలు, ఉత్సవాలు, పరుసల సందర్భాల్లో జరుగుతుంది.

ధర్మవరంలో దుర్గమ్మ జాతర సందర్భంగా 'ఉట్లపరష' జరుగుతుంది. ఇది వైశాఖ శుద్ధ చతుర్దశినాడు అంటే ఏప్రిల్-మే మాసాల్లో జరుగుతుంది. దాదాపు 15-20 గజాలు పొడుగ్గా వున్న, నునుపుగా వున్న స్తంభాన్ని భూమిలో పాతిపెడతారు. ఆ స్తంభానికి నూనె, గ్రీజు మొదలైన జారుడు పదార్థాలని పూస్తారు. కొంతమంది యువకులు ఆ స్థంభం పైభాగం దాకా ఎక్కడానికి ప్రయత్నించి, స్తంభం పై భాగంలో వుంచబడ్డ పారితోషికాన్ని తీసుకోవడానికి ఉత్సుకతని ప్రదర్శిస్తారు. అయితే స్తంభం పై భాగం నుంచి జిడ్డు పదార్థాలని పోస్తుంటారు. ఎక్కడానికి ప్రయత్నించేవాళ్ళు జారిపడడం, మళ్ళీ మళ్ళీ ప్రయత్నించడం, చివరికి ఏ ఒక్కరో ప్రయత్నించి పైకి ఎక్కడం వినోదాన్ని చేకూరుస్తుంది.

ఉట్లపరష సందర్భంగా చిన్న చిన్న అంగళ్ళు ఏర్పడతాయి. పసుపు కుంకుమలు, గాజులు, అద్దాలు, దువ్వెనలు, తినుబండారాలు, కొబ్బరికాయలు, పూలు, పళ్ళు అమ్మబడతాయి. పులివేషం మొదలైన వినోద కార్యక్రమాలు కూడ నిర్వహించబడతాయి.

అనంతపురం జిల్లాలోని పామిడిలో 'ఉట్లమాను పరష' జరుగుతుంది. ఇది ఆషాడశుద్ధ ఏకాదశి మొదలు పౌర్ణమిదాకా ఐదురోజులపాటు (జూన్-జూలై) జరుగుతుంది. పౌర్ణమినాడు స్థానిక దేవత లక్ష్మీనారాయణస్వామి ఊరేగింపు జరుగుతుంది.

పాలు, పెరుగు, అరటిపళ్ళు, బొరుగులు బాగా కలిపి మట్టికుండలో పెడతారు. ఆ కుండని ఊరి మధ్యలో వున్న వేపచెట్టు కొమ్మకి కడతారు. ఈ కుండని పైకి క్రిందకి లాగుతుంటే కొంతమంది దీన్ని పెద్ద వెదురు కర్రలతో (బొంగులతో) కొట్టి ముక్కలు ముక్కలు చేస్తారు. ఇది ప్రేక్షకులకు మంచి వినోదాన్నిస్తుంది. ఈ ఉట్లపరష దాదాపు రెండు శతాబ్దాలుగా జరుగుతూ వున్నట్టు తెలుస్తుంది.

కృష్ణాష్టమినాడు మడకశిరలో ఉట్లపరష వైభవంగా జరుగుతుంది. ఇక్కడ ఉట్లమానెక్కడమనే ప్రదర్శన పై వాటికంటే విలక్షణంగా కన్పిస్తుంది. ఒక పెద్ద వెదురుకర్ర (బొంగు) కు 50 అడుగుల పొడవు - కొన్ని కొబ్బరికాయలు కడతారు. ఆ కొబ్బరికాయల్ని అందుకోవడానికి కర్రనెక్కి ప్రయత్నించేవారి మీద నీళ్ళు, బురద పోస్తారు. వీటిని లెక్కచేయకుండా కర్రనెక్కి కొబ్బరికాయలనందుకొన్న వారికి పారితోషికం ఇవ్వడం జరుగుతుంది. ఉట్లపరుష సందర్భంగా అంగళ్ళు పెడతారు. కావలసిన వస్తువులన్నీ లభిస్తాయి.

ఇలాగే ఆమిదాల గ్రామంలో శ్రీ లక్ష్మీ నారాయణస్వామి ఉత్సవ సందర్భంగా ఆగస్టు-సెప్టెంబరు మాసాల్లో ఉట్లపరష జరుగుతుంది. ఈ సందర్భంగా జరిగే ప్రదర్శన పైన చెప్పిన వాటన్నిటికంటే విలక్షణంగా కన్పిస్తుంది.

వెన్నముద్దల్ని దొంగిలించే శ్రీకృష్ణుని బాల్యక్రీడల్ని ఇది విశదపరుస్తుంది. చెట్టుకొమ్మల్లో తీపి పదార్థాలనీ, తినుబండారాలనీ వుంచుతారు. ఒకరి భుజాల మీద మరొకరు ఎక్కి తినుబండారాలని అందుకోవడం వేడుకగా వుంటుంది.

ఉట్లపరష లాగానే ఆయా స్థానిక దేవతల ఉత్సవాల సందర్భంగా ఆయా దేవతల పేర్లతో పరుసలు జరుగుతాయి. ఇలా పరుసలు సాంఘిక జానపద ఆచారాలుగా వైశిష్ట్యాన్ని పొందాయి. పొందుతున్నాయి.

## జానపదుల ఉత్సవాలను రెండింటిని వివరిస్తాను:

కాయకష్టం చేసే జానపదులు ఒక పండగ అన్నా, ఉత్సవం అన్నా ఎక్కడ లేని సంబరం పడతారు. వాళ్ళ ఉత్సాహానికీ, ఆనందానికీ అవధులు ఉండవు. కల్లా కపటంలేని ప్రేమాభిమానాలు, ఐకమత్యం, సహకారం, జానపదుల వస్తు

సంస్కృతి, ఆచార వ్యవహారాలు, నియమ నిబంధనలు, అలంకరణలు, భాష మొదలైనవి ఇలాంటి ఉత్సవాల్లో స్పష్టంగా కన్పిస్తాయి. దానికి తార్కాణమే 'ఎద్దుల దేవర', 'ఆవుల పబ్బం' అనే జానపద ఉత్సవాలు. ఈ జానపద ఉత్సవాలకూ, శిష్టదేవతోత్సవాలకూ ఏ మాత్రం సంబంధంలేదు.

## ఎద్దుల దేవర:

'ఎద్దుల దేవర'యే ఎద్దుల పండుగ. దీపావళి పండుగ తర్వాత సోమవారం (అమావాస్య తరువాత) నాడు సంవత్సరానికోసారి ఈ ఉత్సవం జరుగుతుంది. ఊరవతల ఫర్లాంగు దూరంలో ఎద్దుల దేవర ఉత్సవం జరుగుతుంది. తంగేడు, 'సీమజాతి', 'కాణిగ' కట్టెలు, పుల్లలు ఒకదానిమీద ఒకటి పేర్చినట్టుగా ఒక చోట వేస్తారు. దీన్ని 'గూడు' అంటారు. ఈ గూడుకు ఎదురుగా కానీ, ప్రక్కన కానీ చెట్టుక్రింద (సాధారణంగా తంగేడు చెట్టు లేదా తుమ్మచెట్టు) కాటమ దేవుణ్ణి ఉంచుతారు. కాటమ రాయుడికి విగ్రహం లేదు. ఆరు లేదా మూడు రాళ్ళను (ఎనిమిది లేదా ఆరు అంగుళాల రాళ్ళు... కోలగా ఉంటాయి) నిలబెడతారు. వీటికి సున్నం రాసి ఎర్రరంగుతో మూడు నామాలు పెడతారు. కాటమ దేవుణ్ణి పూజించి కొబ్బరి కాయ కొడతారు. గూడుకు నిప్పంటించి కాటమ దేవుడిచుట్టూ, గూడు చుట్టూ ఎద్దులను త్రిప్పుతారు (ప్రదక్షిణ చేయిస్తారు). అప్పుడు 'ఉరాలు' (ఉరుము - ఏకవచనం - తప్పెటవంటి వాయిద్యం) వాయిస్తారు. ఎద్దుల నన్నింటినీ త్రిప్పిన తర్వాత ఎద్దులతో పాటు వెనుదిరిగి తమ తమ ఇళ్ళకు వెళ్ళేటప్పుడు 'పటాకీలు' కాలుస్తారు. ఆ రోజు రాత్రి పశువుల మెరవణి (ఊరేగింపు) జరుగుతుంది. పండుగ జరుపుకుంటారు. మరుసటిరోజు గౌరమ్మను చేసి గౌరమ్మ బాలికలు ఊళ్ళో జ్యోతులు పట్టుకొని మెరవణికి వెళ్తారు.

ఎద్దుల దేవరనాడు 'సజ్జముద్ద', గుమ్మడికాయ, పచ్చిమిరప కాయలతో 'కారగాయి' (పల్లెం/కూర), అర్ధశేరు అన్నం చేసిన గిన్నెను అలాగే తీసుకొని గూడు దగ్గరకు వెళ్తారు. ఒక కప్పు పెరుగు, రెండు కొబ్బరికాయలు (ఒకటి కాటమ దేవుడికి, మరొకటి గూడుకు) కూడ వెంట తీసుకొని వెళ్తారు. కాటమదేవుడికి కొబ్బరికాయ కొట్టి తీర్థాన్ని ఎద్దులమీద చల్లుతారు. ఉరాలను కాటమదేవుడికి ఎదురుగా వుంచుతారు. వీటికి ఒక ఆకులో నైవేద్యం (అన్నం, పెరుగు) పెడతారు. అలాగే కాటమ దేవుడికి కూడ ఒక ఆకులో అన్నం పెరుగు నైవేద్యంగా ఉంచుతారు.

ఈ నైవేద్యాన్ని ఉపవాసం వున్న పూజారి (పశువుల కాపరి) భుజిస్తాడు. సజ్జ ముద్దలను, కారగాయిని ఎద్దులు పట్టుకొని వచ్చి త్రిప్పినవాళ్ళకు పంచి పెడతారు.

ఎద్దుల అలంకరణ చూడ ముచ్చటగా ఉంటుంది. ఎద్దు కొమ్ములకు 'గ్గర్లు. కోతంచుల కుచ్చులేసి 'పనకట్లు' (ఫణికట్టు) కడతారు. మెడకు 'గంటలసరం' కడతారు. నుదుటిమీద 'ఆకుపూజ' కడతారు. ముఖానికి 'ముఖవాడం' 'చెండుపూాల'తో కడతారు. నడుంమీద 'జూలు' (రంగు వస్త్రం) కప్పుతారు. కాళ్ళకు చెండుపూాలు, కొమ్ములకు 'గుమ్మటం', గజ్జెలు కడతారు. కొంతమంది కొమ్ములకు బెలూన్లు కడతారు. 'రంగుహస్తం (హస్తం గుర్తు) ఎద్దులమీద కొడతారు.

ఎద్దుల పండగ చేస్తే దీపావళి పండగ చేసినంత ఫలమట. ఎద్దుల దేవర చెయ్యడంవల్ల ఎద్దులకు శాంతి జరిగినట్టుగా విశ్వసిస్తారు. సాయంత్రం 5.30గంటలకు ప్రారంభమైన ఎద్దుల దేవర పండగ తెల్లవారుజామున 2 గంటల వరకు జరుగుతుంది.

ఎద్దుల మెరవణిలో 'ఉరాలు' కొడ్తుంటే గంతులు, కేకలు వేస్తూ పాడతారు. ఈ పదాలన్నీ కన్నడంలో ఉన్నాయి. కొన్నింటిని వివరిస్తాను.

**'ఈడూ* తిరిగిద ఎత్తూ రంగులుస్తా బరుత్తైతే**
**ఊరాగైదాళె హిరియక్క**
**ఊరాగైదాళె హిరియక్కా ఈరమ్మ**
**ఎత్తిగారితి తర్తాళె'**

**అనువాదం:**

**'గూడు తిరిగిన ఎద్దు రంకేస్తూ వస్తోంది**
**ఊళ్ళో ఉన్నది పెద్దక్క**
**ఊళ్ళో ఉన్నది పెద్దక్కా ఈరమ్మా**
**ఎద్దుకు ఆరతీ తెస్తోందీ'**
**పదం కాగానే 'ఓహోహో' అంటూ 'కుణుస్తారు'** (గంతులు వేస్తారు)

---

*ఈడు = గూడు

ఇలాగే మరికొన్ని పదాలు:

**'కొంబీ కోడీ నెత్తు ఎంబత్తు బరుతావె**
**కందానతాయి ఒళగీరో**
**కందానతాయి ఒళగీరో**
**అణ్ణానెత్తు రాజ్యావే నోడి బర్తావె'**

**'లింగాన కుదిరీగె ఉంగురద మైజోడు**
**లింగమల్లయ్యన కుదిరీగె**
**లింగమల్లయ్యన కుదిరీగె బిగదారె**
**నింబె కాయోటు గజమలక'**

ఇలా పదాలు పాడుతూ ఉత్సాహంతో గంతులు వేస్తారు.

ఎద్దుల దేవర మూడురోజులు ఉందనగా యాదవుల (గొల్లలు) తెగలో బహిష్టులు ఇళ్ళల్లో ఉండరాదన్న నియమం వుంది. పండగ అయిన మరునాడు మాత్రమే ఇంటిలోనికి ప్రవేశించాలట. ఇంట్లో 'గోగంజు' (గోమూత్రం) చిముకరించాలట.

ఎద్దుల పండుగ (ఎద్దుల దేవర) కు సంబంధించిన పై వివరాలను నేను శీగల పల్లి, మలయనూరు, వడ్డెపాళ్యం గ్రామాలలో సేకరించాను. ఈ మూడు గ్రామాలు ఈ జిల్లాలోని కుందుర్పి మండలంలో ఉన్నాయి. ఈ మూడు ప్రాంతాలూ కన్నడ భాషా ప్రభావానికి లోనైన ఆంధ్ర, కర్నాటక సరిహద్దు గ్రామాలు. అందువల్లనే ఎద్దుల దేవరనాడు పాడబడే ఈ పదాలన్నీ కన్నడంలోనే ఉన్నాయి.

అనంతపురం జిల్లాలోనే మడకశిరకు పదిమైళ్ళ దూరంలో ఉన్న అమరా పురం గ్రామంలో ఎద్దుల దేవరనే 'దీవిళిగె హబ్బ' (దీపావళి పండగ) అని అంటారు.

## ఆవుల పబ్బం:

'ఆవుల పబ్బం' ఉత్సవం కూడ కాటమరాయుడికి సంబంధించిందే.

**'అర్వై యారూళ్ళు పోయి ఆవులపబ్బం చూడాలి'**
**'తొంభై ఆమళ్ళు పోయి తోలుబొమ్మలు చూడాలి'**
**'నూరామడలు పోయి నూలుపూజ చూడాలి'** అంటారు.

ఆవులపబ్బాన్ని కార్తీకమాసంలో పౌర్ణమికి ముందు మంగళవారం నాడు సంవత్సరానికోసారి ఆచరిస్తారు. ఆవులపబ్బం కూడ ఎద్దులదేవర లాగానే జరుగుతుంది. అయితే 'మెరవణి' (ఊరేగింపులో)లో కాటమ రాయుణ్ణి ఊరేగించడం విశేషం. అనంతపురం జిల్లా కుందుర్పి మండలంలోని శివమజ్జన పల్లెలో నేను సేకరించిన ఆవులపబ్బం వివరాలను మీ ముందుంచుతున్నాను. శివమజ్జన పల్లెలో నూటికి తొంభైపాళ్ళు కన్నడమే మాట్లాడతారు. ఇక్కడి తెలుగు కొంత విలక్షణంగా కన్పిస్తుంది.

ఆవుల పబ్బానికి ముందురోజు సోమవారం రాత్రి పదిగంటలకు ఊళ్ళో ఒక ప్రదేశంలో 'కల్ల' (కంచె) వేసి, 'లక్కి'లాకు, పత్తిఆకు, నేరేడు ఆకులతో 'పది' (పొద) చేస్తారు. ఒక ద్వారం నిర్మించి నాలుగు 'గూటాలు' పాతి, 'టెంకాయ గెర్లు'తో 'చప్రం' వేస్తారు. చప్రం క్రింద బాగా అలికి ముగ్గులు వేసి కాటమరాయుణ్ణి (కాటమ రాయడికి ప్రత్యేకమైన విగ్రహం లేదు). మధ్యలో కూర్చోబెడతారు. ఆ ఊళ్ళో దేవుళ్ళయిన నరసింహస్వామి, గాదిరపాలయ్య (శ్రీకృష్ణుడు), పెద్దక్క రాయమ్మ (ఆదిశక్తి)ల విగ్రహాలను కూడా ఉంచుతారు. 'చప్రం' ఎడమ పక్కలో ఒక ఆవును, దూడను రాత్రంతా కట్టివేస్తారు. మరుసటి రోజు ఉదయమే (మంగళవారం) అవి వేసిన పేడను, ఆవు, దూడ, పులి మాదిరిగా 20 ఆవులు, 20 పెయ్యలు, 20 పులులుగా చేస్తారు. ఆ తర్వాత కలకండ (కండ చక్కెర), ఎండు కొబ్బరి గిన్నెలు ఐదు, బెల్లపు అచ్చులు ఐదు, మూడుసేర్లు బియ్యం నైవేద్యం పెట్టి 'ఆకుపూజ' చేస్తారు.

సాయంత్రం 4 గంటలకు 'గొర్లు' (గొర్రెలు), మేకలు, ఆవులనన్నింటిని 'పద' ముందు నిలపెట్టి 'సాసు' (బియ్యం, సజ్జలు, కలిపినవి) ను వాటిమీద అక్షతలుగా వేస్తారు. కాటమరాయుడికి, ఆవులకు పూజ చేసిన తర్వాత 'పద' చుట్టూ మూడుసార్లు త్రిప్పుతారు. దాని తర్వాత 'అరసేవ' (దాసంగం) చేస్తారు. అంటే వచ్చిన వాళ్ళకు, ఊళ్ళోవాళ్ళకు మూడు 'పల్లాలు' (బస్తాలు) అన్నం తయారు చేయించి, పాలు పెరుగులతో పాటు భోజనం పెడ్తారు. తర్వాత నైవేద్యం అందరికీ పంచుతారు. ఆ తర్వాత ఇంతకుముందు 20 పులులు, 20 ఆవులు, 20 పెయ్యలుగా చేసిన వాటిమీద కంపకట్టి పెద్ద బండ మూస్తారు. (కుక్కలు, నక్కలు వాటిని తొలగించకుండా ఉండడానికి) సాయంత్రం ఆరుగంటలకు ఈ 'ఇగ్రాలు' (విగ్రహాలు)తో పాటు ఊళ్ళోకి మెరవణిగా వెళ్తారు. తెల్లవారుజామున 4 గంటలకు

ఆయా విగ్రహాలను ఆయా ఆలయాలలోనికి తీసుకొని వెళ్ళి యథాస్థానాల్లో ఉంచుతారు. మెరవణిలో కేకలు వేస్తూ గంతులు వేస్తూ ఆనందోత్సాహాలతో గ్రామ ప్రజలు పాల్గొంటారు.

ఆవులపబ్బం కోసమే ఊళ్ళో ఐదారు రోజులకు ముందే పాలు, పెరుగు, నెయ్యి తీసి ఉంచుతారు. ఆవులున్నవాళ్ళు విధిగా పాలు పెరుగు కాటమరాయుడికి ఇవ్వాలన్న నిబంధన వుంది.

పంటలు సమృద్ధిగా పండితే తప్పనిసరిగా సంవత్సరానికో మారు ఆవుల పబ్బం చేస్తారు. పంటలు సరిగా పండక కష్టకాలం అవుతే మూడేళ్ళకోమారు ఆవుల పబ్బం చేస్తారు. ఆవుల పబ్బం చేయడం వల్ల సకాలంలో వర్షాలు బాగా కురుస్తాయనీ, సమృద్ధిగా పంటలు పండుతాయనీ, పాలు, పెరుగు మొదలైనవాటికి కొరత ఉండదనీ జానపదుల ప్రగాఢ విశ్వాసం.

రాయలసీమలో గంగ తిరునాళ్ళ సమయంలో ఆవులకు పొంగళ్ళు పెట్టడం, అలంకరించడం, ఎద్దులతో బరువులులాగే పందేలు వేయడం మొదలైన వేడుకలు జరుగుతూ వుంటాయి. అందువల్లే గంగ జాతరకు ఆవుల పబ్బమనే పేరు వచ్చిందనీ, అయితే ఆవుల పబ్బం వేరు, గంగజాతర వేరు అని రాయలసీమలో పెద్దలు చెప్తున్నారని డా॥ తంగిరాల వెంకట సుబ్బారావు గారు తమ 'కాటమరాజు కథలు', సంపుటం-1 (పుట CCI X Vii)లో పేర్కొన్నారు. ఈ విషయంతో ఏకీభవించవచ్చు. ఆవుల పబ్బం యాదవులకు సంబంధించినది. గంగజాతర అందరికీ సంబంధించినది.

'నేడు రాయలసీమలో ఆవుల పబ్బమన పిలువబడినదే పూర్వకాలమున 'ఆవుల పరుపు'గా వ్యవహరింపబడుచున్నది' (కాటమరాజు కథలు, సంపుటం -1). మల్లంపల్లి సోమశేఖర శర్మగారు 'ఆవుల పరుపు' అంటే 'ఆవులకు సంబంధించిన వేడుకలు జరుగు ప్రదేశము' అనీ, 'పరుపు' శబ్దం తప్పనీ, అది 'పరపు'గా నుండ వలెననీ, అప్పుడు 'పరపు' శబ్దానికి 'ప్రదేశం' అనే అర్థం వస్తుందనీ అభిప్రాయ పడ్డారు.

నాకు చూస్తే 'పరపు' అనే శబ్దానికి 'పారించు' అనే అర్థాన్ని తీసుకుంటే సరిపోతుందనిపిస్తుంది. ఇక్కడ పారించు అనే శబ్దానికి 'పరుగెత్తించు' అనే అర్థం

సమంజసమని తోస్తుంది. ఎంచేతనంటే ఈ అవుల పబ్బం వేడుకలో కాటమ రాయుడికి, ఆవులకు పూజ చేసిన తర్వాత ఆవులను, గొర్రెలను, మేకలను పొదమూట్టూ మూడుసార్లు త్రిప్పుతారు. సాధారణంగా ఆవులు ఇత్యాదులు పొద చుట్టూ నెమ్మదిగా నడువవు. 'పార్తాయి' (పరుగెత్తుతాయి) బహుశా ఈ అర్థంలోనే 'పరపు' శబ్దం ప్రయోగించబడి ఉంటుంది. పరిశీలించాలి.

ఇలా జానపదుల ఉత్సవాలు, పండుగలు, వేడుకలు జానపదుల జీవితంలో విడదీయరాని అంశాలుగా నిలద్రొక్కుకున్నాయి. జానపదులనందర్నీ ఒక చోట చేర్చే శక్తి ఈ ఉత్సవాలు, పండుగలకు ఉన్నాయనడంలో సందేహం లేదు. జానపద సంస్కృతి అంతా ఈ ఉత్సవాల్లో దాగి ఉంటుంది. ఈ సంస్కృతిని నిర్లక్ష్యం చెయ్యక పరిశీలిస్తే ఎన్నో అంశాలు మనకు వెల్లడవుతాయి. మానవశాస్త్రం, సమాజ శాస్త్రం మొదలైన విజ్ఞాన శాస్త్రాలతో ముడిపెట్టుకొన్న ఈ సంస్కృతి మన అందరి సొత్తు.

ఇక రథోత్సవం, తెప్పోత్సవం గురించి వివరిస్తాను. ఇవి సాధారణంగా శిష్టదేవతల ఆరాధనా సమయాల్లో నిర్వహింపబడతాయి.

## శ్రీ చెన్నకేశవస్వామి రథోత్సవము/తెప్పోత్సవము:

శ్రీ చెన్నకేశవ స్వామి రథోత్సవం వైశాఖ శుద్ధ పంచమి మొదలు త్రయోదశి దాకా (ఏప్రిల్-మే) తొమ్మిది రోజులపాటు జరుగుతుంది. సప్తమినాడు ధ్వజారోహణం, అష్టమి మొదలు ద్వాదశిదాకా రాత్రిళ్ళు వివిధ రకాల వాహనాల మీద స్వామి ఊరేగింపు జరుగుతుంది. చివరిరోజు అంటే త్రయోదశినాడు రథోత్సవం ఊళ్ళోవాళ్ళే కాకుండా చుట్టుప్రక్కల ఉన్న గ్రామాల ప్రజలూ ఈ రథోత్సవంలో పాల్గొంటారు. తేరును లాగే సమయంలో అరటిపళ్ళు, 'బత్తాసు' మొదలైన వాటిని తేరుమీద విసరుతారు.

రథోత్సవం సందర్భంగా పరస జరుగుతుంది. వివిధ రకాల వస్తువుల్ని అమ్మే అంగళ్ళు, తినుబండారాలని అమ్మే అంగళ్ళు అనేకం పెట్టబడతాయి.

కార్తీకశుద్ధ ద్వాదశినాడు (అక్టోబరు-నవంబరు) స్వామివారికి తెప్పోత్సవం జరుగుతుంది. స్వామివారి ఉత్సవమూర్తిని చెరువులో తెప్పమీద ఊరేగిస్తారు.

## హొన్నూరు స్వామి ఉరుసు:

హిందూ ముస్లింల ఐక్యతకి దోహదం చేసేవి ఉరుసులు. ఇవి ప్రధానంగా ముస్లింలకి సంబంధించినవే అయినా, హిందువులు అధిక సంఖ్యలో పాల్గొంటారు.

అనంతపురం జిల్లాలో రాయదుర్గానికి 30 కి.మీ. దూరంలో హొన్నూరు గ్రామం వుంది. శ్రీ హొన్నూరు స్వామి పేరుమీదుగా ఈ గ్రామం ఏర్పడింది. హొన్నూరు స్వామి జీవ సమాధి ఇక్కడ ఉంది. హొన్నూరుస్వామి, గోమాతల సమాధులు (tombs), ఒక దర్గా ఇక్కడ ఉన్నాయి.

కార్తీక బహుళ విదియ (నవంబరు-డిసెంబరు) మొదలు నాలుగు రోజుల పాటు హొన్నూరుస్వామి ఉరుసు వైభవంగా జరుగుతుంది. విదియనాడు గంధం పూజ, తదియ, చవితి రోజుల్లో దీపారాధన, పంచమినాడు 'మెరవణి' (ఊరేగింపు) జరుగుతుంది.

ఉరుసునాడు స్వామి ఉపయోగించిన కత్తిని పూలతో అలంకరించి గుర్రం మీద ఊరేగిస్తారు. గంధోత్సవం నాడు గంధాన్ని అందరికీ పంచుతారు. భక్తులు తమ గుర్రాలకి, ఆవులకి, ఎద్దులకి ఆయన పేరుపెట్టి తమ మొక్కుబడుల్ని తీర్చుకోవడం కోసం వదలి పెడతారు. ఉరుసు జరిగిన మర్నాడు మేకల్ని, గొర్రెల్ని స్వామికి బలి యిస్తారు.

దాదాపు రెండు శతాబ్దాలుగా ఈ ఉరుసు జరుగుతోంది. అన్ని మతాలవాళ్ళు, కులాలవాళ్ళు ఉరుసులో పాల్గొంటారు. ముస్లింలు 'ముజావర్లు'గా ఉంటారు.

ఈ దర్గా దగ్గర ఒక 'గవి' చెట్టువుంది. ఈ చెట్టునుంచి చక్కెర పడుతుంది. స్వామి సమాధికి ఉత్తర దిశలో కన్నెరమ్మ బావి ఉంది. ఇందులోని నీళ్ళని త్రాగితే రోగాలు పోతాయనీ, కోరికలు నెరవేరుతాయనీ ఇక్కడివాళ్ళు విశ్వసిస్తారు.

హొన్నూరు స్వామి ఉరుసు రాయదుర్గానికి 20 కిలోమీటర్ల దూరంలో ఉన్న మురడి హనుమాపురంలో కూడ జరుగుతుంది. ఇది చైత్రశుద్ధ పౌర్ణమి (ఏప్రిల్-మే) మొదలు నాలుగు రోజులపాటు జరుగుతుంది.

## బాబయ్య వురుసు:

అనంతపురానికి 60 కి.మీ. దూరంలో పెనుకొండ పట్టణం ఉంది. పెనుకొండ కోటకి తూర్పు దిక్కులో బాబయ్య దర్గా వుంది. దీన్ని టిప్పుసుల్తాన్ కట్టించినట్టు చెప్తారు. ఇక్కడ ఫకీర్ అయిన షరీఫ్ బాబా ఇ ఫక్రుద్దీన్ (బాబయ్య) ఉరుసు అక్టోబరు -నవంబరు మాసాల్లో ఏడు రోజులపాటు జరుగుతుంది. బాబయ్య జ్ఞాపకార్థం ఇది జరుగుతుంది.

బాబయ్య హిందూరాజనీ, ఆయన ఫకీరుగా మారి మక్కా వెళ్ళాడనీ, అక్కడ ఆయనకి తిరుచిరాపల్లి సాధువైన నాథర్‌వలీ ఏదో చిన్న మొక్కనిచ్చి, అది ఎక్కడైతే చిగురు వేస్తుందో అక్కడ స్థిరపడి పొమ్మని చెప్పాడట. బాబయ్య తిరిగి వస్తూ పెనుకొండలోని ఈశ్వరాలయంలో స్థిరపడి, దాన్ని తర్వాత మసీదుగా మార్చాడని అంటారు. బాబయ్య అనేక మహిమల్ని చూపించేవాడట. ఆయన నాటిన చెట్టునుంచి ఇటీవల కాలందాకా చక్కెర పడుతుండేదని అంటారు.

ముస్లింలే కాకుండా హిందువులు కూడ ఈ ఉరుసులో పాల్గొంటారు. దేశం నలుమూలల నుంచీ మహమ్మదీయులు పాల్గొంటారు. పరస జరుగుతుంది. ఈ సందర్భంగా ఖవాలీలు, కుస్తీపోటీలు ఏర్పాటు చేయబడతాయి.

ఉరుసు సమయంలో సిల్కు గుడ్డలు, జరీ లేసులతో అల్లిన వస్త్రాలని సమాధి మీద కప్పడం కోసం చదివిస్తారు. ప్రసాదంగా చక్కెర చదివిస్తారు. మొక్కుబళ్ళని తీర్చడం కోసం డబ్బుని సమర్పిస్తారు. హిందువులు తమ పిల్లలకి బాబయ్య అని పేరు పెట్టడం ఉంది.

ఇలా జానపదుల పండుగలు, జాతరలు, ఉత్సవాలు, పరసలు, ఉరుసులు మన సంస్కృతిలో విడదీయరాని అంశాలుగా జనపదాల్లో నిలద్రొక్కుకొని వున్నాయి.

* * *

# 19. జానపదుల నమ్మకాలు
# (Folk Beliefs)

నమ్మకం అనేమాటకు సరియైన అర్థం చెప్పడం అంత సులభం కాదు. ప్రజాబాహుళ్యంలో తరతరాలుగా నిలద్రొక్కుకున్న విశ్వాసమే నమ్మకం అంటే సరిపోతుందేమో! ఈ నమ్మకం ఏర్పడడానికి ఏదో ఒక కారణం లేదా ప్రేరణ ఉండే ఉంటుంది. బలమైన కారణం లేకుండా కార్యం పుట్టదు. ఉదాహరణానికి మనం రోజూ ముఖం చూసుకునే అద్దం కానీ, ఆడవాళ్ళు నిత్యం ధరించే గాజులు కానీ పగిలిపోతే ఏదో అమంగళం జరుగుతుందన్న విశ్వాసం అనాదిగా మనలో వుంది. పూర్వం ఎప్పుడో, ఎవరికో ఇలాంటి చెడ్డ అనుభవం (అశుభం) కలగడం, అదే పదిమందికి జరగడం - అది సామూహిక ముద్రను వేసుకొని 'నమ్మకం' కావడం జరిగి ఉంటుంది. అన్ని విశ్వాసాలు లేదా నమ్మకాలు చెడ్డవని చెప్పలేం. లేదా మంచివని చెప్పలేం. కొన్ని నమ్మకాలు మంచివి, వైజ్ఞానికాలు అవుతే, మరికొన్ని అవైజ్ఞానికాలు, మూఢవిశ్వాసాలు అవుతాయి.

'విశ్వసించు' అనే అర్థంలో 'నమ్ము' అనే ధాతువు మీద 'అక' అనే కృత్ప్రత్యయం చేరడం వల్ల 'నమ్మకం' (నమ్ము+ అక+ ము) ఏర్పడింది. నమ్మకాన్నే 'విశ్వాసం' అని కూడ అంటున్నాము. నమ్మకాలు సర్వత్రా ఉన్నాయి. ఉత్తర భారతీయులు నమ్మకాన్ని 'విశ్వాస్' అంటున్నారు. కన్నడిగులు 'నంబికె', 'విశ్వాస' అంటున్నారు. నమ్మకానికి సమానార్థకంగా సంస్కృతంలో 'విశ్వాసం', 'విస్రంభః' అనే పదాలు; తమిళంలో 'నంబిక్కై' అనే పదం, మలయాళంలో 'విశ్వాసమ్' అన్న పదం కన్పిస్తాయి. ఉర్దూలో 'భరోసా' అనే మాట విన్పిస్తుంది.

'Belief' అన్న ఆంగ్ల పదానికి సమానార్థకంగా మనలో 'నమ్మకం' అనే పదం వ్యాప్తిలో ఉంది. ఈ మాటకు అనేక అర్థాలు స్ఫురిస్తాయి. సంప్రదాయం (Tradition); పరికల్పన (Concept); తీర్పు (Judgement); అభిప్రాయం(Opinion); అనుమానం(Doubt) అనేవి ముఖ్యమైనవి. ఆంగ్లంలో 'Faith' అనే మరో పదం ఉంది. దీనికి 'విశ్వాసం' అనే అర్థం చెప్పుకోవచ్చు.

నమ్మకం, ఆచరణ, సంప్రదాయం - మనం సాధారణంగా వింటున్న మాటలు. ఈ మూడింటికీ అవినాభావ సంబంధం ఉంది. నమ్మకం ఒక మానసిక

పరికల్పన అవుతే, ఆచరణ దాని క్రియాత్మక రూపం అవుతుంది. ప్రతియొక్క ఆచరణ వెనుక ఏదేని ఒక నమ్మకం లేదా విశ్వాసం దాగి ఉంటుంది. అదే ఆచరణకు వెన్నెముక లాంటిది. ఆ ఆచరణ సమాజంలో స్థిరంగా నిలద్రొక్కుకున్నప్పుడు అదే సంప్రదాయం అనిపించుకుంటుంది. దీన్ని ఈ విధంగా వివరించడానికి వీలుంది. 'మరణించిన వాళ్ళకు తద్దినం పెట్టకపోతే వాళ్ళు దయ్యాలై పీడిస్తా' రనేది ఒక నమ్మకం. ఇది పలు ప్రాంతాలలో విశ్వసింపబడుతోంది. ఈ నమ్మకం - ఒక మానసిక పరికల్పన. తద్దినం పెట్టడం - ఒక ఆచరణ - ఇది క్రియ. మరణించిన వాళ్ళకు తరతరాలుగా తద్దినం పెట్టడం - ఒక సంప్రదాయం. **'An even claborate Custom, also based on folk belief'**[1] అన్న మాటల్ని ఇక్కడ గమనించాలి.

మనిషికి ఆత్మ అనేది ఒకటి ఉందనీ, మనిషి మరణించిన తర్వాత అది ప్రేతాత్మగా మారుతుందనీ ఆదిమ మానవుడు విశ్వసించాడు. ఇదొక మానసిక పరికల్పన. ఈ మానసిక పరికల్పనే పితృ దేవతారాధనకు, మాతృదేవతారాధనకు దారి తీసింది. క్రమంగా మతానికి మనుగడ అయింది. దేవుడు ఉన్నాడనే విశ్వాసం, భయభక్తులు నమ్మకానికి పునాది వేశాయి. ఈ నమ్మకమే మళ్ళీ ఆచరణకీ, సంప్రదాయానికీ దారి తీసింది.

మతాచరణకి సంబంధించిన మరొక నమ్మకాన్ని కూడ ఇక్కడ ఉదహరిస్తాను. మనలో ఆపత్కాలంలో కానీ, మరణ సమయంలో కానీ భగవద్గీతను కానీ, ప్రసిద్ధ పురాణాలను కానీ చదవడం లేదా చదివించడం జరుగుతోంది. అలాగే తీరని కష్టం ఏర్పడినప్పుడు బైబిల్‌లోని ఒక పుటను తెరచి చదివితే కష్ట నివారణ మవుతుందని క్రైస్తవ మతం చెప్తుంది. పితృదేవతలని పూజిస్తే మంచి జరుగుతుందని చైనా దేశంలో నమ్మకం ఉంది. ఇదే విశ్వాసం మనలో కూడ ఉంది.

నమ్మకం, ఆచరణ, సామెత - ఈ మూడింటికి కూడ దగ్గరి సంబంధం ఉంది. ఉదాహరణకి 'కలికితే అతకదు' అనే మాటను తీసుకుందాం. ఇది నమ్మకం, సామెత కూడ. ఈ నమ్మకం ఏర్పడడానికి కారణం 'అనుభవం'. ఈ అనుభవ పూర్వకమైన విశ్వాసం ఎప్పుడో, ఎవరికో ఏర్పడడం వల్లనే అది 'ఆచరణ' లో

---

1. *American Folklore, P-253.*

పెట్టడం జరిగింది. ఈ నమ్మకం అనుభవంలోంచి పుట్టడం జరిగింది కనుకనే అది సామూహిక ముద్రను వేసుకొని 'సామెత' అనిపించుకొంది. అయితే అన్ని నమ్మకాలు సామెతలు కానీ, అన్ని సామెతలు నమ్మకాలు అవుతాయని కాదు. 'అనుభవం' అనేది అటు నమ్మకానికీ, ఆచరణకీ; ఇటు సామెతకీ దారి తీస్తుందని మనం ఊహించడానికి అవకాశం ఉంది.

నమ్మకాన్ని నిర్వచించడం ఎలా? ఈ నిర్వచన విషయంగా పలువురి అభిప్రాయాలను ఉటంకించడం అవసరం.

'Folk belief is often a matter of attitude and a matter of faith'[2] అని అంటాడు Wayland D. Hand

'Belief is the mental state of assurance or conviction, the attitude of a mind towards its own experiences in which it accepts and endorses them, as referring to reality, as having real significance or value'[3] అని A. Mair నిర్వచించాడు.

'Traditionally accepted concept, often of a cause and effect relationship, past, present or future, accepted as a result of repeated and collective observation or perhaps finally of faith"[4] అని అంటాడు R.S. Boggs.

'....విశ్వాసములను జనులు విధిగా పాటించు సంప్రదాయ పద్ధతుల యొక్కయు, నాచారముల యొక్కయు వివరణములుగా మనము గ్రహింపవచ్చును'[5] అంటారు డా. నాయని కృష్ణకుమారిగారు.

'పరంపరానుగతంగా తరతరాలనుంచి పునరావృత్తిని పొందుతూ సామూహికమైన సమ్మతిని పొందే మానసిక స్థితిని నమ్మకం అని చెప్పవచ్చు'[6] అని అంటారు. డా. ఆర్వీయస్. సుందరం.

2. *American Folklore, P-248.*
3. *Encyclopaedia of Religion and Ethics, Vol.II, P.459.*
4. *Funk & Wagnaulls std. Dict. of Folklore, P-1146.*
5. *తెలుగు జానపద గేయగాథలు, పుట - 324.*
6. *ఆంధ్రుల జానపద విజ్ఞానం, పుట - 256.*

పై అభిప్రాయాలను పరిశీలించి నమ్మకాన్ని ఇలా నిర్వచించవచ్చు. 'మానసిక అనుభవాల పరిణామంగా తెలిసికానీ, తెలియక కానీ, మంచికి కానీ, చెడుకు కానీ, ఉద్దేశ్యపూర్వకంగా కానీ ఉద్దేశ్యరహితంగా కానీ, ప్రజలలో ఏర్పడి పలువురిచే అంగీకరించబడ్డ విశ్వాసమే నమ్మకం'.

నమ్మకాలతోపాటు మనం అశాస్త్రీయం లేదా అవైజ్ఞానికం అని పరిగణించే మూఢ విశ్వాసాలు ప్రపంచమంతటా వ్యాప్తిలో ఉన్నాయి. మూఢవిశ్వాసం అంటే ఏమిటి? దాన్ని నిర్వచించడమెలా? మూఢ విశ్వాసాలను మనం 'మూఢ నమ్మకాలు' అని కూడ అంటున్నాము. కన్నడంలో 'మూఢనంబికె' అనీ, తమిళంలో 'మూడనంబ్గై' అనీ, మలయాళంలో 'మూఢ విశ్వాసం' అనీ, హిందీలో 'అంధవిశ్వాస్' అని అంటారు. ఆంగ్లంలో దీనికి సమానార్థకంగా 'Superstition' అనే మాట ప్రచారంలో ఉంది.

'ఒక వ్యక్తి జీవించి ఉన్న సమాజంలోని నిరాధారమైన నమ్మకాలను లేదా పద్ధతులను అంగీకరించడమే మూఢ విశ్వాసాలు. ఈ మూఢ విశ్వాసాలు మతాచరణాలలోను, మాంత్రిక సంబంధమైన విషయాలలోను అధికంగా కన్పిస్తాయని Encyclopaedia Britanica, Vol.21 (P. 577-78) పేర్కొంటుంది.

'..... any belief that is not recommended or enjoyed by any of the great orgainzed religions'[7] అని అభిప్రాయపడ్డాడు Alexander H. Krappe.

'Superstition is a traditional belief that a certain action or event can cause or foretell an apparently unrelated event' అని World Book పేర్కొంది.

Eric Maple దృష్టిలో Superstion అంటే '....superstitions indicate an acceptance of power that are superior to humanity and which can be made to submit to the human will'[8]

---

7. *The Science of Folklore, P-204.*
8. *Superstition and the superstitious, P-7.*

పై నిర్వచనాలను, అభిప్రాయాలను గమనిస్తే మూఢ విశ్వాసాలను 'ఒక వ్యక్తి జీవించెడి సమాజంలోని నిరాధారమైన నమ్మకాలు, ఆ సమాజంలోని ప్రజలచే సమిష్టిగా అంగీకరింపబడి, సామూహిక అభ్యాసంచే తరతరాలుగా నిలద్రొక్కుకున్న శాస్త్రీయంగా విశ్వసింపలేని కొన్ని విశ్వాసాలే మూఢ విశ్వాసాలని నిర్వచించవచ్చు.

మూఢ విశ్వాసాలన్నీ జానపదుల నమ్మకాలే. అయితే అన్ని నమ్మకాలు మూఢవిశ్వాసాలు కావు. అజ్ఞానం, భయభ్రాంతులు, తప్పుగా తెలుసుకోవడం మూఢవిశ్వాసాలకు మూలకందాలు. ఆదిమ మానవుని పరిమిత జ్ఞానం కూడ ఇందుకు దోహదం చేసింది.

మానవుని జీవితంలో ఆవరించుకొన్న ఆందోళన, అస్థిరభావనలు అతి మానుష శక్తులకు మూలం. దేవుడు, దయ్యం, భూతప్రేతాలు మొదలైన అతి మానుష శక్తుల కల్పనలు ఇటువంటి నమ్మకాల పుట్టుకకు కారణం. అతిమానుష శక్తులు శకున రూపంలో ఉంటాయనే భీతి మూఢ విశ్వాసాలకు ప్రధాన కారణంగా కన్పిస్తుంది. అందువల్లే మనలో శకునాలు అధికంగా కన్పిస్తాయి. ఇవి శాస్త్రీయంగా నమ్మలేని నమ్మకాలు కావడంవల్లే మూఢవిశ్వాసాలుగా పిలువబడుతున్నాయి. వర్జిల్ మహాకవి దృష్టిలో మూఢవిశ్వాసం ఆధారరహితం, శూన్యం.

'దేవుని తోడు నేను అబద్ధం చెప్పను' - ఇది అవిద్యావంతులే కాదు విద్యావంతులు, నాగరకులు కూడ అంటున్న మాట. దేవుడు ఉన్నాడని కొందరు విశ్వసిస్తే, మరికొందరు లేడని నమ్ముతారు. దేవుడనే పరికల్పన కేవలం భయ భక్తాదుల వల్ల ఏర్పడిందని మరికొందరు అభిప్రాయపడతారు. కొందరు మంగళ వారాన్ని అశుభంగా తలచి ఏ కార్యాన్నీ తలపెట్టరు. మరికొందరు మంగళ వారాన్ని శుభప్రదంగా భావించి సర్వకార్యాలు నిర్వర్తించుకొంటారు. కొంతమంది 3,13 సంఖ్యలను అశుభంగా పరిగణిస్తే మరికొందరు వాటినే చాల శ్రేష్ఠంగా భావిస్తారు.

ఒకరు నమ్మిన విషయాన్ని అందరూ నమ్మాల్సిన అవసరం లేదు. ఆయా నమ్మకాలు ఆయావ్యక్తుల విచక్షణా జ్ఞానం మీద, అనుభవాలమీద ఆధారపడి ఉంటాయి. అంతేకాకుండా 'It is also important to notice that the reasonableness or unreasonableness of a belief is determined by the evidence which the believer himself has'[9] అన్న విషయాన్ని గుర్తుంచుకోవాలి.

---

*9. Encyclopaedia Britanica, P-369.*

కొందరి మతంలో నమ్మకాలన్నీ అవైజ్ఞానికాలు, అర్థరహితాలు, మూఢ విశ్వాసాలు. అయితే అన్ని నమ్మకాలు అవైజ్ఞానికాలు కావు. ఆయా నమ్మకాల వెనుక మనకు తెలియని ఎన్నో విషయాలు దాగి ఉన్నాయి. వాటి వెనుక పౌరాణిక విషయాలో, మత సంబంధమైన విషయాలో, ఆరోగ్య సంబంధమైన విషయాలో, సమాజ సంబంధమైన విషయాలో చోటు చేసుకొని ఉంటాయి. సమాజానికి ఉపకరించే లేదా ప్రయోజనాన్ని చేకూర్చే వైజ్ఞానికి సంబంధించిన విషయాలను కొన్ని నమ్మకాలు మనకు అందిస్తాయి. వాటిని శాస్త్రీయంగా విశ్లేషించి నప్పుడే వాటి సత్యాంశాలు బయట పడతాయి. అంతే కాని అన్ని నమ్మకాలని అశాస్త్రీయాలని, అంధవిశ్వాసాలని త్రోసివేయడం సమంజసం కాదు.

ఈ అణుయుగంలో కూడ ప్రపంచాద్యంతం నమ్మకాలు నేటికీ ఉన్నాయంటే వాటికి ఉన్న ప్రాచుర్యం తేటతెల్లమవుతుంది. అన్ని నమ్మకాలను కొట్టి పార వేయడానికి వీల్లేదు. వాటి పూర్వాపరాలను క్షుణ్ణంగా పరిశీలించి శాస్త్రీయంగా అధ్యయనం చేయాల్సిన అవసరం ఉంది. అలా శాస్త్రీయాధ్యయనం జరిగినప్పుడే వాటి ప్రాశస్త్యం లేదా, వాటివల్ల సమాజానికి జరిగే మేలు, కీళ్ళు స్పష్టమవుతాయి. అంతవరకు అవి కొందరి దృష్టిలో సమాజ విద్రోహక శక్తులుగాను, మరికొందరి దృష్టిలో సమాజాభ్యుదయ విశ్వాసాలుగాను చలామణిలో ఉంటాయి.

జానపదుల నమ్మకాలు కేవలం జానపద విజ్ఞాన పరిధిలోనే పరిమితమైనవి కావు. ఎంచేతనంటే ఇవి మానవజీవితంలోని ప్రతి క్షేత్రంలోనూ తమ ప్రభావం చూపేవి. కేవలం ఒకే ఒక విజ్ఞానం యొక్క విశ్లేషణకు ఇవి తలబడ్డేవి కావు. మానవ శాస్త్రం, మానసిక శాస్త్రం, సామాజిక శాస్త్రం, వైద్య విజ్ఞానం, జీవ భౌతిక శాస్త్రాలు మొదలైన విజ్ఞానాంశాలన్నీ నమ్మకాల విశ్లేషణలో పాత్ర వహిస్తాయి. ఉదాహరణకి ఒక సమాజంలోని ఆచార వ్యవహారాలు, సంప్రదాయాలు, విధి నిషేధాలు, వివాహాది కార్యాలు మొదలైన వాటికి సంబంధించిన నమ్మకాలను విశ్లేషించిడానికి మానవశాస్త్ర, సామాజిక శాస్త్రాల సహకారం అవసరం. అలాగే మానసిక సంబంధమైన స్వప్నాలు, భూతప్రేతాలు మానసిక శాస్త్రం సహాయం వల్ల వివరించవచ్చు. జంతుజాలాలు, చెట్టుచేమలకి సంబంధించిన విశ్లేషణను, జీవ శాస్త్రంతోను, ప్రకృతి సంబంధమైన గ్రహ నక్షత్రాలను సూర్య చంద్రులను, నదీనదాలను, భూమ్యాకాశాలను భౌతిక, ఖగోళ శాస్త్రాల సహాయం ద్వారా

వివరించడానికి వీలవుతుంది. అందువల్ల జానపద నమ్మకాలను అధ్యయనం చెయ్యడానికి తక్కిన విజ్ఞానశాస్త్రాల పరిజ్ఞానం లేదా సహకారం అనివార్య మనిపిస్తుంది.

నమ్మకాలను సంగ్రహించడానికి క్షేత్రకార్యం (Field work) ముఖ్యమైందని చెప్పాల్సిన అవసరం లేదు. ఈ క్షేత్రకార్యంలో సంగ్రహకారునికి విషయ పరిజ్ఞానం అత్యవసరం. తాను ఏ జాతి లేదా సమాజం నుండి నమ్మకాలను సేకరించలను కొంటాడో ఆ జాతి లేదా సమాజం; వారి సంస్కృతిని, వారి జీవన విధానాన్ని ప్రత్యక్షంగా పరిశీలించాల్సి వుంటుంది. సూక్ష్మ పరిశీలనా దృష్టివల్లనే నమ్మకాలను సులభంగా గ్రహించవచ్చు. ఆ ప్రజల పండుగలు, పబ్బాలు, పెండ్లి పేరంటాలు, జాతరలు, జనన మరణాలు, ఆచార వ్యవహారాలు, సంప్రదాయాలు మొదలైన సందర్భాలలో తాను కూడ పాల్గొనవలసి వుంటుంది. సందర్శన (Interview) ద్వారా నమ్మకాలకు సంబంధించిన పూర్వచరిత్ర (back-ground)ను వివరంగా తెలుసుకోవచ్చు. పరోక్షంగా కూడ ప్రశ్నావళి (Questionnaire) ద్వారా నమ్మకాలను సంగ్రహించవచ్చు; వివరాలను సేకరించవచ్చు. అలాగే ఇంతకుపూర్వం ఎవరైనా తాను సేకరించదలచుకొన్న నమ్మకాలను సేకరించి ఉంటే వాటిని కూడ పరిశీలించాల్సి వుంటుంది. సంగ్రహ కారుని చమత్కారం, చురుకుదనం, సహనాలమీద నమ్మకాల సేకరణ కార్యం అవలంబించి ఉంటుంది.

సేకరించిన నమ్మకాలను వర్గీకరించడం అధ్యయనంలోని రెండవదశ. ఏ ప్రక్రియకు సంబంధించిన విషయాలను సేకరించినా, వాటిని వర్గీకరించడం ఒక ప్రధాన సమస్యగా తయారవుతోంది.

నమ్మకాలనన్నిటినీ కొందరు వైజ్ఞానికాలనీ, మరికొందరు అవైజ్ఞానాకాలనీ వింగడించడం కన్పిస్తుంది. ఇలాంటి వర్గీకరణలో ఏదివైజ్ఞానికం, ఏది అవైజ్ఞానికం అని నిర్ణయించడం కష్టమవుతుంది. దీనికి కారణం నమ్మకం అనేది (అది వైజ్ఞానికమైనా, అవైజ్ఞానికమైనా) మానవ సంస్కృతిలో విడదీయరానంత సంబంధాన్ని కలిగి ఉండడమే.

మరికొందరు నమ్మకాలను 1. అతిమానుషమైన నమ్మకాలు, 2. మానుష నమ్మకాలు, 3. ప్రాణి నమ్మకాలు, 4. ప్రకృతి నమ్మకాలు, 5. కౌటుంబిక నమ్మకాలు, 6. సంకీర్ణ నమ్మకాలు అని వింగడించడం జరిగింది. అలాగే నమ్మకాలను

అవి పుట్టిన సందర్భాలను బట్టి 1. మత సంబంధాలు - వీటిని అతి మానుష నమ్మకాలు అని కూడా పిలిచారు. 2. సాంస్కృతిక సంబంధాలు, 3. వైయక్తికాలు అని వింగడించారు.

R.S. Boggs తన వర్గీకరణలో నమ్మకాలను 1. పురాణం (Mythology); 2. ఐతిహ్యం (Legend); 3. ఆచారం (Custom); 4. మాంత్రికత (Magic); 5. వైద్యం (Medicine); 6. కాలజ్ఞానం, దైవీకరణ (Prediction, Divinition) అని వర్గీకరించారు. వీటిలో ఒక్కొక్క దాంట్లోను అనేక ఉపవిభాగాలు ఉన్నాయి.

కార్యకారణ సంబంధాన్ని సరిగా అర్థం చేసుకోలేని వ్యక్తి ఏ సందర్భంలోనైనా కానీ లేదా ఏ సమయంలోనైనా కానీ ఒక సంఘటనకు అలౌకికగుణాన్ని ఆపాదిస్తూ ఉంటాడు. అలా ఊడిపడ్డవే చాలవరకు ఈ నమ్మకాలన్నీ. ఈ దృష్టితో చూస్తే నమ్మకాలనన్నిటినీ మూడు విధాలుగా వర్గీకరించడం సమంజసం. అవి 1. ఆచార నియమాలు; 2. శకునాలు, 3. కేవల విశ్వాసాలు. ఈ మూడు విభాగాలను ఒక్కొక్కదాన్నీ రెండు ఉపవిభాగాలుగా విభజించవచ్చు. అవి 1. స్పష్టంగా కార్యకారణ సంబంధాన్ని నిరూపించేవి. 2. స్పష్టంగా కార్యకారణ సంబంధాన్ని నిరూపించినవి. స్పష్టంగా కార్యకారణ సంబంధాన్ని నిరూపించని ఆచార నియమాలని విధికి సంబంధించిన ఆచార నియమాలు, నిషేధానికి సంబంధించిన ఆచార నియమాలని వింగడించవచ్చు. అలాగే స్పష్టంగా కార్యకారణ సంబంధాన్ని నిరూపించే శకునాలు శుభశకునాలు, అశుభ శకునాలు అనీ; స్పష్టంగా కార్యకారణ సంబంధాన్ని నిరూపించని శకునాలను శుభశకునాలు, అశుభశకునాలని వింగడించవచ్చు. ప్రధానమైన ఈ మూడు విభాగాలను, అందులో వున్న ఉపవిభాగాలను మళ్ళీ 1. మానుష సంబంధాలు, 2. అతిమానుష సంబంధాలు, 3. ప్రాణి సంబంధాలు, 4. వ్యవసాయ సంబంధాలు, 5. సంకీర్ణాలు అని వింగడించవచ్చు. సంకీర్ణాలలో జ్యోతిషం, సాముద్రికం, సంఖ్యాశాస్త్రం, వాస్తు సంబంధం, జానపద వైద్యం, ప్రయాణం, స్వప్నం మొదలైనవన్నీ చేర్తాయి.

సేకరణ, వర్గీకరణల పిదప అధ్యయనంలో మూడవదశ విశ్లేషణ. ఏ ప్రక్రియకు సంబంధించిన విషయాలను సేకరించి, వర్గీకరించినా వాటిని శాస్త్రీయంగా విశ్లేషించి అధ్యయనం చెయ్యకపోతే ఇంతవరకూ చేసిన పనంతా వ్యర్థమవుతుంది. విశ్లేషణలోనే ఆయా ప్రక్రియలకు సంబంధించిన వివరాలన్నీ

వెల్లడవుతాయి. జానపద విజ్ఞానం సమాజానికి ఏ విధమైన లాభనష్టాలను చేకూరుస్తోంది, సమాజం ఈ విజ్ఞానంవల్ల ఎటువంటి ప్రయోజనాన్ని పొందగల్గుతోంది అన్నది ముఖ్యం. అలాగే నమ్మకానికి సంబంధించిన విశ్లేషణ వల్ల కూడ ఈ అంశాలను పరిశీలించాల్సి వుంది.

నమ్మకాలు విశ్వజనీనాలు, విశ్వవ్యాపకాలు. నమ్మకాలు లేని దేశం కానీ, భాష కానీ లేదంటే అతిశయోక్తి లేదు. ఇవి మన సాంఘికాచారాలలో ఒక భాగం. మనవమూల సంస్కృతికి ఇవి ప్రతినిధి రూపాలు. మనకు తరతరాలుగా సంక్రమించిన మానసిక అనుభవాల ప్రతిరూపాలు.

జానపద నమ్మకాలు తక్కిన జానపద సాహిత్య ప్రక్రియలలాగ సాహిత్యాంశాన్ని కలిగినవి కావు. భాష వ్యావహారికం, విషయ సంక్షిప్తత కంటే, విషయ వివరణ ఇందులో ప్రధానంగా కన్పిస్తుంది. సామెత, పొడుపు కథలలో లాగ ఇందులో ప్రాసలు ఉండవు. అలాగని లేనేలేవని చెప్పడానికి వీల్లేదు. 'బొమ్మకు మొక్కినా నమ్మకం ఉండాలి'. ఇది ప్రధానంగా సామెత. అయితే దీన్ని ప్రజలు నమ్ముతున్నారు. అందువల్ల నమ్మకం అయింది. నమ్మకం అనేది మనుష్యుల మీద ఎలాంటి ప్రభావాన్ని చూపుతుందో ఈ నమ్మకం లేదా సామెతవల్ల తెలుస్తుంది. ఈ నమ్మకం కేవలం మనం మాట్లాడుకునే మాటల్లోనే ఉన్నా ప్రాస దానికంత అదే వచ్చి పడింది.

జానపదుల నమ్మకాలు ప్రజల జీవన విధానం మీద తమ ప్రభావాన్న చూపాయి; చూపుతున్నాయి; ఇక ముందు కూడ చూపిస్తాయి. జానపద మతాచార వ్యవహారాలు, సంప్రదాయాలు, విధి నిషేధాలు ఇత్యాదులన్నీ నమ్మకాల అభివ్యక్తికరణలే.

చాలవరకు నమ్మకాలు మానవ జీవితాలను నియంత్రించే (Control) శక్తులుగా కన్పిస్తాయి. హెచ్చరికలుగా దర్శనమిస్తాయి. అయితే ఏదో ఒక నమ్మకానికి కట్టుబడ్డ వ్యక్తి ఆ నమ్మకాన్నే మూఢంగా విశ్వసిస్తూ అనుసరిస్తూ పోతే ఒకసారి కాకపోతే మరోసారయినా దుష్పరిణామాన్ని ఎదుర్కోవలసి వస్తుంది. సాధారణంగా జనపదాల్లో తీవ్ర అనారోగ్యంతో బాధపడే వ్యక్తులు వైద్యులని సంప్రదించక దేవుడి మీద భారంవెయ్యడం, సరియైన చికిత్సలు లేక ప్రాణాలను పోగొట్టుకోవడం మనం గమనిస్తుంటాం. దేవుడికి ముడుపులు వెయ్యడం, బలులనిస్తామని మొక్కుకోవడం

వల్ల రోగాలు రొచ్చులు నయం కావు. పైపెచ్చు ఇంకా ఎక్కువ అవుతాయి. ఆరోగాలకు తగిన చికిత్సలు చేయించాలి. మంత్రాలకు మామిడికాయలు రాలవు కదా!

జానపదుల నమ్మకాలలో కూడ ఎన్నో సమానాంశాలు పలుప్రాంతాలలో ఉన్నాయి. ఉదాహరణకి 'అద్దం క్రిందపడి పగిలిపోతే అశుభం' అనే నమ్మకం మన పొరుగు రాష్ట్రమైన కర్నాటకలోనే కాకుండా చైనాదేశంలో కూడ ఉన్నట్టు తెలుస్తుంది. 'ఒంటి బ్రాహ్మడు ఎదురవుతే అనుకొన్న పని జరుగదు', 'అశ్వత్థ వృక్షాన్ని చుట్టితే పిల్లలవుతారు' అన్న నమ్మకాలు తెలుగు వాళ్ళలోనే కాదు, కన్నడిగుల లోను, తమిళులలోను కన్పిస్తాయి. రాహుకాలాన్ని గమనించి కార్యాలను చెయ్యడం దక్షిణ భారతదేశమంతటా వ్యాప్తిలో ఉంది.

కొన్ని భారతీయ, పాశ్చాత్య నమ్మకాలలో విభేదాలు కన్పిస్తాయి. కోకిల భారతీయులకు మృదుమధురంగా గానం చేసే మంచి పక్షి అవుతే, పాశ్చాత్యుల దృష్టిలో అది మోసానికి సంకేతం. గుడ్లగూడ మనకు అపశకున పక్షి అవుతే పాశ్చాత్యులకు అది మంచి సంకేతం.

ఎన్నో నమ్మకాలు శిష్టుల రచనల్లో చోటుచేసికొన్నాయి. తిక్కన మహా భారతంలోను, శ్రీనాథుని పల్నాటి వీరచరిత్ర, భీమేశ్వర పురాణాలలోను నమ్మకాలు సాక్షాత్కరిస్తాయి. బహిష్టులను ముట్టుకోకూడదు' అన్న నమ్మకం నన్నయ భారతంలోని సభాపర్వంలో తనను తాకడానికి వచ్చిన దుశ్శాసనుణ్ణి ద్రౌపది అడ్డగిస్తూ '....(అ) నక్కోమలి రజస్వల నన్ను ముట్టకు' అని అంటుంది.

తరతరాలుగా మనకు అందించబడుతున్న వీరగాథలు, స్త్రీల కథల పాటలు, జానపద గేయాలలో లెక్కలేనన్ని నమ్మకాలు విశ్వాసాలు కన్పిస్తాయి. శకునాలు, విశ్వాసాలు పల్నాటి వీర చరిత్ర, కాటమరాజు కథ, దేశింగు రాజు కథ, బంగారు తిమ్మరాజు కథ, బొబ్బిలి కథల్లో అధికంగా కన్పిస్తాయి. అలాగే సీతాదేవి ఆన్నవాలు, లక్ష్మణ మూర్ఛ, కుశలవ కుచ్చల చరిత్ర, రామకథా సుధార్ణవం ఇత్యాది స్త్రీల కథల పాటల్లో అనేకంగా విశ్వాసాలు దర్శనమిస్తాయి. జానపద గేయాల్లో ఎన్నో నమ్మకాలు దాగి ఉన్నాయి. ఉదాహరణానికి నేను సేకరించిన కపిలి పాటల్లో ఉన్న నమ్మకాలు.

'నల్లదాన్ని నమ్మరాదు, ఎర్రదాన్ని ఏలరాదు
సావు నలుపుదాన్ని సచ్చేదంక ఇడువరాదు'

ఇలాగే

'ఏటిగడ్డదాని మాట ఎన్నటికీ నమ్మరాదు',
'మల్లెపూలు ముడవరాదు, ముండమోపిని తడువరాదు' ఇత్యాది.

ఇంచుమించు మన వ్యవసాయ సామెతలన్నీ నమ్మకాలనే చెప్పొచ్చు. ఉదాహరణానికి 'ఆరుద్ర కురిస్తే దారిద్ర్యం లేదు'. మన ఆచార వ్యవహారాలు, సంప్రదాయాల్లో లెక్కలేనన్ని విశ్వాసాలు ఉన్నాయి. తిథి, వార, నక్షత్రాలకు అంకెలకు సంబంధించిన విశ్వాసాలు ఎన్నో ఉన్నాయి. ఉదాహరణానికి సమర్తయిన బాలిక శుభాశుభాలను తెలిపే ఒక సమర్త పాటను గమనించండి.

'అల్లో నేరేడల్లో వెలది రుక్మిణి సమర్త వేడూకలాయ
అల్లో నేరేడలో సోమవారమునాడు సుదతి పతివ్రత
అల్లో నేరేడలో మంగళవారమునాడు మతిమంతురాలు
అల్లో నేరేడలో బుధవారము నాడు బుద్ధిమతియౌను
అల్లో నేరేడలో బేస్తవారమునాడు పుత్రవతియగును
అల్లో నేరేడలో శుక్రవారమునాడు సుదతి సంపద కలిగి యుండు
అల్లో నేరేడలో శనివారమునాడు సతి పేదరాలు'

ఇలాంటి విశ్వాసాలు కేరళ రాష్ట్రంలోను, ముజాఫిర్ ప్రాంతపు హిందూ, మహమ్మదీయ సంప్రదాయాల్లోనూ ఉన్నాయి. అంకెలకు సంబంధించిన విశ్వాసం ప్రతిప్రాంతంలోను కన్పిస్తుంది. కొంతమందికి 13 సంఖ్య అచ్చిరాదు.

అప్పగింతల పాటల్లో వధువుకు చెప్పే బుద్ధి వాదాల్లో ఎన్నో విశ్వాసాలు ఉన్నాయి. ఉదాహరణానికి 'వీధిలో నిలుచుండి కురులు విప్పవద్దనీ, కాళ్ళను విసరీ విసరీ నడువవద్దనీ' బుద్ధులు చెప్పడంలో ఎన్నో విశ్వాసాలు దాగి ఉన్నాయి.

పలునమ్మకాల్లో కట్టుబాట్లు, నిషేధాలు కన్పిస్తాయి. ఉదాహరణానికి 'గర్భిణీ స్త్రీ గ్రహణం చూడరాదు'. చూస్తే పుట్టబోయే బిడ్డ శరీరాంగాల్లో ఏదైనా లోపం సంభవిస్తుందట. నమ్మకాలు సంఘ నిబంధనలలాగ, ప్రవర్తనలను క్రమబద్ధం చేసేవిగా చలామణిలో ఉంటాయి.

కొన్ని నమ్మకాలు ధ్వనిపూర్వకంగాను, వ్యంగ్యార్థంలో కూడుకొన్నవిగాను, కన్పిస్తాయి - ఉదాహరణానికి 'దీపం ఆరిపోయింది అనకూడదు, దీపం శాంతించింది' అదే నమ్మకం ధ్వని పూర్వకంగా ఉంది.

3

చివరిగా నమ్మకాల అధ్యయనం గురించి రెండు మాటలు. ప్రపంచాద్యంతం నమ్మకాలు ప్రచారంలో ఉన్నాయి. ఉత్తర అమెరికాలోని ఇలినాయిస్ దేశంలోని Adams Country అనే ప్రదేశంలో 10,000కు పైగా జానపద నమ్మకాలను సేకరించి ప్రకటించడం జరిగిందట.

తెలుగులో నమ్మకాలను గురించి సమగ్ర పరిశోధన కానీ, అధ్యయనం కానీ జరగలేదు. ఈ విషయంలో కన్నడిగులు మనకంటే ముందున్నారు. 1966లో నవ్యరచనా మండలి ఆధ్వర్యంలో శ్రీ ఎస్. జగన్నాథంగారు 'మూఢ విశ్వాసాలు' గ్రంథం వెలువరించినట్టు తెలుస్తుంది. డా. జి. ఎస్. మోహన్ 1981లో ప్రచురించిన 'జానపద విజ్ఞాన వ్యాసావళి' గ్రంథంలో జానపదుల నమ్మకాల వివరణతోపాటు 30 నమ్మకాలు ఉదాహరింపబడ్డాయి. అంతకుముందే ఆయన 1983లో ప్రచురించిన 'జానపదుల నమ్మకాలు' గ్రంథంలో 15 పుటల ఉపోద్ఘాతంతో పాటు 1326 నమ్మకాలు ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ ప్రాంతాల నుండి సేకరింపబడ్డవి ఉన్నాయి. ఇది కొంతవరకు నమ్మకాలను గురించి అధ్యయనం చేసేవారికి ఉపయుక్త మవుతుంది. డా. ఆర్వీయస్ సందర్‌గారు తమ 'ఆంధ్రుల జానపద విజ్ఞానం' గ్రంథంలో నమ్మకాలను వివరించి 151 నమ్మకాలను ఉదాహరించారు. నాగార్జున విశ్వవిద్యాలయం తెలుగు విభాగంలో శ్రీమతి సత్యభూషణరాణి తెలుగు నమ్మకాలను గురించి 1983లో ఎం.ఫిల్. చేసారు.

ఆంధ్రదేశంలో లెక్కలేనన్ని నమ్మకాలు, మూఢవిశ్వాసాలు ఉన్నాయి. వాటిని సేకరించి శాస్త్రీయంగా అధ్యయనం చేయాల్సిన అవసరం ఎంతైనా వుంది. మూఢవిశ్వాసాలుగా పిలువబడే నమ్మకాలవల్ల సమాజానికి మంచికంటే చెడుపే అధికంగా కలుగుతుంది. మానవజీవితంతో ముడిపెట్టుకొని, విడదీయరాని విధంగా సంబంధం పెట్టుకున్న ఈ అంధ విశ్వాసాలను వేరు సహితంగా లాగివేయడం మంచిది. వైజ్ఞానికంగా అర్థవంతమైన నమ్మకాలు చలామణిలో ఉన్నా సమాజానికి నష్టమేమి ఉండదు.

# 20. జానపద వైద్యం
# (Folk Medicine)

'Folk medicine is related derivatively to the academic medicine of earlier generation' - DON YODER.

జానపద వైద్యమే గ్రామసీమల్లో 'నాటువైద్యం', 'నాటు వైద్యం' అని ప్రచారంలో ఉంది. వ్యవసాయమే జీవనాధారమయిన భారతదేశంలో నూటికి తొంభైమంది పల్లెల్లో నివసిస్తున్నారు. నిత్యజీవితంలో జానపదులు అనేక సమస్యలను ఎదిరించారు. వాటిలో రోగాలు - వాటి నివారణ ఒకటి. మానవులేకాక పశుపక్ష్యాదులు, చెట్టుచేమలు, రోగాల బారినుండి తప్పించుకోలేకపోయాయి. ప్రాచీనకాలంలో ఇప్పుడున్నట్టుగా వైద్యసౌకర్యాలు ఉండేవి కావు. ప్రకృతిలోని వస్తువులే వారికి శరణ్యమయ్యాయి. అందువల్లనే ప్రకృతిలోని వస్తువులు జానపద వైద్య పరిశోధనకు దారి చూపించాయి. 'Necessity is the mother of invention' అన్నట్లు ప్రాచీనులు ప్రకృతిలోని వస్తువుల రోగ నిరోధక గుణాల్ని కనిపెట్టి వాటినే ఔషధులుగా ఉపయోగించారు. ఆ ఔషధాలే నేటికీ గ్రామసీమల్లో తరతరాలుగా సంక్రమించిన 'నాటువైద్యం'గా ప్రచారంలో వుంది. 'Folk Medicine is the substance of all the traditional view points on sickness and the healing methods applied against disease which exist among the people'[1] అనేదాన్ని జానపద వైద్యానికి నిర్వచనంగా స్వీకరింపవచ్చు.

ప్రకృతిలో దొరికే పదార్థాల్ని యథాతథంగా ఉపయోగించటమే జానపద వైద్యపు ప్రాథమిక స్వరూపం. ఆకులు, వేర్లు మొదలగు వాటిని ఉన్నవి ఉన్నట్లు ఉపయోగించటమే తొలిదశ. కషాయాలు, కల్కాలుగా చేసి ఉపయోగించటం తర్వాతిదశ. మాత్రలు, లేహ్యాలు, ఆసవాలు జానపద వైద్యంలో చేరవు.

ప్రకృతిలోని ఆకులు - అలాలు, వేర్లు మొదలయిన వాటిని సేకరించి, పలువిధాలైన రోగాల్ని మాన్పుకోటానికి ఔషధ గుణాల్ని కనుగొన్నారు. కాని ఈ వైద్యవిద్య మాత్రం కొందరికే సంక్రమించింది. దీనికి కారణం ఈ వైద్యవిధానం

---

1. *Folklore and Folklife* నుండి పునరుద్ధరింపబడినది.

అందరికి అందుబాటులో వుండదు. చెట్టు మూలికల్ని తెచ్చుకోడానికి కొన్ని రహస్య మంత్రాలున్నాయట. పైపెచ్చు ఈ జానపదవైద్యులు చెట్టు మూలికల రహస్యాన్ని కాని, ఔషధుల రహస్యాన్ని కాని ఎవ్వరికీ చెప్పరట, ఔషధుల మహత్వం తగ్గిపోతుందనే నమ్మకమే ఇలా రహస్యాన్ని చెప్పకుండటానికి కారణమంటారు. ఇది సత్యదూరం. సంఘంలో తమ పలుకుబడి తగ్గిపోతుందనే కారణం చేతనో లేక ఆర్థికంగా తాము దెబ్బతినవచ్చునన్న కారణం చేతనో ఔషధుల రహస్యాన్ని చెప్పరని భావించవచ్చు. జానపద వైద్యం తండ్రినుంచి కొడుక్కి, తల్లినుంచి కూతురుకి సంక్రమిస్తుంటుంది. అరుదుగా గురువు నుంచి శిష్యునకు సంక్రమిస్తుంది. ఈ వైద్యానికి క్రమబద్ధమైన శిక్షణ విధానం లేదు.

చెట్టు మూలికల్ని తీసుకొని రావటంలో కూడ నియమాలున్నాయట. 'Sympathetic prescriptions are followd in gathering herbs, bark and roots. Leaves plucked upward from a plant have efficacy as an emetic; downward as an enema'[2] అంతేకాక సంవత్సరంలో ఏయే ఋతువుల్లో ఏయే చెట్టు మూలికల్ని తీసుకొని రావచ్చునో, ఎప్పుడు వాటిని ఎండబెట్టవచ్చునో కూడ జానపద వైద్య సంప్రదాయం తెలియజేస్తుంది. 'The time of year in which the herb is picked and dried also, was prescribed by folk - medical tradition'[3]

ఔషధికుండే భౌతిక గుణాలతో పాటు వాటికి కొన్ని మాంత్రికశక్తులు కూడ వుంటాయని, జానపదులు నమ్ముతారు. మందులేకాక మంత్రాలు, వైద్యుడే గాక భూతవైద్యుడు, దేవతలు, పూజారి ఇలా జానపద వైద్యంలో ప్రధానస్థానం ఆక్రమిస్తున్నారు.

నేటికీ గ్రామాల్లో 'ఇంజక్షన్' పేరు చెప్పగానే భయపడతారు. కనుకనే వారు ఆ ఊరి పూజారినికాని, పురోహితుణ్ణికాని లేదా 'నాటీవైద్యుణ్ణి' కాని ఆశ్రయించి, ఏదో ఒక కషాయాన్ని సేవిస్తారు. మరికొందరు ఆ ఊరి దేవతకు మ్రొక్కుబడులు చెల్లించుకొంటారు. మశూచి ప్రబలినప్పుడు ఆ ఊరి 'గ్రామ దేవత' అయిన 'పెద్దమ్మ'నో, 'పోలేరమ్మ'నో పూజించటం సర్వ సాధారణం. 'Popular medicine is still very much practiced and the observer may well ask why these old concepts, discarded by modern science, have

*2&3. Ibid, P-199.*

survived so vigorously in this age of Electronics and Atomic Physics'[4] అనే Dorson అభిప్రాయానికి పైన పేర్కొనబడ్డ అంశం కారణమవుతుంది. Dr. Ben fox అభిప్రాయపడినట్లుగా జానపద వైద్యం మూఢవిశ్వాసానికి సంబంధించింది. 'Folk medicine is made up of the empiricisms which are employed for the prevention or cure of disease, without the back ground of investigation, by people without adequate training. It is closely related to superstistion. Often it represents experience of the race in some far off and long forgotten time; some times it has value'[5] కనుకనే జానపద వైద్యం ఒక్కొక్కప్పుడు శాస్త్రీయ వైద్యానికి పూర్తిగా విరుద్ధంగా వుండవచ్చు.

Richard M. Dorson జానపద వైద్యాన్ని సాంఘిక జానపద ఆచారంలో (Social Folk Custom) చేర్చాడు. జానపద వైద్యం మతాచరణ విధులకు సంబంధించిందని అతని అభిప్రాయం. ఈ విషయమై కొన్ని నమ్మకాలు ప్రచారంలో వున్నాయి. గ్రామం దేవత రోగాల బారినుండి రక్షిస్తుందనే నమ్మకమే ఇందుకు ఉదాహరణ. ''Folk religion overlaps at points with Folk Medicine in instances where a famed miracle maker saves souls and heals bodies'[6] అనే Dorson అభిప్రాయం గమనింప దగింది.

R.S. Boggs జానపద విజ్ఞానాన్ని వింగడిస్తూ జానపదవైద్యాన్ని నమ్మకాల గుంపులో చేర్చాడు.[7]

| | | |
|---|---|---|
| P. | | నమ్మకం (Belief) |
| P. 700 | - | ఔషధం (Medicine) |
| P. 720 | - | రోగాన్ని గుణపరిచేవాడు (Curer) |
| P. 740 | - | రోగానికి కారణం (Means of causing or Avoilding illness) |
| P. 750 | - | రోగ నివారణలు (Remedies) |
| P. 752 | - | జంతువులు (Animals) |

---

*4&5. Dorson Richard M.ed. Buying the wind (1972) అనే గ్రంథంనుంచి పేర్కొనబడినట్లు జానపద వివేచన (కన్నడం)లో వుంది, పుట - 144.*

*6. Folklore and Folklife, P-4.*

*7. Standard Dictionary of Folklore, legend and Mythology, P-1146.*

P. 754 - సస్యాలు, మూలికలు, వేర్లు ............(Plant-herb, root, bark et.)

P. 756 - ఖణిజాలు (Mineral)

P. 760 - Method curing

P. 770 - Surgery

Don yoder జానపద వైద్యాన్ని రెండు విధాలుగా వర్గీకరించాడు.[8]

1. ప్రకృతి జానపద వైద్యం (Natural folk medicine) 2. మాంత్రిక-మతాచరణ జానపద వైద్యం (Magico - religious folk medicine).

ప్రకృతి జానపద వైద్యాన్నే 'rational' folk medicine అనీ, 'herbal folk medicine' అనీ పిలుస్తారు. ఈ రకపు వైద్యంలో ప్రకృతిలోని వస్తువులు రోగాల బారినుండి తప్పించే ఔషధాలుగా ఉంటాయి.

మాంత్రిక - మతాచరణ జానపద వైద్యాన్ని 'occult folk medicine' అనీ వ్యవహరిస్తారు. ఇలాంటి వైద్యంలో మానవుడు తరతరాలుగా తాను నమ్మిన ఆచార వ్యవహారాలే ఔషధాలుగా పనిచేస్తాయి.

ప్రకృతి వైద్యంలో చెట్లు మూలికలు, వేర్లు, కొన్ని ఖనిజాలు. జంతువుల అవయవాలు ఉపయోగింపబడుతున్నందున ఇలాంటి వైద్యంలో 1. సస్యవైద్యం (Plant medicine), 2. ప్రాణివైద్యం (Animal Medicine), 3. ఖనిజవైద్యం అనే విభాగాల్ని నగువనహళ్ళి రత్న వర్గీకరించి యున్నారు.[9]

సస్య వైద్యంలో ప్రధానమైనది చెట్టు మూలికల ఔషధం. ఈ మూలికల్ని కాషాయంగా చేసి ఔషధంగా సేవిస్తారు. 'There is a plant in the world for every ailment; all you have to do is find it'[10] అనేమాట గమనింపదగింది.

---

*8. Folklore and Folklife, P-192.*

9. *జానపద వివేచనె (కన్నడ), నగువనహళ్ళి రత్న Also see Folklore and Folklife, P-198.*

*10. Standard Dictionary of Folklore, legend and Mythology, P-698.*

ప్రాణివైద్యం రెండు విధాలు 1. పెంపుడు జంతువులకు చేసే వైద్యం ఉదా: కోళ్ళవైద్యం మొదలగునవి. 2. జంతువుల శరీర భాగాల్ని మానవుడు తన రోగ నివారణకై ఉపయోగించుకొంటాడు. ఉదా: ఆవు మూత్రం, గోరోచనం మొదలగునవి.

ప్రకృతి జానపద వైద్యాన్ని గురించి వివరిస్తూ Don yodor '.... represents one of man's earlier reactions to his natural environment, and involves the seeking of cures for his ills in the herbs, plants, minerals, and animal substances of nature' [11]

'ధర్మార్థకామ మోక్షాణామారోగ్యం మూల ముత్తమం' అని చరక మహర్షి ఆరోగ్యమనెడి లోకోత్తరమైన వస్తువు చతుర్విధ పురుషార్థాలకూ మూలభూతమని చెప్పాడు. కనుకనే నాటి ప్రజలు ఆరోగ్యానికి ఎనలేని ప్రాధాన్యం యిచ్చారు.

"Early to bed and early to rise makes a man healthy, wealthy and wise" అనే మాటలు ఆరోగ్యవంతుని లక్షణాల్ని చెప్పుతున్నాయి. ఆహార నియమాల్ని పాటించేవాడు సదా ఆరోగ్యవంతుడిగా ఉంటాడని మనవారి అభిప్రాయం. సర్వ రోగాలకు సర్వవిధాలైన ఔషధాలను ప్రాచీనులు కనుగొన్నారు. ఈ విషయంలో ''ఆయుర్వేద చికిత్స'' ప్రసిద్ధి నొందింది. నేడు జానపద వైద్య విధానానికి ఇంగ్లీషు వైద్యంవల్ల ఆటంకమేర్పడింది. శాస్త్రీయ వైద్య విధానాలు వ్యాప్తి చెందిన ఫలితంగా జానపద వైద్య విధానం నానాటికి నశించి పోతోంది.

'God almighty never put us here without a remedy for every ailment'[12] అనే అభిప్రాయం జానపద వైద్య విధానానికి సన్నిహితంగా ఉంది.

* * *

---

*11. Folklore and Folklife.*
*12. Ibid, P-198.*

# 21. జానపద క్రీడలు
## (Folk Games)

"Play is a form of expressive behaviour common among all human beings and manifested overfly in all cultures"

-ROBERT A GEORGES

మానవుని సాంఘిక జీవితానికి, క్రీడలకి తరతరాలనుంచీ అవినాభావ సంబంధం ఉంది. ఎంచేతనంటే ప్రాచీన మానవుడు అడవి మృగాలతో పోరాడవలసి వచ్చినప్పుడు ఆత్మరక్షణగా భుజబలాన్ని ప్రదర్శించాల్సిన అవసరం ఉండేది. విలువిద్యలాంటి విద్యలు నాటి మానవ జీవితావసరాలై రాను రాను క్రీడలుగా పరిణమించాయని విద్వాంసుల అభిప్రాయం. అందువల్లే ప్రాచీన సంస్కృతిలో క్రీడల్ని ఒక భాగంగా పేర్కొనడానికి వీలవుతుంది.

మానవునికి అన్ని రకాలైన వినోదాలు అనుభవంలో ఉండేవి 'మనస్సునకు ఉల్లాసము కలిగించు విషయమేదియో అని అన్వేషించుచూ, ఆ అన్వేషణలోనే వివిధ రకముల వినోద క్రీడలను అతడు కనుగొన గలిగెను. పేక, గాలిపటములు మొదట చీనాలో కనిపెట్టబడినవి. పోలో( గుఱ్ఱములపై నుండి ఆడెడు బంతియాట) ఆట పర్షియాలోను, పాచికల ఆట భారతదేశములోను కనుగొన బడినవి'[1] అనే అభిప్రాయాన్ని గమనిస్తే సాంస్కృతిక జీవనంలో ఒక భాగమైన క్రీడలు మన సంప్రదాయాన్ని ప్రతిబింబిస్తాయని చెప్పవచ్చు. క్రీడలు క్రీడాకారుల్లో వినోదాన్ని, స్పర్థను, శారీరక శక్తిని ఇవ్వడమే కాకుండా, ఆ ప్రాంత సంస్కృతిని అధ్యయనం చెయ్యడానికి తోడ్పడుతాయి. మెదడుకు సున్నితమైన పనిని కల్గిస్తాయి. ఆడపిల్లల ఆటల్ని గమనిస్తే వాటిలో సంసార శిక్షణ చక్కగా గోచరిస్తుంది.

మానవులకు ఆటలు-పాటలు నైసర్గికంగానే లభించాయి. తల్లి ఊపే ఊయల్లో తనయుడు కాళ్ళు చేతులూ ఆడిస్తూ ఆనందడోలికల్లో ఊగుతుంటాడు. తల్లి తన తొడలమీద కూర్చొపెట్టించుకొని, ఆమె ఆడిస్తూ పాడుతూ ఉంటే తన్మయత్వాన్ని పొందుతాడు. కాస్త పెరిగి పెద్దకాగానే తల్లితో

---

*1. తెలుగు విజ్ఞాన సర్వస్వము, హ,.10, పుట - 397.*

దాగుడు మూతలాడుతాడు. మరికాస్త పెద్దవాడు అయ్యేటప్పటికి తల్లి కౌగిలిని వదలి వీధిలోనికి పరుగెత్తుతాడు. వీధిపిల్లలతో రకరకాల ఆటల్ని ఆడుకొంటాడు. ఆటల మైదానాల్లో కుంటి కాలితో గెంతుతాడు, మట్టితో ఆడుకుంటాడు. వర్షాకాలంలో నీళ్ళల్లో కాగితాలతో చేసిన పడవల్ని వదలుతూ సరదాపడతాడు. చలికాలం వస్తే చాలు గాలిపటాలను ఎగరేస్తూ, అవి చేసే విన్యాసాలకు ఉబ్బితబ్బిబ్బవుతాడు. గోలీలాట, కోతికొమ్మచ్చి ఆట, బొంగరాలాట, బంతులాట ఆడుకుంటూ ఉత్సాహ ఉల్లాసాలతో వ్యాయామం చేస్తాడు.

సాధారణంగా పిల్లల్లో అనుకరణ శక్తి అధికం. వంటయింట్లో తల్లి చేసే వంటావార్పును గమనిస్తూనే ఉంటుంది తనయ. వంటవండటం వడ్డించడం ఆడపిల్లలు ఆడుకునే ఆటల్లో చెప్పుకోదగ్గది. అలాగే బొమ్మల పెళ్ళి. ఇది కూడ అనుకరణకి సంబంధించిందే. తల్లి పిల్లలని లాలించినట్టుగా ఈ పిల్లలు బొమ్మల్ని తమ తొడలమీద పడుకోబెట్టించుకుని లాలిస్తారు. పల్లెల్లో బయలాటలు, వీధినాటకాలను చూస్తూ పిల్లలు తామూ ఆయాపాత్రలు ప్రయోగించినట్టుగానే చీపురుపుల్లల్ని బాణాలుగా ప్రయోగిస్తూ ఆడుకుంటారు; పాడుకుంటారు. ఇటీవల టి.విలో రామాయణం చూసిన పిల్లలు బాణాలు ప్రయోగించడం మనం గమనించిందే. చేతుల్ని క్రిందపెట్టి ఇసుకతో వాటిని మూసి ఇళ్ళు కట్టుకోవడం; అంగడిపెట్టడం - అంగట్లో ఉత్తుత్తి సరుకుల్ని అమ్మడం; పాలు, నెయ్యి, కూరగాయలు, ఆకుకూరలంటూ అరుస్తూ అమ్మడం మొదలైన అనుకరణల్ని చేస్తూ పిల్లలు ఆడుకోవడం మనం గమనిస్తూనే ఉంటాం.

పిల్లలకు వినోదంగా తయారైన ఇలాంటి ఆటలు క్రమబద్ధంగా ఆడబడి సమాజంలో నిలదొక్కుకుంటాయి. ఇలా వికాసం చెందిన ఈ ఆటలే క్రమంగా బుద్ధికీ, దేహానికి కసరత్తునిచ్చే ఆటలుగా రూపుగొన్నాయి. ఆయా వయస్సులకి తగినట్టుగా పలురకాల ఆటలు ప్రచారంలోకి వచ్చాయి. ఈ ఆటలకి క్రమంగా నియమ నిబంధనలు చేరాయి. వీటినే మనం 'క్రీడలు' అంటున్నాం.

'క్రీడ' అనే సంస్కృత మూలధాతు రూపానికి టాప్, ప్రత్యయం చేరి 'క్రీడా' అన్న కృత్ప్రత్యయం ఏర్పడింది. అలాగే 'ఆడు' ధాతువుమీద భావర్థక 'ట' వర్ణం చేరి, 'డు' వర్ణం లోపం జరిగి 'ఆట' అనేరూపం ఏర్పడింది.

సాధారణంగా ఏదేని ఒక వేడుక లేదా వినోదం క్రీడ అని చెప్పవచ్చని **Standard Dictionary of Folklore** లో చెప్పబడింది. వినోదభరితుడైన

మానవుని చిత్తవృత్తి విశేషాన్ని, సహజచేష్టా ప్రవృత్తిని ప్రాయకంగా మనం ఆట-క్రీడగా భావించవచ్చని క్రీడావినోదాల మీద పరిశోధన చేసిన డా॥ వఝ్ఝ సుబ్రహ్మణ్యంగారి అభిప్రాయం.[2]

ఆటకూ క్రీడకూ తేడా వుందని చెప్తూ ఒక ఆటలో ఇద్దరి మధ్యలేదా జట్టుకూ జట్టుకూ మధ్య పోటీ లేనంతవరకూ దాన్ని ఆట (Play) అని అనవచ్చు. పోటీ ఉన్నప్పుడు గెలుపు ఓటములు తప్పవు. కాబట్టి పోటీలు ఉండి, గెలుపు ఓటములు కలిగిన ఆటలను క్రీడలు గా భావించవచ్చునని అభిప్రాయపడ్డారు డా॥ సుబ్రహ్మణ్యంగారు.[3] ఆటలకు సర్వసాధారణంగా నిబంధనలంటూ ఉండవనీ, అయితే క్రీడకు నియమనిబంధనలు, గెలుపు ఓటములు ఉండడం సహజమనీ సుబ్రహ్మణ్యంగారు అభిప్రాయపడ్డారు.

వినోదానికీ క్రీడకు తేడాని Folklore and Folklife అన్న గ్రంథంలో - As long as there is no competetive interaction the past time can be called non-game or for convenience here, recreation. Games, however differ from other play activities in that they involve competition between at least two persons.[4] అని చెప్పబడింది.

'A game then may be defined as a form of play in which two or more participants vie, either as individuals or as groups or teams, under the limitation of rules either tacitly or explcitly understood by the rules either by the contestants, for the purpose of determining which is better or best at that partiuclar form of play, a game is a dramatic play contest'[5]

R.S. Boggs ఆటల్ని క్రియా సంబంధివర్గం (Action types)లో చేర్చాడు[6]. ఆయనే మరొక చోట జానపద విజ్ఞానాన్ని కొన్ని గుంపులు (Groups)గ వర్గీకరిస్తూ 'సి' గుంపులో చేర్చాడు[7]. ఈ గుంపులో క్రీడలతోపాటు గేయకథ,

---

2. *తెలుగులో క్రీడావినోదాలు, పుట - 57.*
3. *- అదే - పుట.58.*
4. *P - 177.*
5. *Standard Dictionary of folklore, P-433.*
6. *Ibid.*
7. *- Ibid - P. 1142-43.*

జానపద గేయం, నృత్యం, సంగీతం మొదలైన వాటిని కూడ చేర్చాడు. క్రీడలు సి. 500 నుండి సి.580 గుంపులో చెప్పబడింది. ఈ గుంపులో చేరే క్రీడలు ఇలా ఉన్నాయి.

| | |
|---|---|
| C-500 | Game, passtime, sport |
| C-520 | Bodily Activity |
| C-522 | Athletic Sport and exercise, Gymnastics, Includes body part, such as finger game. |
| C-523 | Singing, Dancing, Marching |
| C-524 | Racing, Chasing, Fighting |
| C-526 | Dramatic |
| C-530 | Mental Activity |
| C-532 | Hit |
| C-534 | Memory |
| C-536 | Knowledge |
| C-538 | Guessing |
| C-560 | Special object or Implement |
| C-580 | Water, Ice, snow. |

జానపద విజ్ఞానాన్ని శాబ్దిక కళలు (Verbal Arts), శాబ్దికేతర కళలు (Non-verbal Arts), సమాహార లేక మిశ్రమ కళలు (Mixed Arts) అని విభజించి మిశ్రమకళల్లో క్రీడలు - వేడుకల్ని చేర్చారు. డా॥ సుబ్రహ్మణ్యం.

జానపద విజ్ఞానానికి సంబంధించిన ప్రతి అంశంలోను దాదాపు ఒకే రకమయిన లక్షణాలను మనం గమనించవచ్చునంటూ అజ్ఞాత కర్తృత్వం, రచనాకాలం తెలియక పోవడం, సామూహిక ప్రచారం, పాఠాంతరాలు కలిగి వుండడం. ప్రాచుర్యాన్ని పొంది వుండడం, నియమిత స్వరూపం లేకపోవడం, సరళత్వాన్ని కలిగి వుండడం, జనసామాన్య పరచితమై వుండడం అనే కొన్ని లక్షణాలను వివరించారు డా॥ సుబ్రహ్మణ్యం.[8]

---

*8. తెలుగు సాహిత్యంలో క్రీడా వినోదాలు, పుట - 95.*

## వర్గీకరణ:

'Games may be discussed according to the season in which they are played, according to the sex or age of the partcipants etc.' - Standard Dictionary of Folklore.[9]

క్రీడల స్వభావాదుల్ని బట్టి, ఆటల్లో పాల్గొనేవాళ్ళ లింగభేదాన్ని బట్టి, ఆటల్లో ఉపయోగించే క్రీడాసాధనాలను బట్టి క్రీడల్ని వర్గీకరించవచ్చుని అభిప్రాయం.[10]

నేదునూరి గంగాధరంగారు 1. ఇంట్లో ఆడునవి - ఆరుబయట ఆడునవి, 2. స్త్రీలు ఆడునవి-పురుషులు ఆడునవి, 3. బాలికలు ఆడునవి-బాలురు ఆడునవి, 4. ఎవరైనను సరే ఆడునవి, 5. శాస్త్రానుభవం కలవి - చతురంగాదులు, 6. నిషిద్ధాలు - జూదం, పేకాట మొదలైనవి[11] అని వర్గీకరించారు.

అలాగే టేకుమళ్ళ కామేశ్వరరావుగారు పాటలున్న ఆటలు కొన్ని, పాటలు లేని ఆటలు కొన్ని, చిన్నపిల్లలు ఆడుకునే ఆటలు కొన్ని, పెద్దవాళ్ళు ఆడుకునేవి కొన్ని అని ఆటల్ని వర్గీకరించారు.[12]

శ్రీ నీలా జంగయ్యగారు ఆంధ్రదేశంలో వున్న ఆటపాటల్ని చాలా చక్కగా వివరించారు. కానీ వాటిని సక్రమంగా విభజించి, అవి ఏ కోవలో చేర్తాయో నిర్దిష్టంగా చెప్పలేకపోయారు[13]. ఆటపాటల్ని స్థూలంగా రెండు విభాగాలుగా చెప్పుకోవచ్చని అవి. '1. అనంత జీవజాలంలో శ్రేష్ఠతారూపులైన మానవుల మధ్య రూపొందించిన ఆటపాటలు. 2. మానవుల మచ్చిక పడిపోయిన జంతువులకు మానవులు నేర్పిన ఆటపాటలు - ఇవి ఆయాభాషలలో ఆయా జాతులలో - ఆయా ప్రాంతాలలో ఆయా దేశాలలో - ఖండాలలో రకరకాలైన నియమ శోభితాలైన ఆనందాన్ని అందిస్తున్నాయి అని వివరించిన నీలా జంగయ్యగారు

---

*9. P - 433.*

*10. Folklore and folklife, P-176.*

*11. ఆటలు - పాటలు, పుట - 10.*

*12. సాంప్రదాయిక విజ్ఞానం, పుట - 10.*

*13. 'తెలుగు (వైజ్ఞానిక పత్రిక) ఏప్రిల్ - జూన్ 1980.*

ప్రపంచ పరివ్యాప్తమై ఉన్న ఈ ఆటపాటలన్నీ మూడు రకాలుగా విడదీయడానికి వీలున్నదని అవి: 1. మౌనంగా ఆడే ఆటలు, ఉదా: పులిజూదం, ఇస్పేటు, చదరంగం (కూర్చొని ఆడే ఆట) ఇవి ఎన్నో రకాలుగా ఉన్నవి. 2. పలుకు అనుబంధంలో ఆడే ఆటలు ఉదా: గద్దొచ్చె కోడిపిల్లాట, బండారు మైసీ ఆట, దాగిళ్ళు మూగిళ్ళు ఆట, 3. పదంతోనో లేదా పాటతోనో, చిందుతోనో ఆడే ఆటలు, ఉదా: అడుగుల భజన, జడకొప్పుకోలాటం, బ్యాట్‌మింటన్, చెండాట' లంటివి అన్నారు. వీరే ఈ ఆట పాటలు పండగల ననుసరించి కూడా ఉన్నాయని, వాటిని స్త్రీల సంబంధమైన ఆటపాటలు, పురుష సంబంధమైన ఆట పాటలు అని రెండుభాగాలుగా చేసుకొనవలసి ఉంటుందన్నారు. ఈ ఆటపాటలు ఈడు ననుసరించినవిగా, అభిరుచి ననుసరించినవిగా, ఎన్నో విభాగాలవుతూ ఉంటాయి, సమయ సందర్భాలను బట్టి వాటి లక్ష్య లక్షణాలు వేరు కావచ్చు అన్నారు. ఇంకొక చోట ఈ ఆటపాటలు వృత్తులను అనుసరించి కూడా ఉన్నాయి అన్నారు. పైగా వీరు వ్యాసాన్ని ముగిస్తూ 'ఆయా ఆటపాటలను గూర్చిన చరిత్ర అనిర్వచనీయమైందే, అయినా వాటి తీరునుబట్టి ఇవి ప్రాకృతికములు - ఇవి సాంస్కృతికములు 'ఇవి కాల్పనికములు అని మూడు భాగాలుగా విభజించుకో వచ్చును' అన్నారు. ఇలా వీరు ఆటపాటల్ని చెప్తూ పోయారేకానీ వీటిని ఒక నిర్దిష్టమైన చట్రంలో ఇమడ్చలేక పోయారు.

క్రీడా వినోదాన్ని డా॥ వడ్లా సుబ్రహ్మణ్యంగారు 12 రకాలుగా విభజించారు[14].

1. మానవుని వివిధ దశలననుసరించి (According to different stages in life)

   (a) బాల్యం - పూర్వబాల్యదశ (5 ఏళ్ళలోపు) (Pre-childhood )
   ఉత్తర బాల్యదశ (5నుంచి 15 ఏళ్ళలోపు) (Postchild)

   (b) యౌవనం: (15నుంచి 25 ఏళ్ళలోపు) (Youth)

   (c) కౌమారం: (25 నుంచి 60 ఏళ్ళలోపు)

   (d) వార్ధక్యం: (60 ఏళ్ళ పైబడి) దశలలో ఆడే ఆటలు

---

*14. తెలుగు సాహిత్యంలో క్రీడా వినోదాలు, పుటలు 78-80.*

2. స్త్రీ. పుం. భేదాశ్రితాన్నిబట్టి (According to sex)

(a) స్త్రీలు (Females) - బాలికలు, యువతులు, స్త్రీలు ఆడేవి

(b) పురుషులు (Males) - బాలురు, యువకులు, పురుషులు ఆడేవి

(c) స్త్రీ పురుషులు (Both Females and Males) కలిసి ఆడేవి.

3. ఉత్సాహాంకాలు - సామాన్య రోజులలో ఆడే ఆటలు (Ordinary days games)

ఉత్సవాంకాలు - పండుగ పబ్బాలలో ఆడే ఆటలు (With reference to feasts and festivals)

4. ఇంటి లోపల ఆడే ఆటలు (Indoor games) / ఆరు బయట ఆడే ఆటలు (Outdoor games)

5. పగటి వేళల్లో (During day time), రాత్రిళ్ళలో (During night time) ఆడే ఆటలు.

6. పౌర (Urban) / జానపద (Rural) భేదాన్నాశ్రయించి

7. క్రీడాకారుల సంఖ్యను బట్టి (According to the number of participants)

(a) వ్యష్టి నిరూపకాలు (Individual)

(b) సమిష్టి నిరూపకాలు (Group)

(i) సామూహికంగా కలసికట్టుగా ఆడే ఆటలు (Combined group games)

(ii) రెండు జట్లుగా ఏర్పడి ఆడే ఆటలు (Team games)

8. క్రీడా సాధనాలను బట్టి (According to the type of equipment used)

(a) నిర్జీవ పదార్థాల తోడ్పాటు కలవి (With the help of inanimate objects)

(b) జీవ జంతువుల ఆధారంతో ఆడేవి (With the help of animate objects)

(c) ఏ పరికరాల తోడ్పాటు అవసరం లేనివి. (Without the help of any equipment)

9. బుద్ధి (Related to mind) / శరీర సంబంధులు (Related to body) and ద్వ్యవధానానికి సంబంధించినవి కొన్ని (Related to both mind and body)

10. మతపరమైనవి (Related to religion)
మతేతరమైనవి (Non Religions)

11. ఋతువులను బట్టి (According to seasons)
నైసర్గిక స్థితిని బట్టి (According to geographical distribution)

12. ఆర్థిక, సామాజిక అంతరువులను బట్టి (According to economical and social status)

డా॥ సుబ్రహ్మణ్యంగారి పై విభజన క్రీడలకు సంబంధించిన అన్ని అంశాలను లోగొన్నదిగా ఉన్నది: అత్యంత సమంజసంగా కన్పిస్తున్నది.

## క్రీడల ప్రస్తావన – కృషి:

మానవ జీవన విధానంలో క్రీడలకి ప్రముఖ స్థానం వుంది. ఆటల్ని గురించి ప్రచురింపబడ్డ గ్రంథాలు తక్కువే. క్రీడా స్వభావాన్ని గురించి పూర్వ పరిశోధకులెవ్వరూ పట్టించుకోలేదు. ఇంగ్లండు దేశస్థుడైన Joseph Strutt తన దేశంలోని విరామ సమాయలలోని activities గురించి The Sports and Pastimes of the people of England (1801) లో వివరించి చక్కని ఉపోద్ఘాతం వ్రాశాడు[15].

15. *Folklore and folklife, P-174.*

పంతొమ్మిదో శతాబ్దాంతానికి యూరపు దేశంలో చాలామంది క్రీడల్ని సేకరించారు. జర్మన్, రష్యా, హంగేరి, నార్వే, డెన్మార్కు దేశాల్లో సేకరణ, ప్రచురణలు జరిగాయి.

క్రీడలకు సంబంధించి ప్రకటింపబడ్డ గ్రంథాలు తెలుగులో అత్యల్పం. అయితే ప్రాచీన సాహిత్యంలో తెలుగు కవులు తమతమ కాలాల్లో ఉన్న ఆటపాటల్ని సోమన పండితారాధ్య చరిత్ర, బసవపురాణాల్లోను, నాచన ఉత్తర హరివంశం లోను, కొరవి గోపురాజు సింహాసనా ద్వాత్రింశికలోను తెలుగువాళ్ళ ఆటల్ని పేర్కొన్నారు.

వేదాల్లు, ఉపనిషత్తుల్లో వేట, గుర్రపుసవారి, ధనుర్విద్యలు, ఈత మొదలైన క్రీడలు చెప్పబడ్డాయి. ప్రాచీనకాలంలో పగడాలాట, జూదం మొదలైనవి అనిష్టాలని తెలిసినా వాటికి బహుజనాదరణ ఉండేవి. జూదానికి మహాభారతం నిదర్శనం. కుస్తీ, ముష్టియుద్ధాలు నాటి కాలానికి నిత్య క్రీడలుగా ఉండేవి.

బొంగరాలాట పల్నాటి వీరచరిత్ర, బాలనాగమ్మ కథ, పరంజోతి కథలోను, పల్నాటి వీర చరిత్ర, బొబ్బిలి రాజు కథల్లోను కన్పిస్తాయి. గోలిగుండు, చిఱ్ఱగోనె, కుందినగుడి, పాచికలాట మొదలైనవి కూడ జానపదగేయకథల్లో చోటు చేసికొన్నాయి.

తెలుగులో క్రీడల స్వరూప స్వభావాలని, వివిధ రకాల క్రీడల్ని వివరించే వ్యాసాలు చాలా తక్కువగా వచ్చాయి. నేదునూరి వారు తమ 'ఆటలు-పాటలు' గ్రంథంలోను, టేకుమళ్ళ కామేశ్వర రావుగారు తమ 'సాంప్రదాయిక విజ్ఞానం' లోను, వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, మంగిపూడి వేంకట శర్మగారు 'భారతి' పత్రికలోను క్రీడలకు సంబంధించిన వివరాలను తెలియజేశారు. 'గృహలక్ష్మి' పత్రికలో కూడ ఆటల్ని గురించి ప్రకటింపబడ్డాయి. 'యుగయుగాల్లో భారతీయ మహిళ' అన్న గ్రంథంలో శ్రీమతి జె. వరలక్ష్మిగారు, 'సారస్వత నవనీతం' అన్న గ్రంథంలో దేవులపల్లి రామానుజరావు గారు, క్రీడల్ని ప్రస్తావించారు. అలాగే మాగంటి బాపినీడు 'ఆంధ్ర సర్వస్వము' గ్రంథంలోను, సురవరం ప్రతాపరెడ్డిగారు 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' లోను, మల్లంపల్లి సోమశేఖర శర్మ, కావూరి ప్రసన్న సత్యనరాయణ మొదలైనవాళ్ళ 'విజ్ఞాన సర్వస్వం', 'సంగ్రహాంధ్ర విజ్ఞానకోశం' సంపుటాల్లోను క్రీడల్ని గురించి ప్రస్తావించారు. డా॥ బిరుదురాజు రామరాజుగారు, డా॥ తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారు ఆటలకు సంబంధించి కొంత కృషి చేశారు.

ఇటీవలి కాలంలో ఆటలు - పాటలు గురించి శ్రీ నీలా జంగయ్యగారు, 'తెలుగు సాహిత్యంలో క్రీడావినోదాలు' అన్న అంశంపైనే పిహెచ్.డి. చేసిన డా॥ వఝ్ఝ సుబ్రహ్మణ్యంగారు, 'ఆంధ్రుల జానపద విజ్ఞానం' లో ఆటలు - వినోదాలకు సంబంధించి చక్కని వివరణనిచ్చిన డా॥ ఆర్వీయస్ సుందరంగారు క్రీడల స్వరూప స్వభావాలను గురించి విశ్లేషించడం జరిగింది.

## క్రీడల ప్రయోజనం – ఆవశ్యకత:

ఆటలు పిల్లలకి ఆనందాన్నిస్తాయి. బుద్ధికి పదనుపెడతాయి. శారీరక వికాసానికి దోహదం చేస్తాయి. ఆటల సమయాల్లో పలురకాల ఆటగాళ్ళతో కలవడం వల్ల పరస్పరం స్నేహం ఏర్పడుతుంది. ఒకొర్నొకరు అర్థం చేసుకోవడం జరుగుతుంది. స్పర్థాత్మక క్రీడల కోసం పలుప్రాంతాలను దర్శించడం వల్ల ఆయా ప్రాంతాల సంస్కృతి అవగాహన అవుతుంది. ఒక విధంగా క్రీడలు జాతీయ సమైక్యతకి నాందీ పలుకుతాయి.

క్రీడలవల్ల క్రమశిక్షణ ఏర్పడుతుది. గెలుపు ఓటముల్ని సమానంగా తీసుకునే మనోభావన ఏర్పడుతుంది. మనోధైర్యం పెరుగుతుంది. స్పర్థించాలనే ఉత్కటమైన కాంక్ష, సాహస లక్షణాలు పెంపొందుతాయి.

పాశ్చాత్య సంపర్కం వల్ల మన సాహిత్యంలోను, సంస్కృతిలోను మార్పు వచ్చినట్టుగానే క్రీడల్లోను వస్తోంది. పాశ్చాత్యుల ఆటలు మనలోను చోటు చేసుకొని మన ఆటలు కనుమరుగైపోతున్నట్టు కన్పిస్తోంది. మన ఆటల్ని మరచిపోతున్నాం. ఉదాహరణకి ఇస్పేటు, గుర్రపు పందేల ఆటలు మనమీద, మన సంస్కృతి మీద ఎలాంటి ప్రభావాన్ని చూపిస్తున్నాయో మనకు బాగా తెలుసు. ఇవి డబ్బుకోసం ఆడే ఆటలు. మనవి పైసా ఖర్చుకాకుండానే ఆడే ఆటలు. ఇవి కూడ మన జనపదాలని ఎగబ్రాకి మానసిక దౌర్బల్యాన్ని తెచ్చిపెడ్తున్నాయి.

కొంతకాలం పోతే మనం మరచిపోతున్న ఆటల్ని మళ్ళీ క్రొత్త తరహా ఆటలుగా ఆ పాశ్చాత్యులే పరిచయం చేసే ప్రమాదం ఉంది. మనం మన దేశీయ క్రీడల్ని 'పాత చింతకాయ పచ్చడి'లాగా అనుకుంటున్నాం. అయితే ఆ పాత పచ్చడిలో కూడ సారం ఉందని తెలుసుకోలేక పోతున్నాం.

మన సంస్కృతీ, సంప్రదాయాలతో కూడుకొన్న క్రీడల్ని పరిరక్షించడం మన విధి, కర్తవ్యం.

## జానపద క్రీడ - గాలిపటం:

ఆకాశంలో గాలిపటాల్ని ఎగిరించడం ఒక జానపదక్రీడ. గాలిపటాన్ని తయారు చెయ్యడం ఒక జానపద కళ. ఈ ఆటకి చిన్నా, పెద్దా తేడా లేదు. ఇదొక స్పర్థాత్మక క్రీడ. శారీరకం గాను, మానసికంగాను ఉల్లాసం, ఉత్సాసం, వినోదం, వేడుక కల్గించడమే ఈ ఆట ప్రయోజనం.

ఆషాఢమాసం ఈ ఆటకు అనువైన సమయం. ప్రపంచాద్యంతం ఈ క్రీడ వ్యాప్తిలో ఉంది. భారత, చైనా దేశాల్లో ఇది వినోదాన్నిచ్చే క్రీడ అవుతే కొరియా దేశంలో దౌర్భాగ్యాన్ని, దుష్టశక్తుల్ని పారద్రోలేందుకు గాలిపటాల్ని ఎగురవేస్తారట[16]. చైనా దేశంలో దీన్ని జాతీయ క్రీడగా పరిగణిస్తారు.

క్రీ.పూ. మూడో శతాబ్దంలో గ్రీసుదేశపు అబిటస్ అనే ఆయన గాలిపటం తయారు చెయ్యడం కనిపెట్టాడని పెక్కు చిత్రకారుల అభిప్రాయం. చైనా దేశంలో క్రీ.పూ. 206లో హనసిన్ అనే ఒక సేనాధిపతి యుద్ధతంత్రంలో ఉపయోగించేందుకు గాను దీన్ని కనిపెట్టాడని చైనీయుల విశ్వాసం.

గాలి పటాల్ని ఉత్తర హిందూస్థానీయులు 'పతంగ్' అంటారు. తెలంగాణా ప్రాంతంలో 'పతంగ్' అన్న పేరే వినవస్తుంది. కన్నడ దేశంలో 'గాళిపట' అన్న పేరు వ్యవహారంలో ఉంది. గాలిపటాల్లో ఎన్నోరకాలు ఉన్నాయి. వాటి సైజును బట్టి ఆకారాన్ని బట్టి పేర్లు విన్పిస్తాయి.

* * *

---

*16. 'జానపద జగత్తు' (కన్నడ జానపద పత్రిక) పుట - 24, జూలై - ఆగస్టు 1988.*

# 22. జానపదుల వంటావార్పు
## (Folk Cookery)

ప్రాంతీయతా భేదంతో సాంప్రదాయికంగా వచ్చిన గృహపాకకళే జానపదుల వంటావార్పు అని డాన్ యాడర్ నిర్వచనం[1]. జానపద పాకకళాధ్యయనంలో ఆహార పదార్థాలు, వాటిని తయారుచేయడం, వాటిని నిలువవుంచే విధానం, వాటి సామాజిక లక్షణాలు, జానపదుల జీవనంలో వాటి పాత్ర, వంటకాలకు వాడే పాత్రలు మొదలైనవన్నీ చేర్తాయి. జానపద పాకకళ నేటి వ్యాపార సంబంధమైన పాకకళకు పూర్తిగా భిన్నమైంది.

మానవ ప్రవృత్తిలో ఆకలికి విశిష్టమైన స్థానం ఉంది. ఆయా పరిసరాలకు సంబంధించినట్టుగా వివిధ ఆహార పదార్థాలను మానవుడు ఆశించాడు. వాటిని సంపాదించుకొన్నాడు. ఆకలికి తగిన రుచి వివిధ ఆహారపదార్థాల తయారీకి కారణమైంది. ఆహార పానీయాలు మనిషి నుంచి మనిషికీ, ఒక సమాజం నుంచి మరో సమాజానికీ, ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికీ వ్యత్యాసంతో కూడుకొని వుంది. 'ఒక్కొక్క సంస్కృతిలోను ఆహార పద్ధతులు తమవే అయిన వైశిష్ట్యంతో కూడుకొని ఉంటాయి. వాటి వైవిధ్యం అపారం. పరంపరాగతమైన జనజీవనంలో వేరుదన్ని నేటికీ నిలిచివున్న ఆహార పద్ధతులు జానపద ఆహార పానీయాలు అవుతాయి'[2]

సాంప్రదాయికంగా వస్తున్న వంటావార్పును 'గ్రామీణుల వంటావార్పు'గా అభిప్రాయపడితే అది కేవలం గ్రామానికి మాత్రమే పరిమితం అవుతుంది. మన నగరాలు పల్లెలకంటే పూర్తిగా భిన్నాలని చెప్పడం సాధ్యం కాదు. పల్లెల్లోని వంటలు పట్టణాల్లోను, నగరాల్లోను చేయబడుతున్నాయి. అందువల్ల గ్రామీణుల వంటలతో పాటు నగరాల్లోని వంటల్ని కూడ మనసులో ఉంచుకొని 'జానపదుల వంటావార్పు'గా అధ్యయనం చేయడం అవసరమనిపిస్తుంది. 'It is not the folk

---

1. *Folklore and folklife, P-325, Ed. by Richard M. Dorson.*
2. *జీ. శం. పరమశివయ్య, 'జానపద అడుగెగళు. సుశీల హొన్నెగౌడ. మున్నుడి 'కర్నాటక జానపద' గ్రంథం, పుట - 260.*

but the folkishness that matters' అన్న విషయాన్ని ఇక్కడ మనం గుర్తుంచుకోవాలి.

పల్లెల్లో కూలీనాలీ చేసుకొని పొట్టపోసుకునే స్త్రీలకు రకరకాలయిన వంటల్ని చేసుకొని తినడానికి తీరిక ఉండదు. అంతే కాకుండా ఆయా వంటల్ని చేసుకోవడానికి కావలసిన ఆహార పదార్థాలను సమకూర్చుకునే సామర్థ్యం కూడ ఉండదు. అంబలి, రాగిముద్దలే వాళ్ళ పాలిటి షడ్రసోపేత భోజనం.

ఆర్.ఎస్. బాగ్స్ మరోచోట జానపద విజ్ఞానాన్ని వర్గీకరిస్తూ జానపద విజ్ఞానాంశాలను ఆరు ప్రధాన విభాగాలుగా వింగడించాడు. అవి. 1. Group (గుంపు), 2. Category, 3. Type (వర్గం), 4. Form, 5. Division (విభాగం), 6. Sub-Division (ఉప విభాగం). ఇలా బాగ్స్ విభజించిన గుంపుల్లో ఆహారపానీయాలు N గుంపుకు చెందుతుంది. N-200 ఆహారం - N-400 పానీయం.

N-200 ఆహారం

N-220 వడ్డన

N-222 వివిధవేళల్లో భోజనం

N-226 వంటకు ఉపయోగించే పాత్రలు; పీటలు, చాపలు, కంచాలు ఇత్యాది.

N-240 ఆహారంలో రకాలు, తయారుచేసే పద్ధతులు.

N-242 తయారు చేసే పద్ధతులు (తరగడం, ఉడికించడం, వేయించడం, ఎండ బెట్టడం, ఉప్పులో ఊరబెట్టడం, నానబెట్టడం ఇత్యాది)

N-243 మిశ్రఆహారాలు పానీయాలతో కలిపి (చారు, పులుసు ఇత్యాది)

N-244 వృక్షసంబంధాలు (ధాన్యాలు, కూరగాయలు, పండ్లు గింజలు ఇత్యాది)

N-245 మాంసం (పెంపుడు జంతువులకు సంబంధించింది: మేక, గొర్రె, గేదె ఇత్యాది)

అడవి ప్రాణులకు సంబంధించింది: జింక, ఎలుగుబంటి ఇత్యాది.

పక్షులకు చెందింది: కోడి, బాతు ఇత్యాది

నీటి ప్రాణులకు చెందింది: చేపలు, ఇతర నీటి ప్రాణులు)

**N-246** జంతుసంబంధాలు

**N-247** తీపి పదార్థాలు

**N-248** సువాసన ద్రవ్యాలు

**N-400** పానీయం

**N-420** పాత్రలు

గ్లాసు, కప్పు, గాజుపాత్ర, పింగాణీ పాత్ర, రాగి, వెండి చెంబులు ఇత్యాది.

**N-440** పానీయాల రకాలు

**N-442** నీళ్ళు

**N-443** మద్యేతరాలు - పండ్ల రసాలు

**N-444** మద్యేతర ధాన్య సంబంధ పానీయాలు

**N-446** ఆకులు, బెరడు, వేర్లతో చేసినవి

**N-447** మద్య సంబంధాలు (కల్లు, సారాయి ఇతరాలు)

**N-448** జంతుసంబంధాలు

**N-800** ఆహార పానీయాల సేవన

(నమలడం, తినడం, మింగడం, చప్పరించడం, వాసన చూడడం ఇత్యాది)

రిచర్డ్ ఎమ్. డార్సన్ వర్గీకరణలో జానపదుల వంటావార్పు వస్తు సంస్కృతి (Material Culture) లో చేరుతుంది.

జానపదుల వంటావార్పును రెండు తీరులుగా విభజించుకోవచ్చు. 1. మత సంబంధం, 2. వస్తు సంస్కృతి. ఇందులో మతసంబంధం పండుగ పబ్బాల్లో తయారుచేసే పాక కళకూ, ఆహారనియమ నిషేధాలకు సంబంధించినవి.

నగరాల్లో ఉన్నట్టుగా కాక పల్లెటూళ్ళోని వంట ఇళ్ళు చాల సరళంగా ఉంటాయి. వంట ఇంటి సామాన్లు అంతే. కుండ, బాణలి, కవ్వం, గుండ్రాయి,

తట్ట, చెంబు, రోలు, రుబ్బురాయి, ఉట్టి, ఉట్లట్రాడు, పొయ్యి, నీళ్ళు కాచే పొయ్యి ఇత్యాదులన్నీ సర్వసాధరణంగా ఉండనే ఉంటాయి.

జానపదుల వంటావార్పులో నిర్దిష్టమైన కొలతలు ఉండవు. అన్నీ చేతిగుర్తులే. చూచాయగా ఆయా పదార్థాలను వాడడం పరిపాటి. వాళ్ళు గుర్తుపెట్టుకొన్న చెంబు, గ్లాసు, కొలతలు ప్రమాణాలను చెప్పడానికి వాళ్ళదే అయిన పారిభాషిక శబ్దజాలం ఈ పాకకళలో ప్రాధాన్యం వహిస్తుంది. ఉదాహరణానికి నిమ్మకాయంతగాత్రం, ఆవాలగింజంత, అత్తెసరు, ఒక చుక్క, ఒక దోసిలి ఇత్యాది.

పల్లెల్లో వంటచెయ్యడంలో సంప్రదాయాలు, విశ్వాసాలు కన్పిస్తాయి. వారంలో ఒకటి రెండురోజులు సాధారణంగా సోమ, శుక్రవారాలు పొయ్యిని ఆవుపేడతో అలికి పసుపు కుంకుమల్ని పెడతారు. పెళ్ళి సమారంభాల్లో పొయ్యికీ, అన్నపురాశికీ పూజ చేయడం కన్పిస్తుంది. కొత్త కుండల్ని ఉపయోగించడానికి ముందు వాటిని బాగ కడిగి, చుట్టూ సున్నం పూసి, నీళ్ళు నింపి పొయ్యిమీద ఉంచుతారు. వంటింట్లో ఉపయోగించడానికి ప్రత్యేకంగా చీపుర్ని ఉంచుతారు.

వంట చేయడంలోను, వడ్డించే సమయంలోను కొన్ని నీతినియమాలు ఉన్నాయి. భోజన సమయంలో ఒకే పంక్తిలో ఏడుగురు కూర్చోరాదన్న విశ్వాసం కొన్ని ప్రాంతాల్లో కన్పిస్తుంది. పంక్తిలో అందరికీ అన్ని పదార్థాలు వడ్డించిన తర్వాతే భోజనం చేయాలి. అలాగే అందరి భోజనాలు ముగిసిన తర్వాతే పంక్తినుంచి లేవాలి. కొంతమంది భోజనానికి ముందు ఒకటి రెండు అన్నపు ముద్దల్ని నేలమీద ఉంచుతారు. కంచం లేదా విస్తరాకు చుట్టూ నీళ్ళు చిముకరిస్తారు. నిండు చూలాలును అందరిముందూ భోజనానికి కూర్చోబెట్టక కాస్త మరుగున కూర్చోబెట్టి వడ్డిస్తారు. ఆమెకు దృష్టిదోషం తగలకూడదన్న నియమం కన్పిస్తుంది. పిల్లలకి అన్నం తినిపించిన తర్వాత ఆఖరిముద్దను దృష్టితీసి పారవేయడమో లేక కుక్కకు వేయడమో చేస్తారు.

పండుగ పబ్బాల్లో విశేష వంటకాలను చేసే పద్ధతి కన్పిస్తుంది. ఉదాహరణకి విఘ్నేశ్వరుడి పండక్కి కుడుములు చేయడం, ఉగాదికి 'ఓళిగలు' చేయడం పరిపాటి.

ఆడపిల్లలు ఋతుమతులయినప్పుడు కొబ్బరి-బెల్లం, నువ్వులు - బెల్లం తినిపిస్తారు.

సాధారణంగా పెళ్ళి సందర్భాల్లో మాంసాహారం నిషేధింపబడుతుంది.

ఒక ప్రాంతంలోని ఆహారపద్ధతి అక్కడి వర్షపాతం, భౌగోళిక పరిస్థితులు, నేల స్వభావం, నీటివనరులు మొదలైన అనుకూల పరిస్థితులే కాకుండా సామాజిక, ఆర్థికవ్యవస్థమీద కూడ ఆధారపడి ఉంటుంది. అలా నీటి వసతులు, భూమి స్వభావాన్ని బట్టి రాయలసీమ, తెలంగాణ, తీరప్రాంతాల అభిరుచులు, అలవాట్లలో వ్యత్యాసం కన్పిస్తుంది. వంటలు ఆయా ప్రదేశాల్లో పండించే ఆహారధాన్యాలమీద ఆధారపడి ఉంటుంది. పంట ఆ ప్రదేశంలో పడే వర్షాధారం మీద, నేలమీద ఆధార పడి ఉంటుంది. నాగరికతా వికాసంతో పాటు వంటావార్పు సంప్రదాయం కూడ వికాసాన్ని పొందింది. పచ్చి మాంసాన్ని తిన్న ఆదిమమానవుడు నిప్పును కనిపెట్టినప్పట్నుంచీ ఆ పచ్చిమాంసాన్నే కాల్చుకొని తింటే రుచికరంగా ఉంటుందని భావించి ఉంటాడు. దీన్ని బట్టి చూస్తే మానవుడు మొదట మాంసాహారి అయిన తర్వాతే శాఖాహారి అయిఉంటాడని చెప్పడానికి వీలుంది.

జానపదులు చూడడానికి నాగరికుల్లా కన్పించక పోయినప్పటికీ సాధారణంగా మంచి ఆరోగ్యం కలిగి, నగరవాసుల కంటే అధిక రోగనిరోధక శక్తిని కలిగినవాళ్ళుగా ఉండడాన్ని మనం గమనిస్తున్నాము. నేడు నగరవాసులో కన్పించే బ్లడ్‌ప్రెజర్ కానీ హృద్రోగాలు కానీ జానపదుల్లో ఎక్కువగా కన్పించవు. దానికి కారణం జానపదుల ఆహారవిహారాది విషయల్లో ప్రకృతికి దగ్గరగా ఉండడమే. ప్రకృతిలో ఆయాకాలాల్లో లభించే కూరగాయలు, ఆకుకూరలు, పండ్లను తాజాగా ఉపయోగిస్తారు.

నేడు జానపద పాకకళ శాస్త్రీయాధ్యయన విషయంగా ఉంది. పాక కళలో డిగ్రీ, పి.జి.డిగ్రీలు, డాక్టరేట్లు, డిప్లొమోలు చేసిన వాళ్ళున్నారు. ఆధునిక కాలంలో వంటావార్పు ఒక కళగా పరిగణించబడుతోంది. కొన్నివేల సంవత్సరాలకి ముందే వంటపద్ధతిని మన కావ్యాలు పాకశాస్త్రమని పిలిచాయి. దీనికి ఉదాహరణంగా మహాభారతంలో భీముణ్ణి, నలుణ్ణి పాకశాస్త్ర ప్రవీణులుగా కీర్తించడం కన్పిస్తుంది ప్రాచీన కావ్యాల్లో రకరకాల వంటలు ప్రస్తావించబడ్డాయి. శ్రీ కాళహస్తి మాహత్మ్యం, కేయూరబాహు చరిత్ర, హరవిలాసం, శ్రీనాథుని చాటువులు, క్రీడాభిరామం, భీమేశ్వర పురాణం, ఆముక్తమాల్యద మొదలైన కావ్యాల్లో ఆహార పదార్థాల ప్రస్తావన కన్పిస్తుంది.

జానపదుల వంటల్ని నాలుగు రకాలుగా వింగడించుకోవచ్చు. అవి 1. శాఖాహారం, 2. మాంసాహారం, 3. నంజుళ్ళు, 4. పానీయాలు.

నంజుకోవడానికి ఉల్లిపాయలు, మిరపకాయలుంటే చాలు. బియ్యపురొట్టె, జొన్నరొట్టె, రాగిరొట్టెలకు కారంనూరిన నంజుడు కన్పిస్తుంది. రాగిలేదా జొన్న ముద్దలు జానపదులు ముఖ్యంగా భోజనానికి ఉపయోగించే ఆహార పదార్థాలు.

నగరవాసుల్లో రోజురోజుకు మారుతున్న అభిరుచులు, అలవాట్లు, ఆహారాది విషయాల్లో మార్పులు జానపదులమీద కూడ తమ ప్రభావాన్ని చూపుతున్నాయి. జానపదుల వంటలు కనుమరుగుతున్నాయి. ఆంధ్రదేశంలోని ప్రతి జిల్లాలోను వంటలు వివిధ రకాలుగా ఉంటాయి. చిత్తూరు జిల్లాలో కన్పించే జానపదుల వంటావార్పుల్ని వివరిస్తాను.[3]

## 1. సంగటిముద్ద (రాగిముద్ద):

పొయ్యిమీద పాత్రను పెట్టి కావలసినంత నీళ్ళు పోస్తారు. దీన్నే 'ఎసురుపెట్టడం' అంటారు. నీళ్ళు బాగా మరగిన తర్వాత బియ్యం నూకల్ని తగినంత అందులో వేస్తారు. నూకలు కాస్త ఉడికిన తర్వాత రాగిపిండి తగినంత వేస్తారు. ముద్దను కలపడానికి ఉపయోగించే 'సంగటికట్టె'ను పాత్రలో ఉంచుతారు. నీళ్ళు బాగా వేడెక్కి కుతకుతమంటూ పొంగు వచ్చిన తర్వాత కర్రతో పిండిని బాగా త్రిప్పుతారు. దీన్నే 'సంగటి కలగడ' మంటారు. ఇలా ఉండలు రాకుండా త్రిప్పిన తర్వాత, పాత్రను క్రిందకు దించి, పాత్రలో ఉన్న సంగటిని ఈ ఆకారంలో ఉన్న కొయ్యపలకమీద వంచుతారు. పాత్రకు మెత్తుకొన్న సంగటిని గోకుడు బిళ్ళతో గోకి పలకమీద వేస్తారు. తర్వాత గోకుడుబిళ్ళతో ఆకారంలో గుంతలా ఉన్న బొప్పిలో సంగటిని తీసుకుని, నీళ్ళు చేతికి తేమచేసుకుని ముద్దలా చేస్తారు. ఇలా చేసిన ముద్దల్ని పాత్రలో వేసి, పాత్రకు పొయ్యిలో ఉన్న బూదిని విభూతిలా పెట్టి, రెండు చేతులతో పాత్రకు మూడుసార్లు నమస్కరించి పాత్రమీద మూత మూస్తారు. పాత్రలు సాధారణంగా రాగి లోహంతో చేసినవిగా ఉంటాయి. సంగటి ముద్దల్ని చేయడానికి కొంతమంది మట్టిపాత్రల్ని ఉపయోగిస్తారు.

---

3. *చిత్తూరు జిల్లాలోని జానపదుల వంటల్ని తెలియజేసిన డా. టి. నారాయణకు కృతజ్ఞుణ్ణి.*

**2. 'అలసంద సారు' లేక పులుసు:** అలసందల్ని బాగా ఉడికించి కొద్దిగా ఉడికిన అలసందల్ని తీసుకుని, దానికి తగినంత కారంపొడి, ధనియాల పొడి, ఉప్పు, చింతపండు, కొద్దిగా కాల్చిన ఎఱ్ఱగడ్డలు (ఉల్లిపాయలు), తెల్లగడ్డలు (వెల్లుల్లి) కొన్నింటిని చేర్చి బాగా రుబ్బుతారు. రుబ్బిన వీటికి తగినంత నీళ్ళు కలిపి, మిగిలిన అలసందుల్ని అందులో వేసి పొయ్యిమీద పెట్టి మరగబెడతారు. బాగా మరగిన తర్వాత 'తిరగమోత' (పోపు) వేస్తారు. దీన్నే 'తిరగబాత వేయడం' అంటారు. తిరగబాత వేయడానికి ఖాళీ పాత్రను పొయ్యిమీద ఉంచి, అందులో కొంచెం నూనెపోసి తగినంత 'వడియం' వేస్తారు (వడియం చేయడాన్ని 'వడియాలు చేయడం' అన్న శీర్షిక క్రింద వివరించడం జరిగింది). వడియం బాగా వేగిన పిమ్మట 'సారు' (చారు)ను అందులో పోస్తారు. పోసిన తర్వాత పాత్రమీద మూత ఉంచుతారు. సంగటికి నంజుకోవడం కోసం అలసంద పులుసును చేస్తారు.

వడియాలు లేకపోతే బాగా కాగిన నూనెలో మొదట 'సాసువులు' (ఆవాలు) వేసి, అవి చిట్లిన పిమ్మట కొద్దిగా కరవేపాకు వేస్తారు. ఆ తర్వాత ఉల్లిపాయముక్కలు, కొద్దిగా జిలకర, ఉద్దిబేడలు (ఉద్దిపప్పు), వెల్లుల్లి, శనగబేడలు వేస్తారు. పోపు బాగా వేగిన పిమ్మట చారులో కలుపుతారు.

**3. వడియాలు చేయడం:** ఉల్లిపాయల్ని, వెల్లుల్లిని బాగారుబ్బి తగినంత ఇంగువ, కరవేపాకు అందులో వేస్తారు. కొద్దిగా వేయించిన జిలకర, ఉద్దిపప్పు, శనగపప్పు కూడ అందులో వేస్తారు. ఈ మిశ్రణాన్ని ఒక పాత్రలో వేసి, ఒక రాత్రంతా బాగా నానబెట్టిన తర్వాత, ఉదయం ఎండ రాగానే మిశ్రణాన్ని పిండి ఉండలు కడతారు. వీటిని వెదురుతో చేసిన వెడల్పు తట్టల్లో (వీటినే 'సిబ్బి' అంటారు) ఎండ బెడతారు. పిండగా వచ్చిన రసాన్ని పాత్రలో వేసి ఎండలో పెడతారు. మరుసటిరోజు మళ్ళీ ఉండల్ని రసంలో కలుపుతారు. మళ్ళీ ఈ మిశ్రణాన్ని పిండి ఉండలు కడతారు. వీటిని ఎండబెడతారు. ఈ విధంగా ఉండలు ఆ రసాన్ని పూర్తిగా పీల్చుకొని ఎండేంత వరకు చేస్తారు. ఉండలు బాగా ఎండలో ఎండిన తర్వాత వాటిని నిల్వచేసి పోపువేసే సమయంలో కొద్దిగా వాడుకొంటారు.

**4. అనపకాయల పులుసు:** అనపకాయల్ని వేయించిన తర్వాత ఉడికించి తగినంత కారం, ధనియాల పొడి, ఉప్పువేసి, చింతపండు కాస్త ఎక్కువగా వేసి పోపు వేస్తారు.

**5. పెసల పులుసు:** అనపకాయల పులుసులాగానే చేస్తారు.

**6. ఎండిన 'పితికి పప్పుచారు':** అనపకాయలు బాగా పండిన కాలంలో 'పితికి పప్పు' చేసి నిలువ ఉంచుతారు. ఈ పప్పును కావలసినంత తీసుకుని, ఉడికించి, అందులో కొంత పప్పుకు కొబ్బరికాయ, దాల్చిన చెక్క, లవంగం, గసగసాలు, అల్లం, పచ్చిమిరప లేక కారంపొడి, ధనియా పొడి, కొత్తిమెర, వెల్లుల్లి, ఉల్లిపాయలు, ఉప్పు చేర్చి రుబ్బుతారు. దానికి రోలు కడిగిన నీళ్ళనే కలిపి, తక్కిన పితికిపప్పు చేర్చి పోపు వేస్తారు.

**7. కందిపప్పు చారు:** కందిపప్పును బాగా ఉడికించి తగినంత మసాల పొడి వేసి, తర్వాత చింతపండు లేకపోతే టమోటపండ్లను వేసి బాగా మరగించిన తర్వాత పోపు వేస్తారు.

**8. మసాల పొడిచేయడం:** తగినన్ని వేయించిన ఎండుమిరపకాయలు, ధనియాలు, జిలకర, మెంతులు, ఉద్దిబేడలు, శనగబేడల పొడిని మసాల పొడి అంటారు. కొంతమంది దీనికి దాల్చిన చెక్క, లవంగం, మిరియాల పొడిని కలుపుతారు.

**9. కందిపప్పు పులగూర:** పచ్చి లేక ఎండమిరపకాయల్ని కొద్దిగా నూనెలో వేయించి, తర్వాత తగినంత కందిపప్పువేసి కాసేపు వేయించిన తర్వాత పచ్చిటమోటాలు లేక వంకాయలు కలిపి వేయించి నీళ్ళుపోసి బాగా ఉడికిన తర్వాత 'పప్పుగుత్తి'తో బాగా చిలికి ఉప్పు, చింతపండు వేసి మరగబెడతారు. తర్వాత దానికి పోపు వేస్తారు.

**10. అనపపప్పు పులగూర:** పైవిధంగానే తయారుచేస్తారు.

**11. ఉలవగింజల చింతనీళ్ళు:** ఉలవగింజల్ని వేయించి ఉడకబెట్టి, దానికి తగినంత చింతపండు, కారం, ధనియాల పొడి, ఉప్పు, పసుపువేసి రుబ్బి పోపు వేస్తారు.

**12. ఉలవల ఊరిబిండి:** వేయించిన ఉలవలకు, వేయించిన ఎండుమిరపకాయలు, వెల్లుల్లి, ఉల్లిపాయలు, చింతపండు, జిలకరవేసి బాగా నూరుతారు. ఆ ముద్దను తీసుకొని కొద్దిగా నీళ్ళు కలిపి పోపు వేస్తారు.

**13. కారం ఊరిబిండి:** నూనెలో వేయించిన ఎండుమిరప లేక కారంపొడిని తీసుకుని ఉల్లిపాయలు, కొద్దిగా వెల్లుల్లి, కొత్తిమిరి, జిలకర వేసి బాగా నూరి ఆవాలు, కరివేపాకుతో పోపు వేస్తారు.

**14. ఆకుకూరల పులగూర:** కొద్దిగా ఎండులేక పచ్చిమిరపకాయల్ని నూనెలో వేయించి, తగినంత కంది లేక మినపపప్పును వేసి 'కూరాకు' (ఆకు కూరలు) వేస్తారు. బాగా ఉడికిన తర్వాత పప్పుగుత్తితో నున్నగా చేసి తగినంత చింతపండు వేసి కాచి పోపు వేస్తారు. అన్ని రకాల ఆకుకూరల్ని ఇలాగే చేస్తారు.

**15. కూరాకు 'ఊరబిండి' (పచ్చడి):** ముఖ్యంగా గురుగాకు ఆకుకూరను ఇందులో ఉపయోగిస్తారు. గురుగాకుతో పాటు పచ్చిమిరపను వేసి ఉడికించి, ఉడికిన తర్వాత అందులోని నీళ్ళను వంచివేస్తారు. కూరాకులోని నీళ్ళను బాగా పిండి ఆరబెడతారు. ఆరిన తర్వాత చింతపండు, పసుపు, జిలకర వేసి రుబ్బి పోపులో ఉల్లిపాయ ముక్కల్ని ఎక్కువగా వేస్తారు.

**16. గోంగూర ఊరిబిండి:** దీన్ని కూడ పైవిధంగానే చేస్తారు. కొంతమంది గోగాకును, పచ్చిమిరపకాయల్ని నూనెలో వేయించి దానికి తగిన పసుపు, జిలకర, మెంతులు, చింతపండు వేసి నూరుతారు. ఉల్లిపాయ ముక్కల్ని ఎక్కువగా వేసి పోపు వేస్తారు.

**17. కూరాకు చింతనీళ్ళు:** కందిపప్పును సగం ఉడికించి అందులో ఆకుకూరల్ని వేసి ఉడికిస్తారు. పాత్రలోని నీళ్ళను వంచి వేస్తారు. తర్వాత ఆకుకూరల్లోని నీళ్ళను బాగా పిండి ఆరబెడతారు. కొద్దిగా కూరాకు తీసుకుని దానికి తగ్గ కారంపొడి, ధనియాల పొడి, ఉప్పు, చింతపండు, కొత్తిమిర, జిలకర, కొద్దిగా కాల్చిన ఉల్లిపాయలు, వెల్లుల్లి బాగారుబ్బి, దానికి తగిన రోలు కడిగిన నీళ్ళనే కలిపి పోపు వేస్తారు.

**18. 'శనిగింజల' పులుసు:** పచ్చివేరు శనగకాయగింజల్ని బాగా ఉడికించి నీళ్ళు వంచేస్తారు. కొద్దిగా ఉడికిన గింజల్ని తీసుకుని దానికి తగినంత ఉప్పు, కారంపొడి, ధనియాపొడి, కాస్త ఎక్కువ చింతపండు వేసి, కాల్చిన ఉల్లిపాయల్ని

చేర్చి రుబ్బుతారు. రుబ్బిన పిండికి రోలు కడిగిన నీళ్ళనే చేర్చుతారు. తక్కిన ఉడికిన గింజల్ని అందులో చేర్చి పోపు వేస్తారు.

**19. 'శనిగింజల' ఊరిబిండి:** ఎండిన వేరుశనగాయ గింజల్ని వేయించి, పొట్టూడదీసి రోట్లోవేసి కాస్త నీళ్ళు కలిపి రుబ్బుతారు. తగినంత ఉప్పు, చింతపండు, పచ్చిమిరప, ఉల్లిపయాలు వేసి రుబ్బుతారు. బాగా మెదిగిన తర్వాత ముద్దను తీసి తగినంత రోలు కడిగిన నీళ్ళను చేర్చి పోపు వేస్తారు.

నవంబరు, డిసెంబరు, జనవరి మాసాల్లో కందిగింజల 'సారు', అనపగింజల 'సారు', అనపగింజల చింతనీళ్ళు, పితికి పప్పు 'సారు' చేస్తారు.

**20. కందిగింజల సారు:** పచ్చి కందిగింజల్ని ఉడికించి, 'శనగ గింజల పులుసు' లాగా చేస్తారు.

**21. అనపగింజల సారు:** ఇది కూడ పైదానిలాగానే చేస్తారు.

**22. అనపగింజల చింతనీళ్ళు:** ఉడికిన పచ్చి అనపగింజల్ని కొద్దిగా తీసుకుని తగినంత చింతపండు, జిలకర, ఉప్పు, కారం పొడి, ధనియాపొడి, కొత్తిమిరవేసి రుబ్బి తగినంత రోలు కడిగిన నీళ్ళనే తీసుకుని పోపు వేస్తారు. తక్కిన గింజలకు 'శనిగగింజల పొడి' చల్లి పోపు వేస్తారు.

**23. 'పితికి పప్పు' సారు:** పచ్చి అనపగింజల్ని పితికి కొద్దిగా ఉడికిన తర్వాత, వాటిలో కొన్ని గింజల్ని తీసుకుని తగినంత అల్లం, పచ్చిమిరపకాయులు, దాల్చినచెక్క, లవంగం, కొత్తిమిర, ధనియాపొడి, టెంకాయ (కొబ్బరికాయ), గసగసాలు, ఉప్పు వేసి రుబ్బుతారు. ఆ ముద్దను తీసుకొని తగినంత రోలు కడిగిన నీళ్లనే కలిపి తక్కిన పితికిపప్పును చేర్చి బాగా ఉడికించి పోపు వేస్తారు.

చేన్లలో పంటలు ఎండడానికి ముందు నీటి వసతి, బావులు ఉన్న రైతులు మిరప, వంకాయలు నాటుతారు. మార్చి, ఏప్రిల్, మే నెలల్లో వంకాయలు, మునక్కాయలు (మునగకాయలు), ముల్లంగికి సంబంధించిన పులుసులు చేస్తారు. (చారు చేస్తారు).

**24. వంకాయల సారు:** కందిపప్పు ఉడికిన తర్వాత వంకాయల్ని ముక్కలుగా తరిగి అందులో వేసి, అవి ఉడికిన తర్వాత తగినంత కారంపొడి, ధనియాపొడి లేక మసాల పొడి వేసి బాగా కలియబెట్టి ఉప్పు, చింతపండు కలిపి అందులో వేసి బాగా ఉడికిన తర్వాత పోపు వేస్తారు.

**25. మునక్కాయల సారు:** పైదానిలాగానే చేస్తారు.

**26. బెండకాయల 'పులగుర':** కందిపప్పును, పచ్చిమిరపల్ని నూనెలో వేసి వేయించి, ఉడికించి, నూనెలో వేయించిన బెండకాయ ముక్కల్ని అందులో వేసి ఉడికించి, కొద్దిగా చింతపండు ఉప్పువేసి పప్పుగుత్తితో నున్నగా చేసి పోపు వేస్తారు.

**27. వంకాయల 'పులగుర':** పైదానిలాగానే చేస్తారు.

**28. ముల్లంగిసారు:** వంకాయల చారులాగానే చేస్తారు.

**29. ముల్లంగి చట్నీ:** ముల్లంగి ముక్కల్ని కొద్దిగా నూనెలో వేయించి, కారంపొడి, చింతపండు, ఉప్పు, కొత్తిమిర వేసి రుబ్బుతారు. తగినంత రోటినీళ్ళనే కలిపి పోపు వేస్తారు.

**30. బెండ్లాకు మాదరింపు:** అడవుల్లో దొరికే ఆకుల్లో బెండ్లాకు చాలా రుచిగా ఉంటుంది. ఈ ఆకును ఉడికించి కూరాకు మాదరింపులా చేస్తారు.

**31. రసం చేయడం:** చింతపండుకు తగిన నీళ్ళు కలిపి బాగా పిసికి, ఉప్పు, కొద్దిగా పసుపు, బాగా నూరిన వెల్లుల్లి, జిలకరపొడి, మిరియాల పొడి అందులో వేస్తారు. తర్వాత పాత్రలో కొద్దిగా నూనె వేసి, బాగా కాగిన తర్వాత అందులో ఆవాలు వేసి, అవి చిట్లిన తర్వాత కరివేపాకు, ఎండుమిరపకాయలు వేసి, బాగా వేగిన తర్వాత చింతపండు నీళ్ళను అందులో కలుపుతారు.

పండుగ సందర్భాల్లో 'ఉర్లగడ్డ పల్లెం' (బంగాళదుంప కూర), వడలు, 'సుగలు', 'పోలీలు', 'కజ్జాయిలు', 'మురుకులు', 'పాకం పప్పుఉండలు', దోసెలు చేస్తారు.

**32. ఉర్లగడ్డ పల్లెం:** బంగాళదుంపల్ని ఉడికించి పొట్టుతీసి, పొడిపొడిగా చేస్తారు. తగినంత ఉప్పును దానికి చేరుస్తారు. బాణలిలో నూనె కాగిన తర్వాత ఆవాలు వేసి చిట్లిన తర్వాత కరివేపాకు వేస్తారు. ఆ తర్వాత మిరపకాయలు, ఆ తర్వాత ఉల్లిపాయముక్కలు వేస్తారు. ముక్కలు బాగా వేగిన తర్వాత కొద్దిగా కొత్తిమెర వేసి, బంగాళదుంప ముక్కల్ని వేసి కలుపుతారు.

**33. వడలు:** పెసల్ని బాగా నానబెట్టి పొట్టు తీసివేసి దానికి కాస్త అల్లం, ఉప్పు, పచ్చిమిరప కాయలు, దాల్చినచెక్క, లవంగం వేసి రుబ్బి ముద్దచేసి తగినంత ఉల్లిపాయ ముక్కలు, కొత్తిమిరి కలిపి వడల్లాగా చేతిమీద తట్టుకుని బాణలిలో కాగిన నూనెలో వేసి వడలు చేస్తారు. 'శనగబేడల' వడలు కూడ ఇలానే చేస్తారు.

**34. సుగలు, పోలీలు:** కందిపప్పును, శనగపప్పును ఉడికించి దానికి తగినంత బెల్లంవేసి రుబ్బుతారు. కొద్దిగా ఏలకుల పొడిని కలిపి ఉండలుగా చేసుకొంటారు. బాగా రుబ్బిన మైదాపిండిని కాస్త తీసుకొని అందులో ఉండలు ఉంచి దోసెలలాగా వెడల్పు చేసి పెనంమీద కొద్దిగా నూనెవేసి, దోసెలా ఉన్నదాన్ని పెనం మీదవేసి అటు, ఇటు కాలుస్తారు. దీన్ని పోలీలు ఉంటారు.

ఉండల్ని నీళ్ళలో కలిపిన మైదాలో అద్ది, కాగిన నూనెలో వేస్తే వాటిని 'సుగలు' అంటారు.

**35. కజ్జాయిలు:** బియ్యాన్ని బాగా నాన్చి, ఆరబెట్టిన తర్వాత దంచి ఒక వైపు ఉంచుతారు. ఒక పాత్రలో తగినంత బెల్లంవేసి పాకం చేసి, బియ్యం పిండిని, నువ్వుల్ని అంధులో వేసి కలియబెడతారు. దాన్ని కాస్త తీసుకుని బాణలిలో బాగా కాగిన నూనెలో వేసి 'జల్లిగంటె' (జల్లెడ గరిటె) తో పైకి తీస్తారు.

**36. పాకం పప్పు ఉండలు:** శనగపప్పు, వేరు శనగగింజల్ని వేయించుకొని, బియ్యాన్ని రవ్వలాగా దంచి ఉంచుకొంటారు. బెల్లం పాకంచేసి అందులో ఈ మూడూ వేసి ఉండల్లా చేస్తారు.

మాంసాహారాన్ని సాధారణంగా ప్రతిజానపదుడూ ఏదో ఒక సందర్భంలో తయారు చేసుకొంటాడు.

**37. గొర్రెమాంసం లేదా కోడిమాంసాన్ని వండడం:** మాంసాన్ని బాగా కడిగి, ఒక పాత్రలో కాస్త నూనె వేసి కాగించి అందులో కడిగిన మాంసాన్ని వేసి గరిటెతో బాగా కలుపుతారు. మాంసం వేడెక్కి అందులోని నీళ్ళు ఆవిరయిన తర్వాత ముందుగానే రుబ్బి ఉంచుకొన్న కారంపొడి, ధనియాల పొడి, దాల్చిన చెక్క, లవంగం, వెల్లుల్లి, ఉల్లిపాయలు, అల్లం, కొత్తిమెర మిశ్రణానికి తగినంత నీళ్ళు కలిపి అందులో కలుపుతారు. మాంసం బాగా ఉడికిన తర్వాత పోపు వేస్తారు.

కొంతమంది కారంపొడి, ధనియాల పొడి, దాల్చినచెక్క, లవంగం, వెల్లుల్లి, ఉల్లిపాయలు, అల్లం, కొత్తిమెర బాగా రుబ్బితగినంత నీళ్ళు చేర్చి అందులో మాంసం వేసి, దానికి పోపు వేస్తారు. ఉడికిన తర్వాత క్రిందకి దించుతారు.

సాధారణంగా అన్ని రకాల మాంసాలను ఇలాగే వండుతారు.

**38. చేపలపులుసు:** చేపల్ని బాగా శుభ్రం చేసి (పొలుసుల్ని, తోకల్ని, పొట్టలోని ప్రేవుల్ని శుభ్రంచేసి) ముక్కలు ముక్కలుగా చేసుకొంటారు. ధనియాల పొడి, కారంపొడి బాగా రుబ్బి కాస్త ఎక్కువగా చింతపండు, కావలసినన్ని ఉల్లిపాయలు, వెల్లుల్లి కలిపి రుబ్బి చేపలముక్కల్ని అందులో వేసి, పోపువేసి ఉడికిస్తారు.

**39. 'వట్టితునకల సారు':** ఎక్కువగా మాంసం మిగిలిపోతే దాన్ని ఎండబెట్టి నిలువచేస్తారు. కావలసినప్పుడు ఎండిన 'తునకల్ని' (ముక్కల్ని) రోట్లో బాగా దంచి, బాణలిలో నూనెవేసి అందులో వాటిని బాగా వేయించి, ఉప్పు, కారంపొడి, ధనియాలపొడి, చింతపండును బాగా రుబ్బి, దానికి తగిన నీళ్ళు కలిపి మిశ్రణాన్ని బాణలిలో వేస్తారు. నీళ్ళన్నీ ఆవిరయ్యే దాకా గరిటెతో కలియ బెడతారు.

**40. కోడిగుడ్డు దోసె:** కోడిగ్రుడ్డును కొట్టి ఒక గిన్నెలో పోసుకుని అందులో ఉల్లిపాయ ముక్కలు, ఉప్పు మిరపకాయ ముక్కలు వేసి బాగా కలిపి మిశ్రణం చేస్తారు. పెనంమీద కాస్త నూనె వేసి కోడిగ్రుడ్డు మిశ్రణాన్ని దోసెలా పెనం మీద వేస్తారు.

వేసవికాలం ప్రారంభమై, ఆకులు రాలి, చెట్లు చిగుర్లు వేయగానే చింత చిగురును గిల్లి చింతాకు పులగుర, చింతాకు ఊరిబిండి మొదలైన వంటకాలను

చేస్తారు. ఎండకాలానికి తగినట్టుగా 'చద్దినీళ్ళు', అంబలి, రాగిరొట్టె భోజనానికి ఉపయోగిస్తారు.

**41. చింతాకు పులగుర:** కందిపప్పు, ఉల్లిపాయలు, పచ్చిమిరపల్ని పాత్రలో ఉన్న నూనెలో వేసి దోరగా వేయించి తగినన్ని నీళ్ళు అందులో పోస్తారు. కందిపప్పు సగం ఉడకగానే చింతాకు అందులో వేసి బాగా ఉడికిన తర్వాత పప్పుగుత్తితో బాగా నున్నగా చేసి పోపు వేస్తారు.

**42. చింతాకు ఊరిబిండి:** చింతాకు, పచ్చిమిరపకాయలు, ఉల్లిపాయలు, కొబ్బరికాయ ముక్కలు నూనెలో వేయించి, వాటిని బాగా రుబ్బి తగినంత ఉప్పు వేసి పోపు వేస్తారు.

**43. 'సద్దినీళ్ళు ' లేక 'చద్దినీళ్ళు':** రాత్రి మిగిలిన అన్నం లేదా సంగటికి కొద్దిగా నీళ్ళు, ఉప్పు చేర్చి అలాగే ఉంచుతారు. ఉదయం దానికి తగిన ఉల్లిపాయలు చేర్చి బాగా పిసుకుతారు. దాన్ని గ్లాసులో పోసుకుని త్రాగుతారు.

**44. అంబలి:** రాత్రి అన్నానికి కొద్దిగా నీళ్ళుపోసి, నీళ్ళు బాగా కాగిన తర్వాత కొద్దిగా రాగిపిండి వేసి బాగా త్రిప్పుతారు. చిక్కగా కాగగానే దాన్ని క్రిందకు దించి ఉల్లిపాయ ముక్కలు వేసి ఉంచుతారు. ఉదయం దాన్ని త్రాగుతారు. కొంతమంది ఈ అంబలికి మజ్జిగ కలుపుకుని త్రాగుతారు.

**45. రాగిరొట్టె:** కావలసినంత నీళ్ళలో ఉప్పువేసి రాగిపిండితో మెత్తగా కలుపుకొంటారు. తగినన్ని ఉల్లిపాయముక్కలు, మిర్చి ముక్కలు కలిపి పెనంమీద కాస్త నూనె వేసి దానిమీద ఈ పిండిని రొట్టెలా తడతారు. దీన్ని పొయ్యిమీద పెట్టి కాలుస్తారు.

ఇలా జానపదులు కాలానికి, ఋతువులకు తగినట్టుగా పౌష్టికాహారాన్ని తీసుకుంటుంటారు.

జానపదుల వంటావార్పుమీద శాస్త్రీయాధ్యయనం ఇంకా జరగాల్సి వుంది. అలాగే వివిధ ప్రాంతాల్లో ఉన్న ఈ పాక కళని సేకరించాల్సి వుంది.

* * *

# 23. జానపద నృత్యం
## (Folk Dancy)

జానపదులచే ప్రదర్శింపబడే నృత్యం జానపద నృత్యం అనే అభిప్రాయం వుంది. 'Folk dance is a dance done by the Folk'. జానపదులంటే ఎవరు? అని ప్రశ్నించుకొంటే తరతరాలుగా సంప్రదాయాన్ని నేటిదాకా రక్షించుకొని వచ్చినవారే జానపదులని సమాధానం చెప్పుకోవచ్చు. అలాంటి జనుల నృత్యాలే జానపద నృత్యాలు. జానపద నృత్య, నాటక, సంగీతాలను R.S Boggs క్రియాత్మక ప్రక్రియ ('action' type) లో సూచించాడు.[1]

Joann wheeler keallinohomoku జానపద నృత్యాన్ని ఇలా నిర్వచించాడు. 'a vernacular dance form performed in either its first or second existnce as part of the tradition within the great tradition of given society. It is understood that dance is an affective mode of expression which requires both time and space. It employs motor behaviour in redundant patterns which are closely linked to the definitive features of musicality [2].

జానపద నృత్యంలో ప్రేక్షకుల కంటే ప్రదర్శకులకే అనుభూతి హెచ్చు. ఇది మానసిక - భౌతిక విధానాలకు సంబంధించింది. ఆయా భావాలకు తగిన భంగిమలు జానపద నృత్యంలో వుండడం చేత ప్రేక్షకులను అమితంగా ఆకర్షిస్తాయి.

ఆదిమజాతుల నృత్యాలు జానపద నృత్యాలకు ఆధారాలనీ, జానపద నృత్యాలు శాస్త్రీయ నృత్యాలకు పునాదులనీ Projesh Benerji అభిప్రాయం. Folk dance ను గురించి వివరిస్తూ 'unlike calssical dance, Folk dance was made for the sheer pleasure of the performers; and not for the entertainments of the public; while the primitive and aboriginal was nothing but a spontaneous and emotional rhythmic expression preparatory to a ritual battle....Nevertheless primitive dance was the foundation of Folk dance; and folk dance was the foundation of the refined form.[3]

---

1. *Standard Dictionary of Folklore, Legend and Mythology, P. 690*
2. *Folklore and folklife, P-387.*
3. *Folk dances of India.*

శాస్త్రీయ నృత్యంలోని హావభావాలు ఒక విధంగా కృత్రిమాలు. కాని జానపద నృత్యంలో అవి సహజాలు. 'originality' ని ప్రధానంగా వున్నటువంటివి.

భారతదేశంలోని జానపద నృత్యాలను స్త్రీల నృత్యాలు, పురుషుల నృత్యాలని రెండు విధాలుగా Projesh Benerji విభజించారు.[4] అవి మళ్ళీ మూడు విధాలుగా వింగడించబడ్డాయి. 1. సాంఘికం, 2. మత సంబంధం, 3. యుద్ధ సంబంధం (Martial).

Shyam Parmar 'Community dances' జానపద నృత్యాలకు సంబంధించినవని పేర్కొని వాటిని నాలుగు విధాలుగా విభజించారు[5]. అవి

1. పండుగ పబ్బాలకు, సాంఘిక ఆచరణలకు, మతాచరణాలకు సంబంధించినవి.
2. జానపద నృత్యాలే జీవనాధారంగా నమ్ముకొన్న వృత్తి కళాకారుల నృత్యాలు.
3. ఆదిమ జాతుల నృత్యాలు Tribal dances
4. దేవతల ఆశీస్సుల్ని పొందటానికై ప్రదర్శించే Ritual dances

డా. రామరాజుగారు జానపద నృత్యాల్ని 1. Religious dances, 2. Social dances, 3. Dance as a past time అని మూడు విధాలుగా వర్గీకరించారు.[6]

వీరు ఆంధ్రదేశంలోని జానపద నృత్యాల్ని కొన్నింటిని ఉదాహరించారు.

1. గోండుల 'Gusadi dance'
2. కొండరెడ్ల 'Mango dance'
3. ఖోందుల 'Peacock dance'
4. అరకులోయలోని 'Dimsa dance'. Dimsa నృత్యం మళ్ళీ ఎనిమిది రకాలట.
5. లంబాడి నృత్యం

---

4. *- Ibid - P-6.*
5. *Traditional Folk Media, P-93*
6. *Folklore of Andhra Pradesh, P-110.*

6. సిద్ధి నృత్యం
7. బతకమ్మ
8. బొడ్డెమ్మ
9. తప్పెట గుళ్ళు
10. డప్పు నృత్యం
11. పులి వేషం
12. బుట్ట బొమ్మలాట
13. గొబ్బి నృత్యం
14. గుజ్జుపు నృత్యం
15. కరువ నృత్యం
16. కోలాటం
17. గరగ నృత్యం
18. వీరనాట్యం మొదలయినవి.

శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారు కూడ వివిధ జానపద కళారూపాల్ని పేర్కొన్నారు[7]. వాటిలో కొన్ని; వీరభద్ర విన్యాస నృత్యం, డప్పుల కోలాట నృత్యం, గోండుజాతి నృత్యాలు, గరగ నృత్యం, పులి నృత్యం, కోలాట నృత్యం, దొమ్మరాట, అశ్వనృత్యం, చెక్క భజన, పండరి భజన, ఘట నృత్యం మొదలయినవి.

Faubion Bowers తమ 'The dance in India' గ్రంథంలో భారతదేశ జానపద నృత్యాల్ని రెండు విధాలుగ విభజించారు. అవి సాంఘికాలు Social మరియు ఆదిమజాతి Aboriginal నృత్యాలు. వాటిని గురించి వివరిస్తూ '......there are the uniquitous folk dance of the village and countryside which are of two types, social and aboriginal. Social dances are the festival dances which are still performed for amusement on special occasions in the streets and the homes.

---

7. *ఆంధ్ర నాటకరంగ చరిత్ర.*

The aborgiral types of Folk dances are generally vestigial ceremorial dances confined, for the most part, to the numerous aborigines, hill tribes, gypsies and depressed classes in the remote areas of the Indian interior. All these comprise the real dance of India[8].

జానపద నృత్యాలు నాట్యశాస్త్రాల్లో చెప్పబడ్డ నియమాల్ని అనుసరించినవి కావు. ఈ విషయంలో ఇవి శాస్త్రీయ నృత్యాలకు బహుదూరం. అంతేకాక జానపద నృత్యాలకు ప్రత్యేకమైన శిక్షకుడు అనవసరం. జానపద నృత్యం ఒక జన సమూహపు జీవితంలో ఒక భాగం.

Joan wheeler keellinohomoku దృష్టిలో జానపద నృత్యం ఒక యాంత్రిక క్రియారూపానికి సంబంధించింది. కనుకనే అయన దీన్ని 'Dance eventing'[9] అని పేర్కొన్నాడు.

ఏమైనా 'Projesh Benerji చెప్పినట్లు 'The folk dancing of a national is the nation's mirror in that it manifests to some extent the nation's temperament, art, culture, simplicity. Social status, customs and greed'.

* * *

8. *Folklore of Andhra Pradesh, P-111* నుండి పునరుద్ధరింప బడింది.
9. *Folklore and Folklife, P-399.*

# 24. జానపద సంగీతం
## (Folk Music)

సంప్రదాయబద్ధమైన సంగీతం శాస్త్రీయ సంగీతమైనట్లే జానపదుల సంగీతం జానపద సంగీత మనబడుతోంది. మొదటిది మార్గ సంగీతం. రెండోది దేశి సంగీతం. శాస్త్రీయ సంగీతం ప్రధానంగా పరరంజనోద్దిష్టం కాగా జానపద సంగీతం ప్రధానంగా స్వీయానందాభివ్యక్తి.

శిశువు, లేగదూడ, నాగుపాము - ఈ మూడింటికి ఆనందాన్ని చేకూర్చేది గానం. కనుకనే పూర్వులు 'శిశుర్వేత్తి, పశుర్వేత్తి, వేత్తి గానరసంఫణి' అని గానాన్ని కొనియాడారు. విషజంతువైన నాగుపాము మొదలు సమస్త జీవరాసులూ గానం చేత ఆనందింపగలుగుచున్నాయంటే సంగీతానికి వుండే మాధుర్యం చెప్పనలవి కాలదు. సంగీతం గీత, వాద్య, నృత్యాల సమ్మేళనం. 'గీతం వాద్యం చ నృత్యం చ త్రయం సంగీత ముచ్యతే'. దీంట్లో పేర్కొనబడ్డ గీతమే పాట.

జానపదగేయాలలాగే జానపద సంగీతం కూడ గ్రామసీమల్లో పుట్టి పెరిగి గ్రామీణుల జీవిత వృక్షానికి అల్లుకుపోయిన రాగమాలికలుగా వున్నాయి. జానపద గేయం ''స్వయంభువు'' అని చెప్పున్నట్లే, జానపద సంగీతం కూడ తనకుతానే ఉత్పన్నమైంది. మానవ జీవితం సుఖదుఃఖాల సంగమం. తాను అనుభవించిన అనుభూతివల్లే తనలోని హృదయ తంత్రులు అప్రయత్నంగా స్పందించ నారంభిస్తాయి. ఆ కూనిరాగాల ఆలాపనే రాగంతో కూడిన గేయంగా వెలువడుతుంది. దేశకాల పరిస్థితుల్ని బట్టి మానవుని బుద్ధి చాతుర్యంచే గానం వికసించి సంగీతమైంది. ఇలా సాహిత్యపరమైన శబ్దాలు తప్ప తక్కిన రాగ, లయ లక్షణాలు సంగీతానికి ఆకరాలయ్యాయి. సంగీతాన్ని శాస్త్రీయంగా అభ్యసించటానికి లక్షణాలేర్పడ్డాయి. ఇలా శాస్త్రీయ సంగీతానికి జానపదులు, వారి కూనిరాగాలాపనలు పునాదులయ్యాయి.

'The term Folk music is often loosely applied to cover all traditional or rurally transmitted music, music that is passed on by ear and performed by memory rather than by the written or printed music score. From the scholarly point of view, genuine folk music

exhibits a number of traits in addition to that of aural transmission' అనే అభిప్రాయం గమనింపదగింది.[1]

శ్రీమతి వింజమూరి సీతాదేవిగారు జానపద సంగీతాభివృద్ధిని నాలుగు ఘట్టాలుగా విభజించారు. (1) ఆదిమవాసులైన ఆటవికులు పెట్టిన పొలికేకలు (Savage yells). అవి 13 స్వరాలు కలసిన ధ్వనులు. (2) ఆ నాదపు తునకల్నే మళ్ళీ మళ్ళీ రెట్టించి (Repetition) పలికే అసంపూర్ణ సంగీత వాక్యం (Musical phrases); (3) అటువంటి అసంపూర్ణ సంగీత వాక్యాలను కొన్నింటిని కూర్చి పాడడము (Balance of musical phrases); (4) తుదకు ఒక ప్రత్యేక శ్రుతిని (Tonal centre) ఆధారం చేసుకొని, ప్రధాన సంగీత వాక్యాన్ని (Principal phrase - అదే పాటలో పల్లవి) పదే పదే రెట్టిస్తూ మిగిలిన వాక్యాలను కలిపి పాడడం (అవే పాటకు చరణాలు)[2]. పై విభజనను బట్టి వారే నాగరకుల్లో ఈ పరిణామం తెలిసిన కృషి ఫలితమనీ, జానపదుల్లో అది వారికే తెలియని ఒక ఉద్రేకపు (Instinct) ఫలితమనీ చెప్పారు. 'పల్లెటూరి పడుచులు తమ ఇండ్లలో రోళ్ళయొద్ద ధాన్యమును దంపునపుడును, తమ ఇండ్లలో పిండ్లు తిరుగలలో విసరచును, తమ భర్తలకు, అన్నదమ్ములకు సహాయపడుచు పైర్లలో కలుపు తీయుచును, నిద్రకై ఏడ్చెడి పాపాయిల జోకొట్టుచును పాడెడి పాటలే మన సంగీతమునకు ఆధారషడ్జములు'[3] అనే మాటల్లో జానపదులకే తెలియని Instinct ఫలితం ఋజువవుతుంది. దీన్ని బట్టి ఆత్మానురంజనమే జానపద సంగీత లక్ష్యమని నిర్ధరింపవచ్చు.

'Music like the language, serves as a vital means of social communication. Akin to spoken language, a song and its musical style jointly communicate the intended meaning to the members of the community with in whom the song is born as traditionally nurtured' [4] అనే Shyam Parmar అభిప్రాయం గమనింపదగింది. ఈ విషయాన్నే శ్రీమతి వింజమూరి సీతాదేవి చర్చిస్తూ 'జానపద సంగీతంలో ఫలాని పాట ఫలానిరాగంలో ఉందంటే ఆ రాగం శాస్త్రీయ సంగీతములాగ సంప్రదాయ

---

1. *Folklore and Folklife, P-363.*
2. *'తెలుగువాణి' Volume III, Number 1, పుట - 24, జనవరి 1978.*
3. *గానకళాబోధిని, పుట - 121.*
4. *Traditional Folk Media in India, P-54.*

సిద్ధమైన ఆరోహణావరోహణాలతో, ప్రయోగాలతో కూడి ఉంది అని అనుకో కూడదు. జానపదులు పనిపట్టి శాస్త్రాభ్యాసం చేసినవారు కారని మనం మరచి పోకూడదు. అందువల్ల అప్రయత్నంగా వెలువడిన వారి పాటలలో రాగచ్ఛాయలు మాత్రమే ఉంటాయి. ఆ పాటలకు అలంకారముతైన ప్రయోగాలన్నీ శాస్త్రీయ మైనవి కావు. అవి విశిష్టమైన జానపద ప్రయోగాలు మాత్రమే'[5] అని పేర్కొన్నారు.

డా. బి. రామరాజుగారు శాస్త్రీయ, జానపద సంగీతాలకుండే అంతరాన్ని వివరిస్తూ 'The basic difference between the classical music and folk music is more in the spirit than in the outward form. Folk music is born of the rustic's heart, whereas classical music is the product of the thinking mind of elite musicians..... The natural simplicity and the glow of human heart, so evident in the rural folk form an important aspect in the style and form of folk music'[6] అని వివరించారు.

పాటకు సంగీతానికి ఉండే అవినాభావ సంబంధం నేటిదికాదు. తరతరాలుగా సంప్రదాయబద్ధంగా సంక్రమించినటువంటిది. జానపద సంగీత పరిణామం కూడ గేయోత్పత్తిలాగే సిద్ధించింది. ఇది మానవజాతితోపాటే ఆవిర్భవించి వుండవచ్చు. దాదాపు రెండువేల సంవత్సరాలకు పూర్వమే ప్రజాబాహుళ్యమైన జానపద వ్యవస్థలో ఏదో ఒక రూపంలో సంగీతానికి స్థానముండిందని శ్రీమతి వింజమూరి సీతాదేవిగారు అభిప్రాయపడ్డారు. సంగీత పరిణామాన్ని మరికొంత విశదీకరిస్తూ నాగరకుల శాస్త్రీయ సంగీతానికి సామగానమే ప్రాతిపదిక అనీ, సామగాన ప్రస్తారం మూడు, నాలుగు స్వరాల కంటే ఎన్నడూ మించలేదనీ, మధ్యయుగం నాటికి దానినుంచే సప్తస్వరభూయిష్ఠమైన శాస్త్రీయ సంగీతమేర్పడి క్రమంగా మేళకర్తలు, రాగవిభజనలు, సంప్రదాయాలు ఏర్పడ్డాయనీ వివరించారు. జానపద సంగీతం కూడా శాస్త్రీయ సంగీతంతో పాటు సమకాలికంగా, సమానంగా పరిణామం చెందుతూ వచ్చింది. ఆదిమ వాసులైన సవరలు, కోయలు, చెంచులు, లంబాడీలు, యానాదులు మొదలైన అనాగరక తెగలవారు అనాదినుంచి సంగీత ప్రియులుగానే వున్నా, నేడు జానపద

5. *'తెలుగువాణి', జనవరి 1978, పుట - 26.*
6. *Folklore of Andhra Pradesh, P-107, National Book Trust of India, New Delhi.*

వ్యవస్థ పురోగమిస్తున్నా, వీరి నాగరికత, సంగీతం నేటికీ ఆ రూపాల్నే దాల్చివున్నవని అభిప్రాయపడ్డారు. సవరల పాటల ప్రస్తారం 3,4 స్వరాలకు (ని, స, రి,గ) మించలేదనీ దీన్ని బట్టి సామగానం శాస్త్రీయ సంగీతానికి బాల్యదశలుగా నిర్ణయించారు. ఇలా మూడు, నాలుగు స్వరాలతో ప్రారంభమైన జానపద సంగీతం మధ్యయుగం నాటికి 5,6,7 స్వరాలు, తర్వాత ఒక స్థాయి, అంతకు మించిన పాటలు కలదైనదిగా పరిణామం చెందినదనీ వీరు నిర్ధరించారు.[7]

ఇంచుమించు పై అభిప్రాయాన్నే శ్రీ మంచాళ జగన్నాథరావుగారును వ్యక్తపరచారు. 'జానపదులు పాడుకొను పాటలయందు గల కొన్ని స్వర సందర్భములను, వరుసలను గమనించినచో, అతి ప్రాచీనములగు కొన్ని రాగ స్వరూపములు ఏర్పడిన విధము ఊహామాత్రముగా గోచరించుచున్నది. ఛందో బద్ధములగు ఏకధాతు, ద్విధాతు స్వరూపములకు కొన్ని పాటలయందు గల చిన్న చిన్న వరుసలను గూడ రాగములుగా నామోదించి వానిని విస్తరించుకొని పెద్ద రాగములుగా తరువాత కొంత కాలమునకు రూపొందించుకొని నారేమో అనియు తోచుచున్నది..... స్థాయియందలి ఏడు స్వరములను ఉపయోగించుకొనకయే కొన్నింటిని మాత్రమే చేర్చుకొని పాటలుగా పాడుకొని వానియందలి మాధుర్యమును గమనించి మేధావులు అట్టి వానిని వృద్ధి పరచి రాగములకు విస్తృత స్వరూపముల నిచ్చియుందురను కొనవచ్చును.''[8] కనుక జానపద గేయంలాగే జానపద సంగీతం కూడ శాస్త్రీయ సంగీతానికి పునాదిగా నిలబడిందని ఘంటాపథంగా చెప్పవచ్చు.

జానపద సంగీతం లక్షణబద్ధమైంది కాదు. కాని లక్ష్యజ్ఞానంతో పెరిగినటువంటిది. ఇది అపూర్వ రాగాలలో రచింపబడలేదు. ఎవరెవరికి ఏయే భావాలు స్ఫురిస్తాయో ఆయా భావాలను తమకు ఇష్టమైన 'మెట్టు' లలో ఇముడ్చు కొన్నారు. ఇంచుమించు ఈ అభిప్రాయమే Folk music and 'Folklore - an Anthology' అనే గ్రంథంలో ఇలా చెప్పబడింది. 'A folk melody is not merely a literary or a musical work, but a product of the continuous process of life of a people. Folk tunes grow and develop in this process'[9].

---

7. *తెలుగువాణి, పుట 24 జనవరి 1978.*
8. *ఆంధ్రుల సంగీత కళ, పుట - 12.*
9. ***Folk Music and Folklore - An Anthology, Vol I, Foreword.***

శాస్త్రీయ సంగీతానికున్నట్లు జానపద సంగీతానికి స్థిరమైన సాహిత్యం లేదు. జానపద గేయాల్లాగే ఇది మార్పు చెందుతూనే వుంటుంది. సంగీత శాస్త్రబద్ధాలు కాని గీతాలన్నీ జానపదాలే.[10]

'There is no fixed bond between the text and the melody of a folk song. The same text may be sung to different tunes often within the same region. They are usually more texts in the repertory than tunes'[11] అనే George List అభిప్రాయం గమనార్హమైంది.

'సంగీత శాస్త్రబద్ధములు గీతములన్నియు జానపదములే - ''ఇచ్చట జానపదములన, జానపద సంగీతమునకు సంబంధించిన రచనలని అర్థము. ఈ జానపదములన్నియు ఒక స్థాయి యందే రచింపబడి యుండును. కారణము గ్రామ వాసులు కంఠమును ఇతర స్థాయిలకు పోనిచ్చుటకు తెలియని వారగుటచే సులభరీతిలో పాడుకొనుటకు అనువుగా నుండును. జానపద సంగీతము నందలి సాహిత్యము వ్యాకరణ బద్ధముకాని సామాన్య భాషలో నుండును. సాహిత్య భావము కూడ సాధారణముగా నుండును. ఈ గీతములలో ఆలపింపబడిన 'మెట్టు' సామాన్యముగను, వినుటకు ఆహ్లాదముగను, జనాకర్షణను కలిగియుండును. సంగతులు కాని గమకములు కాని ఉండవు. సామాన్య తాళములలోను, సంకీర్ణ రాగములలోను ఇవి రచింపబడి యుండును.[12]

శ్రీ పి. సాంబమూర్తిగారు కూడ జానపద సంగీత లక్షణాలనిలా పేర్కొన్నారు.

'1. స్వర పరిమితి తక్కువగా నుండటం - సాధారణంగా సప్తస్వర స్థాయిని మీరిపోదు. పాడేవారు సంగీత శిక్షణ పొందనివారు గనుక ఇది సహజం.

2. ప్రతి మధ్యమస్వరం లోపించడం. ఈ స్వరం విద్వాంసుల స్వరం అవడం వలన అశిక్షిత కంఠాలకు ఒదుగదు. అయితే పెళ్ళి పాటలవంటి నాగరకమైన పల్లె పాటలలో కొన్ని పంతువరావళిలో పాడుతారు.

3. సాహిత్యంలో మాటలు మరీ ఎక్కువగా వాడటం.

---

*10. గానకళాబోధిని, పుట - 122.*

*11. Folklore and Folklife, P-376*

*12. గానకళాబోధిని, పుట - 122.*

4. సువ్యవస్థితములైన సంగతులు కాని, స్వరదీర్ఘకరణాలుగాని లేక పోవడం.

5. సాహిత్యం ద్విపాద చరణాలుగా గాని, చతుష్పాదాలుగా గాని ఉండటం'[13].

గ్రాంథికభాష, వ్యవహారిక భాష క్రమక్రమంగా వేరయి ప్రత్యేక భాషా స్వరూపాలతో కూడుకొని ఎలా వున్నవో, అలాగే జానపద, సంగీతాలునూ ప్రత్యేక నామాలతో కూడుకొని రెండు శాఖలుగా విరాజిల్లుతూ ఉన్నాయి. జానపద గేయాల్లోని సంగీతం ప్రత్యేకమైన మూసల్లో ఇముడ్చబడినట్టివి కావు. శాస్త్రీయ సంగీతంలో కన్పించే స్వర, రాగ, తాళాలు జానపద గేయాల్లో లేకపోలేదు. కాని ఈ స్వరరాగ తాళాలు శాస్త్రబద్ధాలు కావు. వీటిని పాటలు కట్టినవారు కాని, పాడుకొనే వారు కాని చెప్పజాలరనటంలో ఆశ్చర్య పడాల్సిన అవసరం లేదు. కారణం వారు శాస్త్రీయ సంగీత ప్రవేశం లేనివారు. అంతకుమించి వారి దృష్టి విషయ ప్రధానమైనది. సంగీతజ్ఞులే ఈ పాటలకు రాగతాళాలను నిర్ణయింప సమర్థులు. గానకళాబోధినిలో పేర్కొబడినట్లు 'జానపదములను పరిపూర్ణముగా తెలిసి కొనుటకు చాల పరిశ్రమ కావలెను'. ఈ విషయాన్నే శ్రీ హరి ఆదిశేషువుగారు 'నేడు జానపద వాఙ్మయంలో ఉన్న సంఖ్యాకమైన పాటల్ని అన్నింటిని పేరుపేరు వరసలా ఏ రాగంలో, ఏ తాళంలో పాడాలో వివరించడం కేవలం సంగీతం శాస్త్రంలో కృషిచేస్తూ దానికే తమ జీవితం అంకితం చేసినవారికి తప్ప సాధ్యం కాదు'[14] అని అభిప్రాయపడ్డారు. 'It may be futile to attribute ragas to folk music. By doing so, we can, ofcourse, know that such and such are the patent ragas of a region or race'[15] అనే మాటల్లో అతిశయోక్తి లేదు.

జానపద సంగీతం 'త్రిశ్ర', 'చతురస్ర', 'మిశ్ర', 'ఖండగతి' లయల్లో నడుస్తుందనే అభిప్రాయం వుంది. ఇది గాయకుని మనస్తత్త్వంపై ఆధారపడి తాళ, లయ, చరణాల నిడివి, పదాల ఎంపిక, విరామాల్ని నిర్ణయిస్తుంది.

జానపద సంగీతం మీద పలువురి అభిప్రాయాల్ని కొన్నింటిని పేర్కొంటాను.

---

*13. తెలుగుపల్లె పాటలు, ఉపోద్ఘాతము, పుటలు VIII-IX.*

*14. జానపదగేయ వాఙ్మయ పరిచయము, పుట - 343.*

*15. Folklore of Andhra Pradesh, P-107, -B. Rama Raju.*

'Folk music happens to be the spontaneous outburst of their feelings.......' [16]-Dr. Trilochan pande.

'Folk literature as also folk music may not soar high in their imaginative flights. They may not have the ostentation of classical music with its flourish and elaboration. But deep in their heart, there is a melody of pure joy. Beside the poet who is able to make a song of the everyday life of the village - endowing it with rhyme and rhythm - gives voice to the inarticulate soul of the masses' [17] - Rabindranath Tagore.

'Flexibility and variability characterise the tune as well as the text of a folk song.[18] 'Folk music is said to exhibit a clearer social function than art music' [19]-George List

'Folk music at its best is expressive and holds the audience by a flow of sonorous notes and rarely does it aim at art.[20] - Dr. B. Rama Raju

'Broadly speaking, music is concerned with (a) the human voice (b) Instrumental sound production. ....Music emerges distinctively when rhythm has added to it the factor of melody. Another familiar dimension. harmony, has a much later and more restricted place in music' [21] - Felix M. Keesing

పై అభిప్రాయాల్ని గమనిస్తే జానపద సంగీతం భావ ప్రకాశక సంగీతమనీ దానికి రాగ తాళాలతో అవసరం లేదనీ శ్రోతలను ఆకర్షించే శక్తే ప్రధానమనీ చెప్పవచ్చు.

డా. రామరాజుగారు జానపద సంగీతాన్ని ఈ క్రింది విధంగా విభజించారు.[22]

---

*16. Folk music and Folklore - An Anthology, P-16.*

*17. - Ibid - P-2.*

*18. Standard Dictionary of folklore, Legend and Mythology, P-1037.*

*19. Folklore and Folklife, P-376*

*20. Folklore of Andhra Pradesh, P-103.*

*21. Cultural Anthropology, P-356.*

*22. Folklore of Andhra Pradesh, P-103*

1. ఏకాంతంగా వరికోత కోసేటప్పుడో లేదా శ్రామికుడు చెట్లకు నీళ్ళు పడుతూనో, లేదా ఎండుగడ్డి బండిపై పడుకొని ఇంటికి తిరిగి వెళ్ళేటప్పుడో, మడుగులో పొర్లాడే గేదెపై కూర్చున్నప్పుడో పాడే సంగీతం.

2. బాలుడు లేదా బాలిక పనిపాటలకు ఇంటినుండి బయలుదేరి వెళ్ళేటప్పుడో లేదా పనిపాటల తరువాత ఇంటికి తిరిగి వెళ్ళేటప్పుడో గుంపులో పాడేపాట. దీంట్లో 'Chorus' గుంపులోని భిన్నమైన గొంతులలో కన్పడుతుంది.

3. పనిపాటల సమయాల్లో ఒకే గొంతుచే పాడబడిన పాట పునరావృతం కావడం లేదా గుంపులోని వారిచే 'Chorus' అనుసరింపబడటం.

4. ప్రదర్శనకారుడో లేక కథకుడో వీరగాథను పనిపాటల విరామ సమయాల్లో పాడటం.

పైన చెప్పినవన్నీ 'Out door' సంగీతానికి చెందినవి. గృహాల్లో పాడబడే సంగీతాన్ని కూడ ఇలాగే విభజించవచ్చు.

1. ఉదయాన్నే మజ్జిగ చిలికేటప్పుడు తల్లులు పాడే పాటల్లోని సంగీతం.

2. పూజాంతంలో పాడబడే మంగళం.

3. కథల పాటలను పాడే సందర్భాలు.

4. బాలబాలికలు ఆటల సమయాల్లో పాడే పాటలు.

మొత్తం మీద జానపద సంగీతం సరళమైంది మాత్రమే. దీంట్లో గీతిభావాలు, లయ ప్రాధాన్యత వహించి వినేవారి వీనులకు విందు చేకూర్చి సులభంగా ఉంటుంది.

సినిమా సంగీతం మెరుగు పెట్టబడిన (Polished) సంగీతం కాగా జానపద సంగీతం అపరిపక్వ దశలో వుండే సంగీతం. ఒక విధంగా ఇది తేలిక సంగీతం. శాస్త్రీయ సంగీతంలా లోతైంది కాదు. ఉత్తర ప్రదేశ్‌లోని జానపద విజ్ఞానం - సంగీతాన్ని గురించి చర్చిస్తూ డా. కె. పి. ఉపాధ్యాయగారు జానపద గాయకులు పాటలు పాడే సందర్భంలో కొన్ని మాత్రల్నికాని, అక్షరాల్ని కాని, పదాల్ని కాని పూర్తిగా ఒక వాక్యాన్ని కాని ఊతగా చేర్చి పాడుతారని వివరించారు.

ఇలా పాటల్లో చేర్చి (Insertion) పాడటాన్ని నాలుగు విధాలుగా పరిగణించారు.[23]

అవి :

1. The syllable insertion (Matra stobha)
2. The letter insertion (Varna stobha)
3. The word insertion (Shabda stobha)
4. The sentence insertion (Vakya stobha)

డా. బి. రామరాజుగారు జానపదగేయాల్లోని సంగీతాన్ని,[24] డా. తంగిరాల వెంకట సుబ్బారావుగారు వీరగాథల్లోని సంగీతాన్ని[25] చర్చించారు. శ్రీ హరి ఆదిశేషువుగారు తమ జానపదగేయ వాఙ్మయ పరిచయంలో జానపదగేయాల్లోని సంగీతాన్ని కొంత ప్రస్తావించారు.

స్త్రీల పాటలను, వాటికిగల రాగతాళాల్ని నిర్దేశించిన ప్రముఖుల్లో శ్రీ నందిరాజు చలపతిరావుగారు ఎన్నదగ్గవారు. వీరు తమ స్త్రీల పాటలు 1,2,3 భాగాల్లో పాటలకు రాగ తాళ నిర్దేశం చేశారు. అలాగే ఘూలి సుబ్బారావుగారు కూడ తమ 'స్త్రీల వేడుక పాటలు - రెండవ భాగము' లోను, ఎన్.వి. గోపాల్ అండు కో వారు 'సరస్వతీ కల్యాణ పాటలు'లోను రాగతాళాల్ని ప్రవేశపెట్టి వున్నారు. శ్రీమతి వింజమూరి సీతాదేవిగారు జానపద గేయ సంగీత విశేషాల్ని గూర్చి పరిశోధించారు.

ఏమైనా ఆంధ్రదేశంలో జానపద సంగీతాన్ని గూర్చిన శాస్త్రీయ పరిశోధన ఇంకా జరగాల్సిన అవసరమెంతైనా వుంది.

* * *

---

23. *Folk Music and Folklore - an Anthology, P-31.*
24. *జానపదగేయ సాహిత్యము, పుటలు 790-93 మరియు Folklore of Andhra Pp. 102-110*
25. *తెలుగు వీరగాథాకవిత్వము (అముద్రిత సిద్ధాంత వ్యాసం) పుటలు 1291-1307.*

# 25. జానపద నాటకం (బయలాట, వీధిభాగవతం) (Folk Drama)

Richard M. Dorson గారి వర్గీకరణంలో ప్రదర్శన జానపదకళలు నాలుగో విభాగానికి చెందుతాయి. దీంట్లో Traditional music, dance, drama అనేవి చేరతాయి. 'The performing arts intersect each with the other and often appear in conjunction' అని పేర్కొన్నాడు[1]. జానపద నాటకంలో పాత్రల చలనం సంభాషణలకు సరిగా వుంటుంది. ఇది ప్రజల మనోరంజనం కోసం ఏర్పడ్డ ప్రక్రియ. 'Folk drama differs from other dialogue pieces only in performer- audience relationship, in mode of transmission and most important in vocabulary in dramatic effects'. కనుకనే జానపద నాటకాన్ని ఇలా నిర్వచించటానికి ప్రయత్నించాడు. '.... define folk drama as traditional play activity that relies primarily on dialogue to establish its meaning and that tells a story through the combination of dialogue and action. The outcome of which is known to the audience ahead of time'[2]

మనం మూడు విధాలైన నాటకాల్ని పరిశీలింప వచ్చును. 1. జానపద నాటకం (Folk drama) 2. జనప్రియ నాటకం (Popular drama). 3. అత్యాధునిక నాటకం (Sophisticated drama). జానపద నాటకం గ్రామాల్లో ప్రదర్శింపబడుతుంది. దీంట్లోని పాత్రధారులు ఒకే community కి చెందిన వారై ప్రేక్షకులకు పరిచయమైన వారై వుంటారు. ఈ జానపద నాటకాలు సాధారణంగా పండుగపబ్బాల్లోను, ప్రత్యేక సందర్భాల్లోను ప్రదర్శించ బడుతుంటాయి. జనప్రియ నాటకాలు సాధారణంగా జానపద నాటకాల నుంచే ఆవిర్భవించినా, దీంట్లోని పాత్రధారులు 'professionals' మరియు ప్రేక్షకులు పలుతావుల నుంచి వచ్చినవారు; వివిధ communitiesకు చెందినవారై వుంటారు. ఈ ప్రదర్శనలు తరచుగా జరుగుతుంటాయి.

Frazer అభిప్రాయంలో జానపద నాటకం పండుగ (Festival) సందర్భాల్లో ఆవిర్భవిస్తుంది. కానీ సాధారణంగా ఇది మతాచరణ సందర్భాల్లో

1. *Folklore and Folklife, P-4.*
2. *-Ibid - P.353.*

ప్రదర్శింపబడుతుంటుంది. .... folk drama alongwith dance and pantomime and other such entertainment was seen to be a development out of ritual.[3] మతాచరణానికి మూలమైన కళ నుండి రంగభూమి జనించినదని జూలియస్ బాబ్ అభిప్రాయం.[4]

Rozer D. Abrahams అభిప్రాయంలో జానపద నాటకం మరియు తక్కిన ఇతర పండుగ ఆచారాలు (festival activities) విశిష్టమైన సంప్రదాయబద్ధమైన భావప్రకాశక ప్రక్రియలు (unique traditional expressive genres). దీనికి కారణం ఆ ప్రక్రియల్లో వుండే అర్థవంతమైన ఆంతరంగిక చలనం (meaningnful interation).

నాటకం ప్రజల మధ్య ప్రదర్శింపబడి, ప్రేక్షకులచే సులభంగా అవగాహన గావింపబడాలి. అంతేకాక ఒక reflection ను ప్రేక్షకుల్లో కల్గించాలి. కనుక జానపద నాటకం ప్రేక్షకులచే అవగాహన గావింపబడే ఉద్దేశాల (motives) తోను, symbols తోను కూడివుండాలి.

భారతదేశంలోని విభిన్న Folk Theatre ప్రక్రియల్ని Shyam parmar వివరించారు[5]. వాటినలాగే ఉటంకిస్తాను.

| | | |
|---|---|---|
| **'Andhra Pradesh** | : | Veethi Natakam (veedhi Bhagavatam) Yakshagan - Bayal Natakam, Kuchipudi (Kunchipudi - Bhagavatmela), Burrakatha. |
| **Assam** | : | Ankiya Nat (Bhawanas), Kirtaniya natak, Ojapali. |
| **Bihar** | : | Bidesia, sesaikala, chhau. Jat-jatri, Bidepad (North East), Ramkhelia (Rama Leela in crude style - North Bihar) |

---

3. *-Ibid - P-355.*
4. *The origin of the theatre is to be found in the religious and the ceremonial cult through which primitive people of all times has sought to promote the welfare of the tribe by incurring the favour of deities and placating the spirit of evil - encyclopaedia of social sciences Vol.13, P-593.*
5. *Traditional Folk media in India, P-35-37.*

| | | |
|---|---|---|
| **Gujarat** | : | Bhavai. |
| **Haryana** | : | Sang (Sangeetaka), Naqqual (mono performance) |
| **Himachal Pradesh** | : | Kariyale, Bhaget, Ras Juanki, Harnatra - Haran or Harin (Mask dance). |
| **Karnataka (Mysore)** | : | Yakshagana (North Karnataka) Sannata (Belgaum and Dharwar Districts) Doddata - Bayalata, Tala Maddale or prasang (Indoorform, does not use costume), Dasarata, Radhna (closely resembles the Tamasha of Maharashtra). |
| **Kerala** | : | Koodiyattam, Mudiattam or Mudiyettu, Tiyattu, Therayattam, chavittu natakam, (christian rural drama), chakiyar kooth (Thullal), kathkali. |
| **Madhya Pradesh** | : | Maanch, Nacha. |
| **Maharashtra** | : | Tamasha, Lalit, Bharud, Gondhal, Dashavatar. |
| **Orissa** | : | Pala Jatra, Daskathai, Chhau Mayur bhanj, Mangal Ras, Sowang. |
| **Punjab** | : | Nautanki, Naqal, swang (East Punjab) |
| **Rajasthan** | : | Khyal, Rasdhari (Mewar) Ramnat (Bikaner), Turra Kilangi, Gauri (Bhil Gauri or Gavar). Nautanki, Jhamatra (playlets). |
| **TamilNadu** | : | Therekoothu, veethi natakam. Bhagavat Mela Natakam, Kuravanji (Kuram or kuluva Natakam), Pagal Vesham, Kavadi Chindu (Dance drama). |
| **West Bengal** | : | Jatra, puruliya Chhau, Pala, Gambhira Kabigan. |
| **Goa, Daman & Diu** | : | Dashavatar, Tiyatra. |

Folk theatre ను గురించి వివరిస్తూ Shyam Parmar అది '....the forum for didactic messages and morality that transcends age and time' అని పేర్కొన్నారు.

ఆధునిక నాటకాల్లోలా గాక జానపద నాటకం సంభాషణలతో పాటు స్వేచ్ఛగా పాటలను, నృత్యాలను, వాద్య సంగీతాన్ని ఉపయోగించుకొంటుంది.

జానపద నాటకాల్లోని సూత్రధారు (Director)ని మెక్సికోలో 'ensenador' అనీ, West Indies లో 'captain' (stage-manager) అనీ పిలుస్తారు. ఇక్కడ సూత్రధారుడు పాత్రధారులను ఎంపిక చేయుటంలో సంప్రదాయాన్ని నిలబెట్టేవాడు గాను, పాత్రధారులు తమలో తాము ఎలా సఖ్యతతో మెలుగుతూ నాటకాన్ని ఎలాంటి విఘ్నాలూలేక సమాప్తం చేయాలో బోధించే వాడూగాను వుంటాడు. ఈతడే ప్రదర్శనానికి ప్రేక్షకవర్గానికీ, మధ్యవర్తిగా వుంటాడు. సంస్కృత నాటకాల్లో లాగే నాటకారంభాన్ని నాటక సమాప్తాన్ని ఈతడే నిర్వహిస్తాడు. ఒక్కొక్కమారు Prompter ఈతడే గానువుంటాడు.

సంస్కృత నాటకం, జానపద నాటకాల్లోని విదూషకులకు వుండే అంతరాన్ని వివరిస్తూ Shyam Parmar 'In sanskrit drama vidhushak apears as a kind of 'social catalyst' and the alter ego of the main character of the story. In rural drama, while performing his humorous role, he establishes rapport with the villagers as their spokesman on current topic' [6] జానపద నాటకాల్లో విదూషకుని పాత్ర నాటకాన్ని జీవింతమొనర్చుతుంది. సూత్రధారునితో అతడు సంభాషించే తీరు ప్రేక్షక వర్గానికి ఉత్సాహమిస్తుంది. 'He creates snippets of humour relevant to timely need and thus, by his talent he produces during the performance a sense of fellow-feeling among the actors and the audience' [7].

## బయలాట:

బయల్లో ఆడే ఆట బయలాట. ఇది అచ్చమయిన నాటకం. బయలాటను ఆడటానికి ఒక నిర్దిష్టమయిన రంగమంటపం (stage) ఉన్నట్లు కన్పడదు. దీనికి

---

*6 & 7. Traditional Folk media in India.*

కారణము సాధారణంగా గ్రామీణులు తాము నాటకాన్ని వేయదలచుకొన్నప్పుడు అప్పటికప్పుడే రంగ మంటపాన్ని నిర్మించి, ఆట ముగిసిన వెంటనే దాన్ని తీసివేస్తారు. నాలుగు స్తంభాల్ని నాటి, ఆ స్తంభాలమధ్య కొంత ఎత్తులో పలకల్ని జోడించి మంటపాన్ని నిర్మిస్తారు. సాధారణంగా ఈ మంటపం 18 అడుగుల పొడవు, 9 అడుగుల వెడల్పు ఉంటుంది. మంటపం పై పలకలు వేయటంవల్ల పాత్రధారులు ఎగరటానికి వీలుగా వుంటుంది. ప్రేక్షకులు మంటపానికి ముందు, కుడి ఎడమల ప్రక్కన కూర్చొని నాటకాన్ని వీక్షించటానికి వీలుగా మంటపాన్ని నిర్మిస్తారు. కాని సామాన్యంగా గ్రామాల్లో ఎత్తైన ప్రదేశాల్లో (మిద్దెలపై నుంచొని కాని, చావడికట్టలపై కూర్చుండికాని) కూర్చుని బయలాటల్ని వీక్షించటాన్ని గమనించవచ్చు.

సర్వసాధారణంగా బయలాట మంటపాన్ని ఏదైనా ఒక దేవాలయానికి సమీపంలో కాని, ఊరి మధ్యగల 'చావడి' ప్రదేశానికి చేరువలో కాని నిర్మించడం జరుగుతుంది. దేవాలయానికి సమీపంలో ఉండటంవల్ల ఆయా పాత్రలు గుడి నుంచి రంగమంటపానికి బయలుదేరి, తమ ప్రదర్శనభాగం (portion) ముగిసిన వెంటనే తిరిగి గుడిలోనికి ప్రవేశిస్తాయి. సాధారణంగా దుష్టపాత్రలు లేదా పౌరాణికపు పాత్రలు గుడినుండి తప్పెట్లతో రంగమంటపానికి ప్రవేశిస్తాయి. ఇలా పాత్రలు గుడినుంచి మంటపాన్ని ప్రవేశించి తిరిగి గుడిలోకి పోవటంలో ఆంతర్యం లేకపోలేదు. డా. ఎం.ఎస్. సుంకాపుర అన్నట్లు దేవాలయమే మొట్టమొదట రంగస్థలమై వుండి, రానురాను అది ప్రేక్షకవర్గానికి చిన్నదనిపించినపుడు, బయటికి వచ్చి బయలాట అయ్యిందనటంలో సందేహం లేదు[8] నాడు దేవాలయాల్లోనే ప్రాథమిక శిక్షణ, సంగీత, నృత్య వాద్యాలు మొదలయిన కళలు నడుస్తుండేవనీ, పంచాయతీ తీర్పులు సైతం గుడులలోనే జరుగుచుండేవనీ, కనుక గుడియే బయలాటకు రంగస్థలంగా పరిణమించిందనీ, అచ్చటి పద్ధతులే బయలాటలో వచ్చి వుంటాయని డా. సుంకాపురగారి అభిప్రాయం. నేడు బయలాట రంగస్థలాలు ఊరిమధ్యన, గుడికి అతి చేరువలో అప్పటికప్పుడే వేసి తీసివేస్తుండటమే ప్రబల సాక్ష్యం. (అనంతపురము జిల్లా కల్యాణ దుర్గము తాలూకా, మలయనూరు గ్రామంలో నేటికీ వేణుగోపాలస్వామి ఆలయం చెంత బయలాట రంగమంటపాన్ని కట్టటం, గుడినుంచే దుష్టపాత్రలు తప్పెట్లతో రంగస్థలాన్ని ప్రవేశించి, తిరిగి

*8. జానపద సాహిత్య దర్శన, భాగము 2, పుట - 118*

గుడికి చేరటం మొదలైనవి (ప్రత్యక్ష నిదర్శనాలు) సాధారణంగా ఊరిమధ్యన విశాలమైన ప్రదేశంలో బయలాటల్ని ప్రదర్శించటాన్ని గమనింపవచ్చు.

బయలాటలలో పౌరాణికగాథలే అధికం. వీర, రౌద్ర, భయానక రసాలు వీటిలో చోటు చేసుకొని వుంటాయి. పాత్రల కనుగుణమైన వేష భూషణాలు బయలాటలలో శోభగూర్చుతాయి. 'Drama of any sort calls for the creation of a play world by the players, generally through the use of conventional symbolic objects-masks, costumes, a special area for playing-and conventional stylized action.'[9]

బయలాటల పాత్రల్ని వేషభూషణాల కనుగుణంగా 1.రాజుల పాత్రలు, 2. దేవతల పాత్రలు, 3.రాక్షస పాత్రలు, 4. హాస్యపాత్రలు అని వింగడింపవచ్చు.[10] రాజు పాత్ర కిరీటాన్ని ధరించి తీరాలనే నియమం వుంది. రాణిపాత్ర సైతం అర్ధచంద్రాకృతి (చంద్రవంక) కిరీటాన్ని ధరిస్తుంది. సాధారణంగా శిరస్సు ముందు భాగాన కాక వెనుకభాగాన ఈ కిరీటాన్ని అమర్చుతారు. చీర, చీరకు తగిన రంగుల రవికె, చెవులకు కమ్మలు, ముక్కు_నత్తు, నడుముకు ఒడ్డాణం, మెడకు బంగారు లేక ముత్యపు హారాలు. కాళ్ళకు గజ్జెలు, ఉంగరాలు, చేతికడియాలు, గాజులు ధరిస్తారు. రాజులకు సేవకులు, వంధిమాగధులున్నట్లే రాణులకు దాసీ జనులుంటారు. పురుషపాత్రలు భుజకీర్తులు, కిరీటం, గద, కేతనం, కంకణాలు, గజ్జెలు, కాశీదట్టి, చేలాంచలం, వక్షకవచం ఇత్యాది ఆభరణాలు ధరిస్తారు. సాధారణంగా స్త్రీ పాత్రల్ని పురుషులే ధరించడం పరిపాటి. పాత్రలకు రంగులు వేయటం (make up) ఒక కళ. ఆయా పాత్రల భావాలకు, భాషలకు తగిన రంగులు వేయటం బయలాటల్లో ప్రత్యేకత.

పాత్రల సంభాషణలలో చాతుర్యం, పాటల్లో కంఠ మాధుర్యం, గంతులు వేయటంలో దేహదార్ఢ్యం మొదలయినవి ప్రేక్షకులను ఆకర్షించే అంశాలు. బయలాట సంగీత, సాహిత్య, సంభాషణ, నృత్యకళాసమ్మిళితం. బయలాటే వీధినాటకం. ఇదే కాలక్రమంగా యక్షగానప్రక్రియగా రూపుదిద్దుకొన్నదనవచ్చు.

---

*9 Folklore and Folklife, P- 352.*

*10. జానపద సాహిత్య దర్శన, భాగము 2, 151*

బయలాట సాధారణంగా రాత్రి పదిగంటల సమయంలో ఆరంభమై మరుసటిరోజు తెల్లవారుజామున 5, 6 గంటలకు సమాప్తమవుతుంది. బయలాట వినోదాత్మక ప్రక్రియ కాబట్టి ప్రేక్షకులకు విసుగుపుట్టదు.

ఆట ఆరంభానికి ముందు రంగస్థలానికి కొబ్బరికాయ కొట్టి పూజ చేస్తారు. నిమ్మపండుకోసి ఒక భాగాన్ని కప్పుమీదికీ, ఒక భాగాన్ని క్రిందికీ విసరి వేస్తారు. పోటీదారులు మంత్రప్రయోగాన్ని చేయవచ్చుననీ, 'రాహువు' కొడుతుందనీ, ఇలాంటి శాంతిని చేస్తారు. మృదంగం, ముకువేణి (చిన్నమేళం) హార్మోనియం బయలాటల్లో ఉపయోగించే వాద్యవిశేషాలు. పాత్రలు గంతులు వేస్తూ అభినయించేటప్పుడు, ఆ గంతులకు తగినట్టు వాద్యాల్ని ప్రయోగిస్తారు. ముందుగా విఘ్నేశ్వర స్తోత్రంతో నాటకమారంభమవుతుంది. సూత్రధారుడు, సంగీత వాద్యకారులు దీన్ని నిర్వహిస్తారు. సూత్రధారుని 'అయ్యవారు' (రాయలసీమ - అనంతపురము జిల్లాలో) అని పిలుస్తారు. విఘ్నేశ్వర స్తోత్రమైన పిమ్మట గురుస్తోత్రం చేస్తారు. ఈ నాటకంలో తప్పులుంటే వాటిని రచయిత తప్పులుగా భావించండని కోరుతారు. పిమ్మట శారదాస్తోత్రము. బయలాట అంత్యంలో మంగళం పాడతారు. బయలాట పాటల్లో రాగతాళాల ప్రయోగం వుంటుంది.

సూత్రధారుడే భాగవతుడు. 'సారథి' పాత్ర బఫూన్ పాత్ర లాంటిది. పాత్రలను హాస్యోక్తులతో పరిచయం చేస్తుంటాడు. ఏ బయలాటలోనైనా గోపాల కృష్ణుని పాత్ర తప్పనిసరి. ఆ పాత్ర పిమ్మటనే తక్కిన పాత్రలు రంగస్థలానికి వస్తాయి.

బయలాట జానపదుల జీవితంలో అత్యంత ప్రధానమైన ప్రదర్శన జానపద కళారూపం. సాధారణ నాటకాలకు ప్రేక్షకులు డబ్బిచ్చి నాటకాన్ని చూడడం పరిపాటి. కాని గ్రామసీమల్లో నాటకాలపై అభిరుచిగల నటులు, తమకు తామే చందాలు వేసుకొని, నాటకాల్ని కంఠస్థం చేసి ప్రదర్శనలిస్తారు. బయలాటను గీత రూపకమనవచ్చు. పాడుతూ గంతులు వేయడం, గంతులు వేస్తూ పాడటం దీంట్లోని విశేషం. బయలాట పద్యగద్యమయమై నాటకీయతతో వుండటం చేతనే దీన్ని జానపద నాటకమంటున్నాము.

బయలాట ప్రదర్శనలో వారనిషేధం ఉంది. అది, మంగళవారాల్లో తూర్పు ముఖంగా బయలాటను ప్రదర్శింపరాదు. అలా ప్రదర్శిస్తే సూత్రధారుడికి,

పాత్రధారులకు, సంగీత వాద్యకారులకు అపాయం సంభవిస్తుందట. నాటకం నిలిచిపోయే ప్రమాదం కూడ వుందట. బుధ, గురువారాల్లో దక్షిణ ముఖంగా ప్రదర్శించవచ్చు. శుక్ర శనివారాల్లో పశ్చిమ ముఖంగా బయలాటను ఆడవచ్చును.

బయలాటకు మూలం 'బొమ్మలాట' అనే అభిప్రాయం ఉంది. బొమ్మను ఆడిస్తూ కథను నడిపించేవాడే దేవుడి స్థానంలో సూత్రధారుడైనాడు. బొమ్మలను ఆడించి వివిధ పాత్రల హావభావాల్ని ప్రదర్శించే సూత్రధారుడే బయలాటలో కథనడిపించే భాగవతుడు. సంస్కృత నాటకాలకు కూడా బొమ్మలాటే మూలమని కొందరి అభిప్రాయం'[11] 'Puppet is the source of sanskrit drama and that more over has spread over the world'. Shyam parmar కూడా ఇదే అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు. 'It was perhaps the primitive urge of the people for creating life-like movement through figures which later developed into a theatre form, imbibing elements of all arts, painting, sculpture, dance, drama and music.[12]

రాయలసీమలో బయలాటల ప్రదర్శనలధికం. అనంతపురం మండలంలో పెనుకొండ, హిందూపురం, కల్యాణదుర్గం తాలూకాలలో ఇలాంటి ప్రదర్శనలు కనబడతాయి. చాలావరకు బయలాటలు కన్నడదేశంలోనే అధికం. కన్నడ దేశానికి చేరువగా వుండడం చేత బయలాటలు ఆంధ్రదేశంలో ప్రవేశించి వుండవచ్చు. కన్నడంలో ఈ నాటకాల్ని 'బయలాట' లనే అంటారు. ఈ ప్రక్రియ సర్వవిధాల కన్నడ బయలాటల్నే పోలింది. బయలాటల్నే కొన్ని ప్రాంతాల్లో యక్షగానాలంటారు. కాని బయలాట యక్షగానంకంటే ప్రాచీనమైంది.

అనంతపురం మండలంలో ప్రసిద్ధమైన బయలాటల్లో కనకతార, లవకుశ, వాలి-సుగ్రీవుల కథ, వీరాభిమన్యు, ద్రౌపదీ వస్త్రాపహరణం మొదలయినవి. కన్నడంలో ప్రదర్శింపబడే బయలాటల్లో గయోపాఖ్యానం. కృష్ణార్జున యుద్ధం, చిత్రకేతు మహారాజు కథ, మయూరధ్వజ, కరేబంటుని కథ మొదలైనవి చెప్పుకోదగ్గవి.

---

*11. Quoted in the Sankrit drama by A.B. Keith, P-52*
*12. Traditional Folk media in India, P-38*

## వీధిభాగవతం:

జానపదులనోళ్ళల్లో ఇది 'వీరభాగోతం' అయింది. బయలాటలాగానే ఇది కూడ అచ్చమయిన జానపద రూపకం. ఆంధ్రదేశ తీరప్రాంతాలలో ఇది నేటికీ సజీవంగా ఉంది. కొన్ని ప్రాంతాలలో ఇది వీధి నాటకంగా ప్రాచుర్యంలో ఉంది. కర్నాటక రాష్ట్రంలోని కోలారు ప్రాంతాల్లో దీన్ని 'కేళిక' అని కూడా అంటారు.

తక్కిన జానపద రూపకాలలాగానే ఇదికూడ ఒక సమాహారకళ. గీతం, సంగీతం, నృత్యం, అభినయంతో కూడుకొని ఉంటుంది. లౌకిక ఇతివృత్తాలు, పారమార్థిక ఇతివృత్తాలతో కూడిన పాత్రలు 12నుంచి 15దాకా ఉంటాయి. మానవ పాత్రలతో పాటు దేవతాసంబంధమయిన పాత్రలు కూడ ప్రాధాన్యం వహిస్తాయి. బయలాటలలో లాగానే ఇందులో స్త్రీ పాత్రలను పురుషులే ధరిస్తారు.

సాధారణంగా వీధిభాగోతాలను రాత్రి సమయాల్లో ప్రదర్శిస్తారు. ఏ పదిగంటలకో మొదలుపెట్టి మరుసటిరోజు ఉదయం వరకు ప్రదర్శిస్తారు. రెండు మూడు రాత్రులుకూడ వీధి భాగోతాలు కొనసాగుతాయి.

రంగస్థలం నాలుగు ప్రక్కలా తొమ్మిది అడుగుల పొడవు ఉంటుంది. ముందువైపు రెండు స్తంభాలు నాటి వేపాకులతో కానీ, మామిడాకులతో కాని తోరణం కట్టి అలంకరిస్తారు. ఒక గుడ్డను తెరలాగ ఇద్దరు కలిసి పట్టుకొంటారు.

వీధిభాగోతం ఒక సమాజాన్ని, ఒక సంస్కృతిని ప్రతిబింబిస్తుంది. జానపదుల జీవితం ఇందులో బాగా వ్యక్తం అవుతుంది.

* * *

# 26. జానపద కళారూపాలు
## (Performing Folk Art Forms)

'Art is the production of some permanent object or passing action which is fitted not only to supply an enjoyment to the producer, but to convey a pleasurable impression to a number of spectarors or listeners'[1] - LEO TOLSTOY

అంతేకాదు 'మానవకల్యాణానికి కారణభూతమైంది కళ' అని అంటాడు టాల్‌స్టాయ్.

మనస్సును రంజింపజేయడమే కళ. 'Art is for Arts sake' అనడం అందుకనే. 'జీవితాన్ని దర్శింపచేసేదే కళ' అన్నారు అరవిందులు.

Gran Allon దృష్టిలో 'Art is an activity arising even in the animal kingdom and surprising from sexual desire and the prosperity to pay and be accompanied by a pleasurable excitement of nervous system'.

అలాగే veron దృష్టిలో 'Art is an external mainfestation by means of lines, edours, movements, sounds or words of emotion felt by man'.

'సౌందర్యాన్ని దర్శింపజేయడమే కళ' అని ఒకరంటే 'ఆత్మను దర్శింపచేసేదే కళ' అని మరొకరంటారు. ఏమైనా కళకు ఇదమిత్థమైన ఒక నిర్వచనం ఇవ్వడం కష్టమేననిపిస్తుంది. ఎంచేతనంటే కళల్ని పరిశీలించే వాళ్ల ధోరణి, వాళ్ళ దృక్కోణమే వేరుగా ఉంటుంది.

సంగీతం, సాహిత్యం, కళ - ఇవి మానవునికి మానసిక ఉల్లాసాన్నిచ్చే ప్రధాన జీవితావసరాలు. వినోదం ఆనందాన్నిస్తుంది. ఆ ఆనందమే మనిషిని నాలుగు కాలాలపాటు సుఖంగా ఉండడానికి దోహదం చేస్తుంది. భౌతికంగా జీవించడానికి ఆహారం, ఆ ఆహారం సంపాదించుకోవడానికి శారీరక శ్రమ, ఆ శారీరక శ్రమను

---

1. *What is Art, P-119.*

మరచిపోవడానికి వినోదం - ఇలా ఈ మూడూ అవినాభావమైన సంబంధాన్ని కలిగి ఉన్నాయి. ఈ వినోదమే ఒక కళాదృష్టిని, సౌందర్య సృష్టిని వినిర్మించింది. ఇలా ఏర్పడ్డ కళ హావభావాలను ప్రదర్శించే కళగాను, కేవలం సౌందర్యాన్ని వీక్షించి ఆనందించే కళగాను రూపుదిద్దుకొంది. ఇలారూపుదిద్దుకొన్న కళలు సంస్కృతిలో ఒక భాగంగా, అవిభాజ్య అంగంగా నిలద్రొక్కుకున్నాయి. అందువల్లనే జానపద సంస్కృతి ముప్పాతిక మువ్వీసం జానపదకళల్లో ప్రతిబింబిస్తుంది. అనాదినుండి నేటిదాకా ఈ కళలు తమవే అయినా ప్రత్యేకతతో తరతరాలుగా సంప్రదాయబద్ధంగా మనకు సంక్రమిస్తున్నాయి.

మతాచరణ సందర్భాల్లో కానీ, సాంఘికాచరణ సందర్భాల్లోకానీ సాధారణంగా జానపదకళలు ఆవిర్భవిస్తాయి. ప్రకృతి ఈ కళలు ఆవిర్భవించడానికి దోహదం చేసింది. ప్రకృతికి సంబంధించిన ఎండ, గాలి, వాన, చలి, కొండలు, గుట్టలు, పశుపక్ష్యాదులు మొదలైన వాటిచేత కల్గిన భయభ్రాంతులవల్ల ఆదిమ మానవుడు తనకు తెలియని ఏదో ఒక అతీతశక్తి తన్ను ఆవరిస్తోందని తలచాడు. ఆ అతీతశక్తినే దేవుడుగా సృష్టించుకొన్నాడు. ఆరాధించడం మొదలు పెట్టాడు. ఆ ఆరాధనా సమయంలో భక్తితో పాటల్ని పాడుకొన్నాడు. ఆనంద పరవశత్వంతో ఒళ్ళు తెలియకగంతులు వేశాడు. భగవదనుగ్రహం కోసం ఎన్నో ఆరాధనా క్రమాల్ని అనుసరించాడు. ఆ ఆరాధననే ఒక కళగా, వృత్తిగా స్వీకరించాడు. ఈ కళ మన సంస్కృతిలో ఒక భాగంగా, అవిభాజ్య అంగంగా నిలద్రొక్కుకుంది.

జానపద విజ్ఞానంలో జానపద కళలకి ప్రత్యేక స్థానంవుంది. 'Human life without Art is incomplete and is barren' అని చైనీయుల ఆర్యోక్తి. అందువల్లే జానపద కళల్ని, కళారూపాల్ని ప్రజాసంస్కృతి యొక్క అనుభవాల ప్రతీకలుగా మనం నిర్ణయించవచ్చు.

వినోదం లేందే జీవితం లేదు. ఆహార పానీయాలు మన దేహానికి ఆనందాన్నిస్తే, వినోదం మనస్సుకు ఉల్లాసాన్నిస్తుంది. అలా వినోదంగా ఉన్న కళారూపాలకి కొదువలేదు. తరతరాలుగా సంప్రదాయబద్ధంగా మనకు అందింప బడుతున్న ఈ కళారూపాలు ఆధునికత వల్ల ఏమాత్రం నాశనం కాకపోయినా, ఆదరణ లేక ఎదగడం మాత్రం లేదు.

జానపదకళారూపాలు సంగీత, నృత్య రూపాలకు సంబంధించినవిగా ఉన్నాయి. ఇలాంటి కళారూపాల్లో అనుష్ఠానంగానూ, వినోదంగాను ఉన్న కళారూపాలు ఆంధ్రదేశంలో అధికంగా ఉన్నాయి. వాటిలో గొరవయ్యలు, కీలుగుర్రం, పులివేషం, కోలాటం, ఉట్లకాయ పగలగొట్టడం, ఉట్లమాను ఎక్కడం, పలకలకు (డప్పులు) సరిగా అడుగువేయడం, అలావు తొక్కడం, చెక్కభజనలు మొదలైనవన్నీ జాతరలు, ఉత్సవాలు, పండుగలు - పబ్బాలు మొదలైన సాంఘికాచరణ సందర్భాల్లో వినోదాత్మకంగా ప్రదర్శింపబడే కళారూపాలు. జీవితం కేవలం కడుపునింపుకునే పోరాటం కాదనీ, అది కళాసృష్టిని ప్రసాదించే ఒక వరం కూడా అని ఈ కళా రూపాలు మనకు గుర్తు చేస్తాయి. ఆంధ్రదేశంలోని జానపద కళారూపాలను ఈ క్రింది విధంగా వింగడించవచ్చు.

1. **కథాసంబంధి నృత్యాలు (Story related dances):** జంగం కథలు, శారద కథలు, ఆసాది కథలు, పిచ్చికుంట్ల కథలు, బుర్రకథలు, ఒగ్గు కథలు, జముకుల కథలు, కిన్నెర కథలు, పల్లెసుద్దులు, పంబకథలు పాండవులకథలు ఇత్యాది.

2. **బృందనృత్యాలు(Group folk dances):** కోలాటం, పండరిభజన, చెక్కభజన, బోనాలు, గరగలు, గొరవయ్యలు, డప్పునృత్యం, డోలునృత్యం, తప్పెటగుళ్ళు, ఉరుముల నృత్యం ఇత్యాది.

3. **నాటకసంబంధి రూపాలు(Folk theatre forms):** యక్షగానం, వాలకం, వీధినాటకం, బయలాట, తోలుబొమ్మలాట, పగటివేషాలు, చిరతల రామాయణం, తూర్పుభాగవతం, చెంచునాటకం ఇత్యాది.

4. **కుశల కళారూపాలు (Folk Art forms related to skills):** దొమ్మరాట, కర్రసాము, కత్తిసాము, పాముల్ని ఆడించడం, విప్రవినోదులు, సాధనశూరులు, కాటిపాపలు, గారడి, మోడి, కనికట్టు ఇత్యాది.

5. **ధార్మికసంబంధి ఆచరణ కళారూపాలు (Folk art forms related to Rituals):** దాసరి, సాతాని జియ్యర్, ఫకీర్, జంగందేవర ఇత్యాది.

6. **వినోద కళారూపాలు (Folk Art forms related to entertainment):** గంగిరెద్దులాట, జంతరపెట్టె, కాశికావడి, పిట్టలదొర ఇత్యాది.

7. స్త్రీల జానపదనృత్యాలు (Women Folk dances): గొబ్బి, స్త్రీల కోలాటం, జట్టిజాము, బతుకమ్మ, బొడ్డెమ్మ ఇత్యాది.

వీటిలో కొన్నింటిని తెలుసుకొందాం.

## గౌరవనృత్యం:

అనంతపురం జిల్లాలోని యాదవ తెగకు చెందినవాళ్ళు ఈ నృత్యం చేస్తారు. వృత్తి ప్రధానమైన కళకు సంబంధించినవాళ్ళు గొరగలు. వీళ్ళు మైలారలింగని భక్తులు. గొరగ అన్న శబ్దమే అనంతపురం మండలంలో 'గొరవ' శబ్దమైంది. గొరగలని 'గొరవయ్య' లంటారు. కర్నాటకలో వీళ్ళని 'గొరవరు' అని పిలుస్తారు. గొరవ శబ్దానికి కన్నడంలో 'శైవ భిక్షువు' అనే అర్థం వుంది.

సాధారణంగా గొరవలు ఈ మండలంలో గొల్లల్లో కన్పిస్తే, కన్నడ దేశంలో 'కురుబ'లలో ఎక్కువగా కన్పిస్తారు. గొరవదీక్ష సంప్రదాయబద్ధమైంది. వీళ్ళ ప్రధానవృత్తి భిక్షాటన. నొసట విభూతి, మెడలో గవ్వసరాలు, చేతిలో డమరుకం, పిల్లనగ్రోవి, నాగబెత్తం, కాళ్ళకు గజ్జెలు, ఎలుగుబంటి వెంట్రుకల టోపి, కంబడితో చేసిన అంగీ, భుజంమీద భిక్షాపాత్ర, పులితోలుతో చేసిన విభూతి సంచి - ఇదీ గొరవయ్య వేషం.

గొరవయ్యల నృత్యం చాల ఆకర్షణీయంగా ఉంటుంది. ఒక విశాలమైన ప్రదేశంలో నలుగురైదుగురు డమరుకాన్ని మ్రోగిస్తూ, స్తుతి పదాలను చెప్తూ నాట్యం చేస్తారు. ఈ నృత్యం తాళలయబద్ధంగా ఉంటుంది. సాధారణంగా ఈ ప్రదర్శన రాత్రి సమయాల్లో జరుగుతుంది.

ఫిబ్రవరి - మార్చి నెలల్లో ఈ మండలంలోని తనకల్లులో మైలారేశ్వర స్వామి ఆరాధన సమయంలో గొరవలు ప్రధాన పాత్రను వహిస్తారు. గొరవలకి పాలు, అరటిపళ్ళను గ్రామస్థులు ఆహారంగా ఇస్తారు. వీళ్ళు పాలు, అరటి పళ్ళున్న కంచాలముందు కూర్చుని మోకాళ్ళను వంచి, చేతులతో తాకకుండా జంతువుల్లా వాటిని ఆరగిస్తారు. అక్కడ మూగిన జనం అడ్డుపెడ్తే పులుల్లా వ్యవహరిస్తారు.

గొరవలని కరడి గొల్లలని కూడా అంటారు. కన్నడంలో కరడి అంటే ఎలుగబంటి. వీళ్ళ ప్రధానదైవం జంజుప్ప. జుంజప్ప ఉత్సవం అక్టోబరు - నవంబరు

మాసాల్లో కొత్తూరులో జరుగుతుంది. గొరవయ్యలు ఈ ఉత్సవంలో పాల్గొంటారు.

కన్నడ సరిహద్దు ప్రాంతాల్లో కర్నాటకం లోని గొరవయ్యలు తరచుగా రావడం జరుగుతుంది.

## కోలాటం:

కోలాటాన్ని జాతీయ క్రీడావిశేషంగా డా. తూమాటి దొణప్పగారు పేర్కొన్నారు. కోలాట గొడియగా పాల్కురికి సోమనాథుడు దీన్ని పేర్కొన్నాడు. దండనర్తనమనీ, దండలాస్యమనీ దీనికి పేర్లు కన్పిస్తాయి.

కోలాటంలో జడకోలాటం లేదా జడకోపు ఒకరకం. ఇందులో సమసంఖ్యలో వుజ్జీలుంటారు. 8,12,16 లేదా 24మంది పాల్గొనవచ్చు. జడకోలాటాన్ని చెట్టు క్రింద వేస్తారు.

జడకోలాటాన్ని కన్నడ దేశంలో 'జడకోలు' అంటారు. త్రాళ్ళు జడలాగా అల్లుకోవడం వల్ల దీన్ని 'జడకోలు' అంటారు. పండగ సందర్భాల్లో, ఉత్సవాలు - జాతర్ల సమయాల్లో, దరగా, వురుసుల్లో ఒక వేడుకగా కోలాటం వెయ్యడం కన్పిస్తుంది. ఇది కూడ ప్రదర్శన జానపద కళారూపమే.

కోలాటంలో కోపులు, గజ్జెలు ప్రాధాన్యం వహిస్తాయి. ఈ కోపును వెదురు, టేకు కట్టెలతో తయారుచేస్తారు. దీని పొడవు 9 అంగుళాలు మొదలుకొని 1.5 అడుగులదాకా ఉంటాయి. కోపులను పట్టుకనేచోట కొంతలావుగా వుంటుంది. కోపులకు రంగు వెయ్యడం కానీ, రంగు కాగితాలను అంటించడం కానీ చేస్తారు.

మోకాలుదాకా ఎగబెట్టిన ధోవతి, చొక్కా, నడుముకు చుట్టుకునే వస్త్రం- ఇవి కోలాటం వేసేవాళ్ళవేషం. స్త్రీలైతే మోకాలుదాకా చీరకట్టి, 'చెరుగు'ను నడుముకు బిగిస్తారు. స్త్రీలుకానీ, పురుషులుకానీ విధిగా కాళ్ళకు గజ్జెలు కట్టుకుంటారు.

క్రమబద్ధంగా కోలదెబ్బలు, గజ్జెలు కట్టిన కాళ్ళతాళం, కోలాటం పాట- కోలాటంలో-గమనించదగ్గ అంశాలు. పాటలేందే కోలాటం రక్తి కట్టదు.

సాధారణంగా కోలాటం ప్రార్థనతో మొదలవుతుంది. ప్రారంభానికి ముందే కళాకారులు వర్తులాకారంగా నిలబడి కోపులను మధ్య ఉంచి పూజచేస్తారు. మేళనాయకుణ్ణి పెన్నుద్ది అంటారు. ఈయనకి నమస్కరిస్తారు. వినాయకస్తుతి, ఇష్టదేవతా ప్రార్తన, గ్రామదేవతా ప్రార్థన చేసిన తర్వాత వివిధ విషయాలకు సంబంధించిన పాటల్ని పాడతారు. జట్టు నాయకుడు పాట పాడుతూవుంటే తక్కినవాళ్ళు వంత పాడతారు. తయ్యక్ తద్దిమితా, తయ్యక్కు తళాంగు తద్దిమితా, హెయ్‌తట్టూ తళాంగు తయ్యకు తద్దిమితా అన్న ముగింపు పదాలని పలుకుతారు.

కోలాటం పాటల్ని ఈ జిల్లాలో 'కోలన్న పాటల'నీ, 'కోలన్న పదాల'నీ వ్యవహరిస్తారు. కోలాటం పాట పూర్తికాగానే ఉత్సాహంతో చిందులువేస్తూ ఊత పదాలని పాడతారు. వుదాహరణకు ఒకటి.

'ఓ చెల్ గట్టి జిందగ్ జిగి జిగి జిందల్ మరగణ
జీడీలెరుగని వన్నెకాని మొగమొన్నడు దొడగు ఓల్ జింద! ఓల్ జింద!
సీమిడిముక్కల సినతలకాయకి సీకాయి లేదంటలిగింది
దాని పలుకులకు, దాని కులుకులకు పిల్లోడేసే గంతులకు
గుల్లాకులకు, గుండక్ గులుకు ఓల్ జిందా! ఓల్‌జిందా!
కట్టెకి కట్టె తప్పద్దన్నా, తప్పినవానికి తంగెడు బర్రా
తగుల్కొన్నోడికి మామిడి బర్రా ఓల్ జింద! ఓల్‌జింద!
జిందగ్ జిగిజిగి జిందగ్ మరగణ!
జిందగ్ జిగిజిగి తయ్యక్ తద్దిమితా.

## అలావు తొక్కడం:

మే - జూన్ మాసాల్లో మొహరం పండుగ పదకొండురోజుల పాటు జరుగుతుంది. ఈ పండగని ఈ మండలంలో 'పీర్ల పండగ' అని వ్యవహరిస్తారు. హిందూ ముస్లింల సఖ్యతకి ఈ పండుగ నాంది పలుకుతుంది. 'హిందూ ముస్లిం భాయ్‌భాయ్' అన్న నినాదం ఈ సందర్భంగా వ్యక్తవుతుంది.

మొహరం నెలలో పదోరోజు 'అలావు తొక్కు'తారు. 'అలావు' అంటే 'అగ్నిగుండం'. ఆ గుండం చుట్టూ తిరగడమే అలావు తొక్కడం. 'అలాపి,' 'అలాభి' అనే పేర్లు కూడ వినవస్తాయి.

అగ్నిగుండం చుట్టూ నృత్యం చెయ్యడం, అగ్నిగుండాన్ని దాటడం ఆంధ్రదేశంలో కనిపిస్తుంది. నృత్యం చేసే వాళ్ళు కాళ్ళకు గజ్జెలు కట్టుకుంటారు. నృత్యం చేసేటప్పుడు మధ్యలో 'యా ఇమామ్ ధీన్' అనీ, 'యా హుసేన్, యా హుసేన్' అని అంటుంటారు.

మొహరం పండుగలో పీర్లకు మొక్కుబడులు చెల్లించుకొంటారు. కోరికలు నెరవేరితే చక్కెరను బీదలకు పంచుతారు. హిందువులు కూడ తమనీ, తమ పశువులనీ ఆపదల నుండి రక్షించమని కోరుతూ అగ్నిగుండం మధ్యలో నడచుకొంటూ వెళ్తారు.

అనంతపురం జిల్లాలో గూగూడు గ్రామం మొహరంపండక్కి, అగ్నిగుండం మధ్యలో నడచుకొంటూ వెళ్ళిపోవడానికి ప్రఖ్యాతి చెందింది. కన్నడదేశంలో దీన్ని 'అలావు కుణిత' అంటారు.

## ఉట్లమాను ఎక్కడం:

అనంతపురం జిల్లాలో ''ఉట్ల పరష'' అనేక ప్రాంతాల్లో కన్పిస్తుంది. ఇది మతాచరణకి సంబంధించినది. ఈ సందర్భంగా 'ఉట్లమానెక్కడం' జరుగుతుంది. ఇది ప్రదర్శన జానపద కళారూపం. ఉట్లపరష సందర్భంలో ఈ కళారూపాన్ని వివరించడం జరిగింది.

## పులివేషం:

పులివేషం లేదా పులినృత్యాన్ని దసరా, సంక్రాంతి మొదలైన పండుగ సందర్భాల్లోను, జాతర సమయాల్లోను, ముస్లింల మొహరం పండుగలోను ప్రదర్శిస్తారు.

పులి వేషధారి పులి చర్మానికి తగినట్టుగా పసుపు - నలుపు కలిగిన రంగుల్ని చారలు చారలుగా పూసుకొంటాడు. పులిగోళ్ళను పోలిన గోళ్ళను ధరిస్తాడు. ముఖానికి పులికవచం ధరించడం కూడ కొన్ని ప్రాంతాల్లో కన్పిస్తుంది. తలమీద తోలుతో కుట్టిన టోపిని ధరిస్తాడు. నారుతో చేసిన తోకనుకానీ, గుడ్డలతో అల్లిన తోకనుకాని కట్టుకుంటాడు.

పులి వేషదారి నడుముకు త్రాడు తగిలించి ఒకతను పట్టుకొనే ఉంటాడు. పులివేషధారి తొప్పెట్ల ధ్వనికి తగినట్లుగా వివిధ భంగిమల్లో చిందులు వెయ్యడం, గెంతడం, పల్టీలు కొట్టడం చేస్తుంటాడు. ఇతనిని నియంత్రించడం త్రాడు పట్టుకొన్నవాడి పని.

పులివేషదారి ఒక్కడే కాకుండా ఇద్దరు ముగ్గురు పులివేషధారులు కూడా ఒకే ప్రదర్శనలో పాల్గొంటారు. పులి-వేటకాడు పాత్రల నృత్యం ఆకర్షణీయంగాను, ఉత్తేజంగాను, గగుర్పాటు కల్గించేదిగాను ఉంటుంది. చూపరుల్ని బాగా ఆకట్టుకునే ప్రదర్శన ఇది.

నేలమీద ఉంచిన నిమ్మకాయల్ని పులి వేషధారులు నృత్యం చేస్తూ వాటిని నోటితో అందుకోవడం అందర్నీ ఆకర్షించే విన్యాసం. చిన్నపిల్లలు సైతం పులివేషం వేసి నృత్యం చెయ్యడం కన్నుల పండువుగా ఉంటుంది. పులినృత్యం జంతు నృత్యాలకు అనుకరణం. దీన్నే పెద్దపులి వేషమని, దసరా పులివేషమని అంటారు.

కన్నడ దేశంలోను ఈ కళారూపం ఉంది. దీన్ని 'హులివేష' అని పిలుస్తారు. జాతరలు, దసరా, మొహరం పండుగ సందర్భాల్లో, పులివేషం లాగానే ఈ జిల్లాలో 'పాలెగాడి వేషం' కూడ అమిత ప్రచారంలో ఉంది. దృఢకాయుడైన వాడొకడు 'పాలెగాడు' లాగా వేషం వేసుకుని తొప్పెట్ల ధ్వనికి తగినట్లుగా నృత్యం చేస్తాడు.

పైన పేర్కొన్నవే కాక జాతరలు, ఉత్సవాల సందర్భాల్లో కీలుగుర్రం, ఉరుముల నృత్యం, తప్పట నృత్యం (డప్పుల నృత్యం), ఆసాదివాండ్ల నృత్యం మొదలైన జానపద కళారూపాలు ఆంధ్రదేశంలో అనేకం ఉన్నాయి.

* * *

# 27. జానపద హస్తకళలు
## (Folk Handicrafts)

### హస్తకళ:

మానవుడు తన చేతి కౌశలంతో చేసే పనులు హస్తకళలు. సౌందర్యంతో కూడిన మనోహరమైన వస్తువుల్ని తయారు చేయడమే హస్తకళ. ఈ హస్తకళలన్నీ జానపదుల వస్తుసంస్కృతి లేదా భౌతిక సంస్కృతికి సంబంధించినవి.

మానవుడు సౌందర్యోపాసకుడు. సౌందర్యం ఉన్న ప్రతి వస్తువూ ఆనందాన్నిస్తుంది. కేవలం కూడు, గుడ్డలతో మానవుడు మనుగడ సాగించలేదు. అందమయిన వస్తుసముదాయం కోసం, కళల కోసం ఆరాటం పడుతుంటాడు. ఆ తపనలో ఎన్నో వస్తువుల్ని తయారు చేయగలుగుతున్నాడు. ఈ వస్తువులన్నీ అతని వస్తునైపుణ్యానికి ప్రతీకలు. చిత్రకళ, విగ్రహశిల్పం అతని బుద్ధి, యుక్తి కౌశల్యాలకు మచ్చుతునకలు.

కళ అనే శబ్దార్థం విస్తృతమై, అది వృత్తి సాధనాలలో ఒకటయింది. అందువల్ల కళను కేవలం కళాభిరుచి కోసమే కాకుండా, జీవన భృతిని సంపాదించుకోవడానికి కూడ ఒక సాధనంగా చేపడుతున్నాడు. ఇలా విస్తృతమయిన కళారంగంలో వృత్తికళలుగా చేతిపనులు (Handicrafts) కూడ చోటు చేసుకొన్నాయి.

ఆంధ్రదేశం భారతదేశపు హస్తకళలకు ప్రతిబింబం. ఇక్కడ చేతిపనులు అతి ప్రాచీనమైనవి. తరతరాలుగా వంశపారంపర్యంగా సంక్రమించినట్టివి. యుగయుగాల సంస్కృతి సంప్రదాయం ఆంధ్రుల చేతిపనుల్లో ఇమిడి ఉంది. ప్రతి చేతిపనికి ఒక ప్రత్యేకత, వైశిష్ట్యం కన్పిస్తాయి.

### విభజన:

ఒక సమాజం లేదా సంస్కృతి యొక్క సృజనాత్మక తపనని తృప్తి పరచడం కోసం ప్రతీకల్లాగ భాసించేవి హస్తకళలు. ఈ హస్తకళలను ప్రధానంగా రెండు విధాలుగా వర్గీకరించవచ్చు. అవి 1. ఔపయిక కళలు, 2. ఉపయోగిక కళలు.

ఔపయిక కళలు: వీటికి ఉదాహరణం - జానపదుల చిత్రకళలు, శిల్పం ఇత్యాది. సంగీత సాహిత్యాలు నాదజగత్తుని సృష్టిస్తే, శిల్పచిత్రాలు దృశ్య జగత్తుని సృష్టిస్తాయి. దైనందిన వ్యవహారంలో ఉపయోగపడే వ్యావహారిక కళలు ఉపయోగిక కళలు. జానపదుల చేతిపనులు, వృత్తి కళలన్నీ ఇందులో చేరతాయి.

## ఔపయిక కళలు:

ఆంధ్రదేశంలో ముఖ్యమైన జానపద చిత్రకళ కలంకారి. అంటే కలంతో పని చేయడం లేదా రంగుల అద్దకం అని దీని అర్థం. ఈ కళను బాటిక్ చిత్రకళ అని కూడ అంటారు. ఉత్తర సర్కారు జిల్లాల్లో ముఖ్యంగా బందరులో ఈ కళ ప్రాచుర్యం వహించింది.

రంగుల అద్దకానికి కావలసిన రంగుల్ని ఆకులు, పువ్వులు, చెక్కలు, వేర్లు బెరళ్ళతో తయారు చేస్తారు. ఇవన్నీ స్థానికంగా లభిస్తాయి. వస్త్రాలమీద ఈ రంగులు స్థిరంగా ఉండడానికి పటికరసాన్ని ఉపయోగిస్తారు. అద్దకం పనికివాడే కుంచె ఆరు అంగుళాల పొడవు వుంటుంది. ఒక వెదురు బద్దకు ఒక వైపున వెంట్రుకలతో కుంచె మాదిరిగా కట్టి కలంగా ఉపయోగిస్తారు.

జానపదుల మరో చిత్రకళ రంగవల్లి. రంగవల్లిలో వీరి చిత్రకళా నైపుణ్యం అమోఘంగా ఉంటుంది. వేదకాలం నుంచీ జానపద స్త్రీలు ముంగిళ్ళ చెంత రంగవల్లుల్ని తీర్చిదిద్దడం ఒక సంప్రదాయంగా ఉంది. పండుగ పబ్బాల్లో ఉత్సవాల్లో, శుభకార్యాల్లో, వివాహ సందర్భాల్లో రంగు రంగుల ముగ్గులతో ఇంటిని అలంకరిస్తారు. తెలుగు సంస్కృతికి అద్దం పట్టే ఈ రంగవల్లులు చూడ కన్నుల పండువుగా ఉంటాయి.

జానపదుల చిత్రకళల్లో పచ్చపొడుపుకు ప్రాధాన్యం ఉంది. పచ్చ పొడిపించు కోవడం కేవలం అలంకరణ కోసం మాత్రమే కాదు, అందులో అర్థం, పరమార్థం ఉన్నాయి. మతపరమైన చిహ్నాలలో రామాయణం పాత్రలకు చెందిన సీతమ్మ పరమైన పచ్చబొట్లు ఆటవిక స్త్రీలనెక్కువగా ఆకర్షిస్తాయి. అలాగే శ్రీరాముడు, లక్ష్మణుడు, హనుమంతుడు మొదలయిన పచ్చబొట్లు పురుషులను ఎక్కువగా ఆకర్షిస్తాయి. దేహంమీద ఎన్ని ఎక్కువగా పచ్చబొట్లు పొడిపించుకుంటే అవి అన్ని అంతస్తులను తెలుపుతాయని భావించే తెగలున్నట్లు తెలుస్తుంది.

జానపదుల శిల్పకళలో శిల్పానికి అధిక ప్రాధాన్యం కన్పిస్తుంది. జానపద శిల్పి వస్తునిష్ఠ కలిగినవాడు. జానపదుల శిల్పకళల్లో మత సంప్రదాయాల ప్రభావం కొట్టొచ్చినట్టు కన్పిస్తుంది. రాళ్ళమీద వీరుల చిత్రాలు చెక్కబడ్డ వీరగల్లులు, గ్రామదేవతల విగ్రహాలు వీరి శిల్పకళల్లో చెప్పుకోదగ్గవి. శాస్త్రీయ శిల్పకళలో లాగ జానపద శిల్పకళలో శాస్త్రాల సహాయం, నియమాల ప్రసక్తి కన్పించదు.

## ఉపయోగిక కళలు:

### బిద్రీ నగిషీ పనులు:

నేటి కర్నాటక రాష్ట్రంలో ఉన్న బీదరు పట్టణాన్ని బహమనీ రాజులు పరిపాలించారు. ఆ రాజుల ప్రోత్సాహం వల్ల బిద్రీ పరిశ్రమ అభివృద్ధి చెందింది. తుత్తినాగం, రాగి కరగించి పోతపోసి దానిమీద వెండితో డిజైనులు చేయడం ఈ హస్తకళ నైపుణ్యం. అందమైన బిద్రీ కళాఖండాలు సాలారుజంగు మ్యూజియంలోను, నేషనల్ మ్యూజియం (న్యూఢిల్లీ) లోను, బొంబాయి వస్తు ప్రదర్శనశాలలోను భద్రపరచబడి ఉన్నాయి. హైదరాబాదులోను బిద్రీకళ ప్రాచుర్యంలో ఉంది.

### ఫిలిగ్రీపని:

ఆంధ్రదేశంలోని కరీంనగర్ ఫిలగ్రీపనికి ప్రఖ్యాతిచెందింది. ఇక్కడి కంసాలుల పనితనం ఫిలిగ్రీపనిలో వ్యక్తమవుతుంది. అతి సన్నని వెండిదారాల ద్వారా అతి సున్నితమైన అలంకరణాలను తయారు చేయడం ఈ కళ ప్రత్యేకత.

### బొమ్మల తయారీ:

ఆంధ్రదేశం బొమ్మల్ని తయారు చేయడంలో ప్రసిద్ధి చెందింది. ఇక్కడి బొమ్మలు పలుదేశాలకు కూడ ఎగుమతి చేయబడుతున్నాయి.

ఆటబొమ్మలు కొయ్యతోను, వస్త్రాలతోను, తేలికైన లోహాలతోను, కాగితాలతోను, గుజ్జుతోను, రబ్బరుతోను, సెల్యులాయిడ్‌తోను తయారు చేయబడుతున్నాయి. పిల్లల ఆట వస్తువులు వినోదాన్నీ కుతూహలాన్నీ, శక్తియుక్తుల్నీ ప్రేరేపిస్తాయి. ఊహాశక్తిని రేకెత్తించే గుణం బొమ్మల్లో ఉంది. వివిధ

దేశాల ఆచారాలు, సంప్రదాయాలు, పద్ధతులు బొమ్మల మూలంగా వ్యక్తమవుతున్నాయి.

## నిర్మల్ బొమ్మలు:

ప్రపంచ ప్రసిద్ధిగాంచిన బొమ్మల్లో నిర్మల్ బొమ్మలను ముందుగా చెప్పుకోవాలి. నిర్మల్ పట్టణం ఆదిలాబాదు జిల్లాలో ఉంది. ఇది చిత్రవర్ణలతో విలసిల్లే హస్తకళలకు ప్రధాన కేంద్రం. కొయ్యబొమ్మల మీద వేసే లక్క పూతపని, బంగారు పూతపని నిర్మల్ పరిశ్రమ వైశిష్ట్యం. ఇక్కడి వారికీ కళ తరతరాలుగా సంక్రమిస్తోంది. తేలికైన కట్టె నిర్మల్ ప్రాంతంలో లభిస్తుంది. అందువల్లే బొమ్మల తయారీకి ఈ ప్రాంతం అనువుగా ఉంది.

## కొండపల్లి బొమ్మలు:

విజయవాడకు 20 కి.మీ. దూరంలో కొండపల్లి గ్రామం ఉంది. ఇది బొమ్మల తయారీకి ప్రఖ్యాతి చెందింది. కొండపల్లికి సమీపంలో ఉన్న అరణ్యాల్లో లభించే తేలికపాటి పుణికి కర్రతో ఈ బొమ్మలు తయారు చేయబడతాయి. ఈ బొమ్మలు ఆంధ్ర జానపదుల జీవితాలకి ప్రతిబింబాలు.

అలాగే విశాఖపట్టణం జిల్లాలోని ఏటికొప్పాక లక్క బొమ్మలకు, తిరుపతి తిరుచానూరు ఎర్రచందనపు బొమ్మలకు ప్రసిద్ధి చెందాయి. ఎర్రచందనం చెట్లు తిరుపతి, చిత్తూరు, కడప జిల్లాలలో ఎక్కువగా ఉన్నవి.

బొమ్మలు తయారుచేసే కళలే కాకుండా చేటలు, బుట్టలు, తడికలు అల్లడం; రాగి, కంచు, వెండి లోహాలతో ఆభరణాలు, విగ్రహాలు తయారు చేయడం; కమ్మరి పనులు, కుమ్మరి పనులు, చేనేత, లేసుపనులు దంతపుపని, పూసలు తయారుచేయడం; కంబళ్ళు, ఉన్ని తివాసీలు తయారు చేయడం మొదలైన వన్నీ వృత్తికళలు. ఈ వృత్తికళల్లో జానపదుల హస్తకళా నైపుణ్యం ప్రస్ఫుటమవుతుంది. ఈ కళలన్నీ జానపదుల మనోభావాలకు దర్పణాలుగా భాసిస్తాయి.

* * *

# 28. జానపద విజ్ఞాన వస్తుప్రదర్శన శాలలు (Folklore Museums)

ఆంగ్లంలోని 'Museum' అనే పదానికి తెలుగులో సమానార్థకంగా 'వస్తుప్రదర్శన శాలలు' అనే పదం ప్రయోగించబడుతున్నది. ఇది గ్రీకు 'Musee' అనే పదం నుంచి ఆవిర్భవించింది. ఇది మన విద్యాధిష్ఠాన దేవతయైన సరస్వతిలాగా గ్రీకు పురాణాల్లో సంగీతం, సాహిత్యం, మొదలైన లలిత కళలకు అధిష్ఠాన దేవతలయిన తొమ్మిదిమంది అక్కచెల్లెండ్రను ఉమ్మడిగా తెలిపే పదం. ఈమె కళలు, సాహిత్యం, కవిత్వం, సంగీతం మొదలయిన వాటికి అధిష్ఠాన దేవత.

ఆంగ్లంలోని 'Folklore' అనే పదానికి ఆంధ్రంలో 'జానపద విజ్ఞానం' అనేది సమానార్థకం. కనుక 'Folklore Museum' ను జానపద విజ్ఞాన వస్తు ప్రదర్శనశాల అనవచ్చు. అంటే జానపదులకు సంబంధించిన విజ్ఞానాన్నంతటినీ భద్రపరచే వస్తుప్రదర్శనశాల. ఈ విషయమే Standard Dictionary of Folklore, legend and Mythology లో ఇలా చెప్పబడింది. 'A Museum dedicated to the life, work and creations of people at that stratum of society which works with its hands.[1]

Museum అనే మాటనే మరికొంత వివరిస్తూ శ్రీ శంకర్ సేన్ గుప్తా '.....Museum connotes a scholar's library (N.Baiey): and it is also known as an institution of the objects of lasting interests or value or it can be called a 'chamber of rarities (Neickelinsu)'[2] వస్తుప్రదర్శన శాలల్లో ప్రదర్శింపబడే వస్తువులు అసలైన వస్తువులు (original specimens)గా వుండాలి. కృత్రిమత్వానికి కాక వాస్తవానికే ప్రాధాన్యమీయాలి. వస్తుప్రదర్శనశాలలు విద్యా సంస్కృతులకు నిలయంగా వుండి కళాకారులను, శిల్పులను మేల్తరమైన పనుల్ని చేయటానికి పురికొల్పాలి. మానవాభ్యుదయాన్ని అవగాహన చేసుకోటానికి ఉత్సాహాన్ని రేకెత్తించాలి. జరిగిపోయిన, జరుగుచున్న వాటిని గూర్చిన జ్ఞానాన్ని ఇనుమడింప చేయాలి. జనుల జీవన పద్ధతుల్ని కన్నులకు కట్టేలా ప్రదర్శించాలి.[3]

---

*1. P-762.*
*2. Folklore Museum, P-xvii.*
*3. - Ibid - P-xviii.*

కనుకనే Dr. Johnson దృష్టిలో Museum అంటే A repository of learned curiosities'[4]

డా. శ్యామ్‌చంద్ ముఖర్జీ - 'The term, museum, as it stands now, means to indicate a collection of specimens of almost any character and is in theory connected with education or enjoyment of any body, who may wish to avail him self of its facilities'[5] అని వివరించాడు.

జనపదాలకు, జానపదులకు సంబంధించిన వస్తుప్రదర్శనశాల జానపద విజ్ఞాన వస్తు ప్రదర్శనశాల కాబట్టి తరతరాలుగా మనకు లభించిన జానపదుల పనిముట్లు, పరికరాలు, మొదలైనవి ఆసక్తి కలిగిన జనసామాన్యుల కొరకు ప్రదర్శింపబడే ప్రదేశమే 'జానపద విజ్ఞాన వస్తుప్రదర్శన శాల' అని అనేకుల మతం. 'జానపదం' అనే మాట ఆయా సమూహాల్లోని జనుల జీవన విధానానికి సంబంధించింది; అన్ని వర్గాల వారికిని అన్వయించేది. కనుక జానపద విజ్ఞాన ప్రదర్శనశాలను జానపదుల జీవన విధానానికి ప్రతిబింబించే ఒక కేంద్రంగా పరిగణింప వచ్చును.

సమస్త జానపద సమూహాల్లోని సాధారణ జనుల్ని గురించి, వారి నిత్య జీవన విధానాల్ని గురించి అధ్యయనం చేయడమే జానపద జీవనాన్ని (Folklife) పరిశోధించే విద్యార్థి లక్ష్యం. కనుక జానపదులు ఉపయోగించిన పనిముట్లు, వాని గృహనిర్మాణ విధానం, భాష, ఆచార వ్యవహారాలు, విరామ సమయాల్లో వారు గావించే పనుల వివరాలు మొదలయిన వాటిని సేకరించడమే అతని కర్తవ్యం. తరతరాలుగా జానపదుల జీవన విధానాల్లో కలిగిన మార్పులను అవగాహన చేసుకొనటమే అతని విధి. Esdras అన్నట్లు 'It was not in our minds to be curious of the high things, but of such as pass by us daily'[6] జానపద సమూహాల్లోని సాంఘిక జీవన విధానాల్ని పరిశీలించడానికి స్థానిక చరిత్రలనే సాధనాలుగా గ్రహిస్తున్నాం. ఇది కొంతవరకు ఉపకరించినా, తక్కిన ఇతర సాధనాల్ని

---

*4. - Ibid -, P-20.*

*5. - Ibid -, P-20.*

*6. Folklore and Folklife, P-498.*

సైతం ఉపయోగింప వలసి వుంటుంది. ఇందుకోసం నేడు శిథిలమౌతున్న జానపదుల విజ్ఞానానంతటిని సేకరించి భద్రపరచవలసి ఉంటుంది.

పందొమ్మిదో శతాబ్దంలో పురాతన వస్తువుల్ని సంపాదించటానికి బ్రిటీషు ద్వీపాలలో ఒక ఉద్యమం ఆరంభమైంది. వేదాంత సమాజాలు, సాహిత్య సంఘాలు, పురాతన వస్తు సమాజాలు, వస్తుప్రదర్శనశాలసమితులు అనేక సంఖ్యల్లో నెలకొల్పబడి ప్రాచీనకాలంపై నూతనాసక్తిని రేకెత్తించాయి. ప్రాచీనకాలపు వస్తువుల్ని భద్రపరచటమే ఈ సంఘాల ప్రధాన లక్ష్యంగా ఉండేది.

త్రవ్వకాల్లో బయటపడ్డ, రాళ్ళురప్పలు, లోహాలు, మట్టిపాత్రలు మొదలయిన వాటిని సేకరించి, శుభ్రపరచి వివరణరహితంగా అద్దాలచే భద్రపరచబడిన వస్తుప్రదర్శనశాల్లో వుంచడం మాత్రమే జానపద వస్తుప్రదర్శనశాల అనిపించుకోదు. సేకరింపబడ్డ ఆయా వస్తువుల్ని సరైన వివరాలతో ప్రదర్శించాలి. ఆయా వస్తువుల్ని పరిశీలించాలనే జిజ్ఞాసను రేకెత్తించేలా ప్రదర్శనశాలలు నిర్వహింపబడాలి. నేడు పురాతన వస్తు శాస్త్రం అభివృద్ధి చెందుతోంది. త్రవ్వకాల్లో బయల్పడ్డ వస్తువులకు సరైన కాలం నిర్ణయింపబడి భద్రపరచబడుతున్నాయి. చారిత్రక పరిశోధకులకు నాటి జీవన విధానాల్ని పరిశీలించటానికి ఈ వస్తు ప్రదర్శనశాలలు అవకాశం కల్పిస్తున్నాయి. పురాతన వస్తుప్రదర్శనశాలలు జనపద వస్తుప్రదర్శనశాలల్లో ఒక భాగంగా ఉన్నాయి.

జానపద వస్తు ప్రదర్శనశాలల్లో సేకరింపబడ్డ వస్తువులు కేవలం ప్రదర్శన యోగ్యంగానే కాక ఆయావస్తువుల స్వరూప నిర్మాణాన్ని, సంఘంలో వాటికి ప్రాధాన్యాన్ని కల్గించేవిగా ఉండాలి. ప్రదర్శనశాలలోని వస్తువులు వైజ్ఞానిక (Scientific) రీతిలో అభ్యసించటానికి ఏర్పాట్లు గావించాలి. అట్లయినప్పుడే జానపదుల సంస్కృతి వికాసాల్ని గుర్తించటానికి వీలవుతుంది. కేవలం సేకరణతోనే వస్తుప్రదర్శన శాలయొక్క పనిపూర్తి కాదు. ఏ ప్రజల నుండి ఎలాంటి వస్తువులు సేకరింపబడ్డాయో ఆ వస్తువులు ఆ ప్రజల యొక్క నిత్యజీవన విధానాల్ని ప్రతిబింబించేవిగా ఉండాలి. Lille hammer లోని Norwegian Folk Musem వ్యవస్థాపకుడైన Albert sandwing తన వస్తుప్రదర్శనశాలను గురించి చెబుతూ 'It is a collection of homes into which one can enter and go straight to the people that lived there thus learning to know their way of life, their tasks and their work; the fashioning and furnshing of a

home depict the people themselves' నిజమైన వస్తుప్రదర్శనశాలపై లక్ష్యాన్ని సాధించాలి.

వ్యావసాయిక, పారిశ్రామిక పనిముట్లు, చేతి పనిముట్లు జానపదుల జీవనానికి సంబంధించినవి. ఏ వస్తువును తీసుకొన్నా దాని రూపానికీ ప్రాధాన్యమీయక వస్తువుయొక్క పనితనాన్ని, దాని నిర్మాణవైఖరిని, ఒక ప్రాంతానికి మరియొక ప్రాంతానికి ఆవస్తు నిర్మాణ విషయంలో ఉండే వైవిధ్యాన్ని, ఆ వస్తువుకే ఇతర ప్రాంతాల్లో వుండే వివిధ నామాల్ని, ఉపయోగించే తీరుని గమనించవలసి ఉంటుంది. కనుక జానపదవిజ్ఞాన పరిశోధకుడు వీటినన్నిటినీ మనసులో ఉంచుకొని సేకరణకు పూనుకోవాల్సి ఉంటుంది.

కనుక జానపద వస్తు ప్రదర్శనశాలలో సేకరింపబడ్డ వస్తువులు రెండు ప్రధాన లక్షణాల్ని కలిగి ఉండాలని తేల్చవచ్చును. 1. జానపద జీవన సమగ్ర చిత్రణ మరియు ఆ వస్తువు సేకరింపబడ్డ ప్రాంతం యొక్క వైశిష్ట్యం. 2. సేకరింపబడ్డ వస్తువులు తరతరాలుగా మానవ సంఘక్రమ వికాసాల్ని గుర్తింప వీలు కలిగి ఉండటం.

వస్తుప్రదర్శనశాల యొక్క లక్ష్యం నాలుగు విధాలుగా ఉంటుంది. 1. సేకరణ, 2. రక్షణ, 3. ప్రదర్శన, 4. పరిశోధన . దీన్ని గురించి Folk lore and folk life లో collection consists of far more than the haphazard assembling of objects. Preservation consists of far more than the immersing of wooden objects in woodwarm killer and rusty iron in acid. Presevation too consists of something far beyond arranging a shop window display in an immaculate glass case..... that of study and research, is essential in a folk museum'

వస్తుప్రదర్శనశాల రెండుభాగాల్ని కలిగి ఉంటుంది. 1. జానపద జీవన సంస్కృతలకు సంబంధించిన వస్తువులను ప్రదర్శించెడి భవనం. దీని ప్రధాన లక్ష్యం వస్తువు పుట్టుక, వికాసాల్ని తెలపడం 2. మైదాన ప్రదేశ భాగం (Open-air section) దీంట్లో సాంప్రదాయిక జీవనం ప్రతిబింబించే వాస్తుశాస్త్రానికి సంబంధించిన పరికరాలు ప్రదర్శింపబడతాయి.

1883లో Oxford (England) నెలకొల్పబడ్డ Ashmolean Museum అతి ప్రాచీనమైన వస్తుప్రదర్శనశాలగా చెప్పబడుతోంది. 1872లో Arthur

Hazelius చే స్థాపించబడ్డ Nordiska Museet యూరోపియన్ జానపద విజ్ఞాన వస్తుప్రదర్శన శాలల్లో మొట్టమొదటిది.

1891లో Arthus Hazelius చేతనే స్థాపించబడ్డ Stockholm లోగల Skansen లో 'Swedish open - air Museum' మొట్టమొదటి Open air musuem గా పరిగణింప బడుతోంది. గడచిన దశాబ్దంలో అమెరికాలోను ఇట్టి వస్తుప్రదర్శనశాలలు బయలు దేరాయి. ఉదాహరణకు cooperstown, Newyork లోని Farmers' Museum; Sturbridge, Massachusettes లోని Old shelburne; Landis vally లోని Pennsylvania farm Museum; Ontanio లోని Upper Canada Musuem మొదలైనవి. ఇవి Skansen లోని Swidish open Ari Museum ను ఆకర్షించాయి. ఇక్కడి పరిశోధకులు ప్రాచీన అమెరికా దేశస్థుల జీవన విధానాన్ని అధ్యయనం చేయగలుగుతున్నారు. అమెరికాలో నేడు 2000 వస్తుప్రదర్శన శాలలున్నాయట. అందులో కొన్ని జానపద విజ్ఞాన, జానపద సంస్కృతులకు సంబంధించినవీ ఉన్నాయి.

స్వీడను దేశంలో 800 పైగా జానపద విజ్ఞాన వస్తుప్రదర్శనశాలలున్నాయట. నార్వేదేశంలోను అనేక జానపద వస్తుప్రదర్శనశాలలు నెలకొల్పబడ్డాయి. వానిలో రెండు ముఖ్యమైనవి. అవి Oslo చెంతగల Norsk Museum Bygdy మరియు 1837 లో నెలకొల్పబడిన Lille hammer. డెన్మార్క్ దేశంలో Copenhagen చెంతగల Frilands Museet వస్తుప్రదర్శనశాల 100 ఎకరాలు కలిగి ఉన్నదట.

Great britain లో జానపద వస్తుప్రదర్శనశాల ఉద్యమం త్వరితగతిని పుంజుకోలేదు. 1936లో స్కాట్లండులోని Kinguissie లో isbal grant స్థాపించిన High land folk Museum ఎన్నదగినది. దీనికయిన ఖర్చంతా Grant భరించాడు. 1955 నుండి ఇది మూడు Scottish విశ్వవిద్యాలయాలచే నిర్వహించబడుతోంది. స్కాట్లాండులో చెప్పుకోదగ్గ మరి రెండు వస్తు ప్రదర్శనశాలలు Glenesk folk Museum మరియు Angus folk museum

బ్రిటన్ దేశంలో Yorkshire కు సంబంధించిన J.L. kirk వస్తుప్రదర్శన శాల ఉద్యమాన్ని నిర్వహించిన వారిలో పేర్కొనదగ్గవాడు.

జానపద విజ్ఞాన వస్తుప్రదర్శనశాలలో అతి ప్రాచీనమైనదిగా చెప్పబడుతున్న Welsh folk Museum ప్రపంచంలోని యాత్రికులను అమితంగా ఆకర్షిస్తోంది.

ఇది Welsh దేశపు సంప్రదాయాలకు ప్రతినిధిగా వుంది. ఇందులో పరిశోధన సంస్థ (Research Institute) కూడా వుంది. ఈ పరిశోధనా సంస్థలో ఆ దేశపు భాషాశాస్త్రం, జానపద కథలు, వస్తు సంస్కృతి అధ్యయనం చేయబడుతున్నాయి Belfast సమీపంలో వుండే Holyrood లోగల The ulster folk Museum కూడా Welsh folk museum ను పోలియున్నది.

అంతర్జాతీయముగా ప్రసిద్ధి చెందిన కొన్ని విజ్ఞాన ప్రదర్శన శాలలు.

Halifax లోని shifden hall

leeds లోని kirkstall Abbey

Leicester లోని Newarke Houses

Gloucester లోని Bishop Hooper's loding

Bristol లోని Blaise castle- ఇవన్నీ జానపద జీవనాన్ని ప్రదర్శించే వస్తుప్రదర్శనశాలలు. ఇట్లే రష్యా, ఇటలీ, బెల్జియం, హాలెండు, రుమేనియా, యూగోస్లేవియా, ఆస్ట్రేలియా, కెనడా, జపాన్, పోర్చుగల్ మొదలైన శాలల్లో వస్తుప్రదర్శన శాలలున్నాయి.

భారతదేశంలో వస్తుప్రదర్శనశాలా ఉద్యమం 1784 లో Royal Asiatic Society ఏర్పడటంతో ఆరంభమైనది. Dr. N. Wallich మరికొందరు సభ్యులతో 1814లో వస్తుప్రదర్శనశాల ప్రారంభింప బడినది.

1851లో నెలకొల్పబడిన Victoria and Albert Museum పలురాష్ట్రాల్లోని ఆదివుజాతుల (tribal people) కు సంబంధించినది. మద్రాసులోని ప్రభుత్వ వస్తుప్రదర్శనశాలలో మానవశాస్త్రం మొదలుకొని జంతుశాస్త్రం వరకుగల వస్తువులు భద్రపరచబడ్డాయి. దీంట్లో దక్షిణ భారతదేశంలోని జానపదుల సంగీత వాద్యాలు, ఆదిమ జాతుల గుడిసెల నమూనాలు, మలయాళీ భూతనాట్య వస్తువులు మొదలైనవి ప్రదర్శింపబడి వున్నాయి. భారతదేశంలో వుండే జానపద విజ్ఞానానికి సంబంధించిన వస్తుప్రదర్శనశాలలు మరికొన్ని Central Museum (నాగపూరు), Napier Museum, మరియు Sri Chitralaya (తిరువనంతపురం), పూనాలో ఉన్న

రెండు జానపద వస్తు ప్రదర్శనశాలలు, Crafts Museum (న్యూఢిల్లీ), National Museum (న్యూఢిల్లీ), Assam State Museum and Cottage Industries Museum (గౌహతి), Victoria Hall Museum (ఉదయపూరు), Allahabad Museum (అలహాబాదు), Chandradhari Museum (దర్భాంగ), Sikar Musuem (సికార్), Baroda State Museum (బరోడా), Gross forest Museum (కోయంబత్తూరు), Bharath Kala Bhavan (బనారస్), Indian Museum (కలకత్తా), Gurusaday Museum (కలకత్తా), Asutosh Museum (కలకత్తా విశ్వవిద్యాలయం) - ఇదియే మొట్టమొదటి విశ్వవిద్యాలయ వస్తు ప్రదర్శన శాల (1937).

మైసూరు విశ్వవిద్యాలయంలోని జానపద విజ్ఞాన వస్తు ప్రదర్శనశాల జానపదుల జీవన విధానాన్ని, జానపదులు ఉపయోగించిన వస్తువులను ప్రదర్శిస్తూ తక్కిన విశ్వవిద్యాలయాలవారికి కనువిప్పు కలిగిస్తోంది. ఆ మధ్య, ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైద్రాబాదులో ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్తు వారిచే వస్తు ప్రదర్శనశాల ప్రారంభించబడింది.

భారతదేశాన్ని అవగాహన చేసికోటానికి, భారతదేశ విభిన్న సంస్కృతుల రక్షణకు జానపద విజ్ఞాన వస్తుప్రదర్శనశాలలు అత్యంత ఉపయుక్తాలు. ఒక విధంగా ఇవి జ్ఞాన సముపార్జనకు ప్రత్యక్షసాధనాలు. 'Museum is a place for social and secular accumulation and folklore is its aid and objects in a folklore museum. Such a museum holds special potentiallties for the fulfilment and the furtherance of educational, cultural and developmental requirements of man'[7]

వస్తు ప్రదర్శనశాల నిర్వహణకు సమర్థుడైన ప్రాచీన వస్తు ప్రదర్శన శాఖాధికారి Curator ఉండాలి. ఇతడు మానవశాస్త్రం, పురాతన వస్తు శాస్త్రం, జానపద విజ్ఞానం, ప్రాంతీయ - ఆదిమ జాతుల భాషలు, చరిత్ర, కళలు, ఇత్యాదుల్లో ప్రత్యేక శిక్షణ కలిగి వుండాలి. వస్తు ప్రదర్శనశాల నిర్వహణకు సలహా సంఘం, వస్తు ప్రదర్శనశాల సంఘాలు ఉండాలి. ఏమైనా దీన్ని నిర్వహించే సభ్యులు జానపద విజ్ఞానం మరియు వస్తుప్రదర్శనశాలలలో నిపుణులుగా వుండాలి.

---

7. *Folklore Museum, P-xx*

వస్తు ప్రదర్శనశాలలు గ్రంథాలయాలలాంటివి. గ్రంథాలయాల్లో చెప్పబడ్డ విషయాలు Second hand knowledge కి సంబంధించినవి కాగా వస్తు ప్రదర్శనశాలల్లో ప్రదర్శింపబడే వస్తువులు Original Objects.

జానపద వస్తు ప్రదర్శనశాలల్లో ప్రదర్శింపదగిన వస్తువులు: వ్యవసాయం, కట్టడాలు, గనులకు సంబంధించిన వస్తువులు; కమ్మరి, కుమ్మరి, సాలె, వడ్రంగి మొదలైన వృత్తుల వారికి చెందిన వస్తువులు; ఆహారపానీయాలు; క్రీడలు-వినోదాలు; జానపద సంగీత వాద్యాలు, నృత్యం, జానపద కళలకు సంబంధించిన వస్తువులు, బొమ్మలు - కొయ్యబొమ్మలు - లోహపు బొమ్మలు, తాళపత్ర గ్రంథాలు, చిత్ర పటాలు, వివాహాది ఆచార వ్యవహారాలకు సంబంధించిన వస్తువులు మొదలైనవి. మొత్తంమీద జానపదులకు సంబంధించిన ఏ వస్తువైనా ప్రదర్శన యోగ్యమే.

టేపురికార్డర్లు, గ్రామఫోను రికార్డులు, స్లైడులు, కెమెరాలు మొదలయిన వాటిని వస్తుప్రదర్శనశాల కలిగియుండాలి. జానపద గీతాలను, కథలను రికార్డు చేసి పెట్టాలి. పండుగలు - పబ్బాలు, ఆచార వ్యవహారాలు మొదలైన జానపద జీవనానికి సంబంధించిన వాటిని ప్రదర్శించాలి. ప్రదర్శింపబడ్డ వస్తువులను గూర్చి, వాటి ప్రయోజనాన్ని గూర్చి ఆ వస్తువుల చెంతనే చీటీలు వ్రాసి అతికించాలి. ఏమైనా 'The folklore museum is devoted to the life and culture of the people or the community it serves' [8] అంతేకాక 'A museum must never neglict to bridge the gap between the past and present, between the ordinary and extraordinary' [9]

వస్తుప్రదర్శనశాలయొక్క కర్తవ్యాల్ని J. Geraint Jenkins ఇలా పేర్కొంటాడు. '......the primary purpose of a folk museum is not to show things that are unique; neither is to show gems of architectural history, although such features as the evolution of building techniques and the history of technology may be illustrated in the exhibit of a folk museum - The whole concept of a folk museum is to take the visitor out of his present day environment and straight to the people that lived in some by gone age - one of the main duties of a museum is to give the public a new awareness

---

*8. Folklore Museum.*

*9. Folklore and Folklife, P-510.*

of things previously taken for granted. They may be stimulated to search further for knowledge to realize that they inherit a long, complex tradition' [10]

జానపద విజ్ఞాన విషయాల్ని సేకరించటానికి, సేకరించినదాన్ని ప్రదర్శించటానికి జానపద విజ్ఞాన వస్తుప్రదర్శనశాలలు అత్యవసరం. వీటి నిర్వహణకై జానపద అకాడెమీల స్థాపనకూడ అంతే అవసరం. జానపద అకాడెమీల స్థాపనకై కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పూనుకోవాలి. ఆసక్తిగల జానపద విజ్ఞాన వేత్తలు సహకరించాలి.

* * *

---

*10. Ibid - P. 510*

# 29. జానపద విజ్ఞాన క్షేత్రకార్యం
## (Folklore Field Work)

క్రమబద్ధమైన ఎలాంటి అధ్యయనానికైనా మూడు పద్ధతులున్నాయి.[1] అవి 1. విషయ సంగ్రహణం (Collecting the data), 2. విషయానుక్రమణం (Ordering the data), 3. విషయవిశ్లేషణం (Analysing the data). జానపద విజ్ఞానంలో ఈ మూడు అంశాలకూ ప్రత్యేకమైన పేర్లున్నాయి. అవి 1. క్షేత్రకార్యం (Field work), 2. వర్గీకరణం (Classification), 3. సిద్ధాంతీకరణం (Theorization) ఈ మూడూ ప్రత్యేకమయినవే అయినా ఒకదానిమీద ఒకటి ఆధారపడి ఉన్నాయి.

విషయ సంగ్రహణ కావించే వ్యక్తీ, మౌఖిక సంప్రదాయాన్ని సంరక్షించే వ్యక్తీ సమావేశమయ్యే ప్రదేశం క్షేత్రకార్యం.[2] శంకర్ సేన్ గుప్తా ఈ విషయాన్నే విపులీకరిస్తూ 'field study is that of empirical study which is conducted on the basis of first hand information collected by going round to different sources. It is, as such, quite different from the studies which are made on the basis of stored up information. The field study....akin to census and survey commonly used in connection with collection, presentation and handling of statistical data'.[3]

కాబట్టి జానపద విజ్ఞాన ప్రక్రియల్ని అధ్యయనం చెయ్యడానికి జానపద విజ్ఞాన క్షేత్రకార్య విధాన జ్ఞానం అత్యావశ్యకం. ఈ విజ్ఞానాధ్యయనంలో ఆసక్తి ఉన్నవాళ్ళంతా క్షేత్రకార్యంలో కృతకృత్యులవుతారనడం సమంజసం కాదు. ఇది తక్కిన ఇతర విజ్ఞానశాస్త్ర అధ్యయనాల కంటే విభిన్నమైంది. విజ్ఞానశాస్త్ర పరిశోధకుడికి ప్రయోగశాల (Laboratory) ఎలాంటిదో జానపద విజ్ఞానవేత్తకు క్షేత్రకార్యమలాంటిది. జానపద సమూహాన్ని శాస్త్రీయంగా అభ్యసింపజేసే విధానాన్నే క్షేత్రకార్యం అనవచ్చు.

---

1. *An Introduction to the Study of Indian Folklore, P-14, Dr P. R. Subramanian.*
2. *- Ibid -.*
3. *A Guide to field study, P-38, by Sankarsen Guptha.*

జానపద విజ్ఞానాంశాలను అనేకులు అనేకరీతులుగా సేకరించడం జరుగుతుంది. కొంతమంది జానపద గేయాలను ఒక hobby గా సేకరిస్తారు. మరికొంత మంది జానపద సాహిత్య సౌందర్య పరవశులై సేకరిస్తారు. మరికొంతమంది ధన సంపాదన కోసం సేకరిస్తారు. వీళ్ళ దృక్పథం వేరు. నిజమయిన జానపద విజ్ఞాని కేవలం పరిశోధనాదృష్టితో శాస్త్రీయంగా, ప్రామాణికంగా జానపద విజ్ఞానాంశా లను సేకరించి, అధ్యయనం చెయ్యడానికి కృషి చేయాల్సి వుంటుంది.

క్షేత్రకార్యజ్ఞుడికి తన శాస్త్రజ్ఞానమే కాక నృశాస్త్రం (Anthropology), సామాజిక శాస్త్రం (sociology), భాషాశాస్త్రం (Linguistics), (Psychology), చరిత్ర (History) మొదలయిన శాస్త్రాల పరిచయం, మాండలిక భాషా పరిజ్ఞానం ఉన్నట్లయితే పరిశోధన సుకరం అవుతుంది.

సాధారణంగా క్షేత్రకార్యం సంవేదకు (Informant)ని మీద ఆధారపడి వుంటుంది. వివరణ చేసే సామర్థ్యం కొంతమందిలో లోపించి వుంటుంది. అందువల్ల మంచి సంవేదకుల్ని ఎన్నుకోవాల్సి వుంటుంది. మంచి సంవేదకుడు లేని క్షేత్రకార్యం 'చుక్కానిలేవ' అవుతుంది.

జానపద విజ్ఞాన పరిశోధకుడు తాను క్షేత్రకార్యాన్ని ప్రవేశించడానికి ముందు, అంతకుముందు పరిశోధన చేసిన వాళ్ళ వివరాలను గ్రహించి, వాళ్ళ అనుభవాలను మార్గదర్శకాలుగా ఉపయోగించుకోవాల్సి ఉంటుంది. ప్రాంతీయ గెజెట్టుల్ని, ఆయా ప్రాంత గ్రంథాలను చదువవలసి ఉంటుంది. ఆయా ప్రాంత మ్యాపులను కూడ చూడాల్సి వుంటుంది. అందువల్లనే Donald A Mac Donald 'Reading should ofcourse include general theory and practice'[4] అని పేర్కొన్నారు. దీనివల్ల తాను సందర్శించబోయే స్థలమే కాకుండా ఆ ప్రాంత చారిత్రక, సాంస్కృతిక, సాంఘిక విషయాలు కూడ అవగాహన అవుతాయి. పరిశోధకుడికి ఆయాప్రాంతాల లోని గ్రామవైద్యుడు, అధ్యాపకుడు, గ్రంథాలయాధికారి, గ్రామాధికారుల పరిచయం ఉన్నట్లయితే సేకరణ సులభ సాధ్యమవుతుంది.

---

4. *Folklore and Folklife, P-408.*

జానపద విజ్ఞాన పరిశోధకుడు గ్రామీణులలో ఒక్కడుగా మెలగినప్పుడే అతని క్షేత్రకార్యం ఫలవంతమవుతుంది. మాటకారితనం, హాస్యం, చాతుర్యం, యోగ్యత, జ్ఞానం, సమయస్ఫూర్తి, సాహసం ఇత్యాదులు సాధారణ వ్యక్తి కంటే అధికంగా ఉన్నట్లయితే ఆతడు క్షేత్రకార్యంలో బాగా రాణిస్తాడు. అన్నింటికంటె ప్రధానమైంది సహనం. జానపద సమూహాలను కలిసినప్పుడు విభిన్నమయిన అనుభవాలను పొందడం సంభవిస్తుంది. సాధారణంగా గ్రామాల్లో రాజకీయ వర్గాలు ఉండడం పరిపాటి. అలాంటి ప్రాంతాల్లో సమయస్ఫూర్తితో మెలగాల్సి వుంటుంది. సంఘంలో మంచివాళ్ళు, చెడ్డవాళ్ళు ఉండడం సామాన్యం. అందువల్ల ఆ యిద్దరి సహాయ సహకారాలను అర్థించాల్సి వుంటుంది. వాళ్ళతో స్నేహభావంతో సంచరించాల్సి వుంటుంది. ఆత్మీయతను సంపాదించుకోవడం ముఖ్యం. కొంతమంది పరిశోధకుణ్ణే అత్యంత కుతూహలంతో చూస్తారు. మరికొంతమంది పల్లె సాహిత్యం వీడికెందుకని నిర్లక్ష్యభావాన్ని ప్రదర్శిస్తారు. జానపదులు నిరక్షర కుక్షులు కావడం వల్ల పరిశోధకుడి ఉద్దేశాన్ని కానీ, స్వభావాన్ని కానీ గుర్తించకుండ, అతడినొక గూఢచారిగానో సంఘద్రోహిగానో పరిగణించడానికి కూడ అవకాశం ఉంది. ఈ అన్ని సందర్భాల్లోను అతడికి సహనమే నెచ్చెలిలాంటిది.

పరిశోధకుడు సాధారణంగా ఆయాప్రాంత ప్రజల ఆచార వ్యవహారాలు, నిషేధాలు (taboos), నమ్మకాలలో తలదూర్చినప్పుడు, ఆ ప్రాంత ప్రజలతో విరోధం తెచ్చి పెట్టుకోవాల్సి వుంటుంది. అలాంటి సమయాల్లో పరిశోధకుడు కూడ వాళ్ళల్లో ఒక్కడుగా మెలగాల్సి వుంటుంది. జానపదులతో కలసి మెలసి సంచరిస్తూ, వాళ్ళు తినే తిండి తింటూ, కట్టుకునే బట్టల్ని కట్టుకుంటూ, వాళ్ళ ఆచార వ్యవహారాల్నే పాటిస్తూ, వాళ్ళని అనుసరించాల్సి వుంటుంది. క్షేత్రకార్యజ్ఞుడికి పల్లెప్రజలతోడి సంబంధమే అధికం. కాబట్టి వాళ్ళ కట్టుబాట్లు తన అభిరుచికి సరిపడకపోయినా ఓర్పుతో తన క్షేత్రకార్యాన్ని ఫలవంతం చేసుకోవాలి. ఏహ్యభావం పనికిరాదు. ఆగ్రహం, భీతి, మొహమాటం ఇత్యాదులు విషయ సేకరణకు అవరోధాలు.

పరిశోధకుడికి తన క్షేత్రకార్యజ్ఞానంతోపాటు యంత్రోపకరణాలను ఉపయోగించే తాంత్రిక జ్ఞానం కూడ అవసరం. యంత్రోపకరణాలు క్షేత్రకార్యాన్ని సులభం చేస్తాయి; సమయాన్ని ఆదా చేస్తాయి. టేపురికార్డరు, ఫ్లాష్ కెమెరా, మూవింగ్ కెమెరా, టైపు రైటరు ఇత్యాదుల అవసరం ఎంతైనా వుంది. పండుగ

పబ్బాలు, ఆచార వ్యవహారాలు, జానపద కళలు, ప్రదర్శన జానపద కళలు, ఉత్సవాలు - వేడుకలు ఇత్యాదుల్ని చిత్రీకరించడానికి ఫ్లాష్ మరియు మూవింగ్ కెమెరాలు ఉపయోగపడతాయి. ప్రత్యక్ష అధ్యయనానికివి సహకరిస్తాయి. టేపు రికార్డరువల్ల శీఘ్రంగా వ్రాయాల్సిన పని తప్పడమే కాకుండా సంభాషణలని, జానపద సంగీతాన్ని, ఉచ్చారణలోని యాసల్ని రికార్డు చేయవచ్చు. పరిశోధకుడికి టైపు, షార్టుహ్యాండుల ప్రవేశం ఉండటం మంచిది.

ఒక సంవేదకుని నుండి టేపురికార్డురు ద్వారా సేకరించిన విషయాన్ని మరొక సంవేదకుడు లేదా సంవేదకులకు విన్పిస్తే, సంవేదకులలో ఉత్సాహం అధికమై ఇంకా అనేక విషయాలను చెప్పడానికి ఉబలాట పడతారు. అంతేకాక అంతకు ముందున్న సిగ్గు, బిడియం సన్నగిల్లి, తాను చెప్పిన విషయాన్ని అదే టేపురికార్డరు ద్వారా తన కంఠాన్ని వినాలనే ఉత్సుకత సంవేదకుడిలో ఏర్పడ్డంవల్ల క్షేత్రకార్యజ్ఞుడికి కొంతవరకు తన ఉద్దేశం సఫలం కావడానికి దోహదకారి అవుతుంది.

K.S. Goldstein తన 'A Guide for field workers in folklore' అనే గ్రంథంలో జానపద విజ్ఞానానికి సంబంధించిన ప్రణాళికల్ని మూడు విధాలుగా విభజించాడు.[5]

1. **సర్వే (సమీక్షా) ప్రణాళిక (Survey Project):** ఒకరిద్దరు వ్యక్తులనుండి కాని, ఒకటి రెండు ప్రాంతాలనుండి కాని జానపద విజ్ఞానాంశాల్ని మచ్చుకు సేకరించడం.

2. **కూలంకష ప్రణాళిక (Deppth Project):** ఒక ప్రాంతం నుండి కాని, పలుప్రాంతాలనుండి కాని, సమూహం నుండి కాని, వ్యక్తుల నుండి కాని, సమస్త జానపద విజ్ఞానాంశాలను సంపూర్ణంగా సేకరించడం.

3. **స్థానిక ప్రణాళిక (Local Project):** ఒకటి రెండు జానపద విజ్ఞానాంశాలను తన కుటుంబం నుండి కాని, ఇరుగు పొరుగు వాళ్ళనుండి కాని సేకరించడం.

---

5. *An Introduction to Indian Folklore, P-15.*

పై మూడింటిలో ముందుగా సర్వే ప్రణాళికని, స్థానిక ప్రణాళికను చేపట్టాలి. వీటివల్ల అసంఖ్యాకాలైన జానపద విజ్ఞానాంశాల ఉనికిని గుర్తించడానికి వీలవుతుంది. ఆ తర్వాత కూలంకష ప్రణాళికను చేపట్టవచ్చు.

జానపద విజ్ఞానాంశాలను రికార్డు చేసేటప్పుడు Microphone ను ఏ విధంగా ఉపయోగించాలో తెలుసుకోవాలి. 'The positioning of the microphone is vital. Too great a distance can lead to loss of presence and an irritating increase in the level of back ground noise picked up. A distrance of about two feat will often be found ideal, granted that the important is not distressed by such close proximity..... A hand held microphone will often be found to have advantages'[6]

సంవేదకుడికి తెలియకుండ లేదా అతని అనుమతి లేకుండా రికార్డు చెయ్యడం మంచిది కాదు. 'Secret recording, done without the knowledge or permission of the informant, is never to be encouraged'[7] . ఇది క్షేత్రకార్యజ్ఞుడు తప్పక గమనించాల్సిన ప్రధానాంశం.

జానపద క్షేత్ర కార్యాచరణ సందర్భంలో అవలోకన (Obervation) మరియు సందర్శన పద్ధతి (Interview method) ప్రధానమైనవి. అవలోకన పద్ధతివల్ల కలిగే అనుభవం పరిశోధకుడికి ఒక అమూల్య నిధిలాంటిది. జానపద విజ్ఞాన జ్ఞాన సముపార్జనకి సేకరించాలనుకున్న విషయాన్ని అవలోకించడం అత్యావశ్యకం. ఈ పద్ధతిలో కళ్ళు, చెవుల ప్రాధాన్యం అధికం. జానపద విజ్ఞానంలో ఈ అవలోకన పద్ధతిని సాంఘిక జానపద ఆచారాలు (Social folk customs), జానపద కళలు (Folk Arts), వస్తు సంస్కృతి (Material Culture) మొదలైనవాటిని అధ్యయనం చేసే సమయంలో ఉపయోగించుకోవచ్చు. ఈ అవలోకన పద్ధతి రెండు విధాలు. 1. సరళం లేదా అనియంత్రిత అవలోకనం (Simple or uncontrolled observation), 2. వ్యవస్థిత లేదా నియంత్రిత అవలోకనం (Systematic or controlled observation). మరికొంతమంది అవలోకనం రెండు విధాలన్నారు. 1. Participation observation, 2. non-

---

*6. Folklore and Folklife, P-417.*

*7. - Ibid -, P-419.*

participation observation. మొదటి పద్ధతిలో క్షేత్రకార్యజ్ఞుడు నేరుగా జానపద కార్యాచరణల్లో పాల్గొంటాడు. అలా పాల్గొడనం వల్ల స్వంతంగా ఆయా విషయాల్ని నేర్చుకొంటాడు.

Donald A. Mac Donald సందర్శన (Interview) విషయంలో రెండు ముఖ్యమైన techniques గురించి పేర్కొన్నాడు.[8] ప్రత్యక్ష సందర్శనం (Directive interview), 2. పరోక్ష సందర్శనం (Indirective interview). ~~ఈ~~ రెండింటిలో దేన్నైనా ఉపయోగించవచ్చు. ఇదే విషయాన్ని Kenneth S. Goldstein తన 'A guide for fieldworkers in folklore' లో రెండు విధాలైన సందర్శనాలని పేర్కొన్నట్లు George list folklore and folklife గ్రంథంలో పేర్కొన్నారు.[9] 'In directive interviews, a specific line of inquiry is pursued. The interviewer may utilize a previously prepared questionnaire or he may question the informant in a less formal manner. In non-directive interviews, a preliminary question or two are posed and the informant is then allowed to follow his own line of thought or interest. Each type of interviewing offers specific advantages. Directive Interview is the most efficient method of quickly acquiring disired information. In non-directive interview, on the otherhand, the informant, through the free flow of his related experiences, may provide the collector with concerning useful directions of inquiry of which the collectors could have no knowledge in advance. For this reason many collectors use non directive interviews in work with informant preliminary to a recording session'.

'A Guide to field study' లో క్షేత్రకార్యజ్ఞుడు సంగ్రహించాల్సిన వివరాలకు మాదిరికార్డు (Specimen card)ను తయారు చేసుకోవాల్సిన విధం చెప్పబడివుంది.[10]

A. సేకరణ స్థలం: 1. జిల్లా, 2. విభాగం 3. పోలీస్‌స్టేషన్, 4. సంఘం (Union), 5. గ్రామం

B. సంవేదకుడు: 1. పేరు, 2. వయుస్సు, 3. వృత్తి, 4. విలాసం, 5. విద్యావంతుడైతే అతని విద్యావివరాలు, 6. ఇప్పటి Status.

---

*8. Folklore and Folklife, P-420.*
*9. - Ibid - P-447.*
*10. P-48.*

C. వివరాలు: 1. నిరూపించాల్సిన వస్తువుల వివరాలు, 2. దీనికి ఉన్న సాదృశ్యాలు (లభించేటట్టయితే), 3. భాషా వైలక్షణ్యాలు, 4. సంవేదకుడి అభిమతం ప్రకారం చారిత్రకార్థం, 5. పండుగ పబ్బాల పట్టిక, 6. పాట, నృత్యాల మాదిరులు, 7. సంగీత వాద్యాలు, 8. వేషభూషణాలు, 9. నమ్మకాలు, 10. అలవాట్లు, 11. విలాస వినోదాలు, 12. మతాచారాలు (Ceremonies), 13. ఆరాధన.

పై మాదిరి కార్డులోనే సంగ్రహించిన తేదీ, కాలం గుర్తింపబడాలి. సంగ్రహకారుని సంతకం ఉండాలి. సేకరణకు ఉపయోగించిన పద్ధతి (Process) ని సూచించాలి. అంతేకాకుండా సేకర్త తన ప్రయాణస్థలం నుంచి క్షేత్రకార్య ప్రాంతం దాకా ఉన్న అనుకూల, అననుకూల పరిస్థితుల్ని తెలియజేయ్యాలి.

ఇలాగే శ్రీ త్రిలోచన్ పాండేగారూ సేకరణ విషయంలో గమనించాల్సిన తొమ్మిది ప్రధాన విషయాలిన్న ఇలా తెలిపారు.[11]

1. అవి వనరుల (Recources) స్వభావం, సంవేదకుడి పేరు, అతని పూర్వ చరిత్ర (Back ground), సేకరించిన సమయం, పేరు తేదీలతో సహా వ్రాయాలి. సంవేదకుడి పేరు, విలాసం, వృత్తి సేకరించిన వస్తువుల నిర్దిష్టతను ఋజువు పరుస్తుంది.

2. నిర్దిష్టమైన జానపద విజ్ఞాన ప్రక్రియ శీర్షికని వివరించే ప్రధాన సందర్భంతో పాటు, ఉన్నట్టయితే వ్రాసుకోవాలి.

3. సేకరిస్తున్న ప్రక్రియా విశేషం సమూహంలోని స్త్రీ పురుషుల్లో ఎవ్వరిలో అధికంగా ప్రచారంలో ఉందో గమనించాలి. అది సామూహిక విషయమా లేక వైయక్తిక విషయమా గుర్తించాలి.

4. అవి గ్రంథరూపంలో ఉంటే, జానపద విజ్ఞాన ప్రక్రియ అవుతే, రచయిత పేరు, రచనకాలం గుర్తించాలి.

5. అన్ని జానపద విజ్ఞాన ప్రక్రియలకి సంక్షిప్త పీఠిక ముందుగా ఉన్నట్లయితే అది విషయ వర్గీకరణ సందర్భంలో సహకరిస్తుంది.

---

*11. Guide to field study. Essay on "Folklore Research: A preparation for the Field Trip".*

6. ఏదైనా ఉపవిషయం (ఉపకథ ఇత్యాది) ప్రధాన విషయంతో పాటు చెప్పబడ్తే గుర్తుంచుకోవాలి.

7. వివిధ సంగీత వాద్యాల్ని గుర్తించాలి. వాద్యబృందం సహాయంలేని ఏదేని జానపదగేయం ఉన్నట్టయితే దాన్ని గుర్తించాలి.

8. సంగ్రహించిన విషయాలలోని భాషను ఏ కారణంవల్లకాని మార్పు చేయకూడదు. పదాలు, పదబంధాలు ఇత్యాదులు ఉన్నవి ఉన్నట్లే వ్రాసుకోవాలి. ఇవి వివిధ జానపద విజ్ఞాన ప్రక్రియలమీద వెలుగును ప్రసరించడం మూలంగా సంగ్రహకారుడికి లాభదాయకమవుతుంది.

9. సందర్శన (interview) ను జరిపిన వ్యక్తులతో స్నేహంతో వర్తించే ప్రకృతి సదా ఉత్తమ ఫలితాంశాలనిస్తుంది.

జానపద విజ్ఞాన పరిశోధకుడు తాను సేకరించిన విషయాలను కనీసం రెండు శుద్ధ ప్రతుల్లో ఉంచుకోవాలి. లేకపోతే ఒక ప్రతి ఏ కారణం చేతనైనా పోగొట్టుకొని పోతే అతడు పడ్డ శ్రమ అంతా బూడిదలో పోసిన పన్నీరవుతుంది.

## ఒక మాదిరి ప్రశ్నావళి / సందర్శన:

**1. సేకరణ స్థలం:** 1. జిల్లా, 2. తాలూకా/మండలం, 3. గ్రామం.

**2. తేది, సమయం:**

**3. సేకర్త సంతకం:**

**4. సంవేదకుని వివరాలు:** 1. పేరు, 2. వయస్సు, 3. వృత్తి, 4. విలాసం.

**5. పరిశోధన/క్షేత్ర కార్యవిషయం:** ప్రదర్శన జానపద కళలు/జానపద కళారూపాలు.

1. మీ దృష్టిలో కళ అంటే ఏమిటి?
2. మీ ఊళ్ళో ఎన్ని రకాలైన జానపద కళలు ప్రచారంలో ఉన్నాయి.
3. మీ ఊళ్ళో ప్రసిద్ధమైన జానపద కళ లేదా జానపద కళారూపం ఏది? ఏయే సందర్భాల్లో ప్రయోగిస్తుంటారు? పండుగ పబ్బాల్లోనా? జాతరల సందర్భాల్లోనా? లేక ఏ ప్రత్యేక సందర్భాల్లో?

4. మీ ఊళ్ళో ఎంతమంది జానపద కళాకారులు ఉన్నారు" వాళ్ళు ఏ కులస్థులు? వాళ్ళ వృత్తేమిటి?

5. మీ ఊళ్ళో ప్రదర్శన జానపద కళల సందర్భంలో. ఉపయోగించే వాద్యాల పేర్లేమిటి?

6. మీ ఊళ్ళో జానపద నాటకాలను ప్రయోగిస్తారా?

7. మీ ఊళ్ళో బయలాటల్ని ఆడతారా? యక్షగానాలు, వీధిభాగవతాలను ప్రదర్శిస్తారా?

8. పై ప్రదర్శనల్లో ఉపయోగించే వేషభూషణాలు ఏమిటి?

9. పై ప్రదర్శనల సమయం ఏమిటి?

10. స్త్రీల పాత్రల్ని పురుషులు ప్రదర్శిస్తారా? లేక స్త్రీలేనా?

11. జానపద వృత్తిగాయకులు మీ ఊళ్ళో ఉన్నారా? ఏ కులానికి చెందినవారు?

12. మీకు నచ్చిన జానపదకళ/ కళారూపం ఏది? ఎందువల్ల?

13. మీరు స్వయంగా జానపద కళాకారులవుతే మీకు ఈ కళ ఎవ్వర్నుంచి సంక్రమించింది?

14. జానపద కళల్ని ప్రదర్శించడం వల్ల వచ్చే ప్రయోజనం ఏమిటి?

15. మీ ఊళ్ళో కానీ, చుట్టుప్రక్కల ప్రాంతాల్లో కానీ జానపద కళలను గురించి శిక్షణనిచ్చే వాళ్ళెవరైనా ఉన్నారా? శిక్షణకేంద్రం ఏదైనా స్థాపించబడి ఉందా?

16. మీ ఊళ్ళో ప్రసిద్ధులైన కొంతమంది జానపద కళాకారులను తెలియజెయ్యండి. ఆ కళాకారులకు ప్రభుత్వంనుండి ఏదైనా ఆర్థిక సహాయం లభిస్తోందా?

ఇలా ముందుగా తయారు చేసుకొన్న ప్రశ్నావళి జానపద క్షేత్రకార్యాన్ని సుగమం చేస్తుంది.

సంవేదకులని స్నేహం చేసుకోవడం, ఒకేసారి క్షేత్రకార్యానికి వెళ్ళి తనకు కావాల్సిన అంశాలను సేకరించుకొని వెళ్ళి పోడం కాకుండా, తన పరిశోధన కాలంలో కనీసం రెండు, మూడుసార్లయినా వెళ్ళి వాళ్ళకు మొహం చూపించడం వల్ల సేకరణలో మనకున్న ఆసక్తి వాళ్ళకు తెలియడమే కాకుండా, ఇంకా తమకు జ్ఞాపకం వచ్చిన విషయాలను లేదా తామింతకు ముందు చెప్పిన విషయాల్లో వదిలేసిన వాటిని జ్ఞాపకం చేసుకుని విషయ వివరణను ఇవ్వడం జరుగుతుంది.

ఏమయినా క్షేత్రకార్యం సేకరణ ఆసక్తి, ఉత్సాహం, సహనం, జిజ్ఞాసల మీద ఆధారపడి వుంటుంది.

## పరిశీలించదగ్గ పుస్తకాలు:

**English:**


1. The Methoddogy of research in philosophy - T.D. Ramachandran.
2. Research Methodology in Social Sciences - Dr. N. Thanulingam.
3. Research Methodology - Methods and Techniques - C.R. Kothari
4. Social Survey & Investigation - Dr. k. Kumar.
5. Methods & Techniques of Social Survey and Research - Dr. Ramnath Sharma.
6. MLA Hand Book for writers & Research papers - Joseph Gibaldi, walter S. Achtert
7. Thesis and Assignment writing - Janatham Anderson, Borry H. Durston, Millicent poole.
8. Methods in social Research - Goode & Hatte
9. An Introduction to the study of Indian folklore - Dr. P.R. Suramanian.
10. A Guide to field study - Sankarsen Gupta.
11. Folklore and Folklife - Richard M. Dorson.

తెలుగు:

1. పరిశోధన విధానం - డా. ఎస్. జయప్రకాష్
2. పరిశోధన పద్ధతులు - ఆచార్య గంధం అప్పారావు, ఆచార్య కాళిదాసు సూర్యనారాయణ.
3. పరిశోధన - అనువాదం: హరిహరప్రియ
4. పరిశోధన పద్ధతులు: డా. ఆర్వీయస్. సుందరం.
5. తెలుగు సాహిత్యము - పరిశోధన: డా. ఎం. కులశేఖరరావు.
6. తెలుగు పరిశోధన - (రజతోత్సవ సంచిక) : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ.
7. విశ్వవిద్యాలయాల్లో తెలుగు పరిశోధన - వెలుదండ నిత్యానందరావు.
8. విశ్వవిద్యాలయాలు - పరిశోధన: డా. ననుమాస స్వామి
9. తెలుగు పరిశోధన సంచికలు: సం. డా. ఎన్. గోపి, వాసిలి వసంత కుమార్, డా. ననుమాస స్వామి.
10. పరిశోధన - సామగ్రి సేకరణ - డా. జి. ఎస్. మోహన్

కన్నడం:

1. పరిశోధనె - డా. ఎం. చిదానందమూర్తి.

* * *

# 30. సందర్శన పద్ధతి
# (Interview Method)

కొత్త విషయాన్ని ఆవిష్కరించడం, కొత్త సంబంధాన్ని ఏర్పాటు చెయ్యడం, కొత్త సిద్ధాంతాన్ని ప్రతిపాదించడం, ప్రస్తుతం ఉన్న సిద్ధాంతాన్ని లేదా విషయాన్ని పునఃపరిశీలించడం అనేవి పరిశోధన ప్రధాన లక్ష్యాలు. ఈ లక్ష్యాలను సాధించడానికి పరిశోధకుడు సాక్ష్యాలను సేకరించాలి. ఈ సాక్ష్యాలను క్షేత్రకార్యం (Field Work)లో సేకరించడంలో, సందర్శన పద్ధతులు (Interview Methods), ప్రశ్నావళులు (Questionnaires), అవలోకన పద్ధతులు (Observation Methods) అనేవి ప్రధాన పాత్రను వహిస్తాయి.

ఏ పరిశోధనకైనా అవసరమయ్యే ఉపకరణాలలో రెండు ప్రధానంగా మనకు కన్పిస్తాయి. అవి 1. మౌలికాంశం (Primary data), 2. ఆనుషంగికాంశం (Secondary data). మౌలికాంశాల సేకరణ విషయంలో సందర్శన పద్ధతి, ప్రశ్నావళి, అవలోకన పద్ధతి అనేవి చాలా ఉపకరిస్తాయి.

## సందర్శన పద్ధతి

విషయ సంగ్రహణకి ఉపయుక్తమయ్యే ప్రత్యక్ష పద్ధతి సందర్శన పద్ధతి. ఒక విషయానికి సంబంధించి నిశితంగా పరిశీలించడానికి, వాకబు చెయ్యడానికి ఈ పద్ధతి చాలా ఉపకరిస్తుంది. సందర్శకుడు, వ్యవహర్త ఇందులో ప్రధాన పాత్ర వహిస్తారు. ఈ ఇద్దరూ పరస్పరం తమ తమ అభిప్రాయాలను వినిమయం చేసుకోవడం, లోతుగా చర్చించుకోవడం ద్వారా పరిశోధనకి సంబంధించిన నూతన విషయాలు వెల్లడి కావడానికి అవకాశం ఉంది. అదే Interview. Interview అంటే - Inner view ని తెలుసుకోవడమన్న మాట.

'Interview may be defined as a systematic conversation initiated for a specific purpose and focussed on certain planned content areas'[1] అని Dr. N. Thanulingam గారి అభిప్రాయం.

---

1. *Research Methods in Social Sciences, P-62.*

Vivin Palmer దృష్టిలో 'The Interview constitutes a social situation between two persons, the psychological process involved requiring both individuals mutually respond though the social research purpose of the interview calls for a varied response from the two parties concerned'[2]

'Interviewing is fundamentally a process of social interaction'[3] అని అంటారు W.J. Goode మరియు P.K. Halt.

ఇంటర్వ్యూ నిర్వహణ నిజంగా ఒక కళ. ఇది అనుభవం మీదనే తెలుస్తుంది.

సామాజిక శాస్త్రం, జానపద విజ్ఞానం మొదలైన విజ్ఞాన విషయ సేకరణలో ప్రధానపాత్రని వహించేది సందర్శన పద్ధతి. సందర్శననే 'ముఖా- ముఖీ' అని కూడా అంటారు. నిజానికి Interview అనే మాటకి 'సందర్శన' అనే పదమే సమంజసంగా ఉంటుంది. ఒక నిర్దిష్టమైన ఉద్దేశం కోసం ఆరంభించే క్రమబద్ధమైన సంభాషణని సందర్శన అనవచ్చు. ఇది నిర్దిష్టమైన ప్రణాళికా విషయ పరిధిమీద వెలుగుని ప్రసరింప చేస్తుంది. ఇది సందర్శకుడికీ, వ్యవహర్త (సంవేదకుడు) కూ మధ్య జరిగే ద్విమార్గ (two way) సంభాషణ.

పరిశోధకుడు తన పరిశోధనకి సంబంధించి ఏ విషయాన్నైనా, ఏ వ్యవహర్తనైనా తన నిర్దిష్టమైన ప్రశ్నలకి ప్రత్యుత్తర మివ్వమని కోరడం సందర్శనలోని ముఖ్యాంశం. వ్యవహర్తని తన అభిప్రాయాలని, అనుభవాలని, అభిరుచుల్ని, విలువలని, విశ్వాసాలని, జ్ఞానాన్ని తన సందర్శన ద్వారా ప్రశ్నించి తెలుసుకోడం జరుగుతుంది. ముందుగా ఏర్పరచుకొన్న సందర్శన ప్రణాళిక ద్వారా ఇది సిద్ధిస్తుంది.

## సందర్శన పద్ధతివల్ల కలిగే ప్రయోజనం

విద్యావంతులనే కాకుండా నిరక్ష్యరాస్యుల్ని కూడా సందర్శన పద్ధతి ద్వారా సందర్శించి తన పరిశోధనకి అవసరమైన విషయాలను సేకరించుకోవచ్చు.

---

*2. Methods & Techniques of Social Survey & Research, P-290.*

*3. - Ibid -, P-290.*

వ్యవహర్త ఏదేని ప్రశ్నని సరిగ్గా అవగాహన చేసుకోలేనప్పుడు మళ్ళీ సందర్శకుడినే అడిగి ఆ అంశాన్ని స్పష్టం చేసుకోవచ్చు. ఒక వ్యవహర్తకి చెందిన వైయక్తిక గుణాలని - అంటే అతని ఆవేశాలని, అభిప్రాయాలని, భావాలని, అనుభవాలని, ప్రతిక్రియలని నేరుగా అవలోకించడానికి ఈ పద్ధతి ఉత్కృష్టమైంది. సందర్శకుడు ప్రత్యక్షంగా ఈ పద్ధతిలో పాల్గొనడం వల్ల వ్యవహర్త అసత్య విషయాలని నివేదించడానికి జంకుతాడు. అంతేకాకుండా సందర్శకుడు వ్యవహర్తలని లోతుగా ప్రశ్నించి వారినుండి నిర్దిష్టమైన సమాచారాన్ని, సరియైన వివరాలని సంగ్రహించడానికి వీలవుతుంది.

సందర్శించడమనేది ఒక Social Interaction. సందర్శకుడికి తాను ప్రశ్నించే విషయానికి సంబంధించి క్షుణ్ణమైన జ్ఞానం ఉందని వ్యవహర్త గ్రహించి ఇంకా ఎక్కువ సమాచారాలని అందించడానికి ఉత్సుకతని చూపెడతాడు. అందువల్లే పరిశోధన పరికరాలలో సందర్శన పద్ధతి ఉత్కృష్టమైంది.

## సందర్శన రకాలు

సందర్శన స్థూలంగా మూడు విధాలు. 1. ఆధికారికం (Authoritative), 2. చారిత్రకం (Historical), 3. క్షేత్ర సంబంధం (field).[4]

ఆధికారిక సందర్శన అంటే యాజమాన్యం (Authority) ద్వారా విషయాలని సేకరించడం, ఉదాహరణకి వ్యాపారానికి సంబంధించి బ్యాంకు యాజమాన్యాన్ని (Banking Authority) సందర్శించి విషయ సేకరణ చెయ్యడం.

చారిత్రక సందర్శన అంటే ఒక నిర్దిష్టమైన సంఘటన గురించి దానితో ప్రత్యక్ష సంబంధం ఉన్న వ్యక్తి ద్వారా సేకరించడం. స్వాతంత్ర్య సమరయోధుని సందర్శించి విషయాలను సంగ్రహించడం దీనికి ఉదాహరణ.

ప్రజలు తమ్ము తాము ఏ విధంగా feel అవుతున్నదీ, ఇతరులు ఆ ప్రజల పరిసరాలని, వాళ్ళ సమస్యలని ఏ విధంగా తెలుసుకుంటున్నదీ క్షేత్ర సందర్శన

---

*4. Research Methodology in Social Sciences, P-63.*

ద్వారా పరిశీలించవచ్చు. జానపద విజ్ఞానానికి సంబంధించి జానపదులను సందర్శించడం దీనికి ఉదాహరణ.

సందర్శనను నిర్వహించే విధానాన్ని ఆధారం చేసుకొని సందర్శన 5 రకాలు.[5] 1. Structured Interview, 2. Non-Structured Interview, 3. Focussed Interview, 4. Depth Interview, 5. Paper Interview.

## సందర్శనను సుగమం చేసుకోవడానికి కొన్ని మార్గదర్శక సూత్రాలు

1. **సందర్శన సమయాన్ని, ప్రదేశాన్ని ఖరారు చెయ్యడం:** అవసరమయ్యే పక్షంలో ముందుగా సందర్శనని ఏర్పాటు చేసుకోవాలి. సందర్శనని ఏర్పాటు చేసుకొన్న తర్వాత నిర్ణీత సమయాన్ని, ప్రదేశాన్ని నిర్ధారించుకోవాలి. ఇలా చెయ్యడంవల్ల వ్యవహర్త సందర్శన సమయానికి సరిగ్గా హాజరు కావడానికి వీలవుతుంది. ఈ విషయంలో వ్యవహర్తయొక్క నిత్య కార్యక్రమాలకు సంబంధించిన పరిజ్ఞానం కూడ అవసరం.

2. **సందర్శన ప్రణాళికను సిద్ధం చేసుకోవడం:** సందర్శకుడు తన సందర్శనకు సంబంధించి ముందుగా ఒక ప్రణాళికను తయారు చేసుకోవాలి. తాను ఏయే విషయాలను గురించి వ్యవహర్తలతో ప్రస్తావించదలచుకున్నాడో, చర్చించదలచుకున్నాడో ఆ విషయాలను గురించి సందర్శకుడు క్షుణ్ణంగా తెలుసుకొని వుండాలి.

3. **పరిచయ పత్రాన్ని తీసుకుపోవడం:** పరిశోధకుడు తాను పనిచేస్తున్న విభాగాధికారి నుంచి పరిచయ పత్రాన్ని తీసుకొని వెళ్ళడం మంచిది. గ్రామీణ లేదా గిరిజన వ్యవహర్తలని సందర్శించే సమయంలో పరిశోధకుడు స్థానిక నాయకుని సహకారాన్ని సంపాదించుకోవాలి.

4. **పరస్పరావగాహన ఉండడం:** వ్యవహర్త మనస్తత్వంమీద సందర్శన ఆధారపడి వుంటుంది. సత్యాంశాలను తెలియజెయ్యడంలో వ్యవహర్త వెనక్కు మళ్ళే ప్రమాదం వుంది. సందర్శకుడు, సందర్శింప బడేవాడు ఇద్దరూ రెండు విభిన్న ప్రపంచాలలో జీవించేవారు. ఇద్దరికీ భిన్నమైన

---

*5. - Ibid P-64.*

సామాజిక తత్త్వాలు, విభిన్నమైన విలువలు, దృక్పథాలు వుంటాయి. ఇద్దరి అభిప్రాయాలు, ఆసక్తులు పరస్పరం విరుద్ధంగా వుంటయి. కొన్ని విషయాలను వదలివెయ్యడం లేదా తప్పుగా రికార్డు చేసుకోవడం అనేవి సందర్శనకే ముప్పు తెచ్చేవిగా వుంటాయి. సందర్శకుడు, వ్యవహర్త పరస్పరం అర్థం చేసుకోలేక పోయినా అది అనర్థానికే దారితీస్తుంది.

5. **వ్యవహర్తలతో సన్నిహిత సంబంధాన్ని ఏర్పరచుకోవడం:** వ్యవహర్తకు అవగాహన అయ్యేలా పరిశోధకుడు తన్ను గూర్చి, తన సందర్శన ఉద్దేశం గురించి వివరించి, అతని విశ్వాసాన్ని చూరగొనాలి. వస్తు సేకరణ విషయంలో ఎదురయ్యే అడ్డంకుల్ని తొలగించుకోవాలి. కొంతమంది వ్యవహర్తలు సందర్శనకారుని ప్రభుత్వ ఏజెంటుగా భావించి, ఆ సమాచారాన్ని తమకు వ్యతిరేకంగా ఉపయోగించుకోవచ్చునని అభిప్రాయపడడం జరుగుతుంది. అలాంటి సమయాల్లో ఆ అనుమానాన్ని సందర్శనకు ముందే తొలగించుకోవాలి.

6. **వ్యవహర్తల భయాన్ని తొలగించడం:** కొంతమంది వ్యవహర్తలు ప్రశ్నలకు సమాధానాల నివ్వడంలో ఆత్మవిశ్వాసాన్ని కోల్పోవడం జరుగుతుంటుంది. అలాంటి సమయాల్లో వాళ్ళ ఆతురతని తొలగించి 'ఇది కేవలం సర్వే మాత్రమే. మీ అనుభవాలని తెలుసు కోవడం కోసమే మిమ్మల్ని ప్రశ్నిస్తున్నాను' అని నచ్చజెప్పాల్సి వుంటుంది.

7. **సందర్శన వాతావరణం:** సాధారణంగా సందర్శన వాతావరణం స్నేహపూర్వకంగా ఉండాలి. స్వాభావికంగా, ఇచ్చిపుచ్చుకొనే విధంగా, సంభాషణా శైలితో కూడి ఉండాలి.

8. **సాంకేతిక పరికరాలు:** ఎలెక్ట్రానిక్ పరికరాలను ఉపయోగించి సందర్శనని సుగమం చేసుకోవాలి. దీనివల్ల ప్రశ్నలను, సమాధానాలను సరిగ్గా రికార్డు చేసుకోవడానికి వీలవుతుంది.

9. **విషయంమీదనే సందర్శన కేంద్రీకృతమై ఉండాలి:** ప్రధాన విషయం నుంచి దారితప్పి మరో విషయానికి ప్రవేశించడం ఆసక్తికరంగాను, విలువైనదిగాను

ఉంటుంది. అయితే పరిశోధకుడు చాకచక్యంతో వ్యవహర్తని ప్రధాన విషయం మీదకు మరల్చి సందర్శనని ముందుకు కొనసాగించాలి.

10. **ఇతరులు హాజరు కావడం:** సందర్శన సమయంలో సందర్శకుడు, వ్యవహర్త తప్ప ఇతరులెవ్వరూ పాల్గొనకుండా చూసుకోవాలి.

11. **ప్రశ్నలు అడగడం:** ప్రశ్నలని వెయ్యడంలో సందర్శకుడు అతి జాగరూకతతో వ్యవహరించాలి. తాను వెయ్యబోయే ప్రశ్నలు స్పష్టంగాను, సంక్షిప్తంగానూ, యుక్తంగాను ఉండాలి. అన్ని ప్రశ్నల్ని ఏకధాటిగా అడగకూడదు. ప్రశ్న అర్థంకాకపోతే మరోసారి అర్థమయ్యేలా అడగాలి. సందర్శకుడు తన స్వంత అభిప్రాయాల్ని తెలియజెయ్య కూడదు. ఒకవేళ వ్యవహర్త చెప్పమని బలవంతం చేసినా ఆ మాటని దాటివెయ్యడానికి ప్రయత్నించాలి.

12. **వీలయినంత తక్కువగా మాట్లాడడం:** సందర్శకుడు Work more, talk less అనే నానుడిని మనసులో ఉంచుకొని వీలయినంత ఎక్కువ సమాచారాన్ని సంగ్రహించాలి. వ్యవహర్తే ఎక్కువగా మాట్లాడాలి కాని, సందర్శకుడు వ్యవహర్త కాదన్న విషయాన్ని మనసులో ఉంచుకోవాలి.

13. **సందర్శనని ముగించడం:** సందర్శన పూర్తయిన తర్వాత అది కొంతవరకు ఉపకరించిందన్న తృప్తి సందర్శకుడికి, తనవల్ల సందర్శకుడికి కొంతవరకైనా ఉపయోగం జరిగిందన్న తృప్తి వ్యవహర్తకీ ఏర్పడాలి. ఇలాంటి మనస్తత్వం మున్ముందు సందర్శకుడికీ, వ్యవహర్తకీ మళ్ళీ మళ్ళీ పాల్గొనాలన్న ఆసక్తిని రేకెత్తిస్తుంది.

సందర్శన విసుగుపుట్టే పక్షంలో కానీ, లేదా అనివార్య పరిస్థితుల్లో కానీ తాత్కాలికంగా సందర్శనని నిలిపివేయడం మంచిది. మళ్ళీ సందర్శనని కొనసాగించే పక్షంలో అంతకుముందు జరిగిన సందర్శన గురించిన వివరాలను మళ్ళీ వ్యవహర్తకి తెలియజెయ్యాలి.

14. **సందర్శన రిపోర్టును తయారు చేసుకోవడం:** సందర్శన సమయంలో నోట్సు తీసుకోవడం మంచిది. అంటే వ్యవహర్త చెప్తున్నప్పుడు కాకుండా,

ఒక ప్రశ్నకి మరో ప్రశ్నకీ అవధి ఉన్న సమయంలో నోట్సు తీసుకోవాలి. జ్ఞాపకశక్తి అందరికీ ఒకేలాగ ఉండదు కనుక ఎప్పటికప్పుడు వీలునుబట్టి వ్రాసుకుంటూ, చివర్లో వివరంగా రిపోర్టును తయారు చేసుకోవాలి. టేపురికార్డరు ఉన్న పక్షంలో మధ్యలో వ్రాసుకోవలసిన అవసరం ఉండదు. సందర్శన సమయంలో ఏవేని చిన్న చిన్న సంఘటనలు జరిగినా వాటినికూడా వ్రాసుకోవాలి.

## సందర్శన నైపుణ్యం (Techniques of Interview)

సందర్శన పద్ధతి సత్ఫలితాలను ఇవ్వాలంటే సందర్శనకారుల్ని అతి జాగ్రత్తగా ఎన్నుకోవడంలోను, వారికి సరియైన శిక్షణ ఇవ్వడంలోను, వివరించడం లోను ఆధారపడి వుంటుంది. సాధారణంగా పరిశోధకుడే సందర్శకుడు కూడ కావడంవల్ల సందర్శనకు సంబంధించి కొంత శిక్షణని కూడా గ్రహించాలి. శాస్త్రీయ సూత్రాలమీద ఆధారపడ్డ సందర్శన పద్ధతి ఒక కళ. వ్యవహర్తతో స్నేహపూర్వక వాతావరణాన్ని కలిగించి ఒక విశ్వాసాన్ని, నమ్మకాన్ని అతనిలో ఏర్పడేటట్టు చేస్తే, వ్యవహర్త తాను మాట్లడేటప్పుడు, చర్చించేటప్పుడు సందర్శకుడితో పూర్తిగా సహకరిస్తాడు.

సందర్శనకారుడు కూడ తన పరిశోధనకు సంబంధించిన విషయాలనే తెలివితేటలతో ప్రశ్నించి సమాధానాలను రాబట్టుకోవాలి. అలాగే వ్యవహర్త అడిగే న్యాయ సమ్మతమైన ప్రశ్నలకి సమాధానాలు చెప్పి అతని అనుమానాలను తీర్చాలి. సందర్శకుడు ఎప్పుడూ వ్యవహర్త ఇచ్చే సమాధానాలకి ఆశ్చర్యపడడం కానీ, అంగీకరించకుండా పోవడం కానీ చెయ్యకుండా సందర్శనని తానే నడుపుతూ, అనవసరమైన లేదా వ్యర్థసంభాషణని నిరుత్సాహ పరచి వ్యవహర్తని track మీదకి తీసుకు పోతుండాలి.

ఇలా సందర్శన పద్ధతి ఒక ప్రతిపాదన (hypothesis) ని పరీక్షించడానికి, లేదా సాధించిన వాంఛిత లక్ష్యాలను ఎంత వరకు విలువ కట్టడానికి సాధ్యమవుతుందో తెలుసుకోవడానికి ఉపకరిస్తుందనడంలో సందేహం లేదు.

* * *

# 31. ప్రశ్నావళి
## (Questionnaire)

సాధారణంగా అభిప్రాయ సేకరణకోసం, సర్వే కోసం ప్రశ్నావళిని ఉపయోగిస్తుంటారు. ప్రశ్నావళిని పరిశోధకుడు తయారుచేస్తే వ్యవహర్త పూర్తి చెయ్యాల్సి వుంటుంది. ఆధికారికమైన లేదా సత్యాంశాలను వెలికి తియ్యడం కోసం ప్రశ్నావళి ఉపయోగపడుతుంది. వ్యవహర్తకి అడిగిన ప్రశ్నలను అర్థంచేసుకొనే స్తోమత లేదా పరిజ్ఞానం ప్రశ్నావళిలో అత్యవసరం.

Questionnaire అంటే 'Fundamentally, the questionnnaire is a set of Stimuli to which literate people are exposed in order to observe their verbal behaviour under these Stimuli'[1] అని అంటాడు G.A. Lundberg. అలాగే W.J. Goode and P.K Hatt ఇలా అంటారు. 'In general, the Word Questionnaire refers to device for securing answers to questions by using a form which the respondent fills in himself'[2] పరిశోధకుడు తన పరిశోధనకు ఏఏ విషయాలు లేదా అభిప్రాయాలు అవసరమో ముందుగా నిర్ణయించుకొని సమాధానాలను రాబట్టుకోవడం కోసం వాటిని ప్రశ్నల రూపంలో ప్రింటు చేయించడమో లేదా టైపు చేయించడమో జరుగుతుంది. వీటిని ఎవరెవరికి పంపాలో ముందుగానే తీర్మానించుకొని వ్యవహర్తలకి పంపించడం జరుగుతుంది. వ్యవహర్తలు ఈ ప్రశ్నలకి తగిన సమాధానాలను వ్రాసి పంపిస్తారు. దీన్నే ప్రశ్నావళి అంటారు. ప్రశ్నావళి (Questrionnaire)కి షెడ్యూలు (Schedule)కి చెప్పుకోదగ్గ వ్యత్యాసం లేకపోయినా ఈ రెండు పదాలని వేరు వేరుగా ప్రయోగించడం జరుగుతోంది. ప్రశ్నావళిలో వ్యవహర్తలు అడిగిన ప్రశ్నలకి సమాధానాలు వ్రాసి పంపిస్తారు. అయితే షెడ్యూలులో పరిశోధకుడే/సందర్శకుడే వ్యవహర్తని సందర్శించడం ద్వారా ప్రశ్నావళిని పూర్తి చేస్తాడు. Schedule is the name usually applied to a

---

1. *Methods and Techniques of social survey and Research* నుండి పునరుద్ధరించబడింది. పుట - 239. చూ. *G.A. Lundberg* గారి *Social Research.*
2. *Methods in Social Research, P-133.*

set of Questions which are asked and filled by an interviewer in a face to face situation with another'[3]

ప్రశ్నావళిని అక్షరజ్ఞానం ఉన్నవాళ్ళకి పంపించి సమాధానాలని రాబట్టుకుంటే, షెడ్యూల్ని నిరక్షరాస్యులయిన వ్యవహర్తలనుండి సమాధానాలను రాబట్టుకొని ఫారంని పరిశోధకుడే పూర్తిచెయ్యడం జరుగుతుంది.

ప్రశ్నలని క్రమవరుసల్లో పేర్చుకోవడం, వాటికి ఒక రూపాన్నివ్వడం ప్రశ్నావళిలో గమనించదగ్గ విషయాలు. ప్రశ్నావళి స్వరూపం (format) ఆకర్షణీయంగా ఉండాలి. ఒక ప్రశ్నని పూర్తిచేసి మరొక ప్రశ్నని పూర్తిచెయ్యడంలో వ్యవహర్త ఎలాంటి తొందరలకి లోనుకాకూడదు. పైగా అడిగిన ప్రశ్నలు ఆసక్తిని రేకెత్తించేవిగా ఉండాలి. ప్రశ్నలు ఎప్పుడూ సందిగ్ధంగానూ, తికమక పట్టించేవిగాను ఉండకూడదు. భాష సులభరీతిలో అర్థమయ్యేటు ఉండాలి.

## ప్రశ్నావళి బాహ్యరూపం

ప్రశ్నావళి కొలత (size) అంశాల సంఖ్యమీద, సర్వే చేస్తున్న లక్ష్యంమీద ఆధారపడి వుంటుంది. వ్యవహర్తల సమాధానాలను లేదా వివరణలను రికార్డుచెయ్యడం కోసం తగినంత స్థలాన్ని కేటాయించాలి.

ప్రశ్నావళికి ఉపయోగించే కాగితం చాలకాలం మన్నిక ఉండేట్టుగా చూసుకోవాలి. తెలుపులేదా లేతరంగు కలిగిన కాగితాన్ని ఎంపిక చేసుకుంటే మంచిది. వరుసగా ఒకదాని తర్వాత ఒకటి ప్రశ్నావళులను వ్యవహర్తలకు పంపించేటప్పుడు వివిధ రంగులు కలిగిన కాగితాలను ఉపయోగించాలి.

ప్రశ్నావళిని ఆకర్షణీయంగా తయారుచేసి పంపించడంవల్ల పరిశోధకులకి వ్యవహర్తల నుండి అధిక సహకారం లభిస్తుంది. ప్రశ్నలు పెద్దగా ఉన్నప్పుడు, వాటిని చిన్న చిన్న ప్రశ్నలుగా విడగొట్టడం మంచిది. అనవసరమైన ప్రశ్నలకు తావివ్వకుండా ప్రశ్నావళి కేవలం 10-15 నిమిషాలలోనే పూర్తిచేసేట్టు ఉండాలి.

వివరణ లేఖల్లో ప్రశ్నావళి లేదా పరిశోధన అధ్యయన ఉద్దేశాలను స్పష్టపరచడంతో పాటు, వ్యవహర్త తెలిపే అభిప్రాయాలను రహస్యంగా

---

3. *Ibid.*

ఉంచుతానన్న హామీని ఇవ్వాలి. ఇలా చెయ్యడంవల్ల వ్యవహర్తలు నిర్భయంగా తమ అభిప్రాయాలను వెల్లడించుకునే స్వేచ్ఛ ఉంటుంది.

## ప్రశ్నావళిని ఉపయోగించడంవల్ల కలిగే ప్రయోజనాలు

1. వ్యక్తిగతంగా వ్యవహర్తలను సందర్శించడం జరగదు కనుక, ప్రశ్నావళి వల్ల డబ్బు ఆదా అవుతుంది. ప్రయాస తప్పుతుంది; సమయం కలిసి వస్తుంది.

   ప్రతి ప్రశ్నావళికి ఒక వివరణలేఖ (Covering letter) జతపరచబడాలి లేదా ప్రశ్నావళిలోనే ఈ క్రింది అంశాలు ఉండేట్టు జాగ్రత్త పడాలి. 1. అధ్యయనానికి సంబంధించిన వివరణాత్మకమైన శీర్షిక (Title), 2. అధ్యయన ఉద్దేశం, 3. విభాగం పేరు (Name of the sponsering agency or institute), 4. ప్రశ్నావళిని పూర్తిచేసిన తర్వాత ఏ చిరునామాకి వెనుతిరిగి పంపించాలో ఆ చిరునామా, 5. ప్రశ్నావళిని ఎలా పూర్తిచేయ్యాలి, 6. ప్రశ్నావళిని పూర్తిచేసే వ్యవహర్త పేరును ఎట్టి పరిస్థితుల్లోనూ వెల్లడి చేయననే హామీ. (వ్యవహర్తల సహకారాన్ని అభ్యర్థిస్తూ వ్రాయబడే ఈ వివరణ లేఖకి అధిక ప్రాధాన్యం ఉంటుంది.

   ప్రశ్నావళిలో రెండువిధాలయిన ప్రశ్నల్ని ఉపయోగించడం జరుగుతుంది. 1.Supply type, 2. Selection type.[4] ఒక పరిశోధన అంశానికి సంబంధించిన విషయాలు వ్యవహర్తని ఎటువంటి ప్రతిక్రియకి లోనుచేసి వ్రాయింపచేస్తాయో Suuply type ప్రశ్నల్లో ప్రధానంగా కన్పిస్తుంది. ఇలాంటి ప్రశ్నావళిలోని ప్రశ్నలు వ్యవహర్త ఇష్టాన్ని, ఆసక్తిని, సామర్థ్యం లేదా శక్తిని demand చేస్తాయి. ఇటువంటి ప్రశ్నలని జాగ్రత్తగా ఎంపిక చెయ్యడం, అక్షరాస్య సముదాయానికే పరిమితం చెయ్యడం అనేవి ఇందులో ముఖ్యం. అలా చెయ్యకపోతే ఇలాంటి స్వతంత్ర ప్రశ్నలకి (free Questions) సమాధానాలివ్వడం వీలుకాక ప్రశ్నావళి అసంపూర్ణ మవుతుంది.

   Selection type ప్రశ్నలలో ఔను-కాదు, తప్పు-ఒప్పు, లేదా అన్నీ-కొన్ని అనే సమాధానాలలో ఒకదాన్ని ప్రశ్న అపేక్షిస్తుంది.

---

*4. Research methodology in Social Sciences, P-68.*

2. పరిశోధకుడు వ్యవహర్తలకి దూరంగా ఉండడంవల్ల వ్యవహర్తలు మొహమాటానికి, పక్షపాతానికి లోనుగాక సమాధానాలను స్వేచ్ఛగా తెలపడానికి అవకాశం వుంది.

3. ఒకేసారి చాలామందికి ప్రశ్నావళిని పంపించి సమాధానాలను అపేక్షించవచ్చు.

4. వ్యవహర్తల పేర్లు, అభిప్రాయాలు వెల్లడికావు కనుక, వ్యవహర్తల్లో విశ్వాసం పెంపొందుతుంది.

5. కొన్ని సందర్భాలల్లో ప్రశ్నావళుల వల్లే ఎక్కువ ఉపయోగం ఉంటుంది. ఉదాహరణకి వైవాహిక సంబంధ బాంధవ్యాలు, Sexual habits మొదలైన వాటిని నేరుగా చెప్పడానికి వ్యవహర్తలు జంకుతారు కనుక ప్రశ్నావళిని ఉపయోగించి విషయాలను సేకరించవచ్చు.

6. ప్రశ్నావళిని ఉపయోగించడానికి పెద్దగా నేర్పు (Skill) అవసరం లేదు.

7. వ్యవహర్తలకి కావలసినంత వ్యవధి లభించడంవల్ల మరింత బాగా ఆలోచించి సమాధానాలను వ్రాయడానికి వీలుంటుంది.

## ప్రశ్నావళిలో ఉన్న లోపాలు

1. సందర్శన పద్ధతిలోలాగ విషయాలను శ్రద్ధతో అవలోకించడానికి వీలుకాదు.

2. ఈ పద్ధతివల్ల అస్పష్టమైన సమాధానాలే అధికంగా లభిస్తాయి; ఒక్కొక్కమారు ప్రశ్నలు అర్థంకాక వదలిపెట్టడం జరుగుతుంది.

3. ప్రశ్నావళిని సంపూర్ణంగా పూర్తిచేసి పంపేవాళ్ళ సంఖ్య అతి తక్కువగా ఉంటుంది.

4. సమాధానాలను వ్రాయడంలో వ్యవహర్త బద్ధకాన్ని, విసుగుని పొందడానికి ఆస్కారం వుంది.

5. ప్రశ్నావళిని కేవలం చదువుకొన్నవాళ్లకే, మధ్యతరగతి వాళ్ళకే, పంపించడం జరుగుతుంది కనుక, నిరక్షరాస్యుల నుండి సమాధానాలను అపేక్షించడానికి వీలుకాదు.

6. చాలవరకు ప్రశ్నావళులన్నీ, ఏకరీతిగా (uniformity) ఉండడం కన్పిస్తుంది.

7. వ్యవహర్త సమాధానం సత్యాంశంతో కూడుకొన్నదని చెప్పడం ఒక్కొక్కసారి అసాధ్యమవుతుంది. దీనికి కారణాలు -

   1. వ్యవహర్తకి సరియైన సమాధానం తెలియకపోవచ్చు.

   2. విమర్శనాత్మకంగా వ్యవహర్త ఆలోచించకపోవచ్చు.

   3. ఇచ్చిన నిర్దేశనాలని (Directions) వ్యవహర్త సరిగా అర్థం చేసుకోలేక పోవచ్చు లేదా పాటించకపోవచ్చు.

   4. అడిగిన ప్రశ్నలని వ్యవహర్త వ్యక్తిగతంగా (Personal) భావించవచ్చు.

8. ఈ పద్ధతివల్ల ప్రశ్నావళిని వెనులిరిగి పంపడంలో ఆలస్యమే ఎక్కువగా జరుగుతుంది.

## ప్రశ్నావళి సత్ఫలితాలను పొందడానికి కొన్ని మార్గదర్శక సూత్రాలు

1. ప్రశ్నావళి చిన్నదిగాను, సరళంగాను ఉండాలి.

2. ప్రశ్నావళిలో అడిగే ప్రశ్నలు మొదటే కష్టంగా ఉండకూడదు. ముందుగా సులభంగా ఉన్న ప్రశ్నల్ని అడిగి తర్వాత కష్టంగా ఉన్న ప్రశ్నల్ని అడగాలి.

3. సాంకేతిక పదాల్ని, అస్పష్టమైన వ్యక్తీకరణల్ని ప్రశ్నావళిలో ఉపయోగించ కూడదు.

4. వ్యవహర్తల మనసుల్ని కించపరచే ప్రశ్నల్ని అడగకూడదు.

5. ప్రశ్నావళిలో ఒక ప్రశ్నకీ మరో ప్రశ్నకీ మధ్య కొంతస్థలాన్ని కేటాయించాలి.

6. పత్ర వ్యవహార మూలకంగా వ్యవహర్తతో సత్సంబంధాన్ని నెలకొల్పాలి.

7. అధ్యయన ఉద్దేశాన్ని స్పష్టంగా వివరించి చెప్పడం, వ్యవహర్త పేరును రహస్యంగా ఉంచడం ముఖ్యం.

8. ప్రశ్నావళితోపాటు తాను పనిచేస్తున్న అధ్యయన విభాగాధిపతి లేదా ప్రాజెక్టు డైరెక్టరు లేదా అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసర్ లేదా గైడు సంతకం కలిగిన అనుమతి పత్రాన్ని జతపరచి పంపాలి.

9. ప్రశ్నావళిని తిప్పి పంపడానికి తగినన్ని స్టాంపులు కలిగిన కవరును ప్రశ్నావళితో పాటు వ్యవహర్తకు పంపించాలి.

10. ముందుగా ఒక డ్రాఫ్టును తయారు చేసుకుని విజ్ఞులకు చూపించి, ఆ తర్వాతనే ప్రశ్నావళిని తయారు చెయ్యడం మంచిది. దీనివల్ల సందిగ్ధ ప్రశ్నలు, అపరచిత పదాలు కలిగిన ప్రశ్నలు, తికమక పట్టించే ప్రశ్నలు, అపార్థాలనిచ్చే విషయాలు పరిహరింపబడతాయి.

11. అవసరమైన చోటు ప్రశ్నలకి సమాధానంగా (✓) గుర్తు పెట్టేట్టుగా ప్రశ్నలను తయారు చెయ్యాలి.

12. ప్రశ్నావళిని ఆకర్షణీయంగా తయారుచేసి పంపడంవల్ల వ్యవహర్తలతో సహకారాన్ని పొందడానికి వీలవుతుంది.

13. భాష సులభంగాను, దస్తూరి బాగా ఎత్తి కనిపించేదిగాను ఉండాలి.

ప్రశ్నావళివల్ల ప్రయోజనాలు, లోపాలు ఉన్నప్పటికీ, ప్రశ్నావళిని ఆకర్షణీయంగా, అర్థవంతంగానూ తయారుచేసి సమర్థవంతంగా నిర్వహించడంలో పరిశోధకుడి పాత్ర ఎంతైనా వుంది.

## ప్రశ్నావళి

ప్రశ్నావళిలో ఈ క్రింది అంశాలు తప్పక పేర్కొనబడాలి. ఇవి అన్ని రకాల ప్రశ్నావళులకి తప్పక వర్తిస్తాయి.

A. **సేకరణ స్థలం:** 1. జిల్లా, 2. విభాగం/మండలం, 3. పోలీస్‌స్టేషన్ పరిధి, 4. సంఘం (Union)

B. **సంవేదకుడు:** 1. పేరు, 2. వయస్సు, 3.వృత్తి, 4. చిరునామా, 5. విద్యావంతుడైతే అతని విద్యావివరాలు, 6. ఇప్పటి Status

C. **సేకరణ తేది, సమయం:**

D. **సేకర్త సంతకం:**

E. **క్షేత్రకార్య విషయం:** ఉదా: జానపద కళారూపాలు... కొన్ని మాదిరి ప్రశ్నావళుల్ని ఉదాహరిస్తాను.

## ప్రశ్నావళి

### 1. గ్రామదేవతారాధన - ఆచరణలు

1. మీ ఊళ్ళో ప్రధానమైన గ్రామదేవత పేరేమిటి? ఇంకా ఏ యే దేవతల్ని ఆరాధిస్తారు? ఆ దేవతల్ని ఏ సమయాల్లో, సందర్భాల్లో ఆరాధిస్తారు?

2. ఈ గ్రామదేవత మీ ఊరికి మాత్రమే పరిమితమా? లేక చుట్టుపక్కల గ్రామాలవాళ్ళు కూడా ఆరాధిస్తారా?

3. ఈ గ్రామదేవతని ప్రత్యేక కులంవాళ్ళే ఆరాధిస్తారా? లేక అన్ని కులాలవాళ్ళూ ఆరాధిస్తారా?

4. హిందువులలో ఏ వర్గంవారు అధికంగా పూజిస్తారు? హిందువులు కానివాళ్ళు కూడా ఆరాధించడం ఉందా?

5. ఈ గ్రామదేవత విగ్రహ రూపంలో ఆరాధించబడుతోందా? లేక ఏ రూపంలో ఆరాధించబడుతోంది? ఈమె వేషభూషణాలేమిటి?

6. ఆమె ఆరాధనకు ఉపయోగించబడే వస్తువులేమిటి?

7. ఆమె ఎక్కడ ఆరాధించబడుతోంది? చెట్టుక్రిందనా? గుడిలోపలనా? పొలిమేర ప్రాంతాల్లోనా? ఊరి మధ్యలోనా?

8. ఈమె ఆరాధనా విశేషాలేమిటి? ఈమెకు జంతుబలి ఉందా? మొక్కుబడిగా తలనీలాలను సమర్పించుకోవడం వుందా?

9. ఈ దేవతతోపాటు సర్పాలను ఆరాధించడం వుందా?

10. ఆరాధనలో మంత్రతంత్రాలేవైనా ఉన్నాయా? ఆచరణలేమిటి?

11. ఈమెకు సంబంధించిన పాటలు, గేయకథలు, కథలు ప్రచారంలో ఉన్నాయా?

12. వీటిని పాడేటప్పుడు ఏవైనా వాయిద్యాలను ఉపయోగిస్తారా?

13. వీటిని పాడేవాళ్ళు వృత్తి గాయకులా? ఆడవాళ్ళా? మగవాళ్ళా?

14. ఈమెను కొలవడంలో వున్న ఆంతర్యం ఏమిటి?

15. మీ గ్రామంలో ఎక్కడైనా ఏ దేవతైనా ఉద్భవించిందా? ఎప్పుడు?

16. ఈమె పుట్టుకకు సంబంధించి చారిత్రక, పౌరాణిక నేపథ్యం ఏదైనా వుందా?

17. ఈ గ్రామదేవతకు సంబంధించి పండుగలు, ఉత్సవాలు, జాతరలు, పరుసలు ఏవైనా జరుపబడుతున్నాయా? ఎప్పుడు జరుపుతారు?

18. జాతరల సందర్భంగా జానపద కళారూపాలేవైనా ప్రదర్శింపబడతాయా?

19. ఈ సందర్భంలో వున్న ఆచారాలు, కట్టుబాట్లు, నిషేధాలు ఏవైనా వున్నాయా?

20. గ్రామదేవతారాధనకు సంబంధించి ఇంకా ఏవైనా ఇతర అంశాలుంటే తెలియజెయ్యండి.

## 2. పండుగలు, జాతరలు, ఉత్సవాలు, పరుసలు

1. గ్రామానికి చారిత్రక, పౌరాణిక ప్రాధాన్యం ఉంటే తెలియజెయ్యండి.

2. మీ ఊళ్ళో ఉన్న మతారాధన స్థలాలను పేర్కొనండి.

3. మీ ఊళ్ళో జరిగే ఉత్సవం పేరేమిటి? ఏ సందర్భంలో జరుగుతుంది? ఎప్పుడు జరుగుతుంది? ఇంగ్లీషు తేదీలతోపాటు తెలుగు తేదీలు కూడా పేర్కొనండి.

4. ఉత్సవానికి చారిత్రక, పౌరాణిక ప్రాముఖ్యం ఏమైనా వుందా?

5. ఉత్సవం మీ ప్రత్యేక గ్రామానికి మాత్రమే పరిమితమా? లేక జిల్లా అంతటా ప్రాచుర్యంలో వుందా?

6. ఉత్సవం ప్రత్యేక కులానికి మాత్రమే పరిమితమా? లేక అన్ని కులాల వాళ్ళూ ఉత్సవంలో పాల్గొంటారా?

7. ఉత్సవం ఏదైనా గ్రామదేవతారాధనకు సంబంధించిందా? ఆ గ్రామదేవతకు గుడి ఏదైనా వుందా? ఆ దేవత విగ్రహ రూపంలో వుందా? లేక ఏ రూపంలో వుంది?

8. గ్రామ దేవతారాధన, ఉత్సవం పద్ధతుల్ని తెలియజెయ్యండి?

9. దేవతారాధన సమయంలో మొక్కుబళ్ళు, జంతుబలులున్నాయా?

10. ఉత్సవ, ఆరాధన సమయాల్లో ఇతర మతస్థులు కూడా పాల్గొంటారా?

11. ఉత్సవ దినాల్లో ఉపవాసాలు, జాగరణ చెయ్యడం, తీర్థస్నానాలు జరుగుతాయా?

12. ఆరాధన, ఉత్సవ సమయాల్లో జరిపే ఆచార వ్యవహారాలని, ఆచరణలని తెలియజెయ్యండి.

13. జాతర, పరుస ఎక్కడ, ఎప్పుడు జరుపబడుతుంది?

14. ఈ జాతర, పరుస ఎంతకాలం నుంచి జరుగుతోంది? ఎన్ని రోజులపాటు జరుగుతుంది?

15. జాతర, పరుసల సందర్భంగా అంగళ్ళను ఏర్పాటు చేస్తారా? ఆ అంగళ్ళలో అమ్మే వస్తువులు, పదార్థాల పేరేమిటి?

16. జాతర, పరుసలలో పాల్గొనే వాళ్ళకి భోజన, వసతి సదుపాయాలేమైనా వున్నాయా? ఉంటే ఎవరు ఏర్పాటు చేస్తారు?

17. జాతర, పరుసలలో వినోదాలు, వేడుకలేమైనా ఏర్పాటు చేయబడతాయా?

18. జాతర, పరుసలలో క్రీడలు, దొమ్మరివాళ్ళ ప్రదర్శనలు, సర్కసు, మ్యాజిక్కు, బయలాటలు, వీధినాటకాలు, జూదం, పులివేషం లాంటి జానపద కళారూపాలు ప్రదర్శింపబడతాయా? వీటిలో ఊళ్ళోవాళ్ళే పాల్గొంటారా? లేక ఏ ప్రదేశాలనుంచి వచ్చి పాల్గొంటారు?

19. ఆరాధన, ఉత్సవం, జాతరల సందర్భాల్లో విధులు, నిషేధాలు, కట్టుబాట్లు వుంటే వివరించండి.

20. వీటికి సంబంధించి ఇతర అంశాలేవైన వుంటే పేర్కొనండి.

## 3. ప్రదర్శన జానపద కళారూపాలు/జానపద కళలు

1. మీ దృష్టిలో కళ అంటే ఏమిటి?

2. మీ ఊళ్ళో ఎన్ని రకాలైన జానపద కళారూపాలు ప్రచారంలో ఉన్నాయి?

3. మీ ఊళ్ళో ప్రసిద్ధమైన జానపద కళారూపం ఏది? ఏ యే సందర్భాల్లో ప్రయోగిస్తుంటారు/ ప్రదర్శిస్తుంటారు? పండుగ పబ్బాల్లోనా? జాతరల సందర్భాల్లోనా? ఉత్సవాలు, పరుసల సందర్భాల్లోనా?

4. మీ ఊళ్ళో ఎంతమంది జానపద కళాకారులు వున్నారు? వాళ్ళు ఏ కులస్థులు? వాళ్ళ వృత్తేమిటి?

5. మీ ఊళ్ళో ప్రదర్శన జానపద కళల సందర్భంలో ఉపయోగించే వాద్యాల పేరేమిటి?

6. మీ ఊళ్ళో జానపద నాటకాలనేవైనా ప్రదర్శిస్తారా?

7. మీ ఊళ్ళో బయలాటల్ని, వీధినాటకాల్ని, యక్షగానాల్ని ప్రదర్శిస్తారా? వాటి పేర్లేమిటి?

8. వీటిని ఊళ్ళో వాళ్ళే ప్రదర్శిస్తారా? లేక పొరుగూర్ల నుంచి వచ్చి ప్రదర్శిస్తారా?

9. పై ప్రదర్శనల్ని ఏయే సమయాల్లో, సందర్భాల్లో ప్రదర్శిస్తారు?

10. పై ప్రదర్శనల్లో ఉపయోగించే వేషభూషణాలేమిటి?

11. జానపద కళల ప్రదర్శనల వెనుక మతాచారాలు, ఆరాధనా పద్ధతులు ఏవైనా ఉన్నాయా?

12. జానపద వృత్తి గాయకులు మీ ఊళ్ళో ఉన్నారా? ఏ కులానికి చెందినవారు?

13. మీకు నచ్చిన జానపదకళ/ కళారూపం ఏది? ఎందువల్ల? ఈ ప్రదర్శనలో ఎంతమంది పాల్గొంటారు?

14. మీరు స్వయంగా జానపద కళాకారులవుతే మీకు ఈ కళ ఎవర్నుంచి సంక్రమించింది?

15. జానపద కళల్ని ప్రదర్శించడంవల్ల వచ్చే ప్రయోజనం ఏమిటి?

16. మీ ఊళ్ళో కానీ, చుట్టప్రక్కల ప్రాంతాల్లో కానీ జానపద కళలను గురించి శిక్షణనిచ్చే వాళ్ళెవరైనా ఉన్నారా? శిక్షణ కేంద్రం ఏదైనా స్థాపించబడి వుందా?

17. మీ ఊళ్ళో ప్రసిద్ధులైన కొంతమంది జానపద కళాకారులను తెలియజెయ్యండి. ఆ కళాకారులకు ప్రభుత్వం నుండి ఏదైనా ఆర్థిక సహాయం లభిస్తోందా?

18. ప్రదర్శన జానపద కళలకి, కళారూపాలకి సంబంధించి ఏవైనా ఇతర అంశాలుంటే తెలియజెయ్యండి.

* * *

# 32. ఆంధ్రప్రదేశ్‌లో జరిగిన జానపద విజ్ఞానాధ్యయనం
## (Folklore Research in Andhra Pradesh)

నేడు జానపద విజ్ఞానం అతివిశాలమైన క్షేత్రంగా అన్ని దేశాల్లోను విరాజిల్లుతోంది. శాస్త్రీయమైన పద్ధతుల్లో జానపద విజ్ఞానం మీద పరిశోధనలు జరుగుతున్నాయి. భారతదేశం జానపద విజ్ఞాన సంస్కృతులకు నిలయం. మనదగ్గర ముడిసరుకు కావలసినంత ఉంది. అయితే ఉపయోగించుకొనేవాళ్ళు తక్కువ. అంతేకాదు విశ్లేషించడానికి సరయిన థియరీలు లేవు. పాశ్చాత్యులకు ఏ మాత్రం ముడిసరుకు దొరికినా శాస్త్రీయంగా విశ్లేషించి నలుగురికీ చాటుతారు. ఇది నిజంగా మనలో ఉన్న లోపం అంటే తప్పుకాదనుకుంటాను. 'పళ్ళు ఉన్నవారికి పప్పులు లేవు. పప్పులున్నవారికి పళ్ళు లేవు'.

ఆంధ్రదేశంలో జానపద విజ్ఞానం మీద పరిశోధన చేయాలన్న ఆసక్తి దాదాపు 10-15 ఏళ్ళుగా ఎక్కువగా కన్పిస్తోంది. అంతకుముందు జానపద విజ్ఞానం పై కంటే జానపద సాహిత్యం మీదనే కొంతవరకు కృషి జరిగింది. అందులోను జానపద గేయాల మీద. ఈ కృషి కూడా సేకరణలోనే ఎక్కువగా కన్పిస్తుంది. డా॥ బిరుదురాజు రామరాజుగారి తెలుగు జానపద గేయ సాహిత్య పరిశోధనతో మన తెలుగు జానపద విజ్ఞానం క్షేత్రం కొత్త మలుపు తిరిగింది. నందిరాజు చలపతిరావు, కృష్ణశ్రీ, టేకుమళ్ళ కామేశ్వరరావు, హరి ఆదిశేషువుల వంటి మహనీయులతో తెలుగు జానపద సాహిత్య క్షేత్రం తన ఉనికిని స్థిరపరచుకొంది. విశ్వవిద్యాలయాల్లో జానపద సాహిత్యం ఒక పాఠ్యాంశంగా నిర్ణయించబడింది.

స్వాతంత్ర్యానికి పూర్వం అంటే పంతొమ్మిదో శతాబ్దంలోనే ఆంగ్లేయుల రాకతో జానపద పరిమళాలు వెదజల్లబడ్డాయి. తెలుగువాళ్ళలో జానపద సాహిత్య ఆసక్తిని పెంపొందించిన వాళ్ళలో సి.పి. బ్రౌను, కల్నల్ మెకంజీ, ఛార్లెస్ ఇ. గోవర్, జె. ఏ. బోయల్, కెప్టెన్ ఎం. డబ్ల్యూ. కార్ మొదలైన వాళ్ళు చిరస్మరణీయులు. అలాగే తెలుగు విద్వాంసుల్లో నందిరాజు చలపతిరావు, టేకుమళ్ళ అచ్యుతరావు, పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి, వేటూరి ప్రభాకరశాస్త్రి, చిలుకూరి నారాయణరావు, మల్లంపల్లి సోమశేఖర శర్మ, అక్కిరాజు ఉమాకాన్తం, చింతా దీక్షితులు మొదలైన వాళ్ళు ప్రాతఃస్మరణీయులు. వీళ్ళందరూ స్వాతంత్ర్యానికి

పూర్వమే జానపద సాహిత్య రంగంలో కృషిచేసిన మహనీయులు. కనుక వీరిని స్మరిస్తూ, స్వాతంత్ర్యోత్తర కాలం నుంచి నేటిదాకా తెలుగు జానపద విజ్ఞానరంగంలో జరిగిన కృషిని సమీక్షించి, ఇంతవరకు ఏ యే రంగాల్లో ఎలాంటి శాస్త్రీయాధ్యయనం జరిగింది, ఇంకా ఎలాంటి అధ్యయనం జరగాల్సిఉంది అన్న విషయాన్ని మీ ముందుంచుతున్నాను.

తెలుగులో మొట్టమొదట జానపద సాహిత్యాన్ని వివరణాత్మకంగా పరిచయం చేసిన గ్రంథం శ్రీ హరి ఆదిశేషువుగారి ''జానపద గేయ వాఙ్మయ పరిచయము''. ఇది 1953లో తెలుగు భాషా సమితి ద్వారా మద్రాస్ ప్రభుత్వం వారి బహుమతిని పొందింది. 1954లో ప్రచురింపబడినది కూడ. వృత్తిరీత్యా శ్రీహరి ఆదిశేషువుగారు రసాయన శాస్త్రాచార్యులైనప్పటికి జానపద సాహిత్యం మీదున్న మక్కువతో జానపద గేయాలను సేకరించి విశ్లేషించడం గమనించదగ్గ విషయం.

అలాగే అపూర్వమయిన జానపద సాహిత్యాన్ని అపారంగా అందించిన జానపద సాహిత్యోద్ధారకులు నేదునూరి గంగాధరంగారు. తమ జీవితాన్ని జానపద సాహిత్యానికే అంకితం చేసి ఆరువేలకు పైగా జానపద గీతాలను సేకరించి ప్రచురించిన మహనీయులు వీరు. స్త్రీలపాటలు, కథాగేయాలు, వాడుక మాటలు, నుడికారాలు, సామెతలు, జాతీయాలు, పారిభాషిక పదాలు మొదలైన వాటిని సేకరించి గృహలక్ష్మి, కృష్ణాపత్రిక, భారతి, ఆంధ్రభూమి మొదలైన పత్రికల్లో ప్రచురించారు. జానపద సాహిత్యంలోని ప్రతి అంశాన్ని స్పృశించి తర్వాతి సేకర్తలకు మార్గదర్శకులయ్యారు. అధ్యాపక వృత్తిలో ఉంటూ జానపద వాఙ్మయానికి అంకితమైపోయారు నేదునూరి గంగాధరంగారు.

వృత్తిరీత్యా భౌతిక శాస్త్రాచార్యులుగా సేవచేస్తూ, ప్రవృత్తిరీత్యా జానపద వాఙ్మయోద్ధారకులుగా 'కృష్ణశ్రీగా' ప్రఖ్యాతి గాంచిన శ్రీ పాదగోపాల కృష్ణమూర్తి గారు జానపద సాహిత్య క్షేత్రంలో చిరస్మరణీయులు. జానపద సాహిత్య విమర్శకుడుగా స్థానం ఆక్రమించుకొన్న 'కృష్ణశ్రీ' కలం నుంచి అనేక వ్యాసాలు భారతి, కిన్నెర, గృహలక్ష్మి పత్రికలను అలంకరించాయి. కనుమరుగైపోతున్న స్త్రీల పాటలనెన్నింటినో సేకరించి, స్త్రీల రామాయణపు పాటలు, స్త్రీల పౌరాణికపు పాటలు అన్న పేర్తో ఆంధ్రసారస్వత పరిషత్తు వారి పక్షాన 1955, 1963 ప్రాంతాల్లో ప్రచురించారు.

ఉపాధ్యాయులుగానే ఉంటూ జానపదగేయాలను సేకరించి ప్రచురించడంతో పాటు భారతి, కిన్నెర, గృహలక్ష్మి మొదలైన పత్రికల్లో 1953-55 ప్రాంతాల్లో ప్రచురించిన వ్యాసాలను 'ఆంధ్ర జానపదగేయ వాఙ్మయ చరిత్ర' అన్న పేరుతో పుస్తకరూపంగా ప్రచురించిన జానపద సాహిత్యోద్ధారకులు శ్రీ టేకుమళ్ళ కామేశ్వరరావుగారు.

ఈ కోవకే చెందిన డా. తూమాటి దొణప్పగారు జానపద విజ్ఞానానికి సంబంధించి విశేషమైన కృషి జరిపారు. వీరు రచించిన 'తెలుగులో కొత్తవెలుగులు' 'జానపద కళాసంపద', 'తెలుగులో హరికథాసర్వస్వం' విశిష్టమైన గ్రంథాలు. 'త్రివేణి' జానపదగేయాల సంకలనకర్తలలో ఒకరుగా ప్రసిద్ధి చెందిన దొణప్పగారి మార్గదర్శకత్వంలో చాలామంది పిహెచ్‌డి; ఎం.ఫిల్ పట్టాలను సంపాదించు కొన్నారు.

'ఎల్లోరా' అనేకలం పేర్తో ప్రఖ్యాతులైన శ్రీ గొడవర్తి భాస్కరరావుగారు విశ్వవిద్యాలయ స్థాయిలో పిహెచ్.డి; కోసం జానపద సాహిత్యాన్ని అధ్యయనం చెయ్యకపోయినా, ఆ సాహిత్యం మీద ఉన్న అభిమానంతో పిహెచ్.డి., పరిశోధకులు చెయ్యలేనంత కృషి చేశారు. వీరి 'జానపద సాహిత్యం' (1982) 'జానపదగేయాలు' - రెండు సంపుటాలు (1955, 1957), 'మన ప్రాచీనకళలు - పుట్టు పూర్వోత్తరాలు (1960), సరాగాలు (1961), 'మధురకవితలు' (సమీక్షా గ్రంథం - 1961) ఉత్తమ గ్రంథాలు.

శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారు కూడ ఎల్లోరాగారి లాగానే జానపద కళలమీద విశేషమైన కృషి చేశారు. వీరి 'ఆంధ్రనాటకరంగ చరిత్ర' (1969) 'తెలుగువారి జానపద కళారూపాలు' (1992) ఆంధ్రదేశంలోని జానపద కళారూపాలను మొట్టమొదటిసారిగా విశ్లేషించిన గ్రంథాలు.

తోలుబొమ్మలాటల మీద విశేషమైన కృషి చేసిన డా॥ మొదలి నాగభూషణ శర్మగారు 1995లో ''Folk Arts of Andhra Pradesh' అన్న గ్రంథాన్ని ఆంగ్లంలో తెలుగు విశ్వవిద్యాలయం వారి ద్వారా ప్రచురించారు.

డా॥ ఎస్. గంగప్పగారు కూడ జానపద సాహిత్యం మీద పిహెచ్.డి., సంపాదించుకోకపోయినా, అంతకుమించిన స్థాయిలో జానపద విజ్ఞానాంశాలను

సేకరించి, పరిశోధనలు జరిపారు. వీళ్ళందరు సేకరించి, వాటికి వివరాలు వ్రాసి ప్రచురించిన గ్రంథాలు ఒక్కొక్కటి ఒక్కొక్క సిద్ధాంత వ్యాసంగానే పరిగణింపబడతాయి. అనాదృత వాఙ్మయంగా ఒకప్పుడు విద్వాంసులు ఈసడించినా నేడు ఆదరణీయ విజ్ఞానం కావడం గుర్తించదగ్గ విషయం.

ఇలా జానపద సాహిత్య సేకరణతోను, వ్యాస ప్రచురణలతోను సాగిన తెలుగు జానపద సాహిత్య క్షేత్రం విశ్వవిద్యాలయాల మెట్లనెక్కి జానపద విజ్ఞాన పరిశోధనలకు శ్రీకారం చుట్టింది. అలా తెలుగు జానపద సాహిత్య పరిశోధనకి అంకూరార్పణగావించిన ఉస్మానియా విశ్వవిద్యాలయం, తెలుగు జానపద గేయ సాహిత్యంలో 1956లో మొట్టమొదటి పిహెచ్.డి. రావడానికి దోహదం చేసింది. నేటి జానపద విజ్ఞాన పరిశోధకులందరికి మార్గదర్శకులే కాక, ఆంధ్రదేశానికే ఒక asset అనిపించుకుంటున్నవారు ప్రసిద్ధ జానపద సాహిత్య పరిశోధకులు డా॥ బిరుదురాజు రామరాజుగారు. వీరి 'తెలుగు జానపదగేయ సాహిత్యం' తెలుగు జానపద సాహిత్య రంగంలో మొట్టమొదటి పిహెచ్.డి. సిద్ధాంతవ్యాసం. వీరి కృషివల్లే ఉస్మానియా విశ్వవిద్యాలయంలో 1992లో మొట్టమొదటిసారిగా ఎం.ఏ., విద్యార్థులకు జానపద సాహిత్యం ఒక పాఠ్యాంశంగా నిర్ణయించబడింది. నాటి నుంచి నేటిదాకా ఆంధ్రదేశంలోని అనేక విశ్వవిద్యాలయాల తెలుగు శాఖల్లోనూ, కర్నాటకలోని బెంగుళూరు విశ్వవిద్యాలయం తెలుగు విభాగంలోను, తమిళునాడులోని మదరాసు విశ్వవిద్యాలయం తెలుగు శాఖలోను, జానపద విజ్ఞానం ఎం.ఏ. విద్యార్థులకు పాఠ్యాంశంగానూ, ఎం.ఫిల్., పిహెచ్.డిలకు సంబంధించి పరిశోధనాంశంగాను కొనసాగుతూ ఉండడం ప్రశంసించదగ్గ విషయం. మధురై, ఢిల్లీ, బెనారసు విశ్వవిద్యాలయాల తెలుగు విభాగాల్లో కూడ పిహెచ్.డి. కోసం పరిశోధనలు జరుగుతుండడం హర్షించదగ్గ విషయం.

డా. రామరాజుగారు లాగానే జానపద సాహిత్యానికి పరిశోధన గౌరవాన్ని కల్పించినవారు డా. ఎస్వీ. జోగారావుగారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో 'ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర' అనే అంశంమీద సిద్ధాంతవ్యాసం సమర్పించి 1957లో పిహెచ్.డి. సంపాదించారు.

శ్రీమతి వింజమూరి సీతాదేవిగారు మద్రాసు విశ్వవిద్యాలయంలో "Music in Telugu folk songs" అనే అంశంమీద పరిశోధనచేసి 1952లో మొట్టమొదటి ఎం.లిట్ డిగ్రీ సంపాదించారు.

డా. నాయని కృష్ణకుమారిగారు గేయగాథల్ని, మానవశాస్త్ర దృష్టితో అధ్యయనం చేసి 'జానపద కథాగేయాలు' అనే సిద్ధాంత వ్యాసాన్ని సమర్పించి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో 1970లో పిహెచ్.డి. డిగ్రీ పొందారు. జానపద సాహిత్య పరిమళాలను వెదజల్లుతున్న విదుషీమణులలో మొదట చెప్పుకోదగిన వారు వీరు. అలాగే డా. తంగిరాల వెంకటసుబ్బారావు గారు 1969లో 'తెలుగు వీరగాథా కవిత్వము' అనే అంశంమీద శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో పిహెచ్.డి. చేశారు. ఇప్పటిదాకా వివిధ అంశాలమీద పరిశోధకులు పరిశోధనలు జరిపారు. వాటిని ఇక్కడ పేర్కొనడం లేదు.

కొన్ని సిద్ధాంతవ్యాసాలను, పరిశోధకులను పరిచయం చేస్తాను. డా. యెల్లండ రఘువరారెడ్డి ''పల్లెపదాలలో ప్రజా జీవనం'' (ఉస్మానియా విశ్వవిద్యాలయం ( 1974), డా. జి.ఎస్.మోహన్ 'స్త్రీల పాటలు- అనంతపురం మండలం' (బెంగుళూరు విశ్వవిద్యాలయం-1979), డా. రావి ప్రేమలత, 'తెలుగు జానపద సాహిత్యం-పురాగాథలు' (ఉస్మానియా విశ్వవిద్యాలయం-1980), డా.ఎం.కె. దేవకి ''తెలుగులో బాలగేయ సాహిత్యం (శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం-1979), డా.పి. సరస్వతి 'జానపద సాహిత్యం-పిల్లలపాటలు' (ఉస్మానియా విశ్వవిద్యాలయం-1980), డా. బిట్టు వేంకటేశ్వర్లు 'పల్నాటి సీమలో కోలాటం' (నాగార్జున విశ్వవిద్యాలయం-1981), డా. వడ్లా సుబ్రహ్మణ్యం 'తెలుగు సాహిత్యంలో క్రీడా వినోదాలు (నాగార్జున విశ్వవిద్యాలయం-1982) మొదలైనవాళ్ళు పిహెచ్.డి చేశారు.

డా. కసిరెడ్డి వెంకటరెడ్డి 'పొడుపుకథల' మీద (ఉస్మానియా విశ్వవిద్యాలయం-1982), డా.సి. వసుంధర 'తెలుగు జానపద సాహిత్యం - స్త్రీల గేయములలో సంప్రదాయం' (ఉస్మానియా-1988) అన్న విషయాలమీద పరిశోధనలు జరిపారు.

'ఆంధ్రప్రాంతంలోని జానపద నాటకా'లను గురించి డా. మల్లెల రాజేంద్రప్రసాదరావు పిహెచ్డి. డిగ్రీని (ఆంధ్రవిశ్వ విద్యాలయం-1996), 'ప్రకాశం జిల్లాలోని వీధి నాటకాల పరిశీలన' గురించి శ్రీ విస్తాలు శంకరరావు ఎం.ఫిల్. డిగ్రీని (హైదరాబాదు కేంద్రీయ విశ్వవిద్యాలయం-1996), 'హరికథా ప్రక్రియ-సామాజిక ప్రయోజనాలు' గురించి డా. డొంకాడ శారద పిహెచ్.డి.

డిగ్రీని (ఆంధ్ర విశ్వవిద్యాలయం-1989)' 'తెలుగులో బుర్రకథలు' గురించి డా. కె. హెచ్. లక్ష్మణరావు పిహెచ్.డి. డిగ్రీని (ఉస్మానియా విశ్వవిద్యాలయం - 1986) 'బుర్రకథలు' గురించి డా. పువ్వాడ విజయకుమార్ పిహెచ్.డి డిగ్రీని (నాగార్జున విశ్వవిద్యాలయం-1988) 'జానపద భిక్షుక గాయకులు' గురించి డా. ఎస్.యాదగిరి శర్మ పిహెచ్.డి, చేశారు. 'చిత్తూరు జిల్లా గ్రామదేవతలు' గురించి డా. టి.నారాయణ (బెంగుళూరు విశ్వవిద్యాలయం-1987), 'తూర్పుగోదావరి జిల్లా గ్రామదేవతలు' గురించి డా. ఎమ్.రామకృష్ణ (ఆంధ్రవిశ్వవిద్యాలయం- 1993), 'పశ్చిమ గోదావరి జిల్లా గ్రామదేవతలు-ఒక పరిశీలన' గురించి డా.రంకిరెడ్డి రామ మోహనరావు (తెలుగు విశ్వవిద్యాలయం-1997) పిహెచ్.డి పట్టాల కోసం పరిశోధనలు జరిపారు. అలాగే శ్రీమతి మూలమల భరణి 'జంటనగరాలలోని గ్రామదేవతలు-ఒక పరిశీలన' (తెలుగు విశ్వవిద్యాలయం- 1998) గురించి పిహెచ్.డి చేశారు. డా.ఎం.అండమ్మ 'జానపద వాఙ్మయంలో శక్త్యారాధన' గురించి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో 1989లో పి.హెచ్.డి చేశారు.

అలాగే 'తూర్పుగోదావరి జిల్లా జానపదుల పండుగలు-పాటలు' గురించి డా.ఎమ్.విజయలక్ష్మి (ఉస్మానియా విశ్వవిద్యాలయం-1997), 'జానపద సాంస్కృతిక నృత్యగీతాలు-సాహిత్యానుశీలనము' గురించి శ్రీమతి వేదాంతం శ్రీదేవి (కాకతీయ విశ్వవిద్యాలయం-1995), 'జానపద సాహిత్యము-శారద కథలు' గురించి గంట జలంధర్ రెడ్డి (ఉస్మానియా విశ్వవిద్యాలయం-1997) పిహెచ్.డి.కోసం పరిశోధనలు జరిపారు. అలాగే 'నిజామాబాదు జిల్లా మొహరం పాటలు-పరిశీలన' గురించి శ్రీ కత్తి గంగాధర్ (హైదరాబాదు కేంద్రీయ విశ్వవిద్యాలయం-1995) ఎం.ఫిల్. చేశారు.

'తెలంగాణా శ్రామికగేయాలు' గురించి డా. గోపులింగారెడ్డి పిహెచ్.డి. డిగ్రీని (ఉస్మానియా విశ్వవిద్యాలయం), 'కృష్ణాజిల్లా శ్రామికగేయాలు' గురించి డా.ఎం. రఘూన్సీరాణి (హైదరాబాదు కేంద్రీయ విశ్వవిద్యాలయం-1993) ఎం.ఫిల్. డిగ్రీని సంపాదించారు. డా.వల్లూరిపల్లి సుకన్య 'తెలుగునాట పేరంటాళ్ళు' గురించి (తెలుగు విశ్వవిద్యాలయం-1996), 'శ్రీ కాళహస్తి కలంకారీ కళ' గురించి డా.టి.ధనలక్ష్మి (శ్రీ పద్మావతీ మహిళా విశ్వవిద్యాలయం-1997) 'తెలుగు జానపదకథలు' గురించి డా.కె. సుమతి (ఉస్మానియా

విశ్వవిద్యాలయం-1997) 'తెనాలి రామలింగని కథలు - సవిమర్శక పరిశీలనం' గురించి డా.వి.వై.వి. సోమయాజి (బెంగుళూరు విశ్వవిద్యాలయం-1989) పిహెచ్.డి. పట్టాల కోసం పరిశోధనలు జరిపారు. అలాగే అనంతపురం, మహబూబ్‌నగర్ జానపద కథల మీద డా.పెద్దిరెడ్డి, డా.బాలస్వామి పిహెచ్.డి., డిగ్రీలు సంపాదించుకొన్నారు.

స్త్రీలపాటల మీద, పిల్లల పాటలమీదా, పొడుపు కథల మీద, జాతరల మీద, పరిశోధనలు జరిగాయి. నేదునూరి గంగాధరం మీదా, నందిరాజు చలపతిరావు గారి స్త్రీలపాటలు 1,3 భాగాలమీదా పరిశోధనలు జరిగాయి.

డా.వెలగా వెంకటప్పయ్య, డా.కె. శ్రీలక్ష్మి, డా. కె. రుక్నుద్దీన్, డా. చిగిచెర్ల కృష్ణారెడ్డి, డా.సి. ఆపదరావు, డా.కె. సీతారామయ్య, డా. పులికొండ సుబ్బాచారి, డా. కర్ణరాజు శేషగిరి రావు, డా. ఆర్. వసంతలక్ష్మి మొదలైన పరిశోధకులు పిహెఛ్.డి.ల కోసం ఉత్తమ సిద్ధాంత వ్యాసాలను రచించారు.

పైన పేర్కొన్న వాళ్ళలో కొంతమంది పిహెచ్.డి. డిగ్రీలకే పరిమితం కాకుండా ప్రత్యేకంగా జానపద విజ్ఞానానికి సంబంధించిన గ్రంథాలను, వ్యాసాలను ప్రచురించారు. (ఇలా చెప్తూపోతే ఈ పట్టిక చేంతాడంత అవుతుంది కనుక దీన్ని ఇక్కడికి విరమిస్తాను).

పోతే గిరిజన విజ్ఞానం మీదచెప్పుకోదగ్గ పరిశోధనలు జరగలేదు. గ్రంథాలు కూడ వెలువడలేదు.

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో మొట్టమొదటిసారిగా గిరిజన విజ్ఞానం మీద పరిశోధనలు ప్రారంభించబడ్డాయి. డా. రామరాజుగారి మార్గదర్శకత్వంలో డా. పిరాట్ల శివరామకృష్ణమూర్తి 1984లో 'తెలుగు గిరిజన గీతాల' మీద ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పిహెచ్.డి., చేశారు. సిద్ధాంత వ్యాసం ప్రచురింపబడింది. అలాగే ఉస్మానియా విశ్వవిద్యాలయంలోనే, డా॥రాజ్‌మహమ్మద్ 'తెలంగాణా గిరిజనుల మౌఖిక సాహిత్యం' గురించి పిహెచ్.డి. చేశారు. శ్రీ జనపాల శంకరయ్య 'కరీంనగర్ జిల్లాలోని లంబాడీల ఆచార వ్యవహారాల' మీద ఎం.ఫిల్. చేశారు.

తెలుగు విశ్వవిద్యాలయం, బొమ్మూరులో డా. పేరాల్ల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు 'తూర్పుగోదావరి జిల్లా గిరిజన కథలు- ఒక పరిశీలన' అన్న అంశంమీద 1994లో పిహెచ్.డి. చేశారు. ఈయనే 'మారేడుమిల్లి ప్రాంత గిరిజన గేయాల' మీద 1991లో ఎం.ఫిల్. చేశారు.

బెంగుళూరు విశ్వవిద్యాలయంలో మొట్టమొదటిసారిగా 'తూర్పు గోదావరి జిల్లా కొండరెడ్ల గిరిజన ఆచార వ్యవహారాల' మీద శ్రీ పి.ఎం. మునిరెడ్డి డా. జి. ఎస్. మోహన్ మార్గ దర్శకత్వంలో పిహెచ్.డి. చేశారు (1998).

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో డా. మురళీకృష్ణ 'గిరిజనుల సామెతల' మీద పిహెచ్.డి. చేశారు. ఇక్కడే 'గిరిజనుల పొడుపుకథల' మీద పరిశోధన జరుగుతున్నట్టుగా తెలుస్తోంది.

ఇలా పరిశీలిస్తూ పోతే గిరిజన విజ్ఞానం మీదకాని, తులనాత్మక పరిశీలనకు సంబంధించి కానీ వ్రేళ్ళమీద లెక్కించదగినన్ని పరిశోధన వ్యాసాలు మాత్రమే వచ్చాయి. ఇంకా జరగాల్సింది చాలవుంది.

తులనాత్మకంగా జానపద విజ్ఞాన పరిశోధలు చాలా తక్కువగా జరిగాయనే చెప్పవచ్చు. ఈ దిశలో డా॥ ఆర్వీయస్. సుందరం మొట్టమొదటి సారిగా మైసూరు విశ్వవిద్యాలయంలో 1974లో 'తెలుగు కన్నడ జానపదగేయాల' మీద పిహెచ్.డి., చేశారు. వీరి 'ఆంధ్రుల జానపద విజ్ఞానం' అనే గ్రంథానికి డి. లిట్., డిగ్రీ 1988 లో వచ్చింది. మైసూరు విశ్వవిద్యాలయంలో డా॥ పి.ఎస్.గోపాలకృష్ణ 'తెలుగు కన్నడ సామెతల' మీద, డా.టి. గోపాలకృష్ణరావు 'తెలుగు కన్నడ జానపద రామాయణ గేయాల' మీద పరిశోధనలు చేశారు.

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో డా॥ ఎన్. భాస్కర్ 1990లో 'తెలుగు-మలయాళ సామెతలు- కుటుంబ జీవన చిత్రణం' మీద పిహెచ్.డి చేశారు.

మదరాసు విశ్వవిద్యాలయంలో డా. డి. నిర్మల 1981లో 'తెలుగు-తమిళ జానపద సాహిత్య తులనాత్మక పరిశోధన' మీద పిహెచ్.డి., చేశారు.

శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో శ్రీమతి ఎం.వేదవతి 'తెలుగు కన్నడ సాహిత్యాల్లో కుమారాముని కథ' అనే అంశంమీద 1979లో ఎం.ఫిల్. చేశారు.

శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో శ్రీ శిరివరం మీనా విజయకుమార్ 1992లో 'ఉరవకొండ మండలం తెలుగు కన్నడ శ్రామికగేయాల' మీద ఎం.ఫిల్ చేశారు.

బెంగుళూరు విశ్వవిద్యాలయంలో డా. జి. ఎస్. మోహన్ మార్గ దర్శకత్వంలో శ్రీ.ఎ. అంజనప్ప 'తెలుగు కన్నడ పాడుపుకథల తులనాత్మక పరిశీలన' అనే అంశంమీద పిహెచ్.డి చేశారు (1998).

ఆంధ్ర విశ్వవిద్యాలయంలోని హిందీ విభాగంలోను, శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయంలోని హిందీ విభాగంలోను, హిందీ, తెలుగు జానపద సాహిత్యాలకు సంబంధించి ఏడెనిమిది పిహెచ్.డి. సిద్ధాంతవ్యాసాలు వచ్చాయి. అలాగే ఉస్మానియా విశ్వవిద్యాలయం హిందీ విభాగంలోను, ఆగ్రాలోని కేంద్రీయ హిందీ సంస్థలోను పరిశోధనలు జరిగాయి.

జానపద విజ్ఞానం మీద అనేకంగా పిహెచ్.డి. ఎం.ఫిల్ సిద్ధాంత వ్యాసాలు వచ్చాయి. నాకు తెలిసినంతవరకు ఇప్పటిదాకా 150 పిహెచ్.డి. డిగ్రీలు, 200 పైగా ఎం.ఫిల్ డిగ్రీలు వచ్చాయి.

1. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో నేటిదాకా 40కి పైగా పిహెచ్.డి. డిగ్రీలు, 60కిపైగా ఎం.ఫిల్ డిగ్రీలు -

2. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో దాదాపు 10-15 పిహెచ్.డి, డిగ్రీలు, 20 ఎం.ఫిల్ డిగ్రీలు -

3. శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో దాదాపు 25 పిహెచ్.డి., 40కి పైగా ఎం.ఫిల్ డిగ్రీలు -

4. నాగార్జున విశ్వవిద్యాలయంలో దాదాపు 10 పిహెచ్.డి., 15కి పైగా ఎం.ఫిల్ డిగ్రీలు -

5. శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో 10 పిహెచ్.డి., 25-30 ఎం.ఫిల్ డిగ్రీలు.

6. బెంగుళూరు విశ్వవిద్యాలయంలో 8 పిహెచ్.డి., 25 ఎం.ఫిల్. డిగ్రీలు

7. మైసూరు విశ్వవిద్యాలయంలో 4 పిహెచ్.డి., డిగ్రీలు

8. మద్రాసు విశ్వవిద్యాలయంలో 10 పిహెచ్.డి, 20కి పైగా ఎం.ఫిల్ డిగ్రీలు-

9. తెలుగు విశ్వవిద్యాలయంలో 15 పిహెచ్.డి, 20 ఎం.ఫిల్ డిగ్రీలు.

10. హైదరాబాదు కేంద్రీయ విశ్వవిద్యాలయం, బెనారస్ హిందూ విశ్వవిద్యాలయాల్లో చెప్పుకోదగ్గ సంఖ్యలో పిహెచ్.డి. డిగ్రీలు రాకపోయినా, ఎం.ఫిల్ డిగ్రీలు వచ్చాయి.

11. ఢిల్లీ విశ్వవిద్యాలయం నుండి ఒకటి, రెండు పిహెచ్.డి., డిగ్రీలు వచ్చాయి.

12. అమెరికాలోని విస్కాన్సిన్ విశ్వవిద్యాలయం నుంచి ఒక సిద్ధాంత వ్యాసం రావడం విశేషం ('The epic of Palnadu' 1981, Gene. H. Roghair)

13. కాకతీయ విశ్వవిద్యాలయం నుంచి దాదాపు 8-10 పిహెచ్.డి., డిగ్రీలు వచ్చాయి.

ప్రస్తుతం ఆంధ్ర, ఆంధ్రేతర ప్రాంతాలలోని విశ్వవిద్యాలయాల్లో పిహెచ్.డి. డిగ్రీ కోసం 60మందికి పైగా పరిశోధనలు చేస్తున్నారు. అలాగే ఎం.ఫిల్. డిగ్రీ కోసం 60మంది పరిశోధనలు చేస్తున్నారు.

జానపద సాహిత్య సేకరణ, ప్రచురణలకు సంబంధించి గుజిలీపాటల పుస్తక ప్రకాశకులను, ప్రచురణకర్తలను, సాహిత్య సంస్థలను ఇక్కడ స్మరించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఎన్నో జానపద గేయాలను, స్త్రీల పాటలను, కథాగేయాలను ప్రచురించిన ఘనత వీరికే దక్కుతుంది. కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు, యెనిబిల్లి నూకరాజు అండ్ సన్సు, కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు, లక్ష్మీనారాయణ బుక్‌డిపో, చందా నారయణ శ్రేష్ఠి అండ్ సన్సు, కొండా శంకరయ్య, గొల్లపూడి వీరాస్వామి, వెంకటరామ్ అండ్ కో, వెస్టువార్డు కంపెనీ, బాలసరస్వతి ప్రెస్సు మొదలైన ప్రచురణకర్తలు పేర్కొనదగ్గవారు.

అలాగే జానపద సాహిత్యాన్ని ప్రోత్సహించిన పత్రికలు కూడ తమవంతు పాత్రని నిర్వహించడం హర్షించదగ్గ విషయం. భారతి, కిన్నెర, గృహలక్ష్మి, ప్రతిభ,

సంస్కృతి, సౌభాగ్య, గోల్కొండ, స్రవంతి, ప్రజామిత్ర, ఆంధ్రప్రభ, ఆంధ్ర పత్రికలు ఎనలేని సేవ చేశాయి. జానపద గీతాలను ప్రచురించడమే కాక, ప్రసిద్ధ రచయితల, పరిశోధకుల జానపద సాహిత్యాలను ప్రచురించాయి.

1982లో డా. జి. ఎస్. మోహన్ 'తెలుగు జానపద విజ్ఞానసూచి' అనే గ్రంథాన్ని ప్రచురించారు. అందులో 1982దాక ప్రచురింపబడ్డ సేకరణ గ్రంథాల వివరాలని, వ్యాసాల వివరాలని ఇవ్వడం జరిగింది. అలాగే 1993 లో 'ప్రసిద్ధ జానపద విజ్ఞానవేత్తలు' అనే పేర్తో మరో పుస్తకాన్ని ఆయన ప్రచురించారు. అందులో తెలుగు జానపద సాహిత్యోద్ధారకులను గురించి వివరించడంతో పాటు 1993 దాకా విశ్వవిద్యాలయాల్లో జరిగిన పరిశోధనలను, పరిశోధకులను తెలియజేయడం జరిగినది.

ఆంధ్రసారస్వత పరిషత్తు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, ఆంధ్రప్రదేశ్ నాటక అకాడమీలు జానపద సాహిత్యం పట్ల శ్రద్ధ చూపాయి. కొన్ని గ్రంథాలను కూడ ప్రచురించాయి.

1972లో 'ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్తు' డా. నాయని కృష్ణకుమారి గారి నేతృత్వంలో హైదరాబాదులో ఆవిర్భవించింది. ఈ పరిషత్తు 'జానపద సరస్వతి' అనే పత్రికను కూడ ప్రచురించింది. ప్రస్తుతం సంవత్సరానికోసారి పత్రికను ప్రచురిస్తోంది. చర్చాగోష్ఠుల్ని నిర్వహిస్తోంది. ప్రతి సంవత్సరం 'డా. రామరాజు జానపద విజ్ఞాన బహుమతి'ని ఏర్పాటు చేసి ఉత్తమ గ్రంథాలకు బహుమతిని ఏర్పాటు చేస్తూ యువకుల్ని ప్రోత్సహిస్తుడడం గమనించదగ్గ విషయం 'జానపద విజ్ఞాన భారతి' 1981లో మైసూరులో ఏర్పడింది. డా. ఆర్వీయస్ సుందరం అధ్యక్షులుగాను, డా. జి. ఎస్. మోహన్ కార్యదర్శిగాను పనిచేశారు. 'జానపదం' అనే పేరుతో ఒక త్రైమాసిక పత్రికను కూడ ప్రచురించడం జరిగింది. ఈసంస్థ డా.కె. సుమతిగారి 'తెలుగు జానపద కథలు' అన్న పుస్తకాన్ని 1984లోను, 'జానపదుల తిట్లు' అన్న డా. జి. ఎస్. మోహన్ గ్రంథాన్ని 1985లోను ప్రచురించింది. అంతేకాక చర్చాగోష్ఠుల్ని నిర్వహించి, ఆ వ్యాసాలను 'భాష-జానపదం' అన్నపేరుతో ప్రచురించింది. జానపద విజ్ఞానాన్ని శాస్త్రీయంగా అధ్యయనం చెయ్యడానికి ఈ సంస్థ దోహదం చేసింది.

1997లో 'జానపద సంస్కృతి పీఠం' బెంగుళూరులో నెలకొల్పబడింది. డా॥ ఆర్వీయస్ సుందరం అధ్యక్షులుగాను, డా. జి. ఎస్. మోహన్ కార్యదర్శిగాను ఏర్పడ్డ ఈ పీఠం 'జానపద సంస్కృతి' మీద ఒక చర్చాగోష్ఠిని రాజమండ్రిలోను, 'సంప్రదాయపు వంటకాలు' అనే అంశంమీద మైసూరులోను చర్చాగోష్ఠిని నిర్వహించింది. అలాగే 'జానపద వైద్యం' మీద చర్చాగోష్ఠిని నిర్వహించింది. జానపద సాహిత్యంతో పాటు జానపద సంస్కృతిని కూడ పరిరక్షించడం ఈ పీఠం ఉద్దేశ్యం.

జనవరి 1998 లో 'దేశి' అనే సంస్థను మైసూరులో నెలకొల్పడం జరిగింది. ఈ సంస్థకు కూడ డా॥ ఆర్వీయస్ సుందరం అధ్యక్షులు, డా. జి. ఎస్. మోహన్ సంచాలకులు. 'దేశి' అనే పేర్తో ఒక చిన్న త్రైమాసిక పత్రికను ( ఒక చిన్న బుల్లెటిన్) కూడ ప్రచురిస్తోంది.

'జానపద కళా పరిశోధ వేదిక' అన్న పేర్తో హైదరాబాదులో ఒక సంస్థ ప్రారంభించబడింది. దీనికి అధ్యక్షులు డా॥ గోపులింగారెడ్డి. కార్యదర్శి డా. బిట్టు వెంకటేశ్వర్లు ఇది 'జానపద పరిశోధన' అన్న పేర్తో ఒక పత్రికను ప్రచురిస్తోంది. చర్చాగోష్ఠుల్ని, వర్క్‌షాపుల్ని నిర్వహిస్తోంది.

ఆంధ్రపదేశ్‌లో ప్రత్యేకంగా ప్రభుత్వ సంస్థలు కానీ, అకాడమీలు కానీ లేకపోవడం శోచనీయం. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం మాత్రం జానపద సాహిత్యానికి సంబంధించిన గ్రంథాలను ప్రచురించడంతోపాటు చర్చాగోష్ఠుల్ని నిర్వహిస్తుండడం సంతోషించదగ్గ విషయం.

కన్నడ దేశంలో జానపద సాహిత్య సేకరణ, అధ్యయనాలకు, పుస్తక ప్రచురణలకూ, ప్రభుత్వ ప్రభుత్వేతర సంస్థలెన్నో ఉన్నాయి. కర్నాటక సాహిత్య అకాడమీ, కన్నడ సాహిత్య పరిషత్తు సంస్థలేకాకుండా ప్రత్యేకంగా 'కర్నాటక జానపద మత్తు యక్షగాన అకాడమీ' నెలకొల్పబడింది. ఇవన్నీ ప్రభుత్వ సంస్థలవుతే 'కర్నాటక జానపద సాహిత్య పరిషత్తు' అనే ప్రభుత్వేతర సంస్థ డా. హెచ్.ఎల్. నాగేగౌడగారి నేతృత్వంలో ఏర్పడింది. అనేక గ్రంథాలను ప్రచురించింది. జానపద సాహిత్యంతో పాటు జానపద కళల్ని, జానపద సంస్కృతిని పరిరక్షించడంతో పాటు రామనగరంలో 15 ఎకరాల విస్తీర్ణంలో జానపద వస్తు ప్రదర్శనాలయాన్నీ, ఒక గ్రంథాలయాన్నీ ఈ పరిషత్తు నిర్వహిస్తోంది.

ఆంధ్రదేశంలో ఇంచుమించు అన్ని విశ్వవిద్యాలయాలలోను జానపద సాహిత్యాన్ని ప్రత్యేకంగా అధ్యయనం చేస్తున్న తెలుగు విభాగాలు ఉన్నాయి. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యలయానికి సంబంధించి వరంగల్లులో ప్రత్యేకంగా జానపద, గిరిజన శాఖ నెలకొల్పబడింది. హైదరాబాదులో జానపద కళలకు సంబంధించిన ఒక విభాగమూ, రాజమండ్రిలో జానపదగేయాలకు సంబంధించిన ఒక విభాగమూ ఉన్నాయి. హైదరాబాదు కేంద్రీయ విశ్వవిద్యాలయంలో జానపద సంస్కృతి విభాగం, సంస్కృతికి సంబంధించినట్టుగా పరిశోధనలు జరుపుతోంది; వర్కు-షాపుల్ని, సెమినార్లను నిర్వహిస్తోంది.

ఆంధ్రేతర రాష్ట్రాలయిన కర్నాటక, తమిళనాడులలోనూ జానపద సాహిత్యాన్ని అధ్యయనం చేస్తున్న తెలుగు విభాగాలు ఉన్నాయి. బెంగుళూరు, మద్రాసు విశ్వవిద్యాలయాల తెలుగు శాఖల్లోను, మద్రాసులోని ప్రెసిడెన్సీ కాలేజీలోను జానపద సాహిత్యం మీద పరిశోధనలు జరుగుతున్నాయి.

పోతే నేడు జానపద విజ్ఞానాంశాలమీద పరిశోధనలు కాని, సేకరణలు కాని ఇంకా జరగాల్సింది చాలవుంది.

1. ఇంతవరకు జరిగింది అధికంగా జానపద సాహిత్య సేకరణ, పరిశోధన మాత్రమే. తక్కిన జానపద విజ్ఞానాంశాలయిన సాంఘిక జానపద ఆచారం, వస్తు సంస్కృతి, ఒక్కొక్క ప్రదర్శన జానపద కళమీద పరిశోధనలు జరగాల్సిన అవసరం ఉంది.
2. గిరిజన విజ్ఞానం మీద చెప్పుకోదగ్గ సేకరణ కానీ, పరిశోధన కానీ జరగక పోవడం శోచనీయం. కేవలం 3,4 సిద్ధాంత వ్యాసాలు మాత్రమే వచ్చాయి.
3. తెలుగు జానపద కథల మీద కూడ జిల్లాల వారిగా పరిశోధనలు జరగాలి.
4. గ్రామ దేవతల మీద 3,4 సిద్ధాంతవ్యాసాలు వచ్చాయి. ఒక్కొక్క జిల్లాకు సంబంధించి పరిశోధనలు జరగాలి.
5. జాతరల మీద కూడ చెప్పుకోదగ్గ పరిశోధనలు జరగలేదు. ఒక్కొక్క జిల్లాకు సంబంధించినట్లుగా పరిశోధన జరగాలి.
6. ఆంధ్రేతర ప్రాంతాలయిన కర్నాటక, తమిళనాడు ప్రాంతాలలోని జానపద విజ్ఞానానికి సంబంధించి కేవలం 2,3 పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసాలు, 5,6,

లఘు సిద్ధాంతవ్యాసాలు వచ్చాయి. కోలారు, తుంకూరు, బళ్ళారి చిత్రదుర్గ, హోసూరు మొదలైన ప్రాంతాలలోని జానపద విజ్ఞానాంశాల సేకరణ, పరిశోధన జరగాలి. ఇప్పటిదాకా 'కోలారు జిల్లా జానపద కవిత్వం' మీదనే పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసం వచ్చింది.

7. తెలుగు, జానపద విజ్ఞానాన్ని ఇతర సోదర భాషలైన తమిళం, కన్నడం, మలయాళం జానపద విజ్ఞానాలతో తులనాత్మక అధ్యయనం జరగాల్సివుంది.

8. తెలుగు హిందీ జానపద విజ్ఞాన అంశాల తులనాత్మక అధ్యయనాల మీద ఏడెనిమిది సిద్ధాంత వ్యాసాలు వచ్చినా, ఇవన్నీ జానపద గేయాలకు, సామెతలకు సబంధించినట్టివి. ఇతర అంశాల మీద కూడ తులనాత్మక పరిశోధనలు జరగాలి.

9. తెలుగుదేశంలోని ప్రసిద్ధులైన జానపద విద్వాంసుల మీద, వృత్తి గాయకుల మీద, వృత్తుల మీద పరిశోధనలు జరగాలి.

10. జానపద వాద్యాల మీద ఇంకాపరిశోధనలు జరగాల్సి వుంది.

11. ప్రాచీన, ఆధునిక తెలుగు కావ్యాలలో ఉన్న జానపద విజ్ఞానాంశాలను వెలికి తీయాల్సిన అవసరం ఉంది. ఈ దిశలో ఒకటి రెండు సిద్ధాంత వ్యాసాలు వచ్చాయి.

12. తెలుగు జానపద విజ్ఞానం మీద పరిశోధన చేయాలంటే జానపద విజ్ఞాన క్షేత్రకార్యంలో శిక్షణ అవసరం. కారణం సిద్ధాంత వ్యాస రచనకి మౌలిక అంశాలన్నీ క్షేత్ర పర్యటనలోనే లభిస్తాయి. విశ్వవిద్యాలయాల్లో క్షేత్రకార్యానికి సంబంధించిన వర్క్‌షాపుల్ని నిర్వహించాల్సిన అవసరం ఉంది. పొట్టి శ్రీరాములు విశ్వవిద్యాలయం రిఫ్రెషరు కోర్సులతో పాటు ఫీల్డు వర్క్ - వర్క్‌షాప్‌లని కూడ నిర్వహిస్తే బాగుంటుంది.

13. విశ్వవిద్యాలయ స్థాయిలో నేడు జరుగుతున్న జానపద విజ్ఞాన పరిశోధనలు చాలవరకు విశ్లేషణ సామర్థ్య లోపాన్ని కలిగి ఉన్నవిగా కన్పిస్తాయి. తీసి తీసి వ్రాస్తే థీసిస్ అవుతుందన్న విషయాన్ని సార్థకం చేస్తున్నాయి. విషయ

విశ్లేషణకు ప్రాధాన్యం ఇచ్చి సిద్ధాంత వ్యాసాలను వ్రాయాల్సిన అవసరం ఎంతయినా వుంది.

14. జానపద విజ్ఞానం మీద కేవలం ఆసక్తి, ఉత్సాహం ఉంటే మాత్రం చాలదు. తక్కిన శాస్త్రాల పరిజ్ఞానం - అంటే భాషాశాస్త్రం, మానవ శాస్త్రం, సామాజిక శాస్త్ర, మనస్తత్వ శాస్త్రాల పరిచయం ఉన్నప్పుడే పరిశోధన వ్యాసాలు ఉత్తమస్థాయిలో వెలువడుతాయి.

ఇలా జరిగినప్పుడే మున్ముందు తెలుగు జానపద విజ్ఞాన క్షేత్రానికి ఉజ్జ్వల భవిష్యత్తు ఉంటుందని మనమందరం ఆశిద్దాం.

* * *

# 33. ప్రసిద్ధ జానపద విజ్ఞాన విద్వాంసులు (Renowned Folklorists)

1846లో 'Folklore' అన్న పదాన్ని W.J. Thoms 'Popular Antiquities' అన్న పదానికి బదులుగా ప్రయోగించిన తర్వాత జానపద విజ్ఞానం శాస్త్రీయంగా అధ్యయనం చెయ్యడానికి దోహదం చేసింది. నాటి నుండి నేటిదాకా జానపద విజ్ఞానాన్ని తమ అధ్యయన క్షేత్రంగా చేసుకుని కృషి చేసిన పాశ్చాత్య విద్వాంసులు ఎందరో ఉన్నారు. అలాంటి వాళ్ళలో కొంతమంది ప్రముఖుల్ని గురించి తెలుసుకోవడం ముఖ్యం. జానపద కథా క్షేత్రంలో అద్వితీయమైన కృషి చేసిన గ్రిమ్ సోదరులతో పాటు ప్రసిద్ధ జానపద విజ్ఞాన విద్వాంసుల వివరణ ఈ ప్రకరణ ముఖ్యోద్దేశం.

## గ్రిమ్ సోదరులు:

### జేకోబ్ లుడ్విన్ కార్ల్ గ్రిమ్ (1785-1863)

### విల్‌హెల్మ్ కార్ల్ గ్రిమ్ (1786-1859)

జానపద కథామూలాన్ని అన్వేషించడానికి ప్రథమంగా ప్రయత్నించినవారు గ్రిమ్ సోదరులు. వీళ్ళు 1819లో Kinder-und Hausmarchen అన్న గ్రంథాన్ని ప్రచురించినప్పుడు కథల ఆంతరిక సమస్యని గురించి చర్చ జరిగింది. ఆ తర్వాత ప్రపంచం అంతటా అనేక జానపద కథా సంకలనాలు వెలువడ్డాయి. ప్రకటింపబడ్డ కథల్లో సామ్యం కన్పించింది. ఇలా ప్రపంచంలోని కథల్లో కన్పించే ఈ సామ్యానికి ఏదో ప్రబల కారణం వుండవచ్చునన్న సంశయం వీళ్ళల్లో కలిగి వెతకడం మొదలుపెట్టారు. గ్రిమ్ సోదరులు కేవలం జానపద విద్వాంసులేకాదు ప్రముఖ భాషా శాస్త్రవేత్తలు కూడ. వీళ్ళు ఇండో యూరోపియన్ భాషా కుటుబాలమీద కృషిచేయుండడం వల్ల జానపద కథ ఏదేని ఒక స్థలంలో, ఒక కాలంలో మౌఖిక రూపంలో వుండి, విశ్వవ్యాప్తి చెందుతుందని నిర్ధారించారు. వీళ్ళు అధ్యయనం చేసిన జానపద కథలు ఇండో యూరోపియన్ భాషా కుటుంబంలో అధిక ప్రచారంలో ఉండడంవల్ల జానపద కథకి ఏదేని మూలం ఉన్నట్టయితే అది ఒక

నిర్దిష్ట భాషే అయివుంటుందని, భాషా మూలాన్నే కథామూలానికి అన్వయించడం వల్ల ప్రపంచంలోని అన్ని జానపద కథలూ ఇండో యూరోపియన్ భాషల్ని మాట్లాడే ప్రజలనుంచే వచ్చి వుండవచ్చుననే అంతిమ నిర్ణయానికి వచ్చారు. ఇలా గ్రిమ్ సోదరులు అప్పటికే ఇండో యూరోపియన్ భాషల మీద జరిగిన తులనాత్మక భాషాధ్యయనాన్ని తమ సిద్ధాంత ప్రతిపాదనకి ఉపయోగించుకున్నారు. వీళ్ళ సిద్ధాంతం ఇలా వుంది -

1. సమాన ధర్మాలున్న జానపద కథా చక్రాలు ఇండో యూరోపియన్ భాషా కుటుంబానికి చెందినవి. ఇవి ఇండో యూరోపియన్ భాషల ప్రాచీన రూపాల నుండి విస్తరింపబడ్డాయి. ఇదే ఇండో యూరోపియన్ సిద్ధాంతం (Indo-Europian Theory).

2. పురాణాలు విడగొట్టబడి ముక్కలై కథలకి మూలమైందని వీళ్ళ సిద్ధాంతం. దీన్నే 'Broken down Myth Theory' (పురాణ మూల సిద్ధాంతం) అంటారు.

గ్రిమ్ సోదరులు ఇలా భాష, ప్రజలు, ప్రాంతం, సామ్యాలను దృష్టిలో ఉంచుకొని తమ సిద్ధాంతాన్ని ప్రతిపాదించి అనేక జానపద విద్వాంసుల్ని ఆకర్షించారు. వీళ్ళ సమకాలికులు ఈ సిద్ధాంతాన్ని సమర్థించారు. గ్రిమ్ సోదరుల చేత ఇలా ప్రారంభమైన ఈ సిద్ధాంతం పంతొమ్మిదో శతాబ్దానికి ఇంగ్లండు దేశపు విద్వాంసుల్ని ఆకర్షించింది. వీళ్ళలో మ్యాక్స్‌ముల్లర్ పేర్కొనదగ్గవాడు. ఈ సిద్ధాంతాన్ని తిరస్కరించిన వాళ్ళలో ఆండ్రూ ల్యాంగ్ ముఖ్యుడు.

## ఫ్రాన్సిస్ జె. ఛైల్డ్:

అమెరికాలోని జానపద విజ్ఞాన సంగ్రహ కార్యాన్ని ఆరంభించిన వాళ్ళలో హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో ఆచార్యులుగా పనిచేసిన ఫ్రాన్సిస్ జె. ఛైల్డ్ ముఖ్యులు. ప్రపంచంలోని వీరగాథల సేకర్తలలో ఈయన పేరు అగ్ర పంక్తిలో వుంది. 305 వీరగాథల్ని అధ్యయనం చేసి అనేక పాఠాలతో పరిశీలించి ఛైల్డ్ ప్రచురించాడు. (The English and Scottish Popular Ballads, 1904). ఛైల్డ్ వీరగాథల సంగ్రహం 1882-1898దాకా కొనసాగింది. ఈ కాలంలో ఈయన వీరగాథల్ని 5 సంపుటాల్లో పరిశీలించాడు.

## ఆర్చర్ టేలర్:

ఆర్చర్ టేలర్ జననం 1890. జర్మన్ విద్వాంసుడు, తులనాత్మక జానపద విజ్ఞాని, చికాగో విశ్వవిద్యాలయంలో జర్మన్ ఆచార్యులుగాను, జానపద విజ్ఞానాచార్యులుగాను పనిచేశారు.

1941 లో Journal of American folklore సంపాదకులుగా వ్యవహరించారు. California folklore quartely (ఇదే western folklore గా మారింది) కి సంపాదకులుగా పనిచేశారు. అనేక జానపద అకాడమీలకు సభ్యులుగా ఉన్నారు. అనేక గ్రంథాలను, వ్యాసాలను ప్రచురించారు.

## విలియం జాన్ థామ్స్ (1803-1885):

'Folklore ' శబ్ద బ్రహ్మగా విశ్వవిఖ్యాతి చెందిన విలియం జాన్ థామ్స్ 1803లో లండన్‌లోని వెస్ట్ మినిస్టర్ ప్రాంతంలో జన్మించాడు. ఈయన తండ్రి నథానియల్ థామ్స్. తండ్రిలాగానే విలియమ్ కూడా ఒక గుమాస్తాగా పనిచేసేవాడు. కేవలం గుమాస్తాలాగానే బ్రతికి జీవనం గడపడానికి విలియం గ్రంథ సూచి అధ్యయనం మీద ప్రత్యేకమైన అభిమానాన్ని చూపెట్టేవాడు. Foreign Quartely Review మొదలైన పత్రికలకి వ్యాసాలు వ్రాసేవాడు. రచనలకి అవసరమైన సహకారాన్ని ప్రాచీనాన్వేషకుడయిన అమ్యోట్ అనే అతన్ని ఆశ్రయించాడు. ఆయన ద్వారా ఫ్రాన్సిస్‌డౌస్ అనే సాహిత్యాభిమాని పరిచయం ఏర్పడింది. విలియం థామ్స్‌లో అధ్యయనాసక్తిని పురికొల్పడమే కాక తన గ్రంథాలయంలోని వ్రాతప్రతుల్ని, పుస్తకాలని ఇచ్చేవాడు డౌస్. 1827-28 ప్రాంతంలో మూడు సంపుటాల్లో థామ్స్ సంపాదకత్వంలో వెలువడ్డ Early prose Romances అనే గ్రంథనామం వున్న జనప్రియ కథా సంకలనానికి డౌస్ తన సంపూర్ణ సహాయ సహకారాలను అందించారు. ఇది థామ్స్ మొట్టమొదటి విశిష్టమైన కృతి.

విలియం థామ్స్ రచించిన మరో రెండు ప్రధానకృతులు 'Lays (Songs) and Legends of France, Spain, Tartary and Ireland' అనే పెద్ద శీర్షికలో రెండు సంపుటాల్లో ఆయా దేశాల జానపదగేయాలు, ఐతిహ్యాలకు సంబంధించిన గ్రంథాన్ని 1834లో లండన్ నుంచి ప్రకటించాడు. అలాగే మరో గ్రంథం 'Lays

and Legends of Germany'. ఈ గ్రంథాలు ప్రచురణ కావడానికి ముందే థామ్స్ 1832లో 'The Original' అనే పత్రికకి సంపాదకత్వాన్ని వహించడం ఒక విశేషం.

1838లో విలియం థామ్స్ Society of Antiquaries (ప్రాచీనాన్వేషకుల సంఘం) కి సభ్యుడిగా ఎన్నుకోబడ్డాడు. అదే సంవత్సరం Camiden Society అనబడే మరొక సాహిత్య సంఘానికి కార్యదర్శిగా నియమింపబడ్డాడు. 1838లోనే 'The Book of the Court' అనే మరో గ్రంథాన్ని విలియం ప్రచురించాడు.

1845లో విలియం థామ్స్‌ని House of Lords లో గుమాస్తాగా నియమించడం జరిగింది. ఆ సమయానికే విలియం థామ్స్ గొప్ప ప్రాచీనాన్వేషకుడు, విజ్ఞాని అని పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్నాడు. ఇదంతా ఒక ఎత్తయితే ప్రాచీన మానవుల నడవడికలు, పద్ధతులు, కట్టుబాట్లు, ఆచారాలు మొదలైన వాటి అధ్యయనం ఒక శాస్త్రంగా అభివృద్ధి చెంది, ఆ శాస్త్రానికి ఆంగ్లంలో Folklore అనే పేరును విలియం సృష్టించి శాస్త్రీయ పరమయిన జానపద విజ్ఞానాధ్యయనానికి దోహదం చెయ్యడం మరో ఎత్తు.

1846లో విలియం జాన్ థామ్స్ 'ది అథీనియం' అనే పేరున్న సాహిత్య కళలను గూర్చిన పత్రికకి ఒక ఉత్తరం వ్రాస్తూ, Folklore అనే పదాన్ని అంతకుముందు వాడుకలో ఉన్న Popular Antiquities అనే పదానికి మారుగా ఆంగ్లంలో సూచించాడు. Ambrose Merton అనే కలం పేరుతో థామ్స్ 1846 ఆగస్టు 12న వ్రాసిన ఈ ఉత్తరం అదే నెల 26 వ తేదీ నాటి The Athaenaeum 982వ సంచికలో ప్రచురింపబడింది. ఇలా Folklore అన్నపదం నాటినుంచీ నేటిదాకా అందరి సమ్మతిని పొంది వాడుకలో నిలిచిపోయింది.

1849 లో విలియం జాన్ థామ్స్ 'Notes and Queries' అనే నియతకాలికాన్ని (Periodical) ప్రారంభించి 1872 దాకా దాని సంపాదకుడుగా వ్యవహరించాడు. ఆరేళ్ళ తర్వాత Folklore Society ఏర్పడగా దానికి నిర్దేశకుడయ్యాడు. ఈ సంఘ నియమ నిబంధనలని రూపొందించడంలో విలియం పాత్ర చాలా గొప్పది. ఈ సంఘ ఉద్దేశాలను, కార్యవిధానాలను 1888లో ప్రారంభమైన American Folklore Society అనుసరించడం ఒక విశేషం.

ఇలా విలియం జాన్ థామ్స్ Folklore పద సృష్టికర్తగా పేరు పొందడమేకాక, 1846 నుండి మరో నలభై సంవత్సరాల దాకా యూరోప్, అమెరికా ఖండాల ప్రాచీనాన్వేషకుల్లో ఆసక్తిని పెంపొందించి పంతొమ్మిదవ శతాబ్ది విశ్వ ప్రాచీనాన్వేషకులందరికి Torch bearer గా ప్రసిద్ధి పొందాడు. జానపద విజ్ఞానులకు గురుప్రాయుడుగా స్తుతింపబడుతున్నాడు.

## లెవిస్ట్రాస్ (Levi-Strauss):

క్లాడే గుస్తావే లెవిస్ట్రాస్ ఫ్రాన్స్ దేశపు ప్రసిద్ధ సాంఘిక మానవ శాస్త్రవేత్త (Social Anthropologist). ఈయన సాంఘిక మానవ శాస్త్రాన్ని నిర్మాణాత్మక దృష్టితో పరిశీలించాడు. బెల్జియంలోని బ్రస్సెల్స్ నగరంలో ఒక యూదు కుటుంబంలో 1908 నవంబర్ 28న జన్మించాడు. ఈయన చదువు సంధ్యలన్నీ పారిస్ నగరంలో జరిగాయి. పారిస్‌లోని Sorbonne విశ్వవిద్యాలయంలో వేదాంత శాస్త్రాన్ని అభ్యసించిన లెవిస్ట్రాస్ చాలాకాలం అధ్యాపక వృత్తిని నిర్వహించాడు. మానవ శాస్త్రంలో ఆసక్తిని కనబరచి 1935 లో బ్రెజిల్‌లోని Saupaulo విశ్వవిద్యాలయంలో సామాజికశాస్త్ర ఆచార్యులుగా నియమింపబడ్డారు. అక్కడ ఆయన బ్రెజిల్‌లోని ఇండియా తెగలని గురించి అధ్యయనం చేశాడు.

1939-41 మధ్యకాలంలో జరిగిన ప్రపంచ యుద్ధంలో ఫ్రెంచ్ సైన్యంలో పనిచేశాడు. న్యూయార్క్ నగరంలోని New School for Social Research సంస్థలోను, E'cole Libre des Hautes E'tudes (1942-45) సంస్థలోను సాంఘిక పరిశోధనని గురించి బోధించాడు. ఫ్రెంచి రాయబార కార్యాలయంలో Cultural attache గా 1946-47 ప్రాంతంలో పనిచేశాడు.

ఫ్రాన్స్ దేశానికి తిరిగి వచ్చిన లెవిస్ట్రాస్ Music de l 'Homme కి సహకార దర్శకుడిగాను, E'cole pratique des Hautes Etudes కి దర్శకుడిగాను, Man: Review of French Anthropology' అనే పత్రికకి సంపాదకుడుగాను పనిచేశాడు. 1960 నుండి సాంఘిక మానవశాస్త్రాచార్యుడుగాను, నిరక్షరాస్య ప్రజల మతాల తులనాత్మక పరిశీలనకు ఆచార్యుడుగాను, ఫ్రెంచి కళాశాలలోని సాంఘిక మానవశాస్త్ర ప్రయోగశాలకు దర్శకుడుగాను పనిచేశాడు.

'లెవిస్ట్రాస్' రచించిన 'Tristes Tropiques ( A world on the Wane, 1961) అనే గ్రంథంలో నాలుగు ప్రాచీన దక్షిణ అమెరికా తెగలను గూర్చిన చక్కని వివరణ ఉంది. ఈయన రచించిన మరో అత్యుత్తమ గ్రంథం The Savage Mind (1966). పై రెండు గ్రంథాల్లో ఆయన అభిప్రాయం ఇలా వుంది. 'మనుషులంతా పుట్టుకతోనే మేథాశక్తిలో సరిసమానులు. ఆదిమ వాసుల్ని ఈయన వెనుకబడ్డ వాళ్ళుగా అంగీకరించాడు. నాగరిక ప్రజల మేథాశక్తికి ఆదిమవాసుల జ్ఞానసంపద దోహదం చేసినట్టుగా భావిస్తాడు.

లెవిస్ట్రాస్ ప్రాచీన మానవుల మేథా నిర్మాణాన్ని గూర్చి బాగా పరిశోధించాడు. నాగరిక మానవుని మేథ కంటే ఇది కొంచెం భిన్నమైనా, తక్కిన అన్ని విషయాల్లో దానితో సమానమే. 'ప్రాచీన మేథ - ఆధునిక మేథ' అనే భేదాలు లేవు. ఉన్న మెదడు ఒక్కటే. అంధకారం నుంచి బయపడి మానవుడు తన సాంఘికావసరాలను నెరవేర్చుకోవడం కోసం ఇది ఉపయోగపడుతుంది.

లెవిస్ట్రాస్ పరిశోధన ప్రపంచంలో ప్రసిద్ధి చెందింది. ఆయన సిద్ధాంతాన్ని సామాజిక శాస్త్రవేత్తలు అర్థం చేసుకుంటే మానవ మేథా నిర్మాణాన్ని గురించి బాగా అధ్యయనం చెయ్యగలరు. 'His popularity rests on his belief that there are no superior cultures, man acts according to a logical structures in his brain, and that once the code of this logical strctures can be discovered the human science can be as scientific as the natural sciences'

లెవిస్ట్రాస్‌కి 1966లో Wenner gren foundations వారి viking fund మెడల్ మరియు అవార్డు లభించాయి.

## విలియమ్ ఆర్. బాస్కమ్:

ప్రొఫెసర్ విలియమ్ ఆర్. బాస్కమ్ అంతర్జాతీయ ప్రసిద్ధి చెందిన మానవ శాస్త్రజ్ఞుడు, జానపద విజ్ఞాని. జననం 1912. ఈయన Decoratre art విభాగంలోను, బర్కిలీలోని కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలోని Lowie Museum కు నిర్దేశకుడు గాను, North Western University లో మానవ శాస్త్రజ్ఞుడుగాను పనిచేశారు.

బాస్కమ్ అనేక గ్రంథాలను రచించాడు. వీరి If a divination (Indian University Press, 1969) గ్రంథానికి పిట్రె అంతర్జాతీయ జానపద విజ్ఞాన బహుమతి లభించింది. ఇది జానపద విజ్ఞాన క్షేత్రంలో ఉన్నతగౌరవం. అమెరికా జానపద విజ్ఞాన సంస్థ అధ్యక్షులుగా రెండేళ్ళు పనచేశారు.

దాదాపు 50 సంవత్సరాలుగా అమెరికా జానపద విజ్ఞానక్షేత్రంలో ప్రసిద్ధి చెందిన బాస్కమ్ జానపద విజ్ఞానానికి సంబంధించి అనేక ఉత్తమ వ్యాసాలను వ్రాశారు. కొన్ని వ్యాసాల సంకలనాన్ని డా॥ వేదప్రకాశ్ వాటుక్ గారు Founders of Folklore Series-1 పేర్తో, Folklore Institute తరఫున 1981లో ప్రచురించారు. ఇందులో వివిధ విషయాలకు చెందిన పది వ్యాసాలు ఉన్నాయి. ఈ వ్యాసాలన్నీ Journal of Royal Anthropological Institute (London), Journal of American Folklore, Journal of folklore Research Institute as African Literature మొదలైన అనేక ప్రముఖ ప్రతికల్లో ప్రచురింపబడ్డాయి.

వీరి మరో గ్రంథం The Sociological Role of the Youruba Culf group. దీన్ని American Anthropological Association వారు ప్రచురించారు.

Maria Leach సంపాదకత్వం వహించిన Funk & Wagnaulls standard Dictionary of folklore, Legend and Mythology గ్రంథంలో విద్వాంసులు జానపద విజ్ఞానాన్ని నిర్వచించారు. అందులో 21 నిర్వచనాలున్నాయి. బాస్కమ్ కూడ జానపద విజ్ఞానాన్ని నిర్వచించారు. ఆయన జానపద విజ్ఞానాన్ని శాబ్దిక కళ లేదా వాగ్రూపకళ (Verbal Art) అని పేర్కొని 'మానవశాస్త్ర పరిభాషలో జానపద విజ్ఞానం అంటే మౌఖిక ప్రచారంలో ఉన్న పుక్కిటి పురాణాలు, ఐతిహ్యాలు, జానపద కథలు, సామెతలు, పొడుపు కథలు, కవిత్వం, కళాత్మక వ్యక్తీకరణాలు ఉన్న 'అనేక ఇతర ప్రక్రియలు' అని నిర్వచించాడు.

## ఆంటి ఆర్నె (1867-1925):

ఫిన్‌లండు దేశపు ప్రసిద్ధ జానపద విజ్ఞానవేత్తలతో ఆంటి ఆర్నె అగ్రగణ్యుడు. చారిత్రక భౌగోళిక పద్ధతిని సమర్థించి దాన్ని ప్రచారంలోకి తెచ్చిన వాళ్ళలో ఆంటి ఆర్నె ఒకడు. ఒక్కొక్క కథకు సంబంధించిన వివరాలను

సమగ్రంగా అధ్యయనం చేసిన ఖ్యాతి ఈయనకు దక్కుతుంది. ప్రపంచ పర్యటన చేసి అనేక గ్రంథాలయాలను దర్శించడమే కాకుండా జానపద కథల సంగ్రహణ కార్యాన్ని చేపట్టాడు ఆర్నె.

ఆర్నె జానపద కథల్ని అధ్యయనం చేస్తున్న సమయంలోనే కథలలోని అనేక మాదిరులను (Types) గుర్తించడం మొదలుపెట్టాడు. ఐరోపా దేశపు ప్రముఖ జానపద కథలను ప్రత్యేక మాదిరులుగా వింగడించి ఒక్కొక్కదానికీ ఒక్కొక్క క్రమసంఖ్యని సూచించారు.

1925లో ఆంటి ఆర్నె కాలధర్మం చెందిన తర్వాత స్టిత్ థాంసన్, ఆంటి ఆర్నె తయారుచేసిన మాదిరుల సూచిని పరిష్కరించి, విస్తరించి ఆంగ్లమునకు తర్జుమా చేసి ప్రచురించారు.

ఆంటి ఆర్నె జీవితంలో ఎన్నో కష్టనష్టాలకు తట్టుకొన్నా చివరికి జానపద విజ్ఞాన ఆచార్య పదవిని అధిష్టించాడు.

## అలెగ్జాండర్ హేగ్గర్టి క్రాపె (1894-1947):

Alexander Haggerty Krappe అంతర్జాతీయ విద్వాంసుడు, ప్రసిద్ధ జానపద విజ్ఞాని, భాషా శాస్త్రజ్ఞుడు, కొలంబియా విశ్వవిద్యాలయంలో పనిచేశారు.

1922లో British Folklore Society కి, 1942లో American Folklore Society కి సభ్యులుగా వున్నారు. అనేక జానపదగోష్ఠుల్లో పాల్గొన్నారు. 1930లో ప్రచురింపబడ్డ The Science of Folklore వీరి ఉత్తమ గ్రంథాల్లో ఒకటి.

క్రాపె తన గ్రంథంలో జానపద విజ్ఞానానికి సంబంధించి కొన్ని ప్రముఖ విభాగాలను సూచించాడు. అందులోని వివిధ అధ్యాయాలను ఒక్కొక్క జానపద విజ్ఞాన ప్రక్రియగా మనం స్వీకరించవచ్చు. అవి 1. The Fariy Tale (అద్భుత కథ), 2.The Merry Tale (వినోద కథ), 3. The animal tale (ప్రాణి కథ), 4. The Local Legend (స్థానిక ఐతిహ్యం), 5. The Migratory Legend (సంచారి ఐతిహ్యం), 6. The prose saga (వీరగాథ), 7. The proverb (సామెత), 8. The folklsong (జానపదగేయం), 9. The popular Ballad

(జనప్రియ వీరగాథ), 10. Charms (సూత్రబద్ధ వాక్యాలు), 11. Rhymes (ప్రాసలు), Riddles (పొడుపుకథలు) Superstition (మూఢ విశ్వాసం), 12. Plantlore (సస్యజానపదం), 13. Animal Lore (ప్రాణి జానపదం), 14. Mineral lore (ఖనిజ జానపదం), Star lore (నక్షత్ర జానపదం) Cosmogenic Legends (విశ్వసృష్టి ఐతిహ్యాలు), 15. Customs and Rituals (సంప్రదాయాలు మరియు ఆచరణలు), 16. Magic (మంత్రవిద్య), 17. Folk Dance and Folk Drama (జానపద నృత్యం మరియు జానపద నాటకం).

1930 ప్రాంతానికి ప్రకటమైన ఈ గ్రంథంలో క్రాపె జానపద విజ్ఞానానికి సంబంధించిన అన్ని ప్రక్రియల్ని ప్రస్తావించకపోయినా, ముఖ్యమైన ప్రక్రియల్ని వివరంగా చర్చింపగలిగాడు. ఈ ప్రక్రియల్లో ఏదేని క్రమాన్ని అనుసరించడం జరగకపోయినా జానపద విజ్ఞానంలోని ప్రముఖ ప్రక్రియల్ని పేర్కొని ఒక సమగ్ర ప్రక్రియా స్వరూపాన్ని సూచించగలిగాడు.

క్రాపె అనేక జానపద విజ్ఞాన పత్రికలలో వ్యాసాలు ప్రచురించారు.

## స్టిత్ థాంసన్ (1885-1976):

అమెరికాలోని ఇండియానా విశ్వవిద్యాలయంలో జానపద విజ్ఞానాధ్యక్షులుగా పనిచేసి నివృత్తులయిన స్టిత్‌థాంసన్ జానపద కళాక్షేత్రంలో, ముఖ్యంగా కథల వర్గీకరణ విషయంలో విశేషంగా శ్రమించారు.

ప్రపంచంలోని జానపద కథల అధ్యయన చరిత్రలో విశిష్టస్థానాన్ని ఆక్రమించిన స్టిత్ థాంసన్‌ని అమెరికాలో 'Mr. Folklore' అని పిలిచేవాళ్ళట. ఈయన రచించిన The Folktale గ్రంథం (1946) జానపద కథల అధ్యయన క్షేత్రానికొక అపూర్వ కానుక. ఈ గ్రంథంలో థాంసన్ జానపద కథ, దాని స్వరూపం, వర్గీకరణ, జానపద కథల విషయంగా పుట్టిన సిద్ధాంతాల సాధక బాధకాలు, ప్రపంచంలోని జానపద కథల వైవిధ్యం మొదలైన వాటిని సవివరంగా చర్చించడం జరిగింది. ప్రపంచంలోని జానపద కథల అధ్యయనానికి కొత్తరూపాలను కల్పించి జానపద విజ్ఞానులకి మార్గదర్శకమైంది.

స్టిత్ థాంసన్ జానపద కథల్ని శాస్త్రీయంగా వర్గీకరించారు. వీటిని సంకీర్ణ కథలు (Complex Tales), వాస్తవిక కథలు (Realistic Tales), సరళ కథలు (Simple Tales) అని ఆయన వర్గీకరించారు.

థాంసన్ Tales of the North American Indians అనే కథల సంకలనాన్ని 1919లో ప్రచురించారు. జానపద కథల శాస్త్రీయాధ్యయనానికి పునాది వేసిన థాంసన్ ప్రసిద్ధ గ్రంథాల్లో The Types of the Folk tales (1929), ఆరు సంపుటల్లో వెలువడ్డ Motif Index of Folk Literature ప్రధానమైనవి. Motif Index of Folk Literature సహాయంతో ప్రపంచంలోని మారుమూల ప్రాంతాల లోని కథన ఘటకాలను కూడ తెలుసుకోవడానికి వీలవుతుంది. కథ ఏ ప్రాంతానికి చెందిందన్న విషయం కూడ ఈ కథన ఘటక సూచికల సాయంతో వీలవుతుంది. అలాగే జానపద కథల వర్గీకరణానికి, కథా నిర్మాణ పద్ధతిని తెలుసుకోవడానికి 'The Types of the Folktale' అన్న గ్రంథం అత్యంత ఉపయుక్తమైంది.

Funk & Wagnaulls Standard Dictionary of Folklore గ్రంథంలో థాంసన్ Fairy tale, Folktale, Finnish folklore, Type మొదలైన అంశాలను, వివరించారు.

Stith Thompson American Folklore Society కి 1937-40 ప్రాంతాల్లో అధ్యక్షులుగాను, పెక్కు జానపద విజ్ఞాన సంస్థలకు సభ్యులుగాను పనిచేశారు.

జార్జిలైమన్ కిట్రెడ్జ్‌గారి మార్గదర్శకత్వంలో Borrowings and parallels in North American Indian Tales అన్న విషయం మీద థామ్సన్ పిహెచ్.డి. చేశారు.

## ఆర్.ఎస్. బాగ్స్:

రాల్ఫ్ స్టీల్ బాగ్స్ జననం 1901.

జానపద విజ్ఞాన వర్గీకరణ క్షేత్రంలో 1937 నుంచి వినవస్తున్న పేరు బాగ్స్. ఈయన Pan American మరియు స్పానీషు జానపద విజ్ఞాని. North Carolina

విశ్వవిద్యాలయంలో స్పానీషు మరియు జానపదవిజ్ఞానం ఆచార్యులుగా పనిచేశారు. సాంటోడమింగో విశ్వవిద్యాలయంలోనూ, మెక్సికో విశ్వవిద్యాలయంలోనూ పనిచేశారు.

అమెరికాలో జానపద విజ్ఞానాధ్యయనాన్ని కళాశాల, విశ్వవిద్యాలయ స్థాయికి తీసుకువెళ్ళిన ఖ్యాతి ఆర్.ఎస్. బాగ్స్‌కీ, రిచర్డ్ ఎమ్. డార్సన్‌కీ చెందుతుంది వీళ్ళ ప్రయత్నం ఫలితంగా ఇండియానా, కాలిఫోర్నియా విశ్వవిద్యాలయాలు ఈనాడు ప్రత్యేకంగా జానపద విజ్ఞాన భాగాలని ఏర్పాటుచేసి ఎం.ఏ. తరగతుల్నీ, పరిశోధనలనీ, గ్రంథ ప్రచురణ కార్యాల్నీ జరుపుతూ ఉండడం కొనియాడ దగ్గది.

బాగ్స్ జానపద విజ్ఞానానికి సంబంధించి అనేక ఉత్తమ వ్యాసాలను ప్రచురించారు. బాగ్స్ వర్గీకరణ అంతర్జాతీయ ఖ్యాతిని పొందింది. ఆయన Standard Dictionary of Folklore లో జానపద విజ్ఞానాన్ని నాలుగు ప్రముఖ విభాగాలుగా విభజించాడు. అవి 1. Literany Type (సాహిత్య సంబంధి), 2. Linguistic Type (భాషా సంబంధి), 3. Scientific Type (వైజ్ఞానిక సంబంధి), 4. Action Type (క్రియా సంబంధి). కొంతకాలం తర్వాత ఆయనే ఇదే గ్రంథంలోనే సమగ్రమైన జానపద విజ్ఞాన వర్గీకరణని వివరంగా ప్రకటించారు.

బాగ్స్ రూపొందించిన ఈ జానపద విజ్ఞాన వర్గీకరణలో ఆరు దశలు కన్పిస్తాయి. అవి 1. Group (గుంపు), 2. Category (వర్గం), 3. Type (నమూన), 4. Form (ప్రక్రియ), 5. Division (విభాగం), 6. Sub-Division (ఉపవిభాగం).

బాగ్స్ గుంపుల్ని A నుండి Z దాకా సూచించినా, అందులో క్రమపద్ధతి పాటించబడలేదు. బాగ్స్ సూచించిన

ఎ. సామన్య జానపద విజ్ఞానం (General Folklore)

బి. గద్య కథనం (Prose Narrative)

సి. కథాగేయం (Ballad), గేయం (Song), నృత్యం (Dance), క్రీడ (Game), సంగీతం (Music), వచనం (Verse).

డి. నాటకం (Drama)

ఎఫ్. ఆచారం (Custom), పండుగ (Festival)

జి. భూగోళం (Geography)

ఎల్. భాష (Language)

ఎమ్. కళ (Art), చేతిపనులు (Crafts), వాస్తు (Architecture).

ఎన్. ఆహారం (Food), పానీయం (Drink)

పి. నమ్మకం (Belief)

ఎస్. వాక్కు (Speech)

వి. సామెత (Proverb)

డబ్ల్యూ. పొడుపు కథ (Riddle)

ఇది వర్గీకరణలో మొదటి దశ. ఈ గుంపులు మళ్ళీ వర్గాలు (Categories)గా వర్గీకరింపబడతాయి. ఇవి 000-900 సంఖ్యలో సూచింపబడతాయి. వర్గాలు మళ్ళీ నమూనా (Types)లుగా విభజింపబడతాయి. ఇవి 00-90 సంఖ్యలో సూచింపబడతాయి. నమూనాలు మళ్ళీ ప్రక్రియలు (Forms) గా విభజింపబడతాయి. ఇవి 0-9 సంఖ్యలో సూచింపబడతాయి. ఆ తర్వత ప్రక్రియలు విభాగాలు (Divisions) గా విభజింపబడతాయి. అది 0.9 సంఖ్యగా సూచింపబడుతుంది. ఈ విభాగాలు మళ్ళీ ఉప విభాగాలు (Sub-divisions) గా విభజింపబడతాయి.

## రిచర్డ్ ఎమ్. డార్సన్:

ప్రసిద్ధ అమెరికా జానపద విజ్ఞానవేత్త. చరిత్ర మరియు జానపద విజ్ఞానాల ఆచార్యులు. ప్రస్తుతం American Folklore Society అధ్యక్షులు.

రిచర్డ్ ఎం. డార్సన్ సంపాదకత్వంలో వెలువడ్డ Folklore and Folklife అన్న గ్రంథం జానపద విజ్ఞానం, జానపద జీవనానికి సంబంధించి తలఎత్తిన అనేక సందేహాలకు, సమస్యలకు సమాధానాన్నిస్తుంది. ఈ గ్రంథం 1972లో ప్రచురించబడింది.

డార్సన్‌గారి గ్రంథం ప్రప్రథమంగా జానపద విజ్ఞానానికి సంబంధించిన అనేక విషయాలను వివరణ పూర్వకంగా అందిస్తుంది. 'జానపద విజ్ఞానం' అన్న

పదం 'జానపద జీవనం' అన్న పదంతో ఏ విధంగా వ్యత్యాసాన్ని కలిగి ఉందో ఈ గ్రంథం స్పష్టం చేస్తుంది. జానపద విజ్ఞానాన్ని 'జానపద జీవనం' అని అనడం ఎక్కువ అర్థవంతంగా ఉంటుందని సూచిస్తూ జానపద జీవనాన్ని 4 వర్గాలుగా పరిశీలించవచ్చునని డార్సన్ సూచించారు.

విద్యార్థులకి, జానపద విజ్ఞానం మీద ఆసక్తి ఉన్నవాళ్ళకీ, ఈ సంపుటంలోని ప్రఖ్యాత జానపద విజ్ఞానవేత్తల అమూల్యమైన వ్యాసాలు ఉపాధేయంగా ఉన్నాయి. డార్సన్‌గారి ఈ గ్రంథంలోని మొదటి భాగంలో మౌఖిక జానపద విజ్ఞానం, సాంఘిక జానపద ఆచారం, వస్తు సంస్కృతి, జానపద కళలకు సంబంధించి జానపద జీవనంలోని నాలుగు ప్రధాన విభాగాలుగా చర్చించబడ్డాయి. రెండో భాగంలో క్షేత్రకార్యం, అవలంబించాల్సిన పద్ధతులు మొదలైన విషయాలు వివరింపబడ్డాయి. ఆయా వ్యాస రచయితలు వ్యాసాంతాలలో ఆధార గ్రంధాలను, పరిశీలించదగ్గ గ్రంథాలను పేర్కొనడం వల్ల పాఠకులు ఆ సంబంధమైన విషయాలను మరికొంత క్షుణ్ణంగా పరిశీలించడానికి వీలు కల్పించారు.

జానపద విజ్ఞానవేత్తల గురి, సాధన, జానపద విజ్ఞానాధ్యయన అవశ్యకత మొదలైన అంశాలు కూలంకషంగా చర్చించబడ్డాయి. ఈ గ్రంథానికి డార్సన్ వ్రాసిన ఉపోద్ఘాతం అమూల్యమైనది. ఇందులో జానపద విజ్ఞానులు ప్రతిపాదించిన వివిధ సిద్ధాంతాలను డార్సన్ పరిశీలించడం జరిగింది.

అమెరికా జానపద విజ్ఞానం, చరిత్రల గురించీ జపాన్ దేశపు ఐతిహ్యాల గురించి పరిశోధన గావిస్తున్న డార్సన్ జానపద విజ్ఞాన అధ్యయన రంగంలో విశేష కృషి చేస్తున్న ప్రఖ్యాత జానపద విజ్ఞాని.

## వి.జె. ప్రాప్ (ప్రసిద్ధ రష్యన్ విజ్ఞాన శాస్త్రవేత్త):

వి.జె. ప్రాప్ 1928లో Morphology of Folktale అన్న గ్రంథాన్ని ప్రచురించాడు. ఇందులో రష్యాదేశంలో ఉన్న వంద కథల్ని విశ్లేషించడం జరిగింది. రష్యన్ భాషలో ఉన్న ఈ గ్రంథం 1958లో ఆంగ్లంలోకి అనువదించబడింది. ఆ తర్జుమా తర్వాతే జానపద కథల అధ్యయనంలో ఒక కొత్త మలుపు తిరిగినట్టు చెప్పవచ్చు.

Morphology అనే పదం వృక్షశాస్త్రానికి సంబంధించింది. దీన్ని ఆధారంగా చేసుకొని అన్వయిస్తూ ప్రాప్ జానపద కథల్ని విశ్లేషించారు. ప్రాప్ సిద్ధాంతం కథా స్వరూప పరిశీలనకు ఉపకరించేది. జానపద కథల్లో ఒక్కొక్క సందర్భంగా (ఒకే శీర్షిక క్రింద) నిర్మితాలైన కథా ప్రవృత్తులు ఒకే విధంగా ఉంటాయి. అంటే కథలోని పాత్రలు మారినా ప్రవృత్తుల్లో వ్యత్యాసం ఉండదు; కథా నిర్మాణంలో సామ్యం కన్పిస్తుంది.

ఆర్నె - థాంసన్‌లు తయారు చేసిన కథా వర్గీకరణ విధానంలో లోపాలున్నాయని గ్రహించిన ప్రాప్, అన్ని జానపద కథలకు అన్వయించే వర్గీకరణ విధానాన్ని కనిపెట్టడం కోసమే కథల్ని అధ్యయనం చేశారు. ప్రాప్ దృష్టిలో జానపద కథలకు ఒక నిర్దిష్టమైన నిర్మాణం ఉంది. ఈ నిర్మాణం ఆయా కథల మాదిరులని సూచిస్తుంది. కథల్లో స్థిరంగా ఉండే అంశం క్రియ (Function). అయితే పాత్రలు, వస్తు వివరాలు మారుతూ ఉంటాయి. ఒక క్రియ మరొక క్రియని నిర్దిష్ట విధానంలో వెంబడిస్తుంది. కథాగతిలో ఆ క్రియల్ని వాటి స్థానం, విశిష్టతలకి అనుగుణంగా వింగడించిన ప్రాప్, వీటి నిర్దిష్ట విధానమే ఆయా కథల రచనాత్మక రూపం అని స్పష్టం చేశాడు.

ప్రాప్ తన అధ్యయనంలో కథను గురించిన ఎలాంటి తాత్విక నిర్ణయాన్ని మనకు అందించడు. కథ ఎందుకు పుట్టిందన్న విషయాన్ని గురించి ఆలోచించడు. ఆయనది వస్తునిష్ఠ దృష్టి. అయినప్పటికి సార్వత్రికంగా అన్వయమయ్యే సూత్రాలను రూపించి వర్గీకరణ కార్యం మరింత నిర్దిష్టమయ్యేట్టు చేసిన ఖ్యాతి ప్రాప్‌కు చెందుతుంది. (కన్నడ జానపద కథెగళు, పుట 73., డా. కె. ఆర్. సంధ్యారెడ్డి).

## అలన్ డండేస్:

ప్రసిద్ధ అమెరికా జానపద విజ్ఞానవేత్త. కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలో మానవ శాస్త్రం, జానపద విజ్ఞానాల ఆచార్యులు.

అలన్ డండేస్ 1956లో 'The Study of folklore' అన్న గ్రంథాన్ని, 1975లో 'Analytic Essays in folklore' అన్న గ్రంథాన్ని, 'Urban folklore from the paper-work empire' అన్న గ్రంథాన్ని, 1983లో 'Cindrella - A case Book' అన్న గ్రంథాన్ని ప్రచురించారు.

డండెస్ సాంస్కృతిక మానవ శాస్త్రానికీ, జానపద విజ్ఞాన శాస్త్రానికీ ఉన్న సంబంధాన్ని తమ 'The Study of folklore' అన్న గ్రంథంలో నిరూపించారు. ఆయన ఈ గ్రంథంలో జానపదులంటే ఎవ్వరో ఇలా వివరిస్తారు. ''ఏదైనా ఒక్క విషయంలో భావసామ్యం ఉన్న జనుల సమాహారం జానపదులు. వాళ్ళు ఒకే భాషకు చెందినవాళ్ళు కావచ్చు, ఒకే ప్రదేశంలో నివసిస్తున్న వాళ్ళు కావచ్చు లేదా ఒక జాతికి, మతానికి, వృత్తికి సంబంధించిన వాళ్ళు కావచ్చు.' 'ఫోక్' అనిపించుకోవాలంటే కనీసం ఇద్దరైనా వుండాలి. అయితే ఒక ప్రత్యేకమైన, సాధారణమైన, సామూహికమైన గుర్తింపు పొందే లక్షణాన్ని వాళ్ళు కలిగి ఉండాలి. ఇదే 'జానపదత్వం' అవుతుంది. ఈ లక్షణాలున్న పట్టణవాసులు కూడా జానపదులే అవుతారు. జానపద విజ్ఞానం నగరాల్లో కూడా నిత్యమూ సృష్టింపబడుతుందనీ, వికాసాన్ని పొందే ఒక విజ్ఞాన శాస్త్రమనీ, పలు దృష్టాంతాల మూలంగా వివరించారు.

## థియోడర్ బెన్ఫె (1809-1881):

జానపద విజ్ఞానంలోని అనేకాంశాలను (ముఖ్యంగా గద్యకథనాలు, జానపద కథలు), వాటి పుట్టుకలని తెలుసుకోడానికి ప్రముఖ జానపద విజ్ఞానవేత్తలు ప్రతిపాదించిన కొన్ని సిద్ధాంతాలను పరిశీలించాల్సి ఉంటుంది. వాటిలో థియోడర్ బెన్ఫె (1809-1881) ప్రతిపాదించిన వలస సిద్ధాంతం (Migrational Theory of Myth) ప్రధానమైంది. బెన్ఫె జర్మను దేశస్థుడు. ప్రముఖ సంస్కృత పండితుడు, భాషా విజ్ఞాని. తులనాత్మక జానపద విజ్ఞానాధ్యయనం చేసినవాడు.

పందొమ్మిదో శతాబ్దం మధ్య భాగంలో ఐరోపా ఖండంలో మ్యాక్స్ ముల్లర్ ప్రతిపాదించిన పురాణ మూలసిద్ధాంతం (Mythologic Theory) ప్రచురంగా ఉన్న కాలంలో, మ్యాక్స్‌ముల్లర్ సిద్ధాంతం చేత ప్రభావితుడైన బెన్ఫె ఆదానవాదం (Theory of Borrowing) అనే కొత్త సిద్ధాంతాన్ని లేవదీశాడు. 1838లో ఎల్.డి. చాంప్స్ ఐరోపా దేశపు జానపద కథల మూలాన్ని భారతదేశంలో చూడొచ్చని ఊహించాడు. ఈ ఊహని ఆధారం తీసుకొని బెన్ఫె ఈ సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. ఈయన 1858లో భారతదేశపు పంచతంత్ర కథల్ని జర్మను భాషలోనికి అనువదించాడు. పంచతంత్రానికి విపులంగా (ఆరువందల పుటలు) పీఠిక వ్రాస్తూ గ్రీసు దేశం నుంచి వచ్చిన ప్రాణి కథల్ని వదలిపెడితే, తక్కిన అన్ని

కట్టుకథలకీ భారతదేశమే పుట్టినిల్లని (Indian origin Theory) వాదించాడు. మ్యాక్స్‌ముల్లర్ ఆయన అనుయాయులు నమ్మిన genetic relationship తో పాటు సాంస్కృతిక చారిత్రక సంబంధాల లేదా ఆదానాలని (Borrowing) బెన్ఫె పరిశీలించాడు. ఈ ఆదానాల కారణం ''వలస'' విధానమన్నాడు. అందువల్లనే ఈయన సిద్ధాంతానికి వలస సిద్ధాంతం (Migrational Theory) అనే పేరు వచ్చింది. బెన్ఫె సంస్కృత కథలకీ, ఐరోపాదేశ కథలకీ సామ్యాలని చూపించి, ఈ కథలన్నీ భారతదేశంలోని హిందూ, బౌద్ధ సాహిత్యాల నుంచి వచ్చాయన్నాడు. ఇవన్నీ భారతదేశం నుంచి ఇతర దేశాలకి వలస పోయాయన్నాడు.

బెన్ఫె అధ్యయనం ప్రకారం చాలావరకు ప్రాణి కథలన్నీ పాశ్చాత్య దేశాల్లోనే పుట్టాయి. భారతదేశం కూడ ఇలాంటి కథల్ని గ్రీకువాసుల ఈసపు కథల నుంచి తెచ్చుకుంది. అయితే భారతదేశానికి ఈసపు కథలు రావడానికి ముందే అలాంటి కథన పద్ధతి భారతదేశంలో కూడ ఉండి ఉంటుంది. ఎంచేతనంటే ఈసపు కథలకీ, భారతదేశపు ప్రాణికథలకీ కొన్ని వ్యత్యాసాలున్నాయి. అక్కడి ప్రాణి కథలు జంతు స్వభావంచేత వర్తిస్తే, భారతదేశంలో అవి జంతువుల ముఖం కప్పుకున్న మనుష్యులే అయివున్నాయి. అంతేకాకుండా ఇవి నీతిని బోధించేవిగాను, ఆత్మ అనేది జన్మ జన్మల సంబంధాన్ని కలిగి ఉంటుందన్న నమ్మకాన్ని ఆధారం చేసుకున్నాయి. అందువల్ల ఇవి ఈసపు కథలకంటె భిన్నం అని బెన్ఫె అభిప్రాయ పడ్డాడు. (ది ఫోక్ టేల్, స్టిథ్ థాంప్సన్, పుట 376) కట్టుకథలకి భారతదేశమే మూలమని అంటూ, పాశ్చాత్యులనుంచి స్వీకరించిన ప్రాణికథలకి బదులుగా ఈ కట్టుకథల్ని భారతదేశం వారికిచ్చిందని అభిప్రాయపడి భారతదేశ కథల వ్యాప్తి మూడు దశల్లో/ మార్గాల్లో జరిగిందని పేర్కొన్నారు బెన్ఫె. అవి

1. పదోశతాబ్దానికి ముందు కథలు అల్ప ప్రమాణంలో, వాక్సంప్రదాయంలో వ్యాపారులు, తదితరుల సంపర్కంవల్ల ప్రయాణం చేశాయి.

2. పదోశతాబ్దం తర్వాత భారతదేశానికి ఇస్లాం దేశస్థుల సంపర్కం అధికం అయింది. భారతీయ కథా సంకలనాలు పర్షియన్, అరబిక్ భాషలకి తర్జుమా అయ్యాయి. మహమ్మదీయులున్న ఆసియా, ఆఫ్రికా, యూరోపు దేశాలకన్నిటికీ ఇవి వ్యాపించాయి. ఈ ప్రజలతోపాటున్న క్రైస్తవుల సంపర్కం వల్ల పాశ్చాత్య క్రైస్తు దేశాలకి కూడ ఇవి వ్యాపించాయి.

3. బౌద్ధమత ప్రచారకులు, వాళ్ళ అనుయాయులు చైనా, టిబెట్టు దేశాలగుండా వెళ్ళేటప్పుడు తమ మతప్రచారంతో పాటు జానపద కథల్ని కూడా వెదజల్లారు. టిబెట్టు నుంచి మంగోలియా దేశానికి ఈ కథలు ప్రవేశించి అనేక మార్పులతో ఆ భాషలలో చేరాయి. మంగోలుల ప్రాబల్యం యూరోపులో అధికంగా ఉండడంవల్ల భారతదేశ కథలు అక్కడకూడ చేరాయి. ఇలా ఒక ప్రక్క మహమ్మదీయులు, మరో ప్రక్క బౌద్ధులు కథల్ని ప్రపంచం నలుమూలలా ప్రసారం చేశారని బెన్ఫె అభిప్రాయ పడ్డాడు.

బెన్ఫె ప్రతిపాదించిన సిద్ధాంతంలో కొన్ని న్యూనతలు ఉండడం వల్ల అభిప్రాయ భేదాలు ఏర్పడ్డాయి. బెన్ఫెకి కూడ కథల విషయంలో సరియైన పరిజ్ఞానం లేదు. ఆయన కాలంలో కథల ప్రక్రియా విషయంలో సరియైన నిర్దేశం లేదు. పైగా కథల సంగ్రహణం కూడ అంతగా జరగలేదు. ఇందువల్ల బెన్ఫెకి యూరోపు వాక్సంప్రదాయ పరిచయం అంతగా జరగలేదు. ఆయన తన సిద్ధాంతాన్ని పంచతంత్రంలాంటి లిఖిత, శిష్టకథన గ్రంథం ఆధారంగా ప్రతిపాదించాడు. పంచతంత్రం కథల వస్తువు జానపద విజ్ఞాన సంబంధమే అయినా, దాన్ని నిర్వహించిన రీతి మాత్రం శిష్ట సంప్రదాయానికి చెందింది. ఇది వాక్సంప్రదాయపు జానపద కథల ప్రసరణం కంటె భిన్నమైంది. పంచతంత్ర కథలు కేవలం ఆరో, ఏడో ఉన్నాయి. అయితే యూరోపు మూలకథలు వేలకొద్దీ ఉన్నట్టు గమనించవచ్చు. పంచతంత్రంలోని ఈ కొన్ని కథలు కూడ యూరోపు భూమిమీద దృఢంగా వేర్లుపూనలేదు. ('కన్నడ జానపద కథెగళు' గ్రంథం నుంచి పునరుద్ధరింప బడింది. The Study of Folklore) అందువల్ల భారతదేశమే కథల పుట్టుకకి మూలమనే వాదాన్ని ఇది నిరాకరిస్తోంది. అయినా బెన్ఫె మార్గదర్శకత్వంలో చాలా మంది కథల్ని తులనాత్మకంగా అధ్యయనం చేశారు. దీనివల్ల సమాన కథల్ని అనేకంగా ఒకచోట చేర్చడం జరిగింది. భారతదేశపు సాహిత్యక కథన గ్రంథాలు నిశ్శంసయంగా పాశ్చాత్య జానపద కథలమీద ప్రభావం చూపించాయి. కొన్నయినా కథల సామ్యానికి ఆదానమే కారణం అనడాన్ని ఎవ్వరూ నిరాకరించలేరు. అంతవరకు బెన్ఫెగారి ఈ ఆదానవాదం (Theory of Borrowing) గట్టిగా నిలుస్తుంది. (ది పోక్ టేల్, పుట 379)

బెన్ఫె అభిప్రాయపడినట్టుగా భారతదేశమే అన్ని కథలకీ పుట్టినిల్లని నేడు విద్వాంసులు అంగీకరించక పోయినా, కథల పుట్టుకకి కారణమైన అనేక దేశాల్లో

భారతదేశం కూడా ముఖ్యమైందని అంగీకరించారు. (ఫోక్‌టేల్, పుట 379). బెన్ఫె భారతదేశ కథలు యూరోపు దేశాలకి వలసపోయిన చారిత్రక, భౌగోళిక మార్గాలను అన్వేషించడానికి ప్రయత్నించాడు. ఈ వాదం ఒక విధంగా స్కాండినేవియా పండితులని ముఖ్యంగా ఫిన్‌ల్యాండ్ పండితుల్ని ప్రభావితం చేసింది. వీళ్ళు ఈ కథల పుట్టుక, చరిత్ర, ఆ కథలు ప్రయాణం చేసిన మార్గాల (భౌగోళికంగా) అన్వేషణకి కృషి చేశారు. వీళ్ళు ముఖ్యంగా ఫిన్‌ల్యాండు దేశపు జాతీయ ఇతిహాసమైన 'కలేవాల' మీద తమ దృష్టిని ప్రసరింప చేశారు. ఆ కథా మూలాన్ని, అది ప్రయాణం చేసి ఫిన్‌ల్యాండు చేరిన మార్గాలను అన్వేషించారు. అందువల్లనే 'ఈ వాదాన్ని చారిత్రక - భౌగోళిక సిద్ధాంతం అనీ, ఫిన్‌ల్యాండ్ దేశంలో ఈ పద్ధతి ఉపయోగించడం వల్ల దీన్ని ''ఫిన్నిష్ మెథడ్'' అనీ అంటారు. ఇంతకీ మనం గమనించాల్సిన విషయం ఏమిటంటే బెన్ఫెగారి Theory of Borrowing/ Migrational Theory/Indic Origin Theory అనేవి Historical Geopgraphical Method అనే మరో నూతన సిద్ధాంతానికి దారితీశాయనడం.

## సి.పి. బ్రౌను:

తెలుగు సాహిత్యానికి ఛార్లెస్ ఫిలిప్ బ్రౌను (1798-1884) చేసిన సేవ అమోఘం, అపారం, అనిర్వచనీయం. ఈస్టిండియా కంపెనీలో ఉద్యోగం చేస్తూ తెలుగు సాహిత్యం పట్ల అభిరుచినీ, ఆసక్తినీ పెంపొందించుకొన్నాడు. 1842లో ఒక జంగమవ్యక్తిని నెలరోజులపాటు తమ ఇంట్లో ఉంచుకొని అతనిచేత కుమార రాముని కథ, బొబ్బిలి కథ, కామమ్మ కథ మొదలైన గేయాగాథల్ని పాడించు కొన్నాడు. అంతేకాక పెక్కు జానపదగేయల్ని, యక్షగానాన్ని సేకరించి ఆంధ్రులకి అందించాడు. పల్నాటి వీరగాథలు, కాటమరాజు కథలకు సంబంధించి తాళప్రత గ్రంథాల్ని సేకరించాడు.

బ్రౌను సేకరించి భద్రపరచిన పల్నాటి వీరకథా చక్రం పింగళి లక్ష్మీకాంతం, అవసరాల సూర్యారావుల సంపాదకత్వంలో పరిష్కరింపబడి 1961లో ప్రచురింపబడింది.[1]

---

1. *Glimpses into Telugu Folklore, P-1, Dr. B. Ramaraju.*

బ్రౌను తెలుగు జానపద సాహిత్యం గొప్పదనాన్ని గురించి Asiatic Journal లో వ్యాసం ప్రచురించాడు.[2]

మొట్టమొదటిసారిగా తెలుగు జానపద సాహిత్యం గొప్పదనాన్ని గుర్తించి, ఆ గేయ సాహిత్యాన్ని సేకరించిన మహానుభావుడు బ్రౌను.

## ఛార్లెస్. ఇ. గోవర్:

'Folk Songs of Southern India' అన్న గ్రంథాన్ని రచించి ప్రసిద్ధి చెందిన ఆంగ్లేయుడు ఛార్లెస్. ఇ. గోవర్. తమిళం, మలయాళం, బడగ, కన్నడం, కొడగు భాషలలోని జానపదగేయాలను సేకరించి ఈ గ్రంథాన్ని ప్రచురించారు. అయితే ఇందులో తెలుగుకి సంబంధించిన జానపద గీతాలు లేకపోవడం శోచనీయం. జానపద గీతాలకు బదులుగా వేమన పద్యాలను ఈ గ్రంథంలో చేర్చడం జరిగింది. ఈ విషయాన్ని గ్రహించిన జె.ఏ. బోయల్ Indian Artiquary లో Telugu Ballad Poetry పేరుతో వ్యాసం వ్రాస్తూ గోవర్ తన గ్రంథంలో తెలుగు జానపద గేయాల్ని పేర్కొనకపోవడాన్ని ఆక్షేపించారు. గోవర్ తనకు భాష రాకపోవడం మూలంగా జానపద గేయాలకు బదులు వేమన పద్యాలను పేర్కొన్నడనడం సమంజసం. ఏమైనా గోవర్‌కు తెలుగు భాషా సాహిత్యాలపట్ల ఉన్న అభిమానం అనంతం.

## జె.ఏ. బోయల్

తెలుగు సాహిత్యానికి ఆంగ్లేయులు చేసిన సేవ అమోఘం. బ్రౌను పండితుడు తెలుగు సాహిత్యోద్ధరణ చేసినట్టుగానే, తెలుగు జానపద గీతాల వైశిష్ట్యాన్ని గుర్తించి లోకానికి వెల్లడించిన ఘనత బోయల్ మహాశయుడిది. ఉద్యోగనిమిత్తం 1874లో రాయలసీమలో రాజకీయోద్యోగిగా నియమించబడ్డ జె.ఏ. బోయల్ తెలుగు జానపద సాహిత్యాభిమాని. తన అధికారిక పర్యటనల కాలంలో గ్రామసీమల్ని దర్శించినప్పుడు రాత్రి సమయాల్లో పల్లీయులు పాడే పాటల్లోని సంగీతాన్ని వింటూ మైమరచేవారట. సంగీతంలోని మాధుర్యాన్నే కాక,

---

2. *Vol. 34, 1841.*

భాష రాకపోయినా ఆ గేయల్లో తెలుగు సాహిత్యానికీ, సంస్కృతికీ చెందిన విశేషాలేవో ఉన్నాయనీ గ్రహించాడు. ఛార్లెస్. ఇ. గోవర్ 1871లో తన 'Folk Songs of South India' లో దక్షిణ భారతదేశానికి చెందిన జానపద గేయాలను ప్రచురించాడు కానీ అందులో తెలుగు జానపద గీతాలకు బదులు వేమన పద్యాలు ఉండడం బోయల్‌ని కలత పరచింది. అందువల్ల 'Indian Artiquary' లో 'Telugu Ballad Poetry' పేరుతో వ్యాసాలు వ్రాస్తూ, ఒక వ్యాసంలో గోవర్ తెలుగు జానపద గేయాలను తన గ్రంథంలో పేర్కొనక పోవడాన్ని ఆక్షేపించారు. లోపాన్ని ఎత్తి చూపించి తెలుగు జానపద సాహిత్య వైశిష్ట్యాన్ని వెల్లడి చేశారు.

బోయల్ మొత్తం ఆరు జానపదగేయాల్ని సేకరించాడు. అందులో ఒకటి చారిత్రక గేయం, తక్కినవి శృంగార గేయాలు. ఈ చారిత్రక గేయం సర్వాయి పాపడికి సంబంధించింది. బోయల్ దీన్ని బళ్ళారిలో సేకరించాడు. బళ్ళారిలో సేకరించడంవల్ల ఈ గేయం రాయలసీమకు చెందిందనీ, పాపడు రాయలసీమవాడనీ అభిప్రాయపడ్డారు. అయితే పాపడు తెలంగాణా ప్రాంతంవాడు. ఈ విషయాన్ని మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు తమ పరిశోధనలో తేల్చి చెప్పడం జరిగింది. ఏమయినా బోయల్ మహాశయుడికి తెలుగు జానపద గీతాలమీద ఉన్న ఆసక్తి ఒక చారిత్రక మహాశయుడిని లోకానికి చాటడానికి దోహదం చేసింది. డా. రామరాజు గారు తమ తెలుగు జానపదగేయ సాహిత్యంలో పేర్కొన్న బోయల్ సేకరించిన ఒక పాటలోని రెండు చరణాలను మాత్రం ఇక్కడ ఉదాహరిస్తాను.

**'యెదురింటి యెల్లపాప - మూతమున్న కానరాదు**
**పాపిష్టి తల్లి దండ్రి - బై లెల్ల నివ్వరు'**

బహుశా ఈ పాట కపిలిపాట అయివుంటుంది. కపిలి పాటలు ముక్తకాలుగా వుంటాయి. పాటలో రెండు చరణాలు వుంటాయి. భావాలన్నీ శృంగార భావాలే. బోయల్ సేకరించిన ఐదుగేయాలు శృంగార రసాత్మకాలే కనుక, పై పాటకూడ శృంగార రసాత్మకంగా వుంది.

తెలుగు జానపద సాహిత్య విలువల్ని గ్రహించి, జానపద గీతాల మాధుర్యాన్ని చవిచూపించిన బోయల్ మహాశయుని సంస్మరించుకోవడం మన విధి.

## కేప్టెన్. ఎం. డబ్ల్యూ. కార్:

కేప్టెన్, ఎం. డబ్ల్యూ. కార్ తెలుగు సామెతలు కొన్నింటిని 'ఆంధ్రలోకోక్తి చంద్రిక' అనే పేరుతో 1868లో ప్రచురించాడు. అంతకుముందే కొంతమంది సామెతల పుస్తకాలను ప్రచురించారనీ, ఆ గ్రంథ పీఠిక నుంచే తెలుస్తుంది. అయితే అవి అందుబాటులో లేవు. ఉన్న పుస్తకాల్లో తెలుగులో 'ఆంధ్ర లోకోక్తి చంద్రి' కే మొదటిదని శ్రీ వేకుమళ్ళ కామేశ్వరరావుగారి అభిప్రాయం.[3] ఈ పుస్తకాన్నే నందిరాజు చలపతిరావు గారు 1906లో ప్రచురించారట.

ఆంగ్లేయులు ఈ విధంగా కనబరచిన ఆసక్తి తెలుగు విద్వాంసులకి మార్గదర్శకమై జానపద సాహిత్య సేకరణకు పురికొల్పింది.

1900లోను, 1903లోను శ్రీ నందిరాజు చలపతిరావుగారు (1873-1960) స్త్రీల పాటల సంపుటాలని ప్రచురించారు. కాశీ మజలీ కథల్ని, బాల సాహిత్యాన్ని ప్రచురించారు. వీరి తర్వాత 1905లో శ్రీ మంగు వెంకట రంగనాథరావుగారు స్త్రీల పాటల్ని అచ్చు వేశారు. శ్రీ ఎస్.ఎన్. వెంకటస్వామిగారు 'Some Telugu Folk Songs', 'Some Telugu Nursery Folk songs and Catches' అన్న పేర్లతో కొన్ని గేయాలను సేకరించి ప్రకటించారు.

శ్రీ వేకుమళ్ళ అచ్యుతరావుగారు 'ఆంధ్ర ప[illegible] - పాటలు' అనే పేర్తో వ్యాస సంకలనాన్ని 1925లో ప్రచురించారు. ఇందుల[illegible] వ్యాసాలు 1916, 1917 ప్రాంతాల్లో కృష్ణా పత్రికలో ప్రకటింపబడ్డాయి.

జానపద గేయాలను గూర్చిన విమర్శనాత్మక కృషి ఇరవయ్యో శతాబ్ది పూర్వార్ధం తర్వాతనే జరిగింది. ప్రసిద్ధ పండితులు, విమర్శకులైన పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి, వేటూరి ప్రభాకరశాస్త్రి, డా. చిలుకూరి నారాయణరావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ, అక్కిరాజు ఉమాకాన్తం, చింతా దీక్షితులు మొదలైన వాళ్ళు ఈ సాహిత్యానికి సంబంధించి వ్యాసాలు వ్రాశారు.

---

*3. 'భారతి', ఫిబ్రవరి 1955.*

దేవంద్ర సత్యార్థిలాంటి ఆంధ్రేతరులు కూడ తెలుగు జానపద గీతాల సౌందర్యానికి ఆకర్షితులయ్యారు.

## దేవేంద్ర సత్యార్థి:

భారతదేశంలోని పలు ప్రాంతాలను తిరిగి అనేక వేల జానపద గీతాలను సేకరించి ప్రకటించినవారు దేవేంద్ర సత్యార్థిగారు. తెలుగు దేశపు జానపద గేయాలను భారతదేశానికే కాక ప్రపంచవ్యాప్తం చేసిన మహానుభావుడీయన. తాము ప్రచురించిన ఆంగ్ల, హిందీ గ్రంథాల్లోనే కాక, వివిధ పత్రికల్లో తెలుగు జానపద గీతాలను అనువదించారు.

'చిరపరిచిత్ శబ్ద్, చిర్‌పరిచిత్ బాతె, చిర్‌పరిచిత్ స్వర్ యహీ లోక్ గీత్ కీ శక్తీ హై' అని జానపద గీతాన్ని ప్రశంసించారు దేవేంద్ర సత్యార్థి.[4]

'A Nation reborn must be inspired by its folk songs'[5] అని పేర్కొన్నారు సత్యార్థి.

## నేదునూరి గంగాధరం:

అపూర్వమయిన జానపద సాహిత్యాన్ని అపారంగా అందించిన జానపద సాహిత్యోద్ధారకులు కీ.శే. నేదునూరి గంగాధరంగారు. 4-7-1904లో రాజమండ్రిలో జన్మించారు. తమ జీవితాన్ని జానపద సాహిత్యానికే అంకితం చేసి ఆరువేలకు పైగా జానపద గీతాలను సేకరించి ప్రచురించారు. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారి ప్రేరణతో ఊరూరు తిరిగి ప్రాచీన పద్యాలు, శాసనాలు, తాటాకు గ్రంథాలు సేకరించారు. అలాగే శ్రీ వేకుమళ్ళ కామేశ్వరరావుగారి ప్రేరణతో పాతపాటల్ని సేకరించి భారతి, గృహలక్ష్మి, ఆంధ్రభూమి, కృష్ణా పత్రికల్లో ప్రచురించారు. చింతా దీక్షితులు గారి ఆదేశాన్ని అనుసరించి స్త్రీల పాటలు, కథాగేయాలు సేకరించారు. శ్రీ పాద గోపాలకృష్ణమూర్తిగారి సూచనలు

---

*4. ధర్తీ గాతీ హై (ప్రస్తావన)*

*5. తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట 30 నుండి పునరుద్ధరింపబడింది.*
***(The Illustrated week by weekly of India, November, 12, 1944)***

శిరసావహించి సామెతలు, గేయాలు, జాతీయాలు, పారిభాషిక పదాలు మొదలైన వాటిని సేకరించి నాటి పత్రికలలో ప్రచురించారు. శ్రీ టేకువుళ్ళ రాజగోపాలరావుగారి సూచనను అనుసరించి కట్టుకథలు, పొడుపు కథలు, యుక్తి లెక్కలు, మొదలైన వాటిని సేకరించారు. ఇలా ప్రముఖుల సలహాలను స్వీకరించి జానపద వాఙ్మయంలోని ప్రతి అంశాన్ని సేకరించి తర్వాతి సేకర్తలకు మార్గదర్శకులయ్యారు. అధ్యాపక వృత్తిలో ఉంటూ జానపద సాహిత్యానికి సంబంధించిన సమస్త విషయాలను సేకరించిన ధన్యజీవి నేదునూరి గంగాధరం.

జానపద వాఙ్మయోద్ధరణకు తమ పొలాన్ని, 50 కాసుల బంగారాన్ని, తమకు లభించే జీతాన్ని వెచ్చించి జానపద సాహిత్యాన్ని సేకరించడమే కాకుండా, వాటిని అచ్చు వేయించారు. సాహిత్య సంస్థలు, అకాడెమీలు సేకరించి ప్రచురించాల్సిన ఈ పనిని తామొక్కరే సేకరించి ప్రచురించడం శ్లాఘించదగ్గ విషయం. వీరి ప్రచురణలలో జానపద గేయాలే కాకుండా కథాగేయాలు, వీరగాథలు, సామెతలు, జాతీయాలు, పొడుపు కథలు, మారుమూల పదాలు, పలుకుబళ్ళు, కిటుకు మాటలు, జమిలి పదాలు, నోముల కథలు, క్రీడలు-వినోదాలు, పండుగలు-పబ్బాలు, ఆచార వ్యవహారాలు, సంప్రదాయాలు, నమ్మకాలు-మూఢవిశ్వాసాలు, వైద్యం, కళలు, చేతిపనులు మొదలైన జానపద విజ్ఞానాంశాలూ చోటు చేసికొన్నాయి. నేటి జానపద విజ్ఞానులందరూ వీరి సేకరణ అంశాలనూ ఆధారంగా తీసుకొన్నారు. పదివేల పుటలకు పైగా సేకరింపబడ్డ ఈ జానపద సాహిత్య సంపదలో ఆణిముత్యాలలాంటి గ్రంథాలు ఇవి: 1. మేలుకొలుపు పాటలు (1949). 2. మంగళహారతులు - 2 సంపుటాలు (1951), 3. సెలయేరు (1955) - వివిధ రకాల జానపద గీతాలున్నాయి. 4. మిన్నేరు (1968), 5. మున్నీరు (1973), 6. వ్యవసాయ సామెతలు (1956), 7. పసిడి పలుకులు (1960), 8. స్త్రీల వ్రతకథలు - 3 సంపుటాలు (1960), 9. జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి (1960), 10. ఆటలు పాటలు (1964) మొదలైనవి. వీరి రచనలలో మరి కొన్ని 1. పండుగలు - పరమార్థములు, 2. వ్యవసాయ ముహూర్త దర్పణం, 3. గృహవాస్తు దర్పణం, 4. పుట్టుమచ్చల శాస్త్రం, 5. కోడిపుంజుల శాస్త్రం, 6. అంగ సాముద్రికం మొదలయినవి ముఖ్యమయినవి. 1953లో గోదావరి వరదల్లో నేదునూరివారు సేకరించిన అసంఖ్యాకమైన వ్రాతప్రతులు, కొన్ని గ్రంథాలు కొట్టుకుపోయాయట.

డా॥ రామరాజుగారు, డా॥ తూమాటి దోణప్ప, శ్రీ పాద గోపాల కృష్ణమూర్తిగారలతో కలసి 'త్రివేణి' (ఆంధ్రదేశ జానపద గేయాల సంకలనం) గ్రంథాన్ని ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడెమీ వారి సహకారంతో ప్రచురించారు. ఇలా తమ జీవితాన్నే జానపద సాహిత్య సేవకు ధారవోసిన శ్రీ నేదునూరి గంగాధరంగారికి 'కవికోకిల' 'వాస్తువిశారద' అనే బిరుదల్ని శ్రీ కాశీ కృష్ణాచార్యులుగారు ప్రసాదించారు. శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారిచే 'జానపద వాఙ్మయోద్ధారక' అనే బిరుదును పొందారు. అధ్యాపక వృత్తి నుండి 1960లో నివృత్తులయ్యారు. 1970 మార్చి 11న పరమపదించారు ఈ అనాదృత వాఙ్మయ భిక్షువు శ్రీ నేదునూరి గంగాధరంగారు. వారికి జానపద సాహిత్య లోకమెంతో ఋణపడి వుంది. వీరిపేర్తో 'నేదునూరి గంగాధరం జానపద వాఙ్మయ గ్రంథాలయం' ఏర్పడి సాహిత్యసేవ చేస్తుండడం గమనించదగ్గ విషయం.

## శ్రీ పాదగోపాలకృష్ణమూర్తి ('కృష్ణశ్రీ'):

'కృష్ణశ్రీ' గా జానపద వాఙ్మయ క్షేత్రంలో చిరస్మరణీయులయిన శ్రీ పాద గోపాలకృష్ణమూర్తిగారు శ్రీకాకుళం జిల్లాలోని ప్రియా అగ్రహారంలో 28, అక్టోబరు 1901లో జన్మించారు. జానపద సాహిత్యకర్తగా, జానపద సాహిత్య విమర్శకుడుగా స్థానం ఆక్రమించుకొన్న కృష్ణశ్రీగారు వృత్తిరీత్యా భౌతిక శాస్త్రాచార్యులు, ప్రభుత్వ విద్యాశాఖలో ఉన్నత పదవుల్ని నిర్వహించినవారు. ప్రవృత్తిరీత్యా జానపద వాఙ్మయోద్ధారకులు, చిన్నతనం నుంచీ వీరికి జానపద సాహిత్యం మీద అభిమానం, ఆసక్తి. నాటకాలు, చిత్రకళ, శిల్పం మొదలయిన వాటిపట్ల కూడ ఆసక్తిమెండు.

శ్రీ పాదగోపాలకృష్ణమూర్తిగారు అనేక జానపదగేయాలను సేకరించారు. వాటిలో ముఖ్యంగా స్త్రీల పాటలు పేర్కొనదగ్గవి. వీరు సేకరించిన స్త్రీల పాటలు రెండు సంపుటాలుగా ప్రచురించబడ్డాయి. అవి స్త్రీల రామాయణపు పాటలు, స్త్రీల పౌరాణికపు పాటలు. వీటిని ఆంధ్ర సారస్వత పరిషత్తువారు కృష్ణశ్రీగారి చక్కటి ఉపోద్ఘాతాలతో వరుసగా 1955, 1963లలో ప్రచురించారు. ఈ రెండు సంపుటాల్లో స్త్రీల కథల పాటలు చోటుచేసికొన్నాయి. ఆంధ్ర సారస్వత పరిషత్తువారే ప్రచురించిన మరో గ్రంథం 'పల్లెపదాలు'. ఇది 1957లో

ప్రచురింపబడింది. ఇందులో వివిధ రకాల జానపద గీతాలు చోటుచేసికొన్నాయి. స్త్రీల రామాయణపు పాటలు 1986లో ద్వితీయ ముద్రణకు నోచుకుంది. ఈ గ్రంథం విశ్వవిద్యాలయాలలోని ఎం.ఏ. తెలుగు జానపద విజ్ఞాన విద్యార్థులకు పఠనీయ గ్రంథంగా నిర్ణయింపబడింది.

శ్రీ పాద గోపాలకృష్ణమూర్తిగారు మంచి రచయితలు. వీరి జానపద సాహిత్య సంబంధి వ్యాసాలు 'భారతి', 'కిన్నెర', 'గృహలక్ష్మి' మొదలైన పత్రికలను అలంకరించాయి. ఈ వ్యాసాలన్నీ జానపద సాహిత్య విమర్శక వ్యాసాలు. దేశి సారస్వతము, దేశి సారస్వత విభూతి పేరుతో వ్రాయబడ్డ వ్యాసాలు తెలుగు జానపద సాహిత్య క్షేత్రాన్నే ఒక మలుపు త్రిప్పాయి. వీరి వ్యాసాలలో మరికొన్ని: 'తలుపు దగ్గర పాటలు' 'జాజర పాటలు', 'స్త్రీల గేయకథలు', 'స్త్రీల గేయకథా వాఙ్మయము', 'దేశి సారస్వత విభూతి' (అనుబంధము) మొదలైనవి.

కనుమరుగైపోతున్న స్త్రీల పాటలనెన్నింటినో సేకరించి వాటిని విశ్లేషించి, తెలుగుజాతికి అందించారు కృష్ణశ్రీగారు. జానపద సాహిత్యం మీద దీక్షతో విశేష కృషి జరిపిన వీరు వ్యాసాలు వ్రాయడంతోనే సరిపెట్టుకోక, ఆ వాఙ్మయ వైశిష్ట్యాన్ని గురించి వివరిస్తూ అనేక ఉపన్యాసాలిచ్చారు.

నేదునూరి గంగాధరంగారి లాగానే జానపద సాహిత్యానికే తమ జీవితం అంకితం గావించిన కృష్ణశ్రీగారు 2-4-1977లో రాజమండ్రిలో తనువు చాలించారు. అనాదరణీయ సాహిత్యంగా అజ్ఞాతంగా వుండిన తెలుగు జానపద సాహిత్యాన్ని ఆదరణీయు సాహిత్యంగా తీర్చిదిద్దడానికి ప్రయత్నించిన మహానుభావుల్లో ఒకరైన కృష్ణశ్రీగారు నేడు లేకపోయినా వారు సేకరించి మనకందించిన జానపదగేయాలు, స్త్రీల కథాగేయాలు, విమర్శవ్యాసాలు మనల్ని ఉత్తేజపరుస్తాయనడంలో సందేహం లేదు.

## డా॥ బి. రామరాజు:

తెలుగులో జానపద విజ్ఞాన పరిశోధనకి అంకురార్పణ గావించిన వారు ఆచార్య బిరుదురాజు రామరాజుగారు. వీరు తెలుగు జానపద విజ్ఞాన క్షేత్రంలో విశిష్టస్థానాన్ని ఆక్రమించిన వారు. విశ్వవిద్యాలయాల్లో జానపద విజ్ఞానానికి పఠన,

పరిశోధనార్హమైన స్థానాన్ని సంపాదించి పెట్టిన డా॥ రామరాజుగారు 1956లో తెలుగులో జానపద సాహిత్యానికి సంబంధించి మొట్టమొదటిసారిగా పిహెచ్.డి. చేసిన జానపద విజ్ఞాని. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారి మార్గదర్శకత్వంలో 1952-55 మధ్యకాలంలో 'తెలుగు జానపద గేయ సాహిత్యం' మీద పరిశోధన చేశారు. వీరి ఈ పరిశోధన గ్రంథంలో తెలుగు జానపద గేయాలకు, కథాగేయాలకు సంబంధించి పౌరాణిక గేయాలు, చారిత్రక గేయాలు, మత సంబంధ గేయాలు, పారమార్థిక గేయాలు, స్త్రీల పాటలు, శ్రామిక గేయాలు, పిల్లల పాటలు, శృంగార గేయాలు, అద్భుత రసగేయాలు, కరుణరస గేయాలు, హాస్యపు పాటలు మొదలైనవి 17 ప్రకరణాల్లో నిశితంగా పరిశీలించబడ్డాయి. అంతేకాక గేయాల్లోని భాషా సారస్వతాలు, సాంఘిక విషయాలు, జానపద గేయాల వరుసలు వివరింపబడడమే కాకుండా జానపద గాయకుల పరిచయం చెయ్యబడింది. జానపద విజ్ఞానం, జానపద సాహిత్యం, జానపద గేయం - వీటి నిర్వచనం, లక్షణం, వర్గీకరణం ప్రస్తావింపబడడమే కాకుండా, జానపద విజ్ఞాన క్షేత్రంలో జరిగిన కృషి సమీక్షింపబడింది. ఒక్క మాటలో చెప్పాలంటే వీరి గ్రంథం నేటి జానపద విజ్ఞాన పరిశోధకులకు మార్గదర్శకమయిన అత్యుత్తమ గ్రంథం. ఈ పరిశోధన గ్రంథం మొదటిసారిగా 1958లో ముద్రింపబడి, 1978లోను, 1990లోను పునర్ముద్రణలకు నోచుకొంది.

డా॥ రామరాజుగారి కృషివల్ల, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో 1972లో ఎం.ఏ., విద్యార్థులకు జానపద సాహిత్యం ఒక పాఠ్యాంశంగా నిర్ణయించబడింది. నాటినుండి నేటిదాకా ఆంధ్రదేశంలోని అనేక విశ్వవిద్యాలయాల తెలుగు విభాగాల్లో జానపద సాహిత్యం ఎం.ఏ, విద్యార్థులకు పాఠ్యాంశంగాను, ఎం.ఫిల్., పిహెచ్.డి. లకు సంబంధించి పరిశోధనాంశంగాను కొనసాగుతూ ఉండడం ప్రశంసించదగ్గ విషయం.

1960లో 'త్రివేణి' అనే పేర్తో ఆంధ్రప్రదేశ్‌లోని జానపదగేయాల సంపుటి ప్రకటింపబడింది. అందలి సంపాదకులలో డా॥రామరాజుగారు కూడ ఒకరు. వీరు తెలంగాణాలో ప్రచారంలో ఉన్న అనేక గీతాలను ఇందులో చేర్చారు. 1968లో 'తెలంగాణా పల్లెపాటలు' (మొదటి భాగం) అన్న సంకలన గ్రంథాన్ని ప్రచురించారు. ఇందులో పిల్లల పాటలు, జాజిరి పాటలు, కాముని పాటలు,

బ్రతుకమ్మ పాటలు, కోలాటములు, స్త్రీల పాటలు, శృంగార గేయాలు అన్న శీర్షికలున్నాయి. మొత్తం 227 పాటల్ని డా॥ రామరాజుగారు స్వయంగా సేకరించి ప్రచురించిన గ్రంథం ఇది. 1964లో 'Moharrum Folk Songs' అన్న ఆంగ్ల గ్రంథాన్ని ప్రచురించారు.

'జానపద గేయాలు-సాంఘిక చరిత్ర' అనే గ్రంథానికి డా॥ నాయని కృష్ణకుమారితోపాటు సంపాదకత్వ భారాన్ని వహించారు డా॥ రామరాజు గారు. ఈ గ్రంథం 1974లో ప్రచురింపబడింది. ఈ గ్రంథంలో జానపదగేయ గాథలు సేకరించి ప్రకటించబడడమే కాకుండా, ఆ గేయ గాథల వెనుక ఉన్న సంస్కృతి చరిత్ర, సాంఘిక స్వరూపం పీఠిక రూపంలో చక్కగా వివరింపబడ్డాయి.

1960లో 'తెలంగాణా పిల్లల పాటలు' అన్న పేర్తో గ్రంథాన్ని ప్రచురించారు. 1974లో 'Folk Tales of Andhra Pradesh' అన్న ఆంగ్ల గ్రంథాన్ని స్టెర్లింగు పబ్లిషర్సువారి సహకారంతోను, 'Folk lore of Andhra Pradesh' అన్న ఆంగ్ల గ్రంథాన్ని నేషనల్ బుక్‌ట్రస్టు వారి సహకారంతోను 1978లో ప్రచురించారు. 'South Indian Folk Songs' అన్న పేర్తో ఒక ఆంగ్ల గ్రంథాన్ని, 1991లో 'Glimpses of Telugu folklore' అన్న మరో ఆంగ్ల గ్రంథాన్ని ప్రచురించారు. ఈ నాలుగు గ్రంథాలు తెలుగు జానపద విజ్ఞానాన్ని గురించి ఆంధ్రేతరులకు చక్కని అవగాహనని కల్పిస్తాయి.

డా॥ రామరాజుగారు 1925, ఏప్రిల్ 15న వరంగల్లు జిల్లాలోని దేవనూరు గ్రామంలో జన్మించారు. చిన్నప్పట్నుంచీ జానపదగేయాలమీద ఎక్కువ మక్కువ చూపుతూ లెక్కలేనన్ని తెలుగు జానపద గీతాలను సేకరించి ప్రకటించారు. జానపద సాహిత్యం మీదనే కాక తెలుగులో అజ్ఞాతంగా ఉండిపోయిన అనేక గ్రంథాలను పరిశోధించి, పరిష్కరించి ప్రచురించిన ఘనత డా॥ రామరాజు గారిది. తెలుగుతోపాటు సంస్కృత భాషమీద, ఉర్దూ భాషమీద అధికారం, అభిమానం ఉన్న డా॥ రామరాజుగారు భారతదేశంలోని అనేక విశ్వవిద్యాలయాల్లో 'National Professor' గా పర్యటించి జాతీయ ఉపన్యాసాలు ఇవ్వడంతో పాటు, అనేక సెమినార్లలో పాల్గొని తెలుగు జానపద సాహిత్యానికి సంబంధించి అనేక పరిశోధనాత్మక వ్యాసాలను సమర్పించారు. సోవియట్ రష్యా ఆహ్వానం మీద ఆ

దేశానికి వెళ్ళి ఆంధ్ర జానపద సాహిత్యాన్ని గురించి వివరించి వారి మన్ననలను పొందారు.

డా॥ రామరాజుగారి వ్యాసాలు అనేక ప్రముఖ పత్రికల్ని అలంకరించాయి. ఇంకా అలంకరిస్తున్నాయి. జానపద విజ్ఞానాధ్యయనానికే తమ జీవితాన్ని అంకితం చేసుకొన్న ఈ ధన్యజీవి నేటి జానపద విజ్ఞాన పరిశోధకులందరికీ మార్గదర్శకులే కాక, ఆంధ్రదేశానికే ఒక asset. వీరి పర్యవేక్షణలో ఎంతో మందికి పిహెచ్.డి., ఎం.ఫిల్. పట్టాలు లభించాయి.

ఉస్మానియా విశ్వవిద్యాలయంనుండి ఆచార్య వృత్తినుండి నివృత్తులయిన డా॥రామరాజుగారు ప్రస్తుతం హైదరాబాదులో ప్రశాంతమయమయిన జీవితాన్ని గడుపుతూ జానపద సాహిత్యాధ్యయనం పట్ల ఆసక్తి వహించడం ప్రశంసించదగ్గ విషయం.

* * *

'జానపద విజ్ఞానధ్యాయనం' జానపద విజ్ఞానానికి సంబంధించిన ఒక సమగ్రమైన పరిశోధన గ్రంథం. ఇందులోని 33 వ్యాసాలు కూడ 33 మచ్చుతునకలు. తెలుగునాట ఇంతవరకు జానపద విజ్ఞానంలో జరిగిన పరిశోధనను గురించి, ఇక ముందు జరగవలసిన అధ్యయనాన్ని గురించి, వివిధ జానపద ప్రక్రియలను గురించి, జానపద సాహిత్య విభాగాలను గురించి ఈ వ్యాసాలలో సమగ్రంగా చర్చించడం జరిగింది. ఇది పండితులకు పరిశోధకులకు మాత్రమే కాక, విశ్వవిద్యాలయ, కళాశాలోపాధ్యాయులకు, విద్యార్థులకు కూడ చాల ఉపయోగకరమైన గ్రంథం. ఇది జానపద విజ్ఞానంలో అభిరుచిగల ప్రతివ్యక్తి దగ్గర, ప్రతి గ్రంథాలయంలోను ఉండవలసిన ఉత్తమ గ్రంథం.

**డా. కస్తూరి విశ్వనాథం**

సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండియన్ లాంగ్వేజస్

మానస గంగోత్రి, మైసూరు - 570 006



డా॥ జి.ఎస్. మోహన్

## జానపద విజ్ఞానాధ్యయనం

**పుట్టింది:** అనంతపురం, నవంబరు 1949లో

**అధ్యాపకత్వం:** కన్నడిగుల మధ్య - బెంగుళూరు విశ్వవిద్యాలయం, తెలుగు విభాగంలో

**ఇప్పటికి వెలుగు చూచిన గ్రంథాలు:**

**తెలుగు:** జానపద విజ్ఞాన వ్యాసావళి, తెలుగు జానపద విజ్ఞాన సూచి, స్త్రీల పాటలు - అనంతపుర మండలం (సిద్ధాంతవ్యాసం), సామెతలలో సాంఘిక జీవితం, జానపదుల నమ్మకాలు, తెలుగు జానపద కథలు, జానపదుల తిట్లు, పరిశోధన-సామగ్రి సేకరణ, ప్రసిద్ధ జానపద విజ్ఞానవేత్తలు, తెలుగు, కన్నడ సామెతలు-సమానార్థకాలు, డా. చిలుకూరి నారాయణరావు జీవితం (1890-1951)-వాఙ్మయసేవ, ఆంధ్రప్రదేశ్‌లోని ప్రసిద్ధ పుణ్యక్షేత్రాలు- ప్రధాన దేవాలయాలు, గృహలక్ష్మి గీతాలు (అనంతపురం జిల్లా స్త్రీల పాటలు), సాంఘిక జానపద ఆచారాలు (అనంతపురం జిల్లా), మాస్తి చిన్న కథలు (కన్నడం నుంచి అనువాదం - కేంద్ర సాహిత్య అకాడెమీ).

**కన్నడం:** కన్నడ, తెలుగు గాదెగళు - సమానార్థకగళు; అల్లూరి సీతారామరాజు (కర్నాటక సాహిత్య అకాడెమీ).

**ఇంగ్లీషు:** Studies in folkloristics (with others)

**అచ్చుకు సిద్ధంగా ఉన్న మరికొన్ని:** అనుభవ మంటపం (కన్నడం నుంచి అనువాదం), తెలుగు కన్నడ తులనాత్మక సాహిత్య వ్యాసాలు, తెలుగు భాషా వ్యాసాలు, అనువాద విధానం, Essays on Telugu Folklore (English), తెలుగు సాహిత్యద ఆయ్ద ప్రబంధగళు (కన్నడం), వేమన (కన్నడం), Annamayya and Purandaradasu (English).

**వ్యాసాలు, పత్రాలు** : వివిధ పత్రికల్లో 160 వ్యాసాలు, అనేక సాహిత్య సదస్సుల్లో, గోష్ఠుల్లో పలుపత్ర సమర్పణ.

**పరిశోధన, పర్యవేక్షణ** : ఇప్పటిదాకా 10 పిహెచ్.డి., 20 ఎం.ఫిల్ డిగ్రీలు పరిశోధక విద్యార్థులు పొందారు.

**సంపాదకత్వం** : పలుపాఠ్య గ్రంథాల సంపాదక సమితుల్లో సభ్యత్వం.

**ఇతర విశేషాలు** : కార్యదర్శి, ఫోక్ కల్చర్ ట్రస్టు (రి), బెంగుళూరు; కన్వీనర్, దేశిట్రస్టు (రి), మైసూరు.

**అభిరుచులు** : తులనాత్మక సాహిత్యం, జానపద విజ్ఞానం-పరిశోధన, అనువాదం చేయడం.